# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్




ఫిబ్రవరి **1962**

**సంపుటము 39 :** **: సంచిక 2**

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1962



## గమనిక

ప్రచురింపబడని రచనలు తిరిగి పంపగోరువారు తగినన్ని తపాలాబిళ్ళలు జతపరచవలెను. రచయితలు తమ చిరునామా మార్పులు వెంటనే తెలియజేయ ప్రార్థితులు.

# ఆంధ్రపత్రిక

## సంవత్సరాది సంచిక

ప్రతి తెలుఁగుసంవత్సరాదికి ప్రకటించుచున్నట్లే శుభకృతునామ సంవత్సరాదికి కూడా ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక ప్రకటింపబడును. ఎప్పటివలెనే రచయితలు తమ రచనలను పంపి సంచిక జయప్రదమవుటకు తోడ్పడ వేడుచున్నాము. వ్రాతప్రతులు మార్చి 5 వ తేదీ లోపల మాకు చేరునట్లు చూడ ప్రార్థన.

—సంపాదకుడు.

# సూర్యానువాకము

శ్రీ యల్లంరాజు శ్రీనివాసరావు

అమర కుంజర కుంభయుగళ సిందూరంపు
రేణురశ్ములఁబోలె శోణితములు
ప్రథమ పర్వతసానుభవ ధాతుచయ రస
స్రవరాగమునఁబోలె రంజితములు
సమధికస్వర నూత్న కమల కానన కాంతి
పరిచయమ్మునఁబోలె నరుణితములు
సహజప్రతాపదుస్సహధనంజయశిఖా
పరివేషమునఁబోలె పాటలములు

భువనభవనోపచితమైన యవకరమ్ము
నవలఁజిమ్మఁగ మార్జనీనివహములును
నభినవాలంకృతులునైన యబ్జహితుని
చతురకిరణమ్ము లొసఁగుత నతులసుఖము

ప్రహ్వభావమున సంప్రార్థనమ్ములు చేయు
జనుల కిష్టావాప్తి సలుపు వేడ్క
ముకుళకోటర మధ్యమున పెన్నిధులపోల్కి
డాఁచియుంచిన సిరు ల్దోఁచుకొనఁగ
కడఁగుచున్నది పోలె కమలకానన గృహో
ద్ఘాటనం బొనరించి మాటుపడిన
ప్రాణికోటుల బయల్పఱుచుచున్నది పోలె
తిమిఱంపుచెఱ కవాటములు దెఱచి

కిసలయము కంటె ఘనసారఘుసృణపంక
రసముకంటెను నవతామరసము కంటె
కోమలమ్మగు రవికరస్తోమ మొసఁగు
పరమకళ్యాణ సౌఖ్య సంపదలవెలుగు

కమలకాననగర్భ గహ్వరంబుల శైల
శృంగసీమల నొక్కభంగి ప్రాలి
తటితోడ నగు నభ్యుదయమందు దినపరి
క్షయమందు నొకరీతి చాయఁబూని
భువనత్రయోత్తుంగ భవనాంగణములందు
ఖారదోఁపని యట్లు తారసిల్లి
నర విహంగమ జంతు చరకోటి కచర సం
ఘాతంబునకు నొక్క జ్యోతినొసఁగి

ప్రతి ముహూర్త వియత్పథాయతవిహార
చిరపరిశ్రామ జనిత దుర్భర మహోష్మ
మా తప చ్ఛద్మమునఁ జేసి యావరించు
బ్రధ్నపాదంబు లోడగూర్చు భద్రచయము

ఘ్రాణ మస్తకపంక్తి ఘోణయుగ్మము పార్శ్వ
వక్షంబులునుఁ కర్ణచక్షువులును
కంఠగోళము కుక్షి కటి పాణి పాదమ్ము
లాదిగాఁ గలుగు సర్వాంగకములు
వ్రణితమ్ములయి యొత్తువడి నెత్తురులఁ దోఁగి
కృమిదంశములు మూఁగి తుమురు సేయ
నానావిధామయానూన బాధలఁ జేసి
దిక్కుతెన్నును లేక పొక్కుజనుల

నెనరుతొలఁకంగ మేనులు నిమిరి నిమిరి
దివ్యమగు నౌషధమ్ము లందిచ్చి యిచ్చి
వేయికరముల నెత్తి దీవెనలొసంగు
చండభానుని తేజంబు చెందు నఘము

సమయ సంగ్రహ-సముత్సర్జనంబుల పయ
స్సృష్టి లోకులకెల్ల తుష్టిఁగూర్చి
దినముఖమ్మున నాల్గుదెసల నూడనిఁ బాడి
పాయాహ్నమున నొక్కచక్కిఁగూడి

## సూర్యానువాకము

బహుదూరగమన సంభవ ఖేద ముడివోవ
నచ్చటచ్చట నీరు లిచ్చఁ గోలి
కొండలోయల లేఁత గొనబుపచ్చిక పైరు
నాఁడు నాడును ముట్టి వాడుకొలిపి
భవమహాంభోధి లహరికా స్ఫాలనముల
సోలి తూలిన మానవస్తోమములను
తాపమెడలించి దరిఁజేర్చు తేపలైన
చండభానుని గోగణం బండయగుత

కనక ద్రవాభిషేకములు నిర్ధనదశా
దందహ్యమానాంగ బృందములకు
ప్రబల హస్తావలంబము లధఃపతయాళు
విధివంచిత ప్రజా విసరములకు
ఏకైకదీప ప్రభాకల్పములు గూఢ
గహనార్థ వివిదిషా విహారణులకు
ఘంటా పథములు నిష్కంటకామరపుర
ప్రాసాద జిగమిషాగ్రేసరులకు
మోక్షమార్గాను ధావనాపేక్ష మనుజ
తనుగృహద్వారసవిధవేత్రాయితములు
కల్మషధ్వాంతములు ద్రోఁచి కాచుఁగాత
చండమార్తాండ నవరశ్మి మండలములు

# భారతావతరణము

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

## పాత్రలు

| | |
|---|---|
| 1 బ్రాహ్మణుడు | భవభూతి |
| 2 బ్రాహ్మణుడు | కాళిదాసు |
| 3 బ్రాహ్మణుడు | వ్యాసుడు |
| సరస్వతి | నన్నయ |
| మేనక | వైతాళికుడు |
| పరిచారిక | 1 వంది |
| బ్రహ్మ | 2 వంది |

వాల్మీకి

[వీణాగానము :—గోదావరిలో నొక బ్రాహ్మణుడుస్నానము చేయుచున్నట్టి ధ్వని.]

1 వ బ్రాహ్మణుడు : గోదావరి మహాదేవి కావేరి సహోదరి ప్రక్షాళయ మహాపాపం సర్వమల వినాశనం.

2 వ బ్రాహ్మణుడు : అయ్యా ! తమరి దే దేశము ?

1 వ బ్రా : మాది చోళదేశము.

2 వ బ్రా : పరదేశమునందు నివసించుటచేతఁ బాపము వచ్చునా? నీది ద్రవిడ దేశము. మాది ఆంధ్రదేశము. రెండు దేశములు నొక్కటియే.

1 వ బ్రా : ఒక్కటియ యైనచో రెండు దేశము లనుట యెందులకు ?

2 వ బ్రా : అయినచో నీ దేశ మెందులకు రావలయును ?

1 వ బ్రా : నేను కులోత్తుంగచోడదేవుని వెంట వచ్చితిని. ఆ యువరాజుగారి పరివారములోని బ్రాహ్మణుడను.

2 వ బ్రా : యువరాజు వచ్చెనా ? ఎందుకు వచ్చెను ?

1 వ బ్రా : మీది రాజమహేంద్ర నగరమేనా ? అది యేమయ్యా అట్లడిగెదవు ? మీ రాజ పురోహితుడు నన్నయ్య భట్టు భారతమును మీ భాషలోని కనువదించెనట. దాని యావిష్కరణ మహోత్సవము జరుగునట. మీ మహారాజుగారు కుమారుని రమ్మని వార్త పెట్టిరి. మేము వచ్చితిమి. ఈ సంగతియే మీకుఁ దెలియదా ?

2 వ బ్రా : నాకుఁ దెలియదు. ఆవిష్కరణోత్సవ మెప్పుడు జరుగును ? మాది యేదో దూరపు పల్లెటూరు. భారతమును వ్రాయుట యేమి ? వ్యాసుడు వ్రాసెనుగదా !

1 వ బ్రా : నీ కన్న నేనే నయము. మాది ద్రవిడభాష యైనట్లు మీది యాంధ్రభాష. ఆ భాషలోనికి భారతమును మీ నన్నయభట్టుగారు మార్చినారు.

2 వ బ్రా : నా కర్థ మగుటలేదు. ఆంధ్రభాష యని యొకటున్నదా ? జానపదులు మాటాడుకొను భాష యొకటున్నది. భారతము వంటి గ్రంథమును దానిలోఁ ద్రిప్పి వ్రాయుటకుఁ దగినంత భాష కాదే యది.

1 వ బ్రా : సరిగా నా యుద్దేశ్యము కూడ నదియే. కాని యిది యంతయు రాజుల ప్రభావము. రాజానుమతో ధర్మః. మన మిట్లు మాటాడుకొనుచుండగా నాయన యెవరో మన వంకఁ గోపముగాఁ జూచుచున్నాడు. ఏమండీ ! మామీఁదఁ గోపముగా నున్నదా ?

3 వ బ్రా : నీమీఁద లేదు. నీవు పరదేశస్థుడవు. నీ మాటలను బట్టియే తెలియుచున్నది. ఒక యక్షరమునకు బదులు మరియొక యక్షరమును వాడుచున్నావు. సంస్కృత భాషలో నున్న వర్ణసమామ్నాయ మంతయు మా యాంధ్రభాష యథాతథముగా స్వీకరించినది. ఆంధ్రులమైన మేము సర్వ వర్ణములను విస్పష్టముగా నుచ్చరింతుము. నన్నయభట్టుగారు మా యాంధ్రభాషకు వ్యాకరణము రచించినారు. నా కీయన మీఁదఁ గోపముగా నున్నది. ఈయన యాంధ్రుడట. రాజధాని మొగ మెఱిగినట్లు లేదు. నన్నయగారి నెప్పుడైనఁ జూచితివయ్యా నీవు ?

2 వ బ్రా : నన్నయగారిని జూచుట యెందులకు ? ఈ యాంధ్రభాషకు మర్యాద యెట్లు వచ్చును ? ఇది తోఁటపల్లెలో వాడుకొను భాష. జానపదులు ప్రయోగించు భాష. దీని కొక ఛందస్సు కలదా ? వ్యాకరణ మర్యాద కలదా ?

3 వ బ్రా : అన్నియును గలవు. నన్నయగా రన్నియు సమకూర్చిరి. ఛందస్సు వేఱె యెక్కడనుండి వచ్చును ? పింగళుని ఛందస్సే సర్వ భాషలును స్వీకరించును.

1 వ బ్రా : అవునయ్యా ! సంస్కృతములో శిఖరిణి, వసంతతిలకాది వృత్తములను గాళిదాసాదులు స్వీకరించిరి. ఆ వృత్తములను మీ యాంధ్రభాషలో వ్రాసినచో నాటనికుఁ దంగి తొడిగిన ట్లుండును.

3 వ బ్రా : నీ సమట బాగుగా నున్నది. మీ ద్రావిడ భాషలో బూర్వమే చాల కావ్యములు కలవు. అందులోని వృత్తముల మాట యేమి చెప్పితివి ?

1 వ బ్రా : మూడి స్వతంత్ర వృత్తములు.

3 వ బ్రా : పింగళుండు చేసిన ఛందః ప్రస్తారమును బట్టి లక్ష వృత్తములు పుట్టును. క్రొత్తవాని నెవ్వడును సృష్టించలేడు.

2 వ బ్రా : అవును. ఆ భాషయొక్క శక్తినిబట్టి వృత్తముల నెన్నుకొనుటలో నుండును.

3 వ బ్రా : మఱి తెలియనివాడవు కావే. నన్నయ్యగా రా పనియే చేసిరి. ఆంధ్రభాషకు యోగ్యములైన వృత్తములనే తీసికొనిరి.

2 వ బ్రా : ఇది యొక మ్లేచ్ఛభాష. ఇందు వ్రాయఁబడిన కావ్యముల నెవ రాదరింతురు ?

3 వ బ్రా : తమవంటివా రుందురని నన్నయ్యగారికిఁ దెలియును. అందుకనియే వారు వ్రాసిన వ్యాకరణములో నిట్లు వ్రాసిరి. 'స్వస్థానవేషభాషాభిమతాస్సంతో రస ప్రలుబ్ధధియః లోకే బహు మన్యంతే వైకృత కావ్యాని చా స్య దవహాయ." రసలోభము గలిగిన పండితులు సత్పురుషులు నన్నయ్యగారి కావ్యమును స్వీకరింతురు.

2 వ బ్రా : ఏమో నాకు నమ్మకములేదు. ఇంతకును సరస్వతికిఁ బెద్దదినములు వచ్చినవి.

3 వ బ్రా : సరస్వతికిఁ బెద్దదినము లిప్పుడు వచ్చుటయేమి ? వాల్మీకి రామాయణమును వ్రాసిన నాడే వచ్చినవి.

1 వ బ్రా : ఏమండి ! మీ నన్నయభట్టు వాల్మీకి మహర్షి యంతవా డందురా యేమి ?

3 వ బ్రా : అది నాకేమి తెలియును ? సరస్వతీదేవికిఁ దెలియవలయును. మన మిప్పుడు సత్యలోకములో నుండినచో బ్రహ్మణియైన దేవి యీ యాంధ్ర భారతోదయ సమయమున నెట్లుండునో చూడవచ్చును.

1 వ బ్రా : నేను యోగశక్తిచేత సత్యలోకమునకుఁ బోఁ గల్గుదును.

2 వ బ్రా : నేనును రాఁగల్గుదును.

3 వ బ్రా : నేను రాను. నేను రాజనగరమునకుఁ బోయి యిందు సభలో విష్ణువర్ధన మహారాజు కొలువు దీర్చి యుండగా నన్నయ్యగారు భారతమును జదువుచుండగాఁ గనులారఁ జూడవలయును. సత్యలోకము నీ జన్మకుఁ గానిచో మరియొక జన్మమునకుఁ జూతును. నేను స్వస్థాన వేష భాషాభిమతుండను. రసప్రలుబ్ధధీకుండను. నా యాంధ్రభాషా మహాభారతావతరణోత్సవమును గనులారఁ జూతును.

## రెండవ రంగం

(వీణాగానము, నృత్యము, క్రొత్త చీరలు ధరించు పెళపెళలు.)

మేనక : తల్లీ ! సరస్వతీదేవీ ! నే నప్సరసను, మేనకను. నీ పాద సరోజములకుఁ బారాణి సలంకరింప వచ్చితిని.

సరస్వతి : రంభను వచ్చి నృత్యమాడు మంటివే.

మేనక : తల్లీ ! ఆమె నృత్యము చేయుచునే యున్నది. ఆ ధ్వని వినిపించుచున్నది గదా.

సరస్వతి : నారదుని వచ్చి సంగీతము పాడుమంటిని.

మేనక : అవును తల్లీ ! ఆ దేవఋషి వీణాగానము చేయుచున్నారు. వినిపించుచున్నది గదా ! తమ మన స్సిప్పుడు మర్త్యలోకమున జరుగబోవు భారతావతరణోత్సవమునందు లగ్నమై యున్నది.

హంస : తల్లీ ! నేను దమ వాహనమైన హంసను. వచ్చి సిద్ధముగా నున్నాను. తమరు మర్త్యలోకమునకుఁ బోయి యా భారతావతరణోత్సవమును జూడవలయు నను కొన్నచో నేను సిద్ధముగా నున్నానని మనవిచేయుటకు వచ్చితిని.

పరిచారిక : తల్లీ ! నేను ద్వార రక్షకురాలను.

సరస్వతి : ఎందుకు వచ్చితివి ?

పరి : కొందరు మహర్షులు, కొందరు మహర్షితుల్యులు దేవీ దర్శనార్థము ద్వారమునందు వేచియున్నారు.

సర : నా రెవరెవరో కనుగొని రమ్ము—

పరి : ఒకాయన పేరు కాళిదాసు, మరియొకరి పేరు భవభూతి, మరియొకరి పేరు మురారి.

సర : వీరు ఋషులు కారే.

పరి : ఋషులు దూరముగా నిలుచున్నారు తల్లీ ! నీరి కనుజ్ఞ యిచ్చినచో వారుకూడ వత్తురు.

సర : వాల్మీకి వ్యాసులు కూడ వచ్చిరా ?

పరి : చిత్తము.

సర : అందఱను లోనికిఁ బ్రవేశపెట్టుము.

పరి : సృష్టికర్తలు కూడ విచ్చేసినారు.

సర : వారి కనుజ్ఞ యక్కఱలేదుకదా !

(పలుమంది నడచి లోనికి వచ్చిన ధ్వని.)

బ్రహ్మ : సరస్వతీ ! నేను బ్రహ్మను. నీవు మారిపోవుచున్నావు. నిన్నుఁ జూచుటకు వచ్చితిని.

సర : స్వామీ ! అంతయుఁ గల్పముల మీఁద, ననంత మహాయుగముల మీఁదఁ దమ రెన్ని మార్పులు పొందిరి ? నే నెన్ని మార్పులు పొందితిని. ఇందులోఁ గ్రొత్త యేమున్నది ?

బ్రహ్మ : లిగ్గఱిగా ననకుము. అందఱకును దెలిపిపోవుము. దేవీ ! వీరుగో వాల్మీకి వ్యాసులు, కాళిదాస భవభూతి మురారులు.

వాల్మీకి : దేవీ ! నేను వాల్మీకిని. భూలోకమునందు నా కొక ప్రత్యర్థి యుదయించినాఁడు.

సర : నన్నయ్యభట్టు మీకుఁ బ్రత్యర్థియా ?

వాల్మీకి : ఆయన యహంకార మట్లే యున్నది—నన్ను గురించి యేమన్నాడు.

తరళము : హరిహరాబ్జ గజాననార్క షడాస్య మాతృ సరస్వతీ
గిరిసుతాదిక దేవతాతతికి న్నమస్కృతిఁ జేసి దు
ర్భరతపోనిధివాధికున్ గురుపద్యవిద్యకునాద్యు నం
బురుహగర్భ నిభున్ బ్రచేతసుపుత్త్రు భక్తిఁదలంచుచున్

సర : నీవు బ్రహ్మయంత వాడ వన్నాఁడు గదా !

వాల్మీకి : దుర్భరతపోనిధివాధికుఁడను. అంబురుహ గర్భ నిభుఁడను. ఇవి రెండు నొక్కటియే. కవిగా నన్నత డెట్లు చూచుచున్నా డన్నది ప్రశ్న. నేను పద్య విద్య కాద్యుఁడను. అంతే. తిరస్కార మచ్చట నున్నది.

భవభూతి : తల్లీ ! నేను భవభూతిని. తమ యనుజ్ఞతో వాల్మీకి మహర్షికి సమాధానము చెప్ప నెంచుచున్నాను. మహర్షీ ! మన మందఱము నేర్చినది పద్య విద్య మాత్రమే కదా ! వేద వేదాంగములను స్మృతులను నిర్మించినవారము కాదుగదా !

వాల్మీకి : ఆయనకు నాయందుఁ గంటె వ్యాసునియందే యధిక గౌరవము. ఆయన సంసార వికార సంతమసజాలము వాపినాఁడట. సూరి చేతో రుచిరాబ్జబోధనరతుండగు సంభోరుహ మిత్రుఁడట. భూరి యశో విరాజితుఁడట.

వ్యాసుఁడు : తల్లీ ! నేను వ్యాసుఁడను. వాల్మీకి మహర్షిని నన్నయభట్టు బ్రహ్మతో సమానుఁడని యన్నాఁడు. నన్ననలేదు. కావ్యరచనా శిల్ప దృష్టితో నన్నును గౌరవించలేదు. నేను వ్రాసిన వ్రాత యంతయుఁ దారుమారు చేసినాఁడు.

వాల్మీకి : వ్యాసఋషీ ! కాదయ్యా ! నీవు మహాకవి వనియైన నొప్పుకొన్నాఁడు. నేను పట్టి పద్య విద్య కాద్యుఁడనట.

కాళిదాసు : అమ్మా ! నేను గాళిదాసును. నిజమే. నన్నయ్య బాగుగనే వ్రాసినాఁడు. "వాల్మీకే ర్మునిసింహస్య కవితా వన చారిణః శ్రుణ్వన్ రామకథా నాదం కో న యాతి పరాంగతిమ్". కవితావనమునందు సంచరించుచున్న వాల్మీకి యన్న మునిసింహము రామకథ యన్న పేరుతో గర్జించినది. ఆ గర్జాధ్వని విని యెవఁడు గుండె బ్రద్దలై చావఁడు ? అంత భయంకరమైన గర్జ విని పరమైన గతి కెవఁడు పోఁడు ?

భవభూతి : అట్లనరాదు. ఎందుకనుగా
కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్
వాల్మీకి యన్న కోకిల కవిత్వమను కొమ్మమీఁదఁ గూర్చుండి రామరామ యని పలుకుచున్నది. ఎంత మధురముగా నున్నది.

వాల్మీకి : అదికాదు — అతఁడు భారతము నాంధ్రీకరించు చున్నాఁడు గాని నా రామాయణము నాంధ్రీకరించుట లేదు. అతనికి వ్యాసుని యందే యెక్కువ గౌరవము. నేను పట్టి మునిని. వ్యాసుఁడు ముని పూజితుఁడు భూరి యశో విరాజితుఁడు.

సర : ఇంతకును మీరంద ఱిప్పు డెందుకు వచ్చితిరి ?

కాళిదాసు : తల్లీ ! నీ వివర్తశోభ చూచుటకు వచ్చితిమి.

సర : నీవు చేసిన వివర్తశోభ కంటె నధికమైన శోభను బొందుదు ననుకొనుచున్నావా ?

భవభూతి : తల్లీ ! సిద్ధులును చారణులును నీ యీ యాంధ్ర భాషా వివర్త రామణీయకమును బొగడుచున్నారు. అతఁడు నీకు మాకంటె నెక్కువ శోభను సమకూర్చు చున్నాఁడేమో యని వచ్చితిమి.

సర : ఐనచోఁ గూర్చుండుఁడు. రాజమహేంద్ర నగరమున సభ మొదలుపెట్టఁ బోవుచున్నారు—

* * *

వైతాళికుఁడు : అఖిలజలధి వేలా వలయ వలయిత వసుమతీ వనితా విభూషణంబైన వేంగీ దేశంబునకు నాయక రత్నంబునుంబోని రాజమహేంద్రపురంబునందుమహేంద్ర మహిమతోఁ బరమానందంబున సకల భువన లక్ష్మీ విలాస నివాసంబైన రమ్య హర్మ్య తలంబున మంత్రి పురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహా ప్రధానానంత సామంత విలాసినీ పరివృతుండై యపార శబ్ద శాస్త్ర పారగులైన వైయాకరణులును భారత రామాయణాద్యనేక పురాణ పారీణులైన పౌరాణికులును బహు విద్వజ్జనంబులు పరివేష్టించి కొలువ మనుమార్గుఁడును వంశవర్ధనుఁడు నైన విష్ణువర్ధనుఁడు కొలువున్నాఁడు.

* * * *

భవభూతి : అదిగో ! అందఱును వచ్చిరి—నన్నయ్య కూడ వచ్చినాఁడు—నన్నయ్య తన భారతమును దీసికొని చదువఁబోవు చున్నాఁడు.

సర : ఏమయ్యా ! భవభూతీ ! నన్నయ్య యన్నచో నీకు మాత్సర్యము లేదా ?

భవభూతి : మహాదేవీ ! మహర్షులైన వాల్మీకి, వ్యాసులకు దిక్కు లేదు—కాళిదాస భవభూతులము మామాట చెప్ప వలయునా ? అదిగో నన్నయ్య యారంభించు చున్నాఁడు.

* * * *

కలకలం

నన్నయ్య :

శ్రీవాణీ గిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహంత్యవిహతాం
స్త్రీ పుంసయోగోద్భవాం

తే వేదత్రయమూర్తయస్త్రి పురుషా
స్సంపూజితా సస్సురైః
భూయాసుః పురుషోత్తమాంబుజభవ
శ్రీకంధరా శ్శ్రేయసే—

* * * *

కాళిదాసు : ఇది సంస్కృతమే. నే నేదో క్రొత్తభాష యను కొన్నాను. సంస్కృతములోననే మఱియొక భారత మును వ్రాయుచున్నాఁడా ! ఈమాత్రపు శ్లోకమును మేము వ్రాయలేమా ?

మేనక : ఓయి కాళిదాసా ! ఏమి యీ మాటలు ?

ఏకైశ్వర్యే స్థితోఽపి ప్రణత బహుఫలే
య స్స్వయం కృత్తివాసాః
కాంతా సమ్మిశ్ర దేహోఽప్య విషయ మనసాం
యః పరస్తాద్యతీనాం
అష్టాభిర్యస్యకృత్స్నం జగదపి
తనుభి ర్బిభ్రతోనాభిమానః
సన్మార్గాలోకనాయ వ్యపనయతు
స వ స్తామసీం వృత్తిమీశః.

మహాప్రభూ ! కాళిదాసా! నీవు తక్క మఱి యెవ్వ రిట్లు వ్రాయఁగలరయ్యా !

వాల్మీకి : నిజము. నిజము.

వ్యాసుఁడు : నిజము. నిజము.

నర : భవభూతి మాటాడఁడేమి ?

మేనక : ఇదం కవిభ్యః పూర్వేభ్యః నమోవాకం ప్రశాస్మహే
వందే మహి చ తాం దేవీ మమృతా మాత్మనః కలాం.

నర : మన మీ ప్రసంగములో నున్నాము. అప్పటికే గథ చాల దూరము వచ్చినది. అదిగో మరల నన్నయ్య చదువు చున్నాఁడు.

* * * *

నన్నయ్య :

పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు
నారాయణుఁ డట్లు తాను ధరామరవంశ విభూషణుండు
నారాయణభట్టు వాఙ్మయ ధురంధరుఁడున్ దన కిష్టుఁడున్
సహాధ్యాయుఁడు నైన వా డభిమతంబుగఁ
దోడయి నిర్వహింపఁగన్.

* * * *

మేనక : ఈ నారాయణభట్టెవరు ?

నర : అతఁడు సకలభాషా విశారదుఁడు. సర్వ కవితా రహస్య శిల్ప వేది—వీ రిద్దరు సహపాఠులు.

భవభూతి : మఱి భారతము నన్నయ్యభట్టు రచించుచున్నట్లా? నారాయణభట్టు రచించుచున్నట్లా ?

వ్యాసుఁడు : భారతయుద్ధ మర్జునుఁడు చేసినట్లా ? కృష్ణుఁడు చేసినట్లా ?

భవభూతి : వ్యాసమహర్షి మిక్కిలి రమ్యముగా సమాధానము చెప్పినాఁడు.

మేనక : అట్లు చెప్పుటకు వారే తగుదురు ?

వ్యాసుఁడు : నీ వెవ్వరవు ?

మేనక : శుకతాతా ! తపోనిధీ ! నేను మేనకను.

వ్యాసుఁడు : నీ వెందుకు వచ్చితివి ?

భవభూతి : అమృతమైన యాత్మనః కలయైన దేవి పాదము లకుఁ బారాణి పూయుటకు వచ్చినది—

కాళిదాసు : ఆ వివర్త శోభ యింతవఱకుఁ జూడలేదు.

నర : వినవయ్యా ! వినుము. అవిగో భిన్న కంఠములతో నన్నయ్య రచన వినఁబడుచున్నది.

* * * *

1\. చ. బహువన పాద పాళికుల
పర్వతపూర్వ సరస్సరస్వతీ
సహిత మహామహీధర మ
జస్ర సహస్ర ఫణాళిఁదాల్చెడు
స్పృహతర మూర్తికిన్ జలధి
శాయికిఁ బాయక సెజ్జయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁడ
నంతుఁడు మాకు ప్రసన్నుఁడయ్యెడున్.

2\. వాడి మయూఖముల్ కలుగు
వాఁ డపరాంబుధి గ్రుంకె ధేనువుల్
నే డిట వచ్చె నేకతమ
నిష్మ మెయిన్ భవదగ్నిహోత్రముల్
పాడిమి వేల్వఁగాఁ బడియెఁ
బ్రొద్దును వోయెఁగముండు నేనియున్
రాఁడు వనమ్ములోన మృగ
రాక్షస పన్నగబాధ నొందెనో!

3\. జలధి విలోల వీచి విల
సత్కులకాంచి సమంచితావనీ
తలవహ రక్షణంబయిన
దక్షిణ హస్తమునన్ దదున్నమ
ద్గళదురుఘర్మవారి కణ
క్రమ కరాబ్జము పట్టి వాతిలో
వెలువడఁ గోమలిం దిగిచె
విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్.

క ం క ం ం

* * * *

కాళిదాసు : దేవి ! ఈ రచన విని నే సాంద్రుఁడ నై పోవుచున్నాను.

భవభూతి: లక్ష్మి! నేను తెలుఁగువాఁడనా యనిపించుచున్నది.

సర : కాళిదాస భవభూతులారా ! మీ రిద్దఱు గలిసియే నన్నయ్యగాఁ బుట్టినారు.

కలకలం

సేవక : భూలోకమునందలి యీ సభలో నేదో కలకలము పుట్టుచున్నది.

దౌవారికుఁడు : ఈ చళుక్య రాజ్యము లోకమున్ను కృష్ణా, గోదావరుల నడుమ వేంగిరాజ్య ముండెడిది. ఆ వేంగీ నగర మిప్పుడు కొంత శిథిలమై పోయినది. అచ్చట జైనుల మఠమున్నది. ఆ మఠస్థులలో నేదియో వివాదము జరిగి వారు మహారాజుతోఁజెప్పికొన వచ్చినారు.

సేవక : దూరమునుండి మఱి యింకెవరో వచ్చుచున్నారే —

దౌవారికుఁడు : వారా ! గృధ్రవాడ యందలి బౌద్ధవిహారమ్ము నందలి శ్రమణులు. వారు కూడ మహారాజుతో నేదియో చెప్పికొనుటకు వచ్చుచున్నారు.

సరస్వతి : సభ పూర్తియైనట్లున్నది—వందిమాగధులు విష్ణువర్ధనుని స్తోత్రము చేయుచున్నారు.

*　　*　　*

1 వ వంది : బిరుదాంక భీమ భీమే
శ్వర కృత నిత్యప్రసాద సౌజన్య గుణా
భరణ పరగండ భైరవ
సరస్వనమణిమకుటఘటితపద విబుధనుతా!

*　　*　　*

దౌవారికుఁడు : అంతయును బాగుగనే యున్నది కాని తన కావ్యమును నరాంకితము చేసినాఁ డేమి ?

సేవక : ఆ నరుఁ డెట్టివాఁడు. భీమేశ్వరకృత నిత్య ప్రసాదుఁడు. ద్రాక్షారామ భీమేశ్వరునకు నిత్యము నైవేద్యమైన వార్త యంతెలమీఁద రాదమహేంద్రవరమునకు వచ్చిన తరువాత గాని యీ రాజు భోజనము చేయఁడు. ఆ రాజు మరియును నెట్టివాఁడు.

*　　*　　*

2 వ వంది : ఘనదురితానుబంధకలికాలజ
దోషతుషార సంహతిం
దన యుదయప్రభావమున
దవ్వుగఁ బోపి
జగజ్జనానురంజన మగు రాజ్యసంతత వసంత
నితాంత విభూతి
నెంతయుఁ దనరుఁ జళుక్య మన్మథుఁడు
ధర్మ దయార్ద్ర నిబద్ధబుద్ధియై.

*　　*　　*

భవభూతి : ఇతని తెలుఁగు బాస యెంత యందముగ నున్నదో సంస్కృత మంతకంటె నందముగ నున్నది.

సర : ఓయి కాళిదాస భవభూతులారా ! నా శరీర కాంతి నన్నయ్య సంస్కృతముచేత మీ సంస్కృతముచేత వలెనే జిలుగులు మీరుచున్నది.

ద్వారపాలకుడు : ఆంధ్రభారతము జయించుగాక—ఆంధ్రజాతి వర్ధిల్లుగాక—ఆంధ్ర సారస్వతము చిరస్థాయి యగు గాక—
(వీణాగానము)

# కనకదాస చరిత్రము

## శ్రీ మైనంపాటి వేంకటసుబ్రహ్మణ్యము

ఈ చరిత్రమును రచించిన కవి వంకాయలపాటి సుబ్రహ్మణ్యకవి. కౌండిన్యసగోత్రుడు. తండ్రి వీరయ్య. తల్లి ఆదెమ్మ. జననము శాలివాహనశకము 1788 నకు సరియగు అక్షయనామ సంవత్సరము. ఇతని తల్లిదండ్రుల నివాసము ఉత్తర సర్కారులలోని వంకాయలపాడను గ్రామము. జననము చిత్తూర్ మండలమున కార్వేటినగరమందు జరిగినటుల కొన్ని రికార్డు లనుబట్టి తెలియుచున్నది. ఇతని తల్లిదండ్రులు తమ స్వగ్రామమును వదలి కార్వేటి నగరమున నెపుడు స్థిర నివాస మేర్పరచు కొనిరో తెలియుదు. ఈ కవికొక తోబుట్టువు కలదు. ఆ గ్రామముననే మునుపు స్థిర నివాసమేర్పరచుకొనియున్న మైనంపాటివారితో సంబంధ బాంధవ్యము లేర్పడినవి. కేశవయ్య అను నతనికి తనతోబుట్టువు నిచ్చెను. ఇతని బాల్యమంతయు నచ్చటనే గడిచెను.

తన గ్రంథములో "ఇట్లు కనకదాస చరిత్రంబు మత్కృతంబగుటకు కారణం బెట్టిదనిన వింశతి వత్సర వయఃపరిపాక సమయంబున మన్నివాసపుర సమీపంబున" అని వ్రాసికొని యుండుటచే యౌవనము కొంతవర కచ్చటనే గడిచెనని యూహింపవచ్చును. తల్లిదండ్రులు గతించుటచే తనకు దూరపు బంధువులైన 'రాచపూటి' వారి కల్లుడై * వారి గ్రామమగు 'బుడుగుగుంటపల్లె'లో నివాసమేర్పఱచుకొనెను.

ఇతని భార్యపేరు సుబ్బమ్మ. ఈ దంపతులు భగద్భక్తి గలవారు. వీరికి సంతానములేదు. ఈ కవి కార్వేటి నగరమున నున్నపుడే పిచ్చాచార్యులను వారితో మైత్రి యొనగూడెనట! ఆ ఆచార్యులవారు తనకు హితుడును, గురువును అని తన గ్రంథమున చెప్పినాడు. "పిచ్చాచార్య హితాఖ్యుడ! సచ్చరితుని యాదవేంద్ర సమధికనిరతో త్యుచ్చత దాసత్వమున నియచ్చర నుత చరిత కృతి నియామక బుద్ధిన్". ఈ కవి వ్రాసిన మరికొన్ని వ్రాతలనుబట్టి ఈ పిచ్చాచార్యులు చిత్తూరు మండలమందలి వడమాలపేట గ్రామనివాసి. ఇంటిపేరు "ఎలమరితి"వారు. మధ్వమతమునకు చెందిన బ్రాహ్మణోత్తముడు. ఈ మహనీయుడు శ్రీయాదవేంద్రోపాసనా మహామంత్రము నుపదేశించి, ఈతనిని యాదవేంద్రోపాసనా నియమమున నుంచినాడు. ఆనాటినుండియు తన యుపాస్య దైవమును విస్మరింపలేదు. ఆ దేవుని కరుణా కటాక్షముననే తనకీ కవితా విధాన మలవడినదట. బుడుగుంటపల్లెలో ఆ స్వామికి యాలయమును నిర్మించి రథోత్సవాది యుత్సవములను జరుపుచుండెడివాడు.

ఈ కవి యుక్త వయస్సుననే ఆధ్యాత్మిక విచార సంపన్నుడై యుండెనని తోచును. ఒకనాడు తత్పుర సమీపమున నున్న యుపవనమునకు శ్రీ యాదవేంద్రపాదార్చనోపయుక్త కుసుమంబులఁ గైకొని రానేగి, "తద్వన దుర్గా సమీప బదరీ తరు మూల వితర్ది కోపవిష్టుండై వర్తమాన సమయాగత విరక్త చిత్తంబున భగవత్పాద సేవాసక్తిం జేసి తృప్తిం బొందిన మనంబున నుండ నా పూర్వ పుణ్యోదయంబున నచ్చటికొక ధరామర వరుం డరుగుదెంచె. ఆ భూసురోత్తముడు విజ్ఞాన ప్రజ్ఞా సమన్వితుడు గావున :—

మధ్వ సిద్ధాంత సమర్థత నెపుడు
నిగమాగమ స్ఫూర్తి నెగడు వాఁడు
యమనియమాదికాయతయోగమహిమచే
నమరేంద్ర సదృశుఁడై యలరువాఁడు
వైహాయ సాదృశ్య వరసిద్ధ పురుషుఁడై
వనజాక్షు కరుణ వర్ధిల్లువాఁడు
భాగవతాది సద్భావార్థ విజ్ఞాన
భాసుర ప్రజ్ఞచేఁ బ్రబలువాఁడు
స్ఫుటహితాశ్రిత ఘటికాద్రిపుర నివాసుఁ
డతుల సాత్విక సమ్మతుఁ డమల ఘనుఁడు
మహిత పోలూరు కృష్ణార్య మహిత ధుర్యుఁ
డరుగుదెంచెను ముదితాన్యుఁ డగుచు నపుడు"

విచ్చేసెను.

ఈ పోలూరు కృష్ణమాచార్యులు మధ్వమతస్థుఁడనియు, నాధ్యాత్మికతత్వ విచారుఁడనియు, ఘటికాచలపుర నివాసియనియు పై పద్యమువలన దెలియుచున్నది. ఈ ఆచార్యులవారు చేతనొక తాళపత్ర గ్రంథమును బట్టికొని యచ్చటి కరుగుదెంచెను.

---

* కడపజిల్లాలోని కోడూరు సమీపమున నీ గ్రామము కలదు

ఆ మహనీయునిగాంచి ఈ కవి భక్తియుక్తుం డై నమస్కరించి కుశల సంప్రశ్నముల గావించి ఆధ్యాత్మిక విషయముల గొన్నింటిని గూర్చి ప్రశ్నించుటయు, నా కృష్ణమాచార్యులు తన హస్తమునన్న తాళపత్ర సంపుటమునిచ్చి యియ్యది కనకదాస చరిత్రంబనియు దాని సర్వావలోకనాతిశయంబున భగవత్ప్రసాదంబు గలుగుననియు వాక్రుచ్చిన నాథరాముని తన యింటికిఁ బిలిచుకొనివచ్చి తద్గ్రంథరహస్యంబులఁ దెలిసికొనెను.

ఒకనాడు తద్గ్రంథావలోకనాతిశయంబున మది మెచ్చుచు, శిథిల పత్రంబులంగూడి విచిత్ర తత్త్వాతిశయమున సనాతనంబై బహు రహస్యంబుల నుద్బోధించుచున్న దానింగాంచి—

"కనడమున కనక దాసుని
ఘన మాహాత్మ్యంబు చాల గరిమ వహించెన్
గనుగొన శక్యముగాదని
తెనిగించెద వ్యక్తముగను తేటపడంగన్"

అని ఏతద్గ్రంథ రచనకుఁ బూనుకొనినాడు.

ఇతఁ డీ కనకదాస చరిత్రమును తన యుపాస్య దైవమున కంకిత మిడెను.

షష్ఠ్యంతములు—

"ధీరునకు సకల జగదా
ధారునకు నితాంత సుగుణ ధరణీసుర మం
దారునకు దనుజగర్వ వి
దారునకు బుధేంద్రహిత సదాధారునకున్"

"ధామునకు విమల సుగుణో
ద్దామునకు మునీంద్ర శుభ నిదానమనోద్య
త్కామునకు నీల జలద
శ్యామునకు యశఃప్రపూర్ణ సమసోమునకున్"

"దక్షునకు దివ్యకౌస్తుభ
వక్షునకు ఫణీంద్ర తల్పవరవద విశ్వా
ధ్యక్షునకు సహిత పాండవ
పక్షునకు నితాంత శుభద పద్మాక్షునకున్

"వసుదేవ పుత్రునకు స
ద్వసుధాధర వంద్యమాన వరగాత్రునకున్
సముధా ముకశత్రునకును
సముభవ విద్యానమోద వరచిత్ప (?) నకున్"

". . . . . .
. . . . . . . . . . . . . . ."
. . . . . వరయదుపురవాసునకున్."

యాదవేంద్రస్వామిని ప్రతిష్ఠించిన (బడుగుంటపల్లె గ్రామమునకు కవి యుంచిన పేరు వరయదుపురము. దీనిని బట్టియే ఈ చరిత్రము శ్రీ యాదవేంద్రస్వామికి యంకిత మొనర్చినాడని చెప్పవచ్చును.

ఈ కనకదాస చరిత్రము సంపూర్ణముగా రచించలేదు. ఏ కారణమునవో రచన కంతరాయము కలిగినది. వ్రాసినంత వఱకు కథా విధాన మీ విధమున నున్నది.

బేలూరు పురమున బాల్యమునుండియు శ్రీమన్నారాయణ ధ్యానరతుండై యుండి ద్వాదశవత్సర శైశవమునకే బ్రహ్మజ్ఞానియై యొక దినంబున నిశ్చల సమాధి నిమగ్న మానసుండై యుండుటయు, నా పురాధిపతి యంతఃపురకాంత లావణ్యంబునకు నచ్చుటయు, వారిని వర్ణించుట వఱకు రచన సాగించినాడు. అంతఃపురకాంతలను వర్ణించు సీసపద్యమున కడపటి తేటగీతిలో రెండు పాదములతో నీ రచన నిలిచిపోయినది. తరువాతి కథా విధాన మెట్టిదని తెలియరాదు. అపూర్వ వేదాంత విషయములను వెల్లడించు నీ గ్రంథము కనకదాసుని జీవిత చారిత్రక విషయముల నెరిగించుచున్నది. ఈ కవి కనడమునుండి తెలుఁగున కనువదించి వచనమునఁ గథా రూపమున వ్రాసికొన్న చిత్తు కాగితములందలి వ్రాతలనుజూడ నిది స్పష్టమగును. ఇదియు పరిపూర్ణముగా లభింపలేదు. రెండు కాగితములున్నవి. అందలి విషయ మిది.

"ఒకనాడు శ్రీ వేంకటేశ్వర సన్నిధానమున నివాసముగా వుండు మాధవదాసునకు వేంకటరమణుడు స్వప్నమందువచ్చి కనకదాసు వచ్చుచున్నాడు—బహు జాగ్రత్తగా మీరందరు పరమ భక్తితో వర్తించవలెనని చెప్పగా ప్రాతఃకాలమునలేచి ఆ మాధవ దాసుడు స్నానముచేసి సమస్త అనుష్ఠానములు తీర్చుకొని శుచియై కనకదాసు నెదుర్కొని సమస్త విభవముతో వేంకటేశ్వరుని సన్నిధానమునకు చేర్చెను. తక్షణం వ్యాసరాయల స్వాముల వారున్నూ తిరుమలకు దయచేసిరి. ఈ వృత్తాంతమును విని చంద్రగిరి రాజధానియందుండు శ్రీ రాయలవారు సమస్త పరివారముతో వేంకటేశ్వర సన్నిధానమునకువచ్చి స్వామిని దర్శించి పురందరదాసులవారితోగూడ కనకదాసుల వారిని సత్కరించి గోశ్పద (?) ముఖమంటపమందు అందురు కూర్చునియుండిరి. ఆ సమయమునందు తిరుపతియందు నివాసముగానున్న కళావతి అను వేశ్య అభినయ నృత్య గీతాదులయందు ఈ జంబూద్వీపంబున తనతో సములులేరని మెచ్చి ప్రభువులిచ్చిన గండ పెండేరములతో తిరుమల దేవాలయమునందు సభాసీనుండై యున్న శ్రీరాయలను దర్శించి నా విద్యా పరిశ్రమను చూచి నాకు జయపత్రిక ఇమ్మని అడిగెను. ఆ సమయంబున రాయలవారి సమీ

సమునున్న భారతవిజయుండను ఒక బ్రాహ్మణుడు దాని గాన విద్యాదులను గూర్చి ప్రశంసించి పలికెను. శ్రీ శారదాదేవి అనుగ్రహమున అభినయ గీతములందు నభివృద్ధి పొందెను కాన ఈ కళావతిని ధిక్కరించుటకు ఇతరుల కసాధ్యమగునని భారత విజయుండు రాయల కెరింగించి నృత్య గీతములకు కళావతికి అనుజ్ఞ ఇవ్వవలెనని చెప్పెను. అంతట రాయలు సభాసదుల యుద్దేశ్య మెరిగి కళావతి కృతిపాడ అనుజ్ఞ ఇచ్చెను. అది శ్రుతి తాళ రాగ లయాదులతో గూడిన శ్రీ పర్యాయముగానున్న ఒక కృతి చెప్పెను—

కృతి—

సమతే కమలావన సదనే
ప్రవిమల సుమనె—హిమకర
వదనె సమ సుర జననీ ఘనె—. .
. . . . . .కుంతల విశదె
సంతస ఘనశ్రీ పద. . . . . ॥సమ॥

సరసిజ చరణే
జగదిగిచి భరణే
సరిసర నత శ్రీ గణే
విభముఖ ఫలకే
అభినవ తిలకే
సభతర తమ పాదకే ॥సమ॥

వరనుత మహితె
మరహిత సుమతె
వరయాదవేంద్రాదితె
మునిజన సుమనె
కనక సువసనె
వనభవనె ప్రావనె ॥సమ॥

ఇంతవఱకే యీ కాగితము లందున్నవి. ఉన్నది యున్నటుల వ్రాసితిని.

పై కృతి యందలి "వరయాదవేంద్రాదితె" అని యుండుటచే నీ కవి శ్రీయాదవేంద్రోపాసకుడు, మరియు నా స్వామిపై నాలుగైదు నూర్ల * కీర్తనలను రచించియున్నాడు. వానిలో కొన్ని చిత్తు కాగితములనుండి క్రిమిదష్టములైపోయినవి. మిగిలినవి అతని వ్రాతలతోనే భద్రపరుపబడి యున్నవి. కావున నీ కీర్తనయు తానే రచించి, కథా సందర్భమున కనుగుణ్యముగా పొందుపరచికొనియుండవచ్చునని యూహింతును. ఈ కీర్తన శైలియు కనడ కీర్తనలంబోలియున్నది. ఈ కవి సంస్కృతాంధ్రములేగాక, కనడ భాషయు నెఱిగి పాండిత్యము గడించి యుండెననుటకు సందియములేదు.

ఇం దుదాహరించిన రాయలు—కృష్ణదేవరాయలు (?) చంద్రగిరిలోనున్న రాయలు కనకదాసు తిరుమలకు వచ్చెనని తెలిసి యతని దర్శనార్థమై వచ్చుట, తిరుపతి నివాసియగు వేశ్య కళావతి విద్యా పరీక్ష చేయుట—వీనినిబట్టి చూడ కనకదాసు శ్రీకృష్ణదేవరాయల సమకాలికుడని తోచును. కన్నడ సంగీత సాహిత్య ప్రపంచమున వాగ్గేయకారుడై ఖ్యాతినందిన పురందరదాసు ఈతని సమకాలికుడే! ఇందు సూచించిన వ్యాసరాయస్వాముల వారెవరో తెలియదు. తిరుమల నివాసియైన మాధవదాసు గారెవరు? ఇవి విచార్యములైన విషయములు. బేలూరుపురమున కనకదాసుండెనని ఈ చరిత్రమున కవి పేర్కొన్నాడు.

"బేలూరు పురవరంబున
బాలుండై కనకదాసు పరమోత్సుకుడై
శీలత కేశవ నుతగుణ
జాలంబుల తత్త్వ సుగుణ చర్యలు డగుచున్"

బేలూరు పురము పూర్వమొక రాజధాని. ఆ రాజ్యాధిపతి పేరు ఏ కవి పేర్కొనలేదు. కనకదాసు బ్రహ్మ సమాధి యందున్నపుడు అంతఃపుర కాంతలు వన విహారము వచ్చినది మొదలు, కనకదాసు శ్రీ వేంకటేశ్వరుని దర్శనమునకు వచ్చునంతవరకు గల కథా సందర్భమేమో? కళావతి నాట్య పరీక్షానంతరముగల యుదంతమేమో? తెలియదు. మరియు "ఘట పటాది వస్తు జాతంబుల కధిష్ఠానంబగు తత్త్వం బెయ్యది—మహత్త్వాది కార్య భేదాకరణ ద్రవ్యాదిక సంకలిత మార్గంబులే క్రియం బ్రవర్తించె—ఏతద్బ్రహ్మాండ సంస్థాన వేలాఘనోదకాది జల భాగ వివరంబులే క్రమంబునం గలిగె—ఊర్ధ్వ్యంతః ప్రవేశ బాహ్యంబు అవతరణ ప్రచార ప్రదేశ శుభావృత చరితంబులెట్టివి—వికుంఠపుర విశాల విరజా తటోపవన సంచయ వైమానిక నిశ్శనంద ముకుంద పదారవింద సందర్శనా సమస్త విభవంబులే క్రియం బ్రకాశించె—యోగాదిక బ్రహ్మ సాక్షాత్కారాది లక్షణంబులు మొదలగు సర్వ తత్త్వ ధర్మంబులను గ్రహింపుడని ప్రార్థించిన......"

ఈ విషయము లన్నింటికి సదుత్తరము లిచ్చునట్టి చరిత్ర మిదియని తెలియుచున్నది. నా చిన్ననాట మా యింట నొక తాటి యాకుల పుస్తక ముండినది. అది యొక యుద్గ్రంథము. దానిని బాల్య చాపలమున నేనాట వస్తువుగా నుపయో

* వీని విశేషములగూర్చి మరొక వ్యాసమున విశ్లేషింతును

గించి, ధ్వంస మొనర్చినటుల జ్ఞప్తి యందున్నది. అదియే ఈ గ్రంథమై యుండునని యూహించుచు, విచారించుచున్నాను. చారిత్రక మహర్షులు, పండితోత్తములు ఎవరైనా ఈ కనక దాస చరిత్రమును గూర్చి తగిన విషయములు వెల్లడించినచో మా పెద్దల సాహిత్య సేవకు దోహద మొసంగినవారగుదురని మనవి చేసికొనుచున్నాను' — ఈ కవి లక్ష్మణా పరిణయమను నాటకమును రచించియున్నాడు.

ఈ కవిచంద్రుని కవిత్వ వైఖరికీ పద్యములు పరిశీలింపుడు.

శ్రీకరసారసప్రచురశీల సదార్చిత జాల సంవిదా
నేక భవాంధకార పరి నిర్మల సంచిత యోగ లబ్ధి ప్ర
భాకర దీప్తి యోగిజన భాసుర హృత్సరసీ రుహా సమా
లోకనమై దనర్చు కమలోదరు పాదము లాశ్రయించెదన్
"కవిజన హృదయ సంకలిత సౌఖ్యముగాని
కవి జన హృదయ సంగతము కాదు
. . . . . . . . . ... . .
. . . . . . . . . . . . .
పౌరాణికోత్తమ పద వికాసముగాని
పౌరాణికోత్తమ పటిమగాదు
గర్విత పీఠికాక్షమిత లక్ష్యముగాని
గర్విత పీఠికా గతముకాదు
ప్రబల పటుతరతత్త్వ ప్రభావ జాల
కుటిల కుంభిత కుజనానుకూల వాక్య
ఝటిత ఘటిత రసావేశ ఝరితమైన
వృత్త కావ్యంబు చాల సువృత్తమరయు"

కనకదాసు బ్రహ్మనిష్ఠలో నున్నపుడు—

శ్రీరామాశ్రిత పాదపద్మ శుభదా శ్రిత్యానుసారా సమా
ధారోదంచిత యోగవేగబల సంధానోచ్ఛ్రయాధ్యాన సం
చారోద్యత్సుఖశేముషీబలమునన్ చాతుర్య వైరాగ్య ధృ
గ్వారోపార్జిత వృత్తినుండె విలసద్బ్రహ్మను భావంబునన్

'అంతఃపురకాంతలు సంతసమున వన విహార సమయా గతులైన పట్టుల—

"కాంతల వక్షోజ కలిత సంస్పృతి జూచి
పర్వతాగ్రంబుల బ్రావుఁ గనియె
ప్రమదావదన్యాస పద సమాలోకన
కాంతారదేశవిఖ్యాతి నొందె
పౌరనితంబినీభవ దృశాహసితమై
వారి శీకర సమావాసమయ్యె
వరసుందరీజన వదన సంగతి జూచి
పదము జూడక వియత్పదము ప్రాకె
రంజితానమచక్ర మరాళ కుముద
హిమకరులభాతిఁ యువయువ ప్రమద మొసఁగ
మించు సురకాంతలకు నుపమించుకాంత
లరుగుదెంచిరి పౌర వనాంతమునకు"

"అంగజ శరహిత శుభకర
మంగళ రంగత్ప్రసూన మహితోజ్వలమై
సంగీత మత్త మధుకర
శృంగార వనాంతర ప్రశస్తయుతంబై"

# మహాసంకల్పము

శ్రీ వావిలాల రామమూర్తి

ఎవరీతండు మహాప్రశాంత సుషమా హేవాక సద్వీచికా
నివహాస్ఫూర్త్యనుమేయ యోగబల సుస్నిగ్ధుండు సిద్ధుండు; క
న్గవ పొంకంబున వాగ్విధానమున నాగ ప్రాభవ్యయుండో; తపః
ప్రవణత్వాత్తయశోఽర్జనత్వమది రూపంబైన యట్లుండెడిన్

కాషాయాంబరధారియై పలుకు ఉగ్రచ్ఛాత్రవర్గైక సం
తోషాంభోధి తరంగముల్ బలిసి మిన్నుల్ముట్ట; జైవాతృకా
శేషశ్రీఁ బరిడించు మోము, సుగతాశీః పూర్వ సద్బోధ పీ
యూషానల్ప సుధారలం గురియ, సద్యోముక్తి సంధాతయై —

క్రమరీతిన్ యతిసత్తముండు 'శరణంగచ్ఛామిబుద్ధ'మ్మనన్
గమనీయంబుగ నా ప్రభుండు 'శరణం గచ్ఛామి ధర్మ'మ్మనన్
కమనీయంబుగ నా గురుండు 'శరణం గచ్ఛామి సంఘ'మ్మనన్
శ్రమణుల్ పల్కుదు రట్టులే, త్రిశరణస్పష్టంబుగా బుక్కులన్

ఆచార్యోత్తమ! మీదు కారికల గుప్తార్థంబు వ్యక్తంబుగా
ఈ చట్టల్ మిము వేడువారనఁగ ఏమీ వృత్తియూ? యం చెదో
తోచంగా 'అకుతోభయోభవ, సముద్యుక్తోఽస్మి'యంచున్ స్మిత
ప్రాచుర్యాననుఁడైన ఆ మహితుఁడే ప్రాజ్ఞుండో బౌద్ధాకృతిన్

సత్యాన్వేషణ నిష్ఠితాత్మకుఁ డహింసామూర్తి, రోగార్తులన్
మృత్యూదగ్ర ముఖంబునుండి సతతమున్ బ్రేమ్ముగాఁ బ్రోవఁగాఁ
బ్రగ్రగాత్ముఁడటే; ప్రతున్న జనసేవాశీలి; దివ్యాసధీ
ప్రత్యేక ప్రతిపన్నబుద్ధి; ఎదియో స్వాంతమ్మునం దెంచెడిన్

"నేనేమో యిటు బోధలన్ సమయమున్ వెచ్చింప, నీదారి నీ
కై, నిత్యంబును కంధికై అరుగుచేనా జీవనంబంత; అ

ద్యో! నిన్ను ప్రజకింత భిక్షయిడలేవో త్యాగముం జూపి, త
ల్లీ! నీ జన్మము ధన్యమా, సుగుణవల్లీ! భవ్యకృష్ణానదీ!

నీ నాథుండు తదీయసంపద నహో! నెమ్మిన్ సమర్పించఁడో
దానం బేరును గాంచఁడో, యతని కర్థాంగిత్వమున్ గల్గి, నే
వా నిస్తంద్రత సాగరత్వము భజింపంగూడదో, తల్లిరో!
ఈ నేలన్ బ్రవహించి మా కిహపరా లిచ్చోటనే కూర్పవే!

శృంఖలలోఁ దగుల్కొనిన జీవుల రక్షణలో, 'శరీరమా
ద్యంఖలు ధర్మసాధన' మటన్నది ముఖ్యము; నీ కనత్పర
ప్రేంఖణ రీతి ప్రాణులకు భిక్షయిడున్, దదనంతరంబె మా
శంఖము మ్రోగు, నీ దయయె జాతికి జీవము కృష్ణవేణిరో!

సేవాతత్పరులెల్ల భిక్షుకులు, సౌశీల్యమ్ము సౌందర్యమున్
యావల్లోకమునందుఁ గూర్చెదరు, ధ్యేయమ్మద్ది నిర్వాణమై—
ఈ విద్యాలయభూమి, విశ్వజనతాహేలాపదోద్భాసియై,
వేవెల్గుల్ ప్రకటించుఁ; బూతమగు-త్వద్విన్యస్త పాదాలతో—

ఏను భగీరథుండ నగుటెట్లగు నీదగు గంగచేత ఈ
మా నిలయమ్ము ప్లావితము మాన్యము పావనమౌటగాక; కృ
ష్ణానది! మా అనంతరము, జాతికి జీవముఁ బోయునట్టి నీ
వే, ననుగూర్చి, ఇచ్చటనె వెల్గి, సుభిక్షము చేయు సీమలన్.

వందిత దేవతా నికర భవ్యకిరీట మణిప్రభాలస
త్సుందర దివ్యపాద! పరితున్న జనావనదక్ష! సచ్చిదా
నంద ఘనస్వరూప! కరుణావరుణాలయ! వీతరాగ! క
ర్మంది శరత్సుధాకర! నిరంతరపావన! బుద్ధ! తేనమః—

ఈ సంకల్ప మమోఘ"మంచు దనలో ఎంతో భవిష్యంబు లి
ప్సా సంసిద్ధముగాఁ దలంచి, కనురెప్పల్ విప్పి, సానందుఁడై,
ఆసీనుల్ శ్రమణుల్ తథాగతుని దివ్యస్తోత్రముల్ చేయ; 'ఓ
నా సూక్తిన్ మతి భావి ఉజ్జ్వల'మనెన్-నాగార్జునాచార్యుఁడున్

తన కార్యదీక్ష సీతా భాగ్యమునకునై
తత సేతువునకు 'నీలత' భజింప
తన ఉగ్గమునఁ దెచ్చుకొనిన సంకటికలి
దేశసేవావ్రత దీక్ష తెలుప
తన దృఢ భుజ బలోద్ధతి, ఖనిత్రంబులోఁ
జేరి రాచట్టు బెచ్చికలుగొట్ట
తన దేహాయష్టి పడినపాటునకు ఫలం
బులు, ఫాల ఘర్మాంబువులు, చెలంగ

పాటుపడు శ్రామికునిపాటివారు, లక్ష
లై, శ్రమింపఁగా, నాగార్జునాఖ్య సాగ
రంబు రూపొంది, సారసారణుల మీఱు
టా మహాసిద్ధు సుస్థిర ధీమహస్సు!

# జేబుదొంగ

## శ్రీ ఎం. ఎస్. ఎస్. సుందరం

**శ్రీరంగం :** కల్యాణి తండ్రి .... కొంచెం గొప్పవాడే— వయసు 45 సంవత్సరాలు.

**రామం :** జేబుదొంగ .... పరిస్థితుల ఒత్తిడివల్లనే తయారు కావాల్సొచ్చింది—వయసు 20 ఉండొచ్చు—

**వేణు :** రామం స్నేహితుడు—రామానికి జేబుదొంగతనంలో సహాయం చేసిందీ, చేసేదీ ఈయనే!

**యిన స్పెక్టరు:** డైరెక్టు ఎపాయింటెడ్ మాత్రంకాదు. పాపం ప్రమోషన్ వచ్చేసరికే పన్నెండు సంవత్సరాలయింది.

**కల్యాణి :** శ్రీరంగంగారి ప్రథమ పంట—పద్దెనిమిదివసంతాలు చూచింది.

**సుగుణ :** కల్యాణి గారాబు చెల్లెలు. ఆమెకంటె పది పదకొండు సంవత్సరాలు చిన్నది. అమాయికత్వంతో ఆకర్షణీయంగా ఉండే ముఖం.

....సూర్యు డస్తమించి మూడు గంట లయింది. ఒకవేళ సూర్యు డస్తమించకపోయినా ఈ కారు మేఘాల్లో కంటికి కనుపించడు—ఉండి ఉండి మెరుములు మెరుస్తున్నాయి. ఉరుములు ఘణేల్మంటున్నాయి. చిన్న తుంపర రాల్తోంది. క్షణాని కో, అర్ధకో కుంభవృష్టి కురవచ్చు. లేదా గాలివాటుకు అసలు వర్షం పడకపోనూ వచ్చు—

శ్రీరంగం గారిల్లు. ఇంట్లోని విజిటర్స్‌రూం—ఆ గదిలో రెండు సోఫాలు. వాటిమధ్య చక్కటి ఆష్ట్రె. అందంగా అమర్చబడి ఉన్నాయి.

గదిలో ఒకమూల టేబిలు—టేబిలు మీద గాజు కూజాలో నీళ్ళు, ప్రక్కనే గ్లాసు ఉన్నాయి.

ప్రేక్షకుల కెదురుగా ఉన్న గదిలో ఒక రేడియో, ఒక మంచం సగం సగం కన్పిస్తున్నాయి. రేడియోబల్లకీ, మంచానికీ మధ్య వలసినంత స్థలం ఉంది.

తెర తొలగింది ......

రేడియో ట్యూను గదినుండి శ్రావ్యంగా విన్పిస్తోంది. లోన గదిలో కూర్చుని—ఏదో అల్లుకొంటూ రేడియోతో పాటు తనూ హమ్మింగ్ చేస్తోంది శ్రీరంగంగారి ప్రథమ పంట కల్యాణి. ప్రక్కనే అక్కను చికాకు పరుస్తూ చిలిపి ప్రశ్నలు వేస్తోంది చెల్లెలు సుగుణ ....

సుగుణ : అక్కయ్యా !—మరే !—

కల్యాణి : (విసుగ్గా) అబ్బ !—ఏమిటే ?

సుగుణ : మరే—అక్కయ్యా ......

కల్యాణి : ఎంతసేపూ "మరేం" తప్పించి యింకోమాట రాదేమిటే నీ నోటివెంట .... పోయి ఆడుకో .... అల్లరి చెయ్యకు.

సుగుణ : అదికా దక్కయ్యా !—మరి కిశోర్‌కి—

కల్యాణి : ఊఁ ! కిశోర్‌కి !—ఏమయిందేం ?

సుగుణ : మరేఁ !—కిశోర్‌కి బావున్నాడే—

కల్యాణి : అవును—ఉన్నాడు. ఉంటే ?—

సుగుణ : "నీకు బావలేడు—నాకున్నాడోచ్చి" అని ఎగతాళీ చేస్తున్నా డక్కయ్యా !

కల్యాణి : అయితే వాడి దగ్గరకు వెళ్లకు. పోయి కోమలితో ఆడుకో—గొడవ చెయ్యకు—మా చిట్టి చెల్లెలవు కదూ! (హేళన).

సుగుణ : మరేఁ అక్కయ్యా ! కోమలికికూడా బావున్నాడే! నా కెందుకులేదు చెప్పవ్ ?

కల్యాణి : (జవాబు చెప్పలేకపోయింది) అబ్బబ్బ ! గొడవ చెయ్యకు సుగుణా ! వెళ్ళు.

సుగుణ : వెళ్తాగానీ ఒక టడుగుతాను యిస్తావా ?

కల్యాణి : చెప్పు.

సుగుణ : చెప్పంటే కుదరదండోయ్ ! తప్పకుండా యివ్వాలి.

కల్యాణి : యిస్తానుగా—చెప్పు.

సుగుణ : నాకేం—అక్కయ్యా .... మరేం బావ కావాలి.

(కల్యాణికి సిగ్గుతో, ఆనందంతో కూడిన కోపం వచ్చింది. ఆమె చెల్లెల్ని వదిలించుకోవాలని—)

కల్యాణి : అలాగే యిస్తాలే—వెళ్లి ఆడుకో.

సుగుణ : (వెక్కిరింపుగా) యిస్తాన్లే—ఎక్కడనుండి తెచ్చిస్తావమ్మా ?

కల్యాణి : ఆకాశం నుండి దిగొస్తాడు. సరేనా. పోయి ఆడుకో తల్లీ.

సుగుణ : పోనీలే—నువ్వియ్యకపోతే నాన్ననే అడుగుతాను.

కల్యాణి : (హేళనగా) వెళ్లం—వెళ్లి నాన్ననే అడుగు. వెళ్లమ్మా.

(ఇంతలో రామం ప్రవేశించేడు. తలంతా చెదిరి పోయింది. ముఖంనిండా చెమటా—అతని ముఖంలో ఏదో భయం, ఆందోళన, ఆత్రుత గోచరమవుతున్నాయి. అతను ఆయాసంగా వూపిరి పీలుస్తున్నాడు. ఇంతలో అతని కంట బడింది కూజా. ప్రక్కన గ్లాసు. చొరవగా వెళ్లి, కూజాతో నీళ్ల వొంపుకుంటున్నాడు. మనిషి అలికిడి విని పైకి వచ్చింది కల్యాణి. క్రొత్త

వ్యక్తిని చూచి ఆశ్చర్యపోయింది. ఒక్క క్షణం పూరు కొని)

కల్యాణి : (కొంచెం కోపంగానూ, మితం శాంతంగానూ) ఎవరండీ మీరు ?

(రామం అదిరిపడ్డాడు. మంచినీళ్ల గ్లాసు నేం చేయాలో తోచక తికమక పడ్డా)

రామం : నేనాండీ !—నేనేనా (చుట్టూకలయచూచి)—నేనూ ?

కల్యాణి : అవును. మీరే ! (రామం నెమ్మదిగా గ్లాసుని టేబిలు మీద పెట్టేసేడు.)

రామం : నేనూ—అదే !—నా పేరూ M. B. B. S. రామం! ఓ !—సారీ ! కాదు ! కాదు. రామం M. B. B. S.

కల్యాణి : ఇక్కడికి దేనికొచ్చేరు ?

రామం : చెప్తాగానీ !—ముందు నే నొకటి అడుగుతాను. చెప్తారూ ?

కల్యాణి : ఏమిటది ?

రామం : మీ పేరు—(ఆమె కోపంగా అనుమానంగా చూచింది) మీ పేరండీ— కోపంగా చూస్తారేం ?—పోన్లెండి. అడగను (కల్యాణి కోపం పోయింది.)

కల్యాణి : నాపేరు కల్యాణి !

రామం : Oh! Very Good Name—చాల బావుంది.

కల్యాణి : ఏమిటి బాగుంది ?

రామం : (ఖంగారుగా) ఏం లేదూ.

(యినస్పెక్టరు వచ్చేడు.)

ఇనస్పెక్టర్ : ఏమండీ ! యిక్కడి కెవరైనా మనిషి పరుగెత్తు కొచ్చాడా ?

(కల్యాణి రామంవేపు అయోమయంగా, అనుమానంగా చూసింది.)

రామం : (యినస్పెక్టర్‌తో) ఇక్కడికాండి !—అబ్బే. ఎవరొస్తారండీ ?—ఎవరూ రాలేదు. రారు కూడ (కల్యాణితో) అవునుకదూ కల్యాణి ?

ఇనస్పెక్టరు : ఇక్కడి కొక జేబుదొంగ పరిగెత్తు కొచ్చేడండి—వాడు ఎటుపోయేడో.

రామం : కల్యాణి ! మంచినీళ్లు తీసుకురా—(కల్యాణి అర్థం కాక రామంవంక చూస్తోంది.) తీసుకురా కల్యాణి !—మంచినీళ్లు తెమ్మంటే అలా చూస్తావేం ?

కల్యాణి : మీ కిక్కడ మంచినీళ్లు తెచ్చి అందివ్వటానికి దాస దాసీ జనం సిద్ధంగా లేరు. అసలు మీరూ—

రామం : అదేమిటి కల్యాణి!—భర్తకి—కావల్సిన వాడికి, కొంచెం మంచినీళ్ళు—(మాటని కట్ చేసింది కల్యాణి)

కల్యాణి : My God ! భర్తా ? ఎవరికి ?—ఎవరు ?

రామం : అక్కడో అవు కల్యాణి !—ఎవరైనా వింటే నవ్వి పోతారు—నిన్నటికి నిన్న మీ నాన్నగార్ని 'నువ్వు మా నాన్నవా ?—ఛీ—ఫో ! మీ నాన్నంటావ్'' అని కసిరేవు. ఈనాట్టి కివాళ నన్ను మనిషంత మనిషిని నీ భర్తను "నువ్వు నా భర్తవా !'' అంటున్నావు బాగుంది. రోజు రోజుకీ నీ పిచ్చి మరీ ఎక్కువవుతోంది. చూడండి యినస్పెక్టర్ ! ఆడవాళ్లంతలా మారిపోయేరో—!

కల్యాణి : యినస్పెక్టర్!—అంతా అబద్ధం—నాకు పిచ్చి పట్ట లేదు. ఈయనకే—అసలు మా నాన్న—

రామం : ఇంట్లో లేడంటావ్ ?—అంతేనా ?—బాగుంది !—చాల బాగుంది కల్యాణి. మీ నాన్న!—అస్తమానూ యింట్లో కూర్చోటాని కేం ఆడదనుకొన్నావా ?—లేకపోతే పక్ష వాతం వచ్చి కాళ్ళు—

కల్యాణి : షటప్ !—యూ — (ఏమనాలో తోచక ఆగిపోయి, చిత్తరపోయింది)

రామం : తిట్టు కల్యాణి !—ఊఁ ! కానీ ! — నీకు యింత అందంతోబాటు భగవంతు డా పేసకాయంత వెర్రి ఎందుకు పెట్టాడో !—తిట్టు. నువ్వు తిట్టాల్సిన దానివి, నేను పడాల్సినవాడిని. తిట్టు కల్యాణి !— ఊఁ !

యినస్పెక్టర్ : కల్యాణిగారూ! భర్త నలా తిట్టటం మంచిదికాదు ! ఏనాటికైనా భర్తే—

కల్యాణి : యూ ! యినస్పెక్టర్—మీరు మీ బాధ్యతను విస్మరిస్తున్నారు.

యినస్పెక్టర్ : విస్మరిస్తే విస్మరించేనులెండి !—కాని మీరలా భర్తను దూషించేటం మంచిపని కాదు. మన భారత వనితకు, కులస్త్రీకి తగిన పని కాదు. భర్తను దైవంలా చూసుకోవాలి.

రామం : అలా బుద్ధిచెప్పండి యిన్‌స్పెక్టర్ !—సంవత్సరం నుండీ చూస్తున్నా—అబ్బబ్బా ఒకటే తిట్టడం—

యినస్పెక్టర్ : పెళ్లయి సంవత్సరానికే మొహం మొత్తిందా ?

కల్యాణి : Nonsense !—Mr. యినస్పెక్టర్! — Mind your own business!—నేను చెప్పింది వింటారా ? —వినరా?

యినస్పెక్టర్ : ఏఁవిటమ్మా వినేది ? అర్ధగంటనుండీ భర్త నలా విలువనా తిట్లతో, దీవెనెలతో, సాధింపులతో బాధ పెడుతున్నావు. చూస్తున్నాను కదూ. (రామంతో) మీవంకోయ్—నేను చెప్పినట్లు చెయ్యండి—చూడండి! ఈమెకు కొంచెం పిచ్చిలాగుంది. వో వెలరోజులపాటు మా శాణాకు గాని, పిచ్చాసుపత్రికిగాని పంపండి !—

కల్యాణి : (కోపంతో) మిస్టర్ యినస్పెక్టర్ ! నన్ను పిచ్చిదాన్నంటావ్ ? — డ్యూటీని విస్మరించిన నీకే పిచ్చి — కావలిస్తే మీరే ఆ పిచ్చాసుపత్రిలో చావండి ! (రామంతో) ఏయ్ మిస్టర్ ! మర్యాదగా బైటకు పోతావా ? గెంటించమంటావా ?

రామం : ఏమిటి ? ఏమిటి కల్యాణి !—నన్ను గెంటిస్తావంటావ్ ? ఊఁ పిలు !— మన నౌకర్ల నందర్నీ పిలుచ్ !— ఎవరు నన్ను గెంటగలరో చూస్తాను.

యిన్స్పెక్టర్ : అంత మరీ ఎగిరిపాటు కూడదు కల్యాణిగారూ ! భర్త వింట్లోంచి గెంటేస్తానే భార్య ఉంటుందనుకో లేదు.

కల్యాణి : (ఉడికింపుగా) మీ భార్య ఎప్పుడూ అలా అనలేదా ?

యిన్స్పెక్టర్ : నా భార్యతో వారం రోజులు స్నేహం చేస్తే తెలుస్తుంది.

కల్యాణి : మీ భార్యతో స్నేహం చెయ్యాల్సిన అవసరం నాకేం లేదు.

రామం : ఎంతైనా ఉంది కల్యాణీ !—ఆమెలాటివారితో స్నేహం చేస్తే కొంచెం పతివ్రతా లక్షణా లబ్బుతాయి.

కల్యాణి : Nonsense! నే నిప్పుడు పారుపోతు ననుకున్నారా ?—

యిన్స్పెక్టర్ : అన్నన్న !—ఎంతమాట ! మా పోలీసు డిపార్టు మెంటునే గజగజ లాడిస్తున్న పతివ్రతామతల్లివి— పరమ సాధ్వివి.

కల్యాణి : Mr. యిన్స్పెక్టర్! Dont loose your tongue. మీ మీద పరువున్నష్టం దావా వేస్తాను.

యిన్స్పెక్టర్ : ఏమిటమ్మా ?—మహా బెదిరిస్తున్నావ్. నేనుకో. అసలు నీ మీద నేను వెయ్యకపోతే.

రామం : వూరుకోండి యిన్స్పెక్టర్ !—ఆమె యిప్పుడున్మాద స్థితిలో ఉంది. (యింతలో సుగుణ వచ్చింది) హల్లో పాపా ! బడి విడిచిపెట్టేసారా ?

సుగుణ : (తెల్లబోయి) వాకీరోజు బడి లేదుగా. (రామం ఆమె నెత్తుకొంటు)

రామం : యింద !—యింద పాపా !—తీసుకో (సుగుణ తెల్లబోతూ చూస్తూ వూరుకొంది) అదేమిటి పాపా !— అదేమిటలా క్రొత్తవాడిని చూస్తున్నట్లు చూస్తావ్ !— హలో యితవా ? — ఈయన యిన్స్పెక్టరుగారు ? యిన్స్పెక్టరుగారూ ! మా పాప—పాపా !— చూడు— అక్కయ్య నేను నీ బావను కానంటోంది—నేను నీ బావనే కదూ ?

సుగుణ : అవును—బావ !—హోయ్, హోయ్ ! అక్కయ్యా ! బావ.

కల్యాణి : (కోపంగా) సుగుణా ! యిలారా ! ఊ ! రా.

రామం : సుగుణా నువ్వు బావ జట్టేకదూ ?—నీకు చాక్లెట్లిస్తాను. బిస్కత్తు లిస్తాను. గౌన్లు కుట్టిస్తాను. సినిమాకి తీసికెళ్తాను—ఏం ? మా సుగుణ బావ చెప్పి నట్లు వింటుంది—కదూ ?

కల్యాణి : సుగుణా !—చెప్పుంటే వినవ్వాదూ ?—యిలారా ?

సుగుణ : నాతో మాట్లాడకమ్మాయ్ !—ఇవాళనుండి నేను బావజట్టు ! నీతో మాట్లాడమన్నా మాట్లాడను. బావ చాల మంచివాడు. అక్కయ్య చాల—

కల్యాణి : (బిగ్గరగా) సుగుణా !

యిన్స్పెక్టర్ : ఎందు కలా యిల్లదిరిపోయేలా అరుస్తారు— కాస్త విశ్రాంతి తీసుకోండి !—మరి నే వెళ్లొస్తానండి !— ఈ ప్రాంతాల్లో జేబుదొంగ—సామాన్యమైనవాడు కాడండోయ్—బాగా చెయ్యి తిరిగినవాడు తిరుగుతున్నాడు. జాగ్రత్త—వస్తానమ్మా కల్యాణమ్మా !— పాపా ! టా ! .. టా !—(వెళ్లిపోయేడు)

కల్యాణి : (కోపంగా) రోగ్ రాస్కెల్ రౌడీ .... !

రామం : (పాపను దింపుతూ) రోగ్ .... రాస్కెల్ .... రౌడీ ..! ఎవర్నలా తిడుతున్నారు ?

కల్యాణి : సిగ్గు వేయటంలేదూ పైగా మాట్లాడుతున్నారూ.

రామం : (సుగుణ చెయ్యి వదిలి) సుగుణా ! పోయి ఆడుకో !—

సుగుణ : వద్దు ! — కాదు నువ్వురా బావా !—మనిద్దరం ఆడుకొందాం.

రామం : నేను తర్వాత వస్తాగా !—మనిద్దరం చాలాసేపు ఆడుకొందాం గానీ అందాకా నువ్వెళ్లి ఆడుకో.

సుగుణ : మరి తప్పకుండా రావాలండోయ్—లేకపోతే నీ జట్టుండనే వుండను.

(వెళ్లింది—కల్యాణి కోపంగా రేడియో గదిలోకి వెళ్లింది)

రామం : కల్యాణీ !—(ఆమె కోపంగా చూచింది) సారీ ! కల్యాణి గారూ !—

కల్యాణి : ఏం ?—ఎందుకు మిస్టర్ నేమ్‌లెస్ !—

రామం : మీ మనసు నొప్పించినందుకు క్షమించండి—

కల్యాణి : (స్వరంలో హేళన ఉట్టిపడ్తోంది) ఏమిటీ ?—నేను మిమ్మల్ని క్షమించడమా—! నేను పిచ్చిదాన్ని Mr. Nameless.

రామం : కాదు !—అసభ్యంగా ప్రవర్తించి మీ మనసు నెంతో నొప్పించేను. నన్ను మీ రపార్థం చేసుకోవద్దు. పరిస్థితుల వల్ల అలా చేయాల్సొచ్చింది. కల్యాణిగారూ !—నన్ను క్షమించే నసండి !—

కల్యాణి : హు!—నే నెందుకు క్షమించాలి !—ఎందుకు క్షమించాలి Mr. Nameless !— యిన్స్పెక్టర్ ఎదురుగా నన్ను మీ భార్యనని అగౌరవపరచినందుకా ?—ఆయ నెదురుగుండా నన్నొక పిచ్చిదాన్నిగా చేసి ఆట ఆడించినందుకా ?—లేకపోతే నా స్వంత చెల్లెలుచేత మిమ్మల్ని "బావ" అనిపించుకొన్నందుకా ?—దేనికి మిమ్మల్ని క్షమించడం !—

రామం : కల్యాణిగారూ !

కల్యాణి : ఏం ?అర్థగంట క్రితం వరకూ నేను మీ భార్యను— నన్ను 'నువ్వు' అని సంబోధించేరు. కల్యాణి అని ఏక వచన ప్రయోగం చేశారు. యిప్పు డమాంతంగా పరాయిస్త్రీని అయిపోయానా ?—నాకు మర్యాదా యివ్వాల్సొచ్చిందా ?

రామం : మీకు బాగా కోపం తెప్పించిన ట్లున్నాను—కాని నేను మనస్పూర్తిగా మాత్రం అవని చేయులేదని నమ్మండి!—

కల్యాణి : ఇంకా నమ్మాలా ?—హు !

రామం : సరే !—మీరు క్షమించనంటే నేను చేసేదేంలేదు. వెళ్తాను. (రెండడుగులు వేశాడు. యింతలో చేతిలో రబ్బరు బొమ్మతో వచ్చింది సుగుణ).

సుగుణ : బావా !—బావా ! అమ్మ దొంగా ! వెళ్ళిపోతున్నావా ? అరగంటయినా ఆడుకోటానికి రాలేదు. అలా వీల్లే దబ్బాయి. ఈసారి నాతో రా. (రామం మనసు చెదిరి పోయింది. అతని కళ్లల్లో నీరు తిరిగింది.)

రామం : తర్వాత వస్తాను సుగుణా!—నువ్వు మంచిదానవుకదూ?

సుగుణ : ఆనప్పు లుదకవండోయ్—

రామం : కాదు! బజారుకెళ్లి నీకు చాక్లెట్లు, గౌన్లు, తేవద్దూ —వస్తానుకదూ—యిప్పుడే వస్తా.

సుగుణ : అలా కుదరదు బావా ! మరీ సెంకితనం చెయ్యకూడ దబ్బాయి ! అలా అయితే నాకు కోపం వస్తోంది. (కల్యాణి దగ్గరికెళ్లి) అక్కయ్యా ! చూడు ! బావ వెళ్లిపోతా డుట. ఉండమనవూ అక్కయ్యా ! నువ్వుండమంటే ఉంటాడు. అక్కయ్యా ! ఉండమనవూ—బావ—(కల్యా ణికి కోపం వచ్చింది. చెల్లెల్ని చెంపదెబ్బ కొట్టింది— రామం అదిరిపడ్డారు. అతని హృదయం బాధతో ఆక్రోశించింది.)

సుగుణ : (బాధగా ఏడుస్తూ) బావా ? (రామాన్ని కౌగిలించు కొంది. రామం ఆమె నెత్తుకొని)

రామం : క్షమించండి కల్యాణిగారూ ! నా మూలంగా మీ చిన్నారి చెల్లెలుకు కూడ దెబ్బలు!—సాఫీగా సాగిపోతున్న మీ మనసులో పెను తుఫాను రగిల్చేను—(సుగుణను దింపి) పోయి ఆడుకో పాపా ! మళ్లీ వస్తాగా. (సుగుణ వెళ్లి పోయింది. రామం ఒకసారి కల్యాణి ముఖంలోకి చూచి, మాట్లాడకుండా వెళ్లటానికి రెండడుగులు వేసాడు. కల్యాణి బాధపడింది. ఆమె తను చేసిన తప్పు పనికి పశ్చాత్తాపపడింది. రామం వదిలేసిన మంచినీళ్ల గ్లాసు తీసుకొని అతన్ని సమీపిస్తూ—)

కల్యాణి : యిదిగో—మిమ్మల్నే—(వెళ్తున్న రామం వెనక్కు చూచేడు) మంచి .... నీళ్లు (వెనక్కు చూచి రామం తిరిగి వెళ్లబోయేడు) మంచినీళ్లు త్రాగకుండా వెళ్తే నామీద ఒట్టు—(రామం స్తంభించిపోయేడు—ఏం చేయాలో తోచక నిలబడ్డాడు. ఇంతలో శ్రీరంగం గారు వీధిలోంచి వచ్చేరు. రామాన్నిచూచి ఆశ్చర్య పోయేరు. ఎదురుగా కల్యాణి చేతిలో మంచినీళ్ల గ్లాసు—అతనికేం అర్థంకాలేదు.)

శ్రీరంగం : కల్యాణి ! కల్యాణి !—ఏమిటమ్మా అది.

కల్యాణి : ఏంలేదు !—ఏంలేదు నాన్నా ! ఈయన పేరూ ....

రామం : రామం :::: M. B. B. S.

కల్యాణి : అవును....M.B.B.S.రామం!—మరేమో ఈయనకి

శ్రీరంగం : మంచినీళ్లు కావాలన్నారా ?

కల్యాణి : ఆఁ ! అబ్బే !—ఆఁ ! అవును. మంచినీళ్లే కావా లన్నారు. అవును.

రామం : అంతేకాదు—నాకు గది లేక చాల బాధపడుతున్నాను. మీరు కనక ఓ గది యిప్పించారంటే (రామం మాటలు విని కల్యాణి కోపంగా గ్లాసు టేబిలుమీద పెట్టేసి వెళ్లిపోయింది.)

శ్రీరంగం : గదులా ?—అబ్బే ! ఏం లేవోయ్ !

రామం : అన్నన్న—అలా అనేస్తే కాదు !—ఇంత మహాపట్నంలో రూంలేక చచ్చిపోతున్నానంటే నమ్మండి.

శ్రీరంగం : అవుననుకోండి .... కానీ మా యింట్లో కూడా ....

రామం : అలా అనేస్తే మరి నా గతేంకాను. మీరే ఏదో నాకో దారి చూపించాలి (సుగుణ వచ్చింది.)

సుగుణ : ఏం ? వచ్చేవా ?—చాక్లెట్లేవీ ? (రామం గాభరాగా)

రామం : చాక్లెట్లా ?—చాక్లెట్లా ?—అవేమిటో !—ఓ అవా ?

శ్రీరంగం : ఎవర్ని చూచి ఎవరనుకొందో !—(సుగుణతో) సుగుణా ! ఏమిటది ?

సుగుణ : కాదు నాన్నా !—బావేమో చాక్లెట్లూ, గౌన్లూ తెస్తా నన్నాడు—మరేం బావా తెచ్చేవా ?

శ్రీరంగం : (రామంతో) క్షమించండి—చిన్నపిల్ల !—వీధిలో ఉన్న పిల్ల లందరికీ బావ ఉన్నాడు. దీనికీ ఒక బావ కావాలంటోంది. ఎదిగినపిల్ల యింట్లో ఉన్నా వరు డెక్కడా దొరకటంలేదు.

రామం : మరేనండి. అందరూ కట్నాలు కావాలనేవారే !— వయస్సైనా ఆదాయం లేనివాడు కూడా వేలు కావా లంటాడు ఈ రోజుల్లో.

శ్రీరంగం : బాగా చెప్పావు—ఆఁ ! నాయనా మన దే కులం ?

రామం : మేమాండి ! ! బ్రాహ్మలం !

శ్రీరంగం : (కుతూహలంగా) యింటిపేరు ?

రామం : మల్లాప్రగడవారు !

శ్రీరంగం : ఏం చదువుకొంటున్నావు ?

రామం : M. B. B. S. —యిదే ఆఖరి సంవత్సరం—

శ్రీరంగం : బాగుంది !—ఆఁ ! గది కావాలన్నావు కదూ ?— సరే చూడు (రేడియో గది చూపిస్తూ) అది చాలదూ?

రామం : నిక్షేపంగా సరిపోతుంది.

శ్రీరంగం : అయితే యింకేం ?—దాంట్లో ఉండు !—ఆఁ ! చూడు. దీనికి కొన్ని రెండు పాఠాలు కూడా చెప్తూండు బాబూ ! బొత్తిగా జులాయిగా తిరుగుతోంది. (సుగు ణను చూపించేడు).

రామం : అలాగేనండి ! దానికేం భాగ్యం !—

శ్రీరంగం : మరి నీ సామాను అదీ ఎప్పుడు తెచ్చుకొంటావ్ !—

రామం : సామానుకే ముందండి? ఒక బెడ్డింగు ఓక పెట్టె— అంతేగా — మరొక గంటలో తెచ్చేసుకొంటూ !—వస్తా (వెళ్లి—మళ్లీవస్తూ) ఆఁ ! ఇవాళ మంచిరోజే అవునాండి.

శ్రీరంగం : (ఆలోచించి) బేషయిన రోజు .... వెళ్లిరా బాబూ ! (రామం వెళ్తున్నాడు)

సుగుణ : బావా !—(నాన్నతో) నాన్నా ! బావ వెళ్లిపోతున్నాడు చూడునాన్నా.

రామం : వస్తాగా ! యిప్పుడే వస్తా.

శ్రీరంగం : వస్తాడమ్మా !—యిప్పుడే వస్తాడు !—వెళ్లి రావోయ్.

(తెర)

## 2వ రంగం

సమయం తొమ్మిది గంటలపైన .... రంగాలంకరణ తొలుత మాదిరిగానే ఉంది. తెర తొలగింది. లోన గదిలో కూర్చుని కల్యాణి ఏదో చదువుకొంటోంది. రేడియో సన్నగా మ్రోగుతోంది. బైట గదిలో సుగుణ గెంతుతూ పాడుతోంది.

.... లోన గది వొక్కదానినే రంగస్థలంపై ప్రదర్శిస్తే మరీ లెక్కకుదుతుంది.

సుగుణ : బావా బావా పన్నేరూ ......
బావని పట్టుకు తన్నేరూ .... "బావా" .... "బావా".

కల్యాణి : ఏయ్ సుగుణా ! ఏమిటా పిచ్చి పాట ? (సుగుణ ఒక సారి అక్కవేపు నిర్లక్ష్యంగా చూచి తల త్రిప్పేసుకుని తిరిగి పాడటం ప్రారంభించింది.)

సుగుణ : బావా బావా పన్నేరూ ? ....

కల్యాణి : ఆపమంటె వినిపించటంలే ?—సుగుణా ! నీకే చెప్పేది.

సుగుణ : నే పాడుకొంటే నీకేం ?—(మళ్లీ పాడుతుంది.)

కల్యాణి : సుగుణా ! మరి నాకు కోపం వస్తోంది. తెల్సా ?

సుగుణ : కోపం వస్తే ఎవడికి భయమమ్మా ?—నేను నీగూర్చి పాడటంలేదు. మా కొత్త బావను గూర్చి పాడుతున్నాను. తెలుసా (యింతలో రామం బెడ్డింగు, సూటుకేసుతో వచ్చేడు) హాయ్ .... హాయ్ .... బావ వచ్చేసేడమ్మా.

(కల్యాణి ఒకసారి తొంగిచూచి నిర్లక్ష్యంగా తన పనిలో మునిగిపోయింది.)

రామం : సుగుణా ! మీ నాన్నగారేరీ ?

కల్యాణి : పైకెళ్లారని చెప్పవే సుగుణా ! సామాన్లు ఈ గదిలో పెట్టుకోమన్నారని కూడ చెప్పు.

రామం : సుగుణా ! మీ అక్క నీ గదినుండి లెమ్మను. నేను సామాన్లు సర్దుకోవాలి.

కల్యాణి : నే నుండగా సర్దుకోవచ్చు—సర్దుకోమనవే—

రామం : అలా అయితే కుదరదు. ఈ మూలకీ రేడియో ఏమిటి ?—అడ్డంగా ఈ మంచం ఏమిటి ?—ఇక్కడ ఈ టాయ్‌లెట్ టేబిలు ఏమిటి ?—ఛ .... ఛ .... Hopeless !—యిక్కడ రాక్షసులా మనుష్యులా వాసం చేసేది ?—చెప్పు సుగుణా.

కల్యాణి : కన్పించడంలేదా—అని అడగవే సుగుణా.

రామం : లాభంలేదు. బైటకు వెల్లి ఆ సోఫాలో కూర్చోండి!—అను సుగుణా !—(కల్యాణి లేచి పైకి వచ్చింది. రామం లోని కెళ్లాడు—కాని కల్యాణి కూర్చోలేదు.)

రామం : ఛ .... ఛ ....! రేడియో వింత మూలగా పెట్టు కొంటారా ? (రేడియోని సమీపిస్తూ మంచాన్ని గుద్దు కొని) అబ్బ!— ఈ మంచం మరీను. కొంచెం వెనక్కు వెయ్యకూడదూ. (వాటి స్థానాన్నుండి మారుస్తున్నాడు. కల్యాణి కిది చూచి కోపం వస్తోంది.)

కల్యాణి : ఏమిటిదంతా—స్వంత యింటిలా !—ఎక్కడ సామా న్లక్కడుండగా వాడుకోలేరా యిల్లు ?—అని అడగవే సుగుణా.

రామం : (పైకి వస్తూ) బాగుంది—చాల బాగుంది! ఇంత అద్దె యిస్తూ గదిలో Furniture నా యిష్టం వచ్చినట్లు సర్దుకోనియ్యరూ ?— ఏం సుగుణా చెప్పు.

కల్యాణి : మా సామాన్లు కదపకూడదూ ? ఆసవేమే మొద్దూ !

రామం : (మంచంమీద లేసులు తీస్తూ) ఛ .... ఛ .... ఏమిటే లేసులు. (చీర జాకెట్టు తీసి) రామ .... రామా! ఇక్కడే కట్టుదిడుపు గుడ్డలు కూడా (అక్కడున్న Lody high heels ను చూచి అకస్మాత్తుగా బైటకు ఒక్క గెంతు గెంతి)

రామం : Nonsense ! అక్కడనుండి ఆ చెప్పుల్ని తియ్య మను. చెప్పు సుగుణా.

కల్యాణి : అది నా గది !—తియ్యటానికి వీలులేదని చెప్పవే.

రామం : ఇది మీ నాన్నగారు నా కద్దె కిచ్చేరు కల్యాణిగారూ.

కల్యాణి : అయినా యిది మా స్వంత యిల్లేనండి రామంగారూ!

రామం : కావొచ్చు!—స్వంతిల్లు అయినంతమాత్రాన అద్దెవాళ్ల నెత్తిమీద చెప్పులుంచమన్లేదే.

కల్యాణి : అద్దెవాళ్ల నెత్తిమీద మేం చెప్పు లుంచలేదే—నా గదిలో నా చెప్పు లుంచుకున్నాను.

రామం : ఇంకా మీగది ఏమిటండీ ? అయినకాడి కంతద్దె పుచ్చుకొంటూను.

కల్యాణి : పోనీ చెప్పులు నావి—

రామం : కనుకనే తీసుకుపొండి—

కల్యాణి : వీల్లేదు! వాటి నక్కడే ఉంచాలి !

రామం : వీల్లేదు ! తీసెయ్యాలి—

కల్యాణి : అయితే ఆ గదిలో ఉన్న సామాన్లన్నీ తీసెయ్యాలి.

రామం : హా .... (వెళ్తూ తక్కువ ఆగి) ఏమిట్ ! గదిలో వస్తువు లన్నీనా ?—అంటే రేడియో కూడానా ?

కల్యాణి : కచ్చితంగా ! రేడియో, మంచం, అద్దం, పన్నె—

రామం : My God ? మరి నే నెక్కడ పడుకోటం ! దేంతో తల దువ్వుకోటం ! దేన్లో ముఖం చూచుకోటం ?

కల్యాణి : ఏమో ?

రామం : అలా వీల్లేదు. ఇక్కడనుండి ఒక్క పూచిక పుల్ల కూడా తీసికెళ్లటానికి వీల్లేదు.

కల్యాణి : అయితే ఉంచుకోండి ! కాని చెప్పులు మాత్రం భద్రం.

రామం : My goodness !—చెప్పులు ! Nonsense ! వాటి నిక్కడనుంచి తీసేయాల్సిందే.

కల్యాణి : తీసేయకపోతే ఏం చేస్తారు ?

రామం : తక్షణం తీసికెళ్లి వీధిలో చెత్త కాల్వలో పారేసొచ్చి అరడజను Mysore sandal soaps తో చేతుల్ని కడుక్కొంటాను.

సుగుణ : అన్నెందుకు బావా ?

రామం : ఎందుకా ?—ఆడదాని చెప్పులు ముట్టుకోగా అంటిన మలినాన్ని వదలించుకోటానికమ్మా !

కల్యాణి : (బిగ్గరగా నవ్వి) బాగుంది!—ఆడదాని జోడును ముట్టుకుంటే అరడజను సబ్బులు—కాని ఆడది ముట్టుకొన్న రేడియో ముట్టుకొంటే ?—ఆమె పడుకొన్న మంచంమీద పడుకొంటే—? ఏం చేయాలి ? చెప్పండి? ఏంచేయాలి ?

రామం : ఏమండోయ్ కల్యాణిగారూ ! నా కొట్టే కోపం తెప్పించకండి—మరేదిక్కడనుండి చెప్పులు తీసి కెళ్తారా—వెళ్ళరా ?

కల్యాణి : మహారాజులా తీసికెళ్తాను—కాని ఒక్కటే షరతు.

రామం : ఏమిటది ?

కల్యాణి : ఈ గదిలోంచి అన్ని వస్తువుల్ని తీసుకుపోతా.

రామం : లాభంలేదు.

కల్యాణి : అయితే యిదీ లాభంలేదు.

రామం : చెప్తున్నా వినండి ! నష్టపోతారు.

కల్యాణి : ఏమిటండీ నష్టపోయేదీ ?

రామం : చెప్పులండీ !—మీ పాదరక్షలు.

కల్యాణి : ఎందుకు నష్టపోతాను ?

రామం : ఎందుకు నష్టపోతారా ?—అవి ఈ గదిలోంచి తియ్యమంటే తియ్యలేదు గనుక.

కల్యాణి : ఎలా నష్టపోతాను ?

రామం : తీసికెళ్లి వీధిలో Side కాల్వలో విసిరేస్తాను కనుక.

కల్యాణి : ఏమిటీ?—నేను ముచ్చటపడి కొనుక్కొన్న జోళ్లను?—

రామం : అవును—

కల్యాణి : అందమైన జరీ ఉన్న ఈ జోళ్లను—

రామం : ఆహా—

కల్యాణి : మోజుపడి పన్నెండురూపాయలిచ్చి కొన్న సరిక్రొత్త ఈ జోళ్లను—

రామం : అవునండీ !—ఈ జోళ్లనే—ఇక్కడనుండి మీరు మర్యాదగా తియ్యకపోతే నేనే వీధిలో విసిరేస్తాను. తెలిసిందా ?

కల్యాణి : ఏమిటి మీ దబాయింపు ?—నా గదిలో నుండి నా జోళ్లను తీసివేయమంటారేం ?

రామం : చూడండి కల్యాణిగారూ !—మీ నాన్నగారు నాకీ గది అద్దె కిచ్చేరు—అవునా ?

కల్యాణి : (తలూపుతూ) అవును—కానీ !

రామం : ముందు నా మాట వినండి. నేను మీకు అద్దె యిస్తున్నాను. అటువంటప్పుడు ఈ గది నాదా మీదా ?

కల్యాణి : నాదే !

రామం : My God!—మీదెలా అవుతుందండీ?—అయినకాడికంటద్దె యిస్తుంటేనూ ?

కల్యాణి : అయితే అద్దెకున్నవాళ్లంతా ఆ యిళ్లు తమవే అని దబాయిస్తున్నారేమిటి ?

రామం : లేదనుకోండి—అయినా మీరి చెప్పులు తీసేయాలండీ. తప్పదు. ఇంత గట్టిగా నొక్కి చెప్తున్నందుకు క్షమించండి.

కల్యాణి : మీరు చెప్పినపని చెయ్యలేనంటున్నందుకు నన్ను కూడా క్షమించండి.

రామం : My goodness!—అలా అయితే సరే !— మీ చెప్పులు నేనే విసిరేస్తాను (గదిలోకి వెళ్లబోయేడు)

కల్యాణి : రామంగారూ ! నాకు కోపం తెప్పిస్తున్నారు. ఆడదానికి కోపం వస్తే అవమానం పాలవుతారు.

రామం : ఆడదాని చెప్పులున్న గదిలో ఉంటే అంతకం టెక్కువే అవమానం పాలవుతాను (లోనికెళ్లి ఎడంచేత్తో తేలునో, పామునో పట్టుకొన్నట్టుగా చెప్పులు పట్టుకొని వస్తాడు.)

కల్యాణి : (కోపంగా) రామంగారూ! వాటిని పారేస్తే మర్యాద దక్కదు.

రామం : వీటి నీ గదిలో ఉంచితే నా మర్యాదకు భంగకరం.

కల్యాణి : చివరిసారి చెప్తున్నా !—నామాట వినండి—వాటిని (రామం ఆమెమాటలు విన్పించుకోకుండా జోళ్లను వీధిలో పారేసొచ్చి ఆమె ముందు నిలబడి చేతులు దులుపుకొన్నాడు. ఆమె కోపంతో వళ్లు మరచింది. అతన్ని చెంపమీద కొట్టింది. క్షణం అతను చెంప తడుముకొంటు ఆమె ముఖంలోకి చూచేడు. ఆమె కూడా అదే సమయంలో అతన్ని చూచింది. ఆమె అతనిలోని అమాయకత్వాన్ని చూచి తను చేసిన పనికి సిగ్గుపడి విచారంగా ముఖం దించుకొని వెళ్లిపోతూ)

కల్యాణి : క్షమించండి—(రామం పలకలేదు. ఆమె వెళ్లిపోయింది. రామం సోఫాలో కూర్చుని మళ్లీ లేచి)

రామం : My god !—(కూజాలో మంచినీళ్లు త్రాగి—విసురుగా తిరిగి చికాగ్గా సోఫాలో కూర్చున్నాడు. పాప వచ్చింది. చేతిలో బఠానీలు ఉన్నాయి.)

సుగుణ : అమ్మ దొంగా—! యిక్కడున్నావా ? (రామం మాట్లాడలేదు.)

సుగుణ : బావా !

రామం : (పలుకలేదు.)

సుగుణ : ఏయ్ ! చెవుడు బావా !

రామం : (యికా పలుకలేదు.)

సుగుణ : బాగుంది. అక్క దక్కయ్య పలక్కుండా కూర్చుంది. ఇక్కడ బావ కూర్చున్నాడు. మరి మీ పనేమిటే. బఠాణీలు—(ఒక్క గింజ నోట్లో వేసుకొంది) బావా? బఠాణీలు తింటావా ?

రామం : (ఒద్దన్నట్టు తలూపేడు.)

సుగుణ : చాల బాగున్నాయి. తెలుసా ? ఎంచక్కా, తియ్యగా—తినిచూడు (రామం చేతిని పెకిలించి చేతిలో పోసింది. రామం తినకుండా కూర్చున్నాడు.)

సుగుణ : కోపం వచ్చిందా బావా!—అక్కయ్యెప్పుడూ అంతే! దాంతో అస్సలు మాటాడవద్దు. ఏం?—మనిద్దరం జట్టు (అతని మెడ పెనవేసింది.)

రామం : (దానికీ మాట్లాడలేదు.)

సుగుణ : మాట్లాడకపోతే నా కేడుపొస్తుం దబ్బాయ్!

రామం : పాపా!—పోయి ఆడుకో!—

సుగుణ : నే నొక్కర్తెనూ ఎలా ఆడుకోనూ, నువ్వు రా.

రామం : నీ బొమ్మతో ఆడుకో—వెళ్ళు.

సుగుణ : నా బొమ్మేమైనా మాట్లాడుతుం దేమిటమ్మా?

రామం : పాపా! నన్ను విసిగించకు. వెళ్ళి మీ అక్కతో ఆడుకో.

సుగుణ : అక్కదగ్గర కెళ్తే నీ దగ్గరకు పొమ్మంటుంది. నీ దగ్గరకొస్తే నువ్వు పొమ్మంటావ్—ఇకనుంచీ నీతో అస్సలు మాట్లాడనే మాట్లాడనబ్బాయ్—(వెళ్ళి పోయింది.)

రామం : (సోఫాలోంచి లేచి) పాపా! (వీధి ద్వారంలోంచి శ్రీరంగంగా రొచ్చేరు.)

శ్రీరంగం : ఏమిటయ్యా డాక్టర్! అలా గున్నావ్.

రామం : (తత్తరపాటుతో) ఏం లేదండీ!—ఏం తోచటంలేదు.

శ్రీరంగం : తోచకపోట మేమిటోయ్?—తోచకపోతే మా సుగుణతో కబుర్లు చెప్తూ కూర్చోకపోయావ్—(అతని చెంప చూచి) అరె! అదేమిటాచెంపలా కంది పోయిందేం?

రామం : అబ్బే!—లేదండీ!

శ్రీరంగం : లేదేమిటోయ్ లేదు!—ఆ చెంపలా వాచిపోతే.

రామం : (తెచ్చిపెట్టుకొన్న నవ్వుతో) నిద్దట్లో దోమ కుడ్తే, దాన్ని చంపటానికి చేసిన ప్రయత్నంలో—

శ్రీరంగం : (నవ్వి) బాగుంది. దోమని చంపబోయి చెంప వాయించుకొన్నావన్నమాట.(శ్రీరంగంగారింట్లోకివెళ్లారు.)

రామం : పాపా!—పాపా!—(లోనుండే సుగుణ)

సుగుణ : నేను నీతో మాట్లాడనబ్బాయ్.

రామం : ఒక్కసారి రావూ?—నా పాపవు కదూ?

సుగుణ : మరి యిందాక నే నాడుకొందాం రమ్మంటే రాలేదు కానీ.

రామం : యిప్పు డొస్తాగా. మరి రా! రావాలి .... రావాలి .... రావాలి (పాప పరుగెత్తుకొచ్చింది) ఆఁ! అదీ మంచి ఆడ పిల్లల లక్షణం!—

సుగుణ : మరి చెడ్డ ఆడపిల్లల లక్షణం?

రామం : చెంప వాయగొట్టటం—అది సరేగాని పాపా! నా కిప్పు డాకలేస్తుం దనుకో—ఏంచెయ్యాలి.

సుగుణ : అన్నం తినాలి

రామం : మరి అన్నం లేకపోతే ?!

సుగుణ ఎందుకు లేదూ?—మా అక్క వండిందిగా.

రామం : మీ అక్క వండితే నా కెలా వస్తుంది?

సుగుణ : మా అక్కయ్య వండి నాకూ, నాన్నకీ పెడ్తుందిగా—నువ్వు అడుగు. నీకూ పెడ్తుంది.

రామం : (తనలో) పెడ్తుంది ఒక చెంపపెట్టు. (పైకి) ఒకవేళ పెట్టకపోతే—

సుగుణ : ఎందుకు పెట్టదూ—అక్కయ్య చాల మంచిది బావా!

రామం : అవునమ్మా!—అక్కయ్య చాల మంచిదే—కాని నే నడగను.

సుగుణ : పోనీ నే నడుగుతాను. (లేవబోయింది)

రామం : వద్దు కాని యిక్కడికి దగ్గరగా ఏవైనా హోటళ్ళున్నాయా?

సుగుణ : హోటలు లేదు కాని—మనింటికి మూడిళ్ళవతల పకోడీల తాత దుకాణ ముంది.

రామం : అయితే యిప్పుడే వస్తానుండు. కొంచెం పకోడీలు కొని తెస్తాను.

సుగుణ : పకోడీలు తింటే ఆకలి పోతుందా బావా?

రామం : పోతుంది పాపా!—నిజంగా పోతుంది. (కల్యాణి వచ్చింది. బెదురుతూ, సిగ్గుతో ప్రవేశించి)

కల్యాణి : సుగుణా! భోజనానికి రా.

సుగుణ : నా కప్పుడే ఆకలిగా లేదు.

కల్యాణి : ఆకలిగా లేకపోవటమేమిటి?—అవతల నాన్నగారు పిలుస్తున్నారు.

సుగుణ : మరి నే వస్తానుగానీ, బావకి కూడా అన్నం పెడ్తావా?

(కల్యాణి వొకసారి రామంవేపు చూచింది. అత డామెను చూచి ముఖం వేరొక ప్రక్కకు త్రిప్పేసు కొన్నాడు.)

కల్యాణి : నాన్నగారు మిమ్మల్ని కూడ రమ్మన్నారు.

రామం : నా కాకలిగా లేదు—యిప్పుడే భోజనంచేసి వచ్చేను.

సుగుణ : అన్నీ అబద్ధా లక్కయ్యా!

కల్యాణి : నే నన్నీ విన్నాను రామంగారూ! భోజనం చేసిన వాళ్ళెప్పుడూ చిరుతిళ్ల కాసపడరు. (రామం సిగ్గుపడి ముఖం దించేసుకొన్నాడు.)

సుగుణ : (అతని చేతిని పట్టుకొని) రా బావా!

కల్యాణి : రండి!—(వెళ్లిపోయింది. తర్వాత రామం సుగుణ నెత్తుకొని వెళ్లేడు.)

(తెర)

## 3 వ రంగం

ఉదయం పది గంటలు. శ్రీరంగంగా రిల్లు—తెర తొలగేసరికి క్షణకాలం నిశ్శబ్దం— పాప పలక పట్టు కొని ఏదో తీవ్రంగా ఆలోచిస్తోంది. ఇంతలో వేణు—అదే—రామం స్నేహితుడు వచ్చేడు. అతని ఆకారం పైకి పెద్ద మనిషిలా కన్పిస్తున్నా లోన గోతులు త్రవ్వే రకంగా ముఖం విశదపరుస్తోంది.

వేణు : పాపా!—ఏయ్ అమ్మాయ్! (సుగుణ వొకసారి అతన్ని చూచి నిర్లక్ష్యంగా తన పనిలో నిమగ్నురాలైంది.)

వేణు : ఇదుగో—అమ్మాయ్.

సుగుణ : నాపేరు అమ్మాయికాదు—తెలుసా ?

వేణు : మరి ?—ఏంపేరు ?

సుగుణ : సుగుణ !—మరి మా బావ మాత్రం "పాపా!" అని పిలుస్తాడు.

వేణు : బాగుంది! Nice name !—ఆఁ! పాపా !

సుగుణ : నన్నలా పిలవొద్దు.

వేణు : ఏం ? ఎందుకని ?

సుగుణ : మా బావొక్కడే అలా పిలవాలి.

వేణు : పోనీలే ! ఆఁ! సుగుణా రామం ఉన్నాడా ?

సుగుణ : అంటే మా బావేనా ?

వేణు : (ఆశ్చర్యంగా) ఆఁ!—మీ బావా ?—(స్థిరంగా) ఆఁ!—అవును అతనే.

సుగుణ : లేడు.

వేణు : ఎక్కడికి కెళ్ళేడు ?

సుగుణ : బజారు కెళ్ళాడు రిబ్బన్లు తెస్తానని—యింకా రాలేదు.

వేణు : మరి యింట్లో ఎవరూ లేరా ? (కల్యాణి వస్తూ క్రొత్త వ్యక్తిని చూచి వెనక్కు తగ్గి)

కల్యాణి : సుగుణా ! ఎవరే వచ్చింది ?

సుగుణ : ఎవరో అక్కయ్యా ! బావకోసం !

కల్యాణి : ఏయ్ సుగుణా ! యిష్టం వచ్చినట్లు వాగక ఆయన పేరేమిటో కనుక్కో. రామంగారింట్లో లేరని చెప్పు.

వేణు : నాపేరు వేణండీ!—రామం నేను క్లాసుమేట్సు (కల్యాణి స్టేజిపైకి వచ్చింది)

కల్యాణి : ఆయన యింట్లో లేరండీ—బజారు కెళ్ళారు గావున్ను.

వేణు : చంపేసాడే—నన్నీవేళకు రమ్మని తను షికారుకి పోయేడా ?—ఆఁ! చూడండి. కొంచెం మంచినీళ్ళిస్తారూ. (కల్యాణి మంచినీళ్ళిచ్చింది. అతను త్రాగుతూ) వారం రోజుల క్రితం కన్పించేడు. అప్పటినుండీ "రారా!" అంటూ ఒకటే వేపుకు తింటున్నాడు. తీరా వస్తే హు! (గ్లాసు క్రిందా, టేబిలుమీదో పెట్టేస్తాడు.)

కల్యాణి : ఇంతవరకూ యిక్కడే ఉన్నారండీ—యిప్పుడే అలా వెళ్ళారు.

వేణు : అవునండీ .... వాడి తత్వమే అంత—ఉంటావన్న సమయాని కేదో కొంపలు మునిగిపోయే పని వచ్చిందంటూ పై కెళ్ళిపోతాడు.

కల్యాణి : అందరి తత్వాలు ఒకలా ఉండవు చూడండి. అయినా ఆయన మీ గూర్చే వెళ్ళారేమో.

వేణు : సరే !—అయితే వస్తా (వెళ్ళబోయేడు)

కల్యాణి : ఆగండి !—మళ్ళీ మీరు ఆయనకి కన్పించకపోతే—ఆయ నొచ్చేవరకూ ఈ గదిలో కూర్చోండి.

వేణు : Thanks— (సోఫాలో కూర్చున్నాడు సిగరెట్టు ముట్టిస్తూ. టేబిలుమీదున్న పేక తీసి) సుగుణా ఆడతావా ?

సుగుణ : నే నాడను—చదువుకోవాలి.

వేణు : హో యబ్బ !—చదివేవుగాని ఒకాటాడుదువుగాని రా.

సుగుణ : నేను రానంటే రాను. మాబావ వచ్చేసరికివి రాయక పోతే నాతో మాట్లాడడు.

కల్యాణి : పరవాలేదు సుగుణా !—ఆయనో నే చెప్తాగాని నువ్వాడుకో!

సుగుణ : నువ్వు చెప్పొద్దు—అయినా నే నాడను.

వేణు : పెంకిపిల్ల—పోనీ—ఏమనుకోకపోతే మీరు—

కల్యాణి : నేనా ?—

వేణు : ఏం ?—ఆడకూడదా ?

కల్యాణి : కూడదని కాదు—

వేణు : అయితే యికనేం ?—రండి—(ముక్కలు పంచుతాడు. కల్యాణి తప్పనిసరిగా ఆటకి కూర్చుంది. మొదటి ఆట గెల్చింది.)

వేణు : Very Nice !—ఆట బాగా ఆడగలరే !

కల్యాణి : ఏదో పొద్దుపోనప్పుడు ఆయన, నేను, నాన్నగారు ఆడుతూంటాం.

వేణు : అయితే ఈ ప్రాక్టీసంతా మనవాడి ప్రతాపమన్నమాట—ఏదో!—యిలాగయినా వాడి జీవితం ఆనందంగా దొర్లిపోతే—

కల్యాణి : ఏం? అలా గంటున్నారు ?

వేణు : అబ్బే !—ఏం లేదు. ఆ గొడవంతా యిప్పుడెందుకులెండి.

కల్యాణి : తెలుసుకోటం మంచిదికదూ ?

వేణు : ఆఁ! ఏంలేదు !—చిన్నతనంలోనే పాపం తండ్రి పోయేడు. అప్పటినుండీ తల్లే అతన్ని పెంచుతూ వచ్చింది. బహుశా వీడు అప్పుడు స్కూలు ఫైనలు చదువుతున్నా డనుకొంటాను. స్కూలు ఆటల పోటీలో ప్రథమ బహుమతి పొంది, దాన్ని తల్లికి చూపించాలని ఆతృతగా పరుగెత్తు కొచ్చేడు—కాని వచ్చేసరికి—

కల్యాణి : (ఆతృతగా) ఏమయింది ?

వేణు : ఆ వీధిలో ఉన్న యిళ్ళకి నిప్పంటుకొంది. అందరిళ్ళతో బాటు వీ డిల్లు కూడా కాలిపోయింది. ఆ మంటల్లో చిక్కి వీడి తల్లి చనిపోయింది. అంతే ! ఆనాటినుండీ వీడిని వాళ్ళ మావయ్యే పెంచుకొస్తున్నాడు. తన కూతుర్నిచ్చి పెళ్లిచేద్దా మనుకొన్నాడు. ఆమె అంటే వీడికి ప్రాణం. కాని దేవుడు అదీ చూడలేకపోయేడు. పాపం ! ఆమెకు క్షయ వచ్చి పోయింది.

కల్యాణి : పాపం !—చాలా విషాద జీవితం!

వేణు : ఆనాటినుండీ తన మనసు కేమాత్రం కష్టం కల్గినా ఆదోరకంగా అయిపోతాడు మనిషి— ఆ ప్రవర్తన యిదీ అని సరిగ్గా నిర్ధారణ చెయ్యలేం—కాని యిప్పు డిప్పుడే గతాన్ని మరచిపోతున్నాడు—అంతేచాలు.

(కల్యాణికి ఆటమీద ధ్యాస పోయింది—ఏదో ఆడుతున్నాం అని యాంత్రికంగా ఆడ్తోంది.)

వేణు : అరె !—అను పడేసి—తిరిగి ఆసే తీస్తారేం ?—

కల్యాణి : వాట్ ! Sorry !

వేణు : ఆటమీద ధ్యాస సన్నగిల్లిందిలా వుంది.

కల్యాణి : (నవ్వుతూ) అబ్బే ! —లేదు. ఆడండి.

వేణు : (ఆడుతూ) మీరు యింతకు పూర్వం కాకినాడలో ఉండే వారు కదూ ?

కల్యాణి : నా చిన్నప్పు డుండేవాళ్లం. నేను ఫస్టు ఫారం చదువుతున్న రోజుల్లో అనుకుంటాను యిక్కడికి వచ్చేశాం. అయినా మీకెలా తెలుసు.?

వేణు : నా జ్ఞాపకం ప్రకారం మీరు నాతో చదువుకొన్నారని—మీ పేరు కల్యాణి కదూ ? మీ యింట్లో "పాప" అనేవారు—

కల్యాణి : అవును .... మీరూ ....

వేణు : నేను వేణునండీ !—గుర్తుపట్టలా !—పోకరోజు చెరుకు ముక్క యివ్వలేదని వీధి అరుగుమీద నుండి క్రిందకి పడద్రోసేను. మీకు కుంభంమీద చిన్న గాయం తగిలింది.

కల్యాణి : ఓ !—బాబు !—అవునా ?—

వేణు : Exactly Correct బాబునే—

(రామం వచ్చేడు. వస్తూనే వేణుని చూచి ఆశ్చర్యపోయి వెనక్కి తగ్గేడు.)

కల్యాణి : అలా వెనక్కి పోతారేం ?—ఈయనపేరు వేణు !—చిన్నప్పుడు వీళ్లూ, మేం ఒకే యింటో ఉండేవాళ్లం! వేణూ !—ఈయన రామం M. B. B. S. Oh ! Sorry ! మీకు పూర్వ పరిచయ ముందిగా.

వేణు : హల్లో రామం !—ఏమిటి సంగతి !—

రామం : సంగతుల కే మున్నాయి వేణూ ! చూడననుకొన్న వాళ్లని తిరిగి చూడాల్సొస్తోంది. ఆ!—కల్యాణి ! మీ నాన్నగా రుదయం Elletric Bill కట్టమన్నారు. ఇదిగో రసీదు. జాగ్రత్తగా దాయి. (కల్యాణి అందుకొని వెళ్లిపోయింది—రామం వేణు రాక యిష్టంలేనట్లుగా అతనితో మాట్లాడకుండా సుగుణతో)

రామం : పాపా !—అక్షరాలు రాసేవా ?—ఎంతవరకూ వచ్చేయి.

సుగుణ : అన్నీ వచ్చేశాయి బావా !—బావా ! మరేం యిందాక అక్కయ్య నన్నాడుకోమంటోంది.

రామం : చదువుకొనే సమయంలో ఆడుకోకూడదు పాపా ! అలా అయితే పెద్దయిం తర్వాత ఎందుకూ పనికి రాకుండా పోతారు.

సుగుణ : అందుకనే నే నసలు ఆడనని చెప్పేశాను.

రామం : ఊఁ ! పాపా మంచిపిల్ల తీసుకురా. (యిప్పటికీ వేణుతో మాట్లాడలేదు. తన పనిలో అంటే టై విప్పుకోటం, కోటు విప్పుకోటం వగైరా—మునిగి పోయేడు.)

వేణు : హల్లో M. B. B. S. స్టూడెంట్ !—ఏమిటి కథ ?

రామం : కథలకేం గాని ఏం యిలా వచ్చేవ్ ?

వేణు : స్నేహితుడన్నవా డున్న తర్వాత రాక తప్పుతుందా Brother !—నువ్వు కన్పించకపోతే ఈ రెండు నెలలూ ప్రాణం గిలగిలా కొట్టుకొం దనుకో—నీకోసం వూరంతా గాలించాను. అయినా నల్లపూసలా మరీ అంత కన్పించటం మానేశావేం ?

రామం : అనవసర మన్పించింది.

వేణు : ఏం ?—ఎందుకని ?

రామం : పాత జీవితంతోపాటు పాత స్నేహితుల్నీ, పాత పాడు అలవాట్లనూ వదల్చుకొంటున్నాను కనుక.

వేణు : పాత అలవాట్లని వదలి జీవితాన్ని మార్చుకోగలవు గాని, పాత స్నేహితులను మరచిపోలేవు Brother !—స్నేహం అయస్కాంతం లాంటిది. అది ఆకర్షించకుండా వూరుకోదు. Brother అంతే బూర్ల గంపలో పడ్డావ్—అవునా ?

రామం : కాదు. జీవించటం ఎలాగో నేర్చుకొన్నాను. నలుగురిలో తలెత్తుకొని, నేనూ ఒక మనిషి ననిపించుకోవాలని ప్రయత్నిస్తున్నాను.

వేణు : Well and good idea ! దానికి మన స్నేహం ఏవిధంగానూ అంతరాయం కాదు.

రామం : కాదు. అంతరాయమే. నీలాటివాళ్ల స్నేహం చేస్తే యిక నలుగురిలో తలెత్తుకు తిరగలేను. వేణూ ! చెప్తున్నా విను. అజ్ఞానంలో మంచి చెడ్డలు తెలియని దినాల్లో నీతో స్నేహం చేశాను. నీతోపాటు రేసులు, జూదం ఆడేను. దొంగతనం చేశాను. కాని ఈనాడు అవన్నీ తప్పని గ్రహించాను. ఆ పాడు అలవాట్లతోబాట నీ స్నేహం కూడా విడిచిపెట్టేశాను. తిరిగి నీతో స్నేహం చేయుటం ఈ జన్మకి పడదు.

వేణు : తొందరపడుతున్నావు Brother !—స్నేహం అనేది మసిబొట్టు కాదు. చెరిపితే చెరిగిపోవటానికి—జీడి చుక్క తెలిసిందా ?

రామం : కావచ్చు—అయినా చెరుపుకోటానికి ప్రయత్నిస్తాను.

వేణు : ఇంత స్వార్థం నీలో ఉందని అనుకోలేదు Brother—బాగుపడేది నువ్వొక్కడివేనా ?

రామం : నా జీవితాన్ని నేను బాగుచేసుకోగలనో లేదో తెలియదు. అయినా ఎవరి జీవితం బాగోగులు వాళ్ళు చూసుకుంటేనే మంచిది.

వేణు : నీకేం నువ్విప్పుడెన్ని మాటలైనా చెప్తావ్ !—పైలా పచ్చీసులాటి చిన్నది—పచ్చనిపిరి కంట బడింతర్వాత.

రామం : అది నా అదృష్టం!—నువ్వు నీ అదృష్టాన్ని వెదుక్కో.

వేణు : అదృష్టాన్ని వెదుక్కోటం, దానికోసం ఎదురుచూడటం అనేది వేణు ఇంతవరకు ఎరగడు Brother. నేను పోగొట్టుకొన్నదానికి చింతిస్తున్నది ఒక్క నీ విషయంలోనే—

రామం : కాని నేను నీ స్నేహం పోయినందుకు చింతించటం లేదు. సంతోషిస్తున్నా.
వేణు : సంతోషిస్తావు Brother! కాని ఒక్కరోజు మాత్రం కోరి కుత్తుకకు కొని తెచ్చుకున్నానే అని విచారించక మానవు.
రామం : అటువంటి రోజు రాకూడదనే నే ననుకొంటున్నాను.
వేణు : అనుకున్నవన్నీ జరుగవు Brother
రామం : మంచిది !—వెళ్లిరా !
వేణు : వెళ్లి తిరిగి రమ్మన్నందుకు చాల Thanks, Brother! వోస్తాను. ప్రస్తుతానికి వెళ్తున్నా, ఏదో ఒకరోజు నీకు నా అవసరం, నాకు నీ అవసరం తప్పకుండా ఉంటుంది. ఆ రోజు తప్పకుండా వస్తాను. Good by. (విసురుగా వెళ్లాడు. కల్యాణి వచ్చింది.)
కల్యాణి : మీ స్నేహితుడు చాల కోపంగా వెళ్తున్నాడే—కారణం ఏమిటీ ?
రామం : అతడు మీకు తెలుసా ?
కల్యాణి : తెలుసు—
రామం : (ఆతృతగా) ఆఁ!—ఎలా తెలుసు ?
కల్యాణి : వాళ్ళు మేం చిన్నప్పుడు కాకినాడలో ఒకే యింట్లో ఉండేవాళ్లం—
రామం : వోహో!—అత నిప్పుడేమైనా చెప్పాడా ?
కల్యాణి : చెప్పాడు.
రామం : ఏమిటీ ?—ఏమిటి చెప్పాడు.
కల్యాణి : మీ జీవితంలోని ఒక భాగం ! అతిముఖ్యమైన ఘట్టం!
రామం : ఆఁ ! ముఖ్యమైన ఘట్టం—ఏమిటది—
కల్యాణి : ఏదో మీ చిన్ననాటి సంగతి—అదంతా యిప్పు డెందుకులెండి.
రామం : అంతేకదా ?—ఆఁ ! మీ నాన్నగా రింట్లో లేరా ?
కల్యాణి : లేదు—
రామం : పాప ఉందా ?
కల్యాణి : లోప లాడుకొంటోందిలా ఉంది—పిలవమంటారా ?
రామం : పిలవండి—(కల్యాణి లోనికెళ్లింది—సుగుణ వచ్చింది.)
సుగుణ : బావా !—కాలేజికి పోలేదేం ?—సెలవా ?
రామం : అవునమ్మా—ఆఁ ! చూడు! నేను మంచివాణ్ణేనా ?
సుగుణ : చాల మంచివాడివి బావా !
రామం : నేను చెడ్డవాడినని నీకు తెలుస్తుందనుకో !—అప్పుడు నాతో మాట్లాడ్తావా ? పాపా ?
సుగుణ : మా బావ చెడ్డవాడు కాదు. బావ చాలా మంచి వాడు. అక్కయ్యే చెడ్డది.
రామం : మంచివాడిగానే ఉండటానికే ప్రయత్నిస్తానమ్మా !

## 4వ రంగం

సమయం ఉదయం పది గంటలపైన—శ్రీరంగంగా రింట్లో రామం గది. రామం పాపకు చదువుచెప్తున్నాడు.

సుగుణ : రాశాను బావా !—
రామం : ఏదీ (పలక తీసుకొని చూచి) వెరీ గుడ్ !— ఆఁ!— అంకెలు చెప్పు.
సుగుణ : ఒకటీ, రెండూ, మూడూ, నాలుగూ—మీ బడి కింకా వేళ్లవ లేదా బావా ?
రామం : అయింది పాపా ! — అంకెలు త్వరగా చెప్పేసెయ్. వెళ్లిపోవాలి.
సుగుణ : అట్నుంచి రాగానే మిగతా అంకెలు చెప్పేస్తా బావా! మరేం నువ్విప్పుడు బడికి తొందరగా వెళ్లాలిగా.
రామం : ఊఁ ! కొంటెపిల్ల ! — (సుగుణ వెళ్లిపోయింది—కల్యాణి కాఫీతో ప్రవేశించింది.)
కల్యాణి : ఊహు !—
రామం : (తిరిగిచూచాడు.)
కల్యాణి : కాఫీ !—
రామం : వో !—(తీసుకొని త్రాగుతూ) చాలా బాగుంది!
కల్యాణి : (పరాకుగా) ఏమిటి ?—
రామం : ఊఁ!—కాఫీ—(కప్పుని ఆమెకందిస్తుంటే వేణువచ్చేడు.)
వేణు : Good morning Doctor (యిద్దరూ అదిరి పడ్డారు. కల్యాణి వెళ్లిపోయింది.)
రామం : నువ్వా !—ఇలా వచ్చావేం ?
వేణు : చిన్న కేసు పట్టుకొచ్చేనులే.
రామం : అంటే— ?
వేణు : అంటే—నాకు పదివేలు రూపాయలు కావాలి—
రామం : చిల్లిగవ్వ కూడా లేదు. ఉన్నా యివ్వను.
వేణు : ఊహు !—అలాగా !— Brother నా పేరు తెలుసు కదూ—వేణు.
రామం : భయంలేదు—
వేణు : అవును—నీకెందుకు భయం—పైరావప్పేసులో ఉన్నావు.
రామం : సరే !—ఇక వెళ్ళు !—
వేణు : వెళ్లటానికైతే యింత దూరం రావాలా ?—ఆలో చించు !—పాత స్నేహితుణ్ణి ! — Old Friend నీ, Old slipper నీ, వదలొద్దని మా సిద్ధాంతం.
రామం : మీ సిద్ధాంతాలకు ప్రస్తుతం మా సిద్ధాంతాలు పూర్తిగా వ్యతిరేకం.
వేణు : అవును కదూ—ఈమధ్యనే మడికట్టు కొన్నావు.
రామం : మడి కట్టుకోటం కాదు. బాగుపడటం నేర్చుకొన్నాను.
వేణు : బాగుపడటం, చెడిపోవటం మన చేతిలో లేదు భాయ్—నసీబ్— బోధపడిందా.
రామం : అనవసర ప్రసంగం మాని వెళ్లిక్కడనుంచి.
వేణు : ఒట్టి చేతులతో పోవడం వేణు కీ జన్మలో తెలీదని నాతో సహవాసం చేసిన నువ్వు తెలుసుకోలేదా ?
రామం : మీ సహవాసానికీ నీకూ రామ్ ! రామ్ !—ముందిక్కడ నుండి దయచెయ్యి !—
వేణు : తీపి తిన్నమీదట చేదు రుచించదులే Brother !—కామినీ కాంచనాలు ఎల్లకాలం ఉండేవి కాదు. అసలు కాంచనం కంటె స్థిరం లేనిది కామిని—తెలిసిందా. ఎందు కీ ఒక్క ఆడదానికోసం నిక్షేపంలాంటి ఆసం దాన్ని వదులుకొంటావ్ !—రా—నాతో రా. అరనేలిలో అరవై స్వర్గాలు చూపిస్తా.

రామం : నీతో కూడి స్వర్గం చూడబోయేకంటే నరకంలో ఉంటేనే మంచిది.

వేణు : రామం !—నువ్వు నా పాత స్నేహితుడివని బతిమాలు తున్నాను. రా. నాతో రా.

రామం : రాను.

వేణు : బుద్ధి గడ్డితింటోంది.

రామం : కాదు. పెడదారిని పట్టనంటోంది.

వేణు : అనవసరంగా పాడయిపోతావు !

రామం : పాడయిపోయిన జీవితాన్ని బాగుచేసుకోటానికి ప్రయత్నిస్తున్నా.

వేణు : వృధా ప్రయాస !—

రామం : అంతా దైవేచ్ఛ.

వేణు : సిరి రాకకు మోకా లడ్డుపెట్టుకుంటున్నావ్—

రామం : దొంగ సిరికోసం ఆశించే మోకా లుంచుకోటం కంటె నరుక్కోటం చాలా ఉత్తమమైన పని—

వేణు : రామం! భ్రమపడుతున్నావ్!—నువ్వు రామం M.B.B.S వి కాదు. M.B.B.S. రామానివి—తెలుసా? నువ్వు డాక్టరువి కావు—కామా లేవు—జేబుదొంగవి—జ్ఞాపక ముంచుకో.

రామం : పాత కథలను పెకలించటానికి వచ్చేవా ?

వేణు : నీ జీవితం నా గుప్పెట్లో ఉంది. నిన్ను ఎలా పడితే అలా ఆడించగలను.

రామం : (టేబిలుమీద కల్యాణి ఫొటో తీసి) పాపం! చాలా అమాయకంగా కన్పిస్తోంది.

రామం : (ఫొటో తీసుకొంటూ) నీ సానుభూతి అనవసరం.

వేణు : ఎవరికి ఏ సమయాల్లో సానుభూతి అవసరమో ఎవరు చెప్పగలరు Brother !— ఇవాళ అద్దాల మేడలో, హంసతూలికా తల్పముమీద, హాయిగా, అరమోడ్పు కన్నులతో, సుఖా ననుభవిస్తున్నవాడే, రేపటికి, బికారిలా వీధులవెంట బిచ్చమెత్తుకొంటూ కంకర రాతిమీద నిద్రపోవచ్చు. అంతా కాలమహిమ Brother !— కాలం బాగుంటే దరిద్రుడు ధనికుడు కావచ్చు. అది బాగులేకపోతే కుబేరుడైనా ఫకీరు కావచ్చు !— ఈరోజు ఆనందంగా ఉన్న నువ్వు, పాత జీవితాన్ని హేయమని నిరసిస్తున్న నువ్వు, రేపు అకస్మాత్తుగా మారిపోయి, పాత జీవితంలో ప్రవేశించటానికి హస్తం చాచొచ్చు.

రామం : కల్లో వార్త.

వేణు : కలలు వాస్తవిక సంఘటనకి ప్రతిబింబాలు కావచ్చు M.B.B.S రామం! వాస్తవంలోని సంఘర్షణలే తాను ఒడలు మరచి నిద్రపోతున్నప్పుడు కూడ ఆలోచించటంవల్లే కల లొస్తాయి. అటువంటివి కల్లలనడం అన్యాయం.

రామం : మీతో వాదించటానికి నాకు టైము లేదు.

వేణు : అవును. నాతో మాట్లాడ్డానికి నీకు టైమెందు కుంటుంది. సృష్టించుకొన్న దొంగ కాలేజీలో, సృష్టించుకొని, నమ్మించి, వంచిస్తున్న M.B.B.S. స్టూడెంటువి.

రామం : వేణూ ! అనవసరంగా నోరు పారేసుకోకు. వెళ్ళు.

వేణు : వెళ్ళటానికి రాలేదని మొదటే చెప్పాను Brother. ఈరోజు నాకు పదివేలు కావాల్సొచ్చింది—దాన్ని పటు కెళ్లాలి. లేదా దాన్ని సంపాదించడానికి నిన్ను తీసు కెళ్లాలి. ఈ రెండు కాకపోతే నే నిక్కడనుంచి కదలను—

రామం : ఆ రెండూ కావటం దుర్లభం.

వేణు : దుర్లభం, దుస్సాధ్యం అనకు Brother—నేను చెప్పిన మాట విని నాతో వచ్చేవా, నిన్ను ధనరాసులతో ముంచెత్తుతాను. కుబేరుణ్ణి చేస్తాను. కాదని నిరాకరించేవా ? (జేబులోంచి రివాల్వరు తీసేడు.)

రామం : చావుకి భయపడి, అన్యాయానికి లొంగే కాలం అంతరించింది. ఇప్పుడు నాలోని ప్రతి రక్తకణం న్యాయం కోసం, సమాజంలో మంచిగా జీవించడం కోసం, పదిమందిలో పేరు గడించడం కోసం పోరాడుతోంది. అంతేకాని నీలాటి వాళ్ల మాటలకీ, చేతలకూ భయపడి లొంగిపోయే స్థితిలో లేను. చంపు.

వేణు : హాఁ! నిన్ను చంపుతా ననుకొన్నావా ?—దానివల్ల నా కొరిగే లాభం ఏమిటి ?—నిన్ను చంపటానికి రాలేదు. ఈ తుపాకీ చూసేవా ?—దీంతో మంచిపనైనా చేయొచ్చు. చెడ్డపనైనా చేయొచ్చు. నీచేత యిప్పుడు చేయించే పని చాల మంచిపని నా వుద్దేశంలో—మనకు కావలసిన వస్తు వేదోవిధంగా సంపాదించుకోవడమే మన పని — Beg Barrow steal అన్నాడు వెనకటి కొక ఆంగ్లకవి,—

ఇక నువ్వు చెయ్యవలసిన పని—(రామం టైము చూచుకొని తలుపేసి వచ్చేడు) తలుపులు వేసి వచ్చేవా? అంటే మంచి రహస్య వ్యాపారమని అంగీకరించేవన్న మాట—Well Brother !— నా చేతిలో ఉంటే నిన్ను హిట్లర్ బాబుని చేసిపారేద్దును. అది సరే. అసలు విషయం—

సేఠ్ సోనాచంద ధర్మానంద్ పేరు మనిద్దరికీ చాలా చిరపరిచితమే కదూ ?

రామం : అయితే?— (బాంబు ప్రేలిన ట్లదిరిపడ్డాడు.)

వేణు : కథలో అడ్డుపుల్ల వేస్తే కధ రక్తికట్టదు—సరిగ్గా విను. సేఠ్ సోనాచంద్ ధర్మానంద్అంటే, వెండి బంగారాల గని అన్నమాట—ధనానికి మింట్ అన్నమాట—కాని వాడిలో ధర్మగుణం అన్నమాట సెర్చిలైటు వేసి వెదికినా కన్పించదు—వాడి దగ్గరున్న ధనం మనకి కావాలి. కావాలనుకొంటే నువ్వు రావాలి—తెలిసిందా !—నువ్వూ నేనూ కలిస్తే ప్రపంచంలో అత్యద్భుతమైన యిరువురు మేధావులు కలిసినట్టే—చాలు. మనకి కావలసినపని ఈ రాత్రి అయిపోతుంది. రేపీపాటికి యధాపూర్వంగా నువ్వు రామం M.B.B.S వి; నేను సాధావేణుని.

రామం : నాకు ధనం అక్కర్లేదు.

వేణు : అలా అనేవాడు శుద్ధ తెలివితక్కువవా డన్నమాట— మన సూత్రం ఏమిటో తెలుసా Brother ! పైసాయే

పరమాత్మ !—డబ్బంటే కొండమీది కోతి కూడా దాన్ను చేస్తూ వస్తుంది. డబ్బు లేకపోతే—మనలో మనమాట—కల్యాణి కాదు కదా, ఏ ఆడదీ ప్రేమించదు Brother.

రామం : డబ్బుకోసం ప్రేమించే స్త్రీ నా కవసరం.

వేణు : డబ్బుని ప్రేమించని ఆడది ఈప్రపంచంలో ఉండదు—చివరికి నీ కల్యాణి కూడ—

రామం : (బిగ్గరగా) వేణూ !—(నెమ్మదిగా) నా కల్యాణి అటువంటిది కాదు.

వేణు : కల్యాణి ఏమీ అమరత్వం పుట్టిపడిన దేవత కాదు—ఆమెకూడ నీలాగ రక్తమాంసా లున్న మనిషే.కల్యాణి ధనానికి దాసురాలు కాకా తప్పదు—నిన్ను విడిచిపెట్టకా తప్పదు.

రామం : ఛీ !

(వేణుని కొట్టటానికి చేయెత్తాడు—దాన్ని పట్టుకొని క్రిందకు దించుతూ)

వేణు : రామం! నువ్వు నా స్నేహితుడివని వూరుకున్నాను. మరొకడు నాపై చేయెత్తితే వాడి రక్తం కళ్లచూద్దును. తెలిసిందా ? (Gap) ఈమధ్య సేఠ్ జీకి వ్యాపారంలో లాభం ఎంతో తెలుసా !—ఎనభై లక్షలు—నేను మొన్న వెళ్లి అప్పుగా వంద రూపాయలు యిమ్మన్నాను. లేవు లేవంటూ గొడవ పెట్టేడు. అటువంటివాడి దగ్గర అంత డబ్బుండటం నా కిష్టంలేదు Brother —ఈ రాత్రికే నేనూ నువ్వూ వెళ్లాలి. మన తృప్తి తీరేవరకూ యింటికి తెచ్చుకోవాలి. దానికి నువ్వు సిద్ధంకావాలి. బోధపడిందా ?

రామం : నేను రానని మొదటే చెప్పేను.

వేణు : నేను రమ్మన్న వెనుక చెప్పినమాట—నువ్వు రావాలి తప్పదు (తుపాకీ తీసేడు.)

రామం : రాకపోతే నువ్వు నన్నేం చేయలేవు—

వేణు : అని నువ్వు అనుకొంటున్న మాటలు—కాని నేనేం చేయగల్నో తెలుసా ?—తెలీకపోతే చెప్తా విను.

ఆరు నెలల క్రితం, సంధ్యచీకట్లుపడిం తర్వాత—గుర్తుందా Brother —చీకటి రాత్రి!—ఆకాశం నిండా మేఘాలు!—చిన్న వానజల్లు—నువ్వూ నేనూ కలిసి హెూటల్ ప్రొప్రయిటరు రామనాథం యింట్లో.

రామం : (బాధగా) చాలు—ఆవు—ఆవు.

వేణు : పూర్తిగా చెప్పనీయ్ Brother !—కథని మధ్యలో ఆపేయడం నా మనస్సుకే వ్యతిరేకం—రామనాథం యింట్లో రెండు విలువగల నగలు—అయిదువేలు నగదు చేజిక్కించుకొని వస్తున్నాం. కాని Bad luck, Brorher !—నువ్వొ యినస్పెక్టర్ కంట బడ్డావు—వెంటనే నిన్ను వెంబడించేడు. నువ్వు—(Gap) ఈ యింట్లో ప్రవేశించేవ్. ఇంతవరకూ పాత్రపోషణ చాల సహజంగానూ, బాగానూ చేసు కొచ్చేవ్ !—కాని నేటితో నీ పాత్రాభినయాని కాఖరి రోజు. ఈ రహస్యాన్ని నేనే స్వయంగా ఆ యినస్పెక్టరుకు చెప్తా !—ఒక్కసారి ఆ సుందర దృశ్యాన్ని ఆలోచించుకో. రామం M.B.B.S. చేతికి అరదండాలు! అతని నివాసం కటకటాల వెనుక— అప్పుడు నువ్వు జీవించాలనుకున్న మంచి జీవితం. నువ్వు కనిన కలలు సర్వ నాశనం—తెలిసిందా— నిన్ను బాధించినందుకు క్షమించు Brother !

రామం : ఆ నీచపు పని చేసేకంటే జైల్లో ఉండటమే మంచిది.

వేణు : అది నీకు మంచిదిగా అనిపించొచ్చు. కాని Brother ! ఈ విషయం కల్యాణికి తెలుస్తుంది. శ్రీరంగంగారికి తెలుస్తుంది. అప్పుడు వారు పడే బాధ వూహించుకో. వస్తాను (వెళ్లటానికి లేచాడు.)

రామం : ( బిగ్గరగా ) ఆగు !—ఏం చేయాలి ?—చెప్పు చేస్తాను—చెప్పు వేణూ ! నా జీవితాన్ని, నాతోపాటు కల్యాణి జీవితాన్ని నాశనం చెయ్యకు. చెప్పు. నువ్వేది చేయమన్నా చేస్తాను. నీ కేదీ కావాలన్నా తెస్తాను. చెప్పు.

వేణు : ఒక్క పదివేలు రూపాయలు. ఎలా తేవాలో కూడా చెప్తాను. నువ్వు నేను కలిసి సేఠ్ సోనాచంద్ ధర్మానంద్ యింటిని కొల్లగొట్టాలి. చేతికి చిక్కింది తెచ్చుకోవాలి. అర్థమయిందా ? Brother చెయ్యి చెయ్యి కలుపు.

(రామం ఒక్కక్షణం అమిత సంఘర్షణలకు లోనయి చివరిసారిగా.)

రామం : లాభంలేదు—కల్యాణి!—చెయ్యను. విన్నయినా విడిచి పెడ్తాను కాని తిరిగి ఆ పాడుపనిని చెయ్యలేను కల్యాణి ( ఫోటో చూస్తూ )

వేణు : తప్పదు Brother చేసి తీరవలసిందే—లేకపోతే నిన్ను ప్రేమించిన కల్యాణితో నీ రహస్యం అంతా చెప్పేస్తాను. అప్పుడు నీ బ్రతుకు ఆలోచించుకో. నీ బ్రతుకు కంటె ముఖ్యం కల్యాణి స్థితి ఆలోచించు. నిన్నే నమ్ముకొంది. అమాయికంగా నిన్నే ప్రేమిస్తోంది. నువ్విలాటి వాడివని తెలిస్తే ఆమె హృదయంలో ఎటువంటి సంచలనం లేస్తుందో ఆలోచించు. నీమీదే ఆశలు పెట్టుకున్న ఆమె తండ్రి గతి ఆలోచించు. గుండె పగిలి చస్తాడు—తెలిసిందా ?—నిన్ను నిత్యమూ "బావా ! బావా!" అంటూ నీతోపాటు తిరుగుతున్న నీ చిన్న మరదలు స్థితి ఆలోచించు. ఆ చిన్నారి లేత హృదయం ఎంత క్షోభిస్తుందో తెలుసా ?—ఆ బెంగతో ఆమె కుమిలి కుమిలి కృశించి మరణిస్తుంది.

రామం : వీల్లేదు. అలా జరగడానికి వీల్లేదు.

వేణు : అయితే నే చెప్పిన పని చెయ్యి !—ఊఁ ! బయల్దేరు.

రామం : ఏది పాడుపని అని విరమించుకొన్నానో—ఎవరికోసం చెడ్డపనుల్ని, చెడు సావాసాన్ని విరమించుకొన్నానో, ఆ పాడుపని వారి కొరకే తిరిగి చెయ్యమంటావా ?—లాభంలేదు. నేను చెయ్యలేను.

వేణు : చెయ్యకపోతే నీ యిష్టం. నీ మూలంగా నిన్ను నమ్ము కొన్న శ్రీరంగం—నీకే మనసిచ్చి నీ ఆనందమే తనదిగా భావిస్తున్న అమాయిక కల్యాణి—నీ చిట్టి మరదలు నాశన మవుతారు. అయితీరవలసిందే — ఇంతకాలం కల్యాణి నిన్నొక దేవునిగా చూస్తోంది. నిన్ను రామం M.B.B.S అనుకొంటోంది—కాని ఈరోజుతో నువ్వు M.B.B.S రామంగా వెళ్లడవుతావు—తెలిసిందా ?

రామం : వద్దు—అలా కావటానికి వీల్లేదు. చేస్తాను. కాని వేణూ—రెండు నిముషాలు—ఆలోచించుకోటానికి టైమివ్వు.

వేణు : రెండు నిముషాలేం ఖర్మ Brother !—యిప్పుడింకా ఉదయం పదకొండు గంటలు అయింది—సరిగ్గా రాత్రి పదిగంటల వరకూ టైమిస్తున్నా—అంత వరకూ ఆలోచించుకో—వస్తా—Good by Brother (తుపాకీ వదలి వెళ్లిపోయేడు).

(రామం చికాగ్గా అత నొదిలేసిన తుపాకీని చూస్తూ—పచార్లు చేస్తున్నాడు. కల్యాణి వచ్చింది. ఆమెను చూచి తుపాకీని దాచేడు.)

కల్యాణి : ఈరోజు కాలేజీ లేదా ?—యింతవరకూ యింట్లోనే కూర్చున్నారు.

రామం : లేదు !—ఆ! ఉంది. వెళ్లాలి. వెళ్తాను.

కల్యాణి : బాగుంది. అలా కంగారుపడ్తారేం ?—భోజనానికి లేవండి.

రామం : ఇది బాగుంది కల్యాణి !—రోజూ మీ యింట్లో భోజనం—

కల్యాణి : ఏమో !—నాన్నగారు ఆర్డర్ పాస్ చేశారు.

రామం : కుమార్తెగారు "జీ హుజూర్" అన్నారు అంతేనా.

కల్యాణి : అంతే—లెండి—రండి. (వెళ్లటానికి రెండడుగు లేసింది.)

రామం : జీ హుజూర్ (కల్యాణి వెనుదిరిగి నవ్వింది—రామం ఆమె ననుసరించేడు.)

## 5 వ రంగం

రాత్రి పది గంటల పైచిలుకు—రామం తన గదిలో సోఫాలో కూర్చున్నాడు. అతని ముఖం నిండా చెమట బిందువులు—జుత్తు చిందరవందరగా ఉంది. అతని ప్రక్కనే సోఫాలో రివాల్వరుంది—Bed light వెలుగుతోంది. రామం చేతితో రివాల్వరును తీసుకొని లేచేడు. ఒకసారి పరీక్షగా చూచి తిరిగి దాన్ని యథా స్థానానికి విసిరేసి చిరాకుగా పచార్లు చేసేడు.

రామం : (టేబిలుమీద కల్యాణి ఫోటో చూచి) కల్యాణి !—లాభంలేదు ! కల్యాణి !—చెయ్యను. నిన్నైనా విడిచి పెడ్తాను కాని తిరిగి ఆ పాడు పనిని చెయ్యలేను కల్యాణి—

[తెరలో]

వేణు గొంతు : రామం ! తప్పదు. చేసి తీరవలసిందే—లేకపోతే నిన్ను ప్రేమించిన కల్యాణితో నీ రహస్యం అంతా చెప్పేస్తాను. అప్పుడు నీ బ్రతుకు ఆలోచించుకో—నీ బ్రతుకు కంటె ముఖ్యం కల్యాణి స్థితి ఆలోచించు. నిన్నే నమ్ముకొంది. అమాయికంగా నిన్నే ప్రేమించింది. నువ్విలాటి వాడివని తెలిస్తే ఆమె హృదయంలో ఎటువంటి సంచలనం లేస్తుందో ఆలోచించు. నీ మీదే ఎన్నో ఆశలు పెట్టుకున్న ఆమె తండ్రి గతి ఆలోచించు. గుండె పగిలి చస్తాడు. తెలిసిందా ? నిన్ను నిత్యమూ బావా ! బావా ! అంటూ పిలుస్తూ నీతోపాటు తిరుగుతున్న నీ చిన్ని మరదలు స్థితి ఆలోచించు—ఆ చిన్నారి లేత హృదయం ఎంత క్షోభిస్తుందో తెలుసా ?—ఆ బెంగతో ఆమె కుమిలి కుమిలి కృశించి మరణిస్తుంది—తెలుసా ?—

రామం : వీల్లేదు—అలా జరగడానికి వీల్లేదు—

వేణు : అయితే నే చెప్పిన పని చెయ్యి— ఊఁ ! బయల్దేరు.

రామం : ఏది పాడుపని అని విరమించుకొన్నానో ఆ పాడుపనినే వారి కొరకు తిరిగి చెయ్యమంటావా ?—లాభంలేదు. నేను చెయ్యలేను.

వేణు : చెయ్యకపోతే నీ యిష్టం !—నీ మూలంగా నిన్ను నమ్ముకొన్న శ్రీరంగం—నీకే మనసిచ్చి, నీ ఆనందమే తనదిగా భావిస్తున్న అమాయిక కల్యాణి—నీ చిట్టి మరదలు నాశన మవుతారు—అయి తీరవలసిందే. ఇంత కాలం కల్యాణి నిన్ను ఒక దేవునిగా చూస్తోంది. నిన్ను గౌరవిస్తోంది. నిన్ను రామం M. B. B. S.గా అనుకుంటోంది. కాని యివాళ్టితో నువ్వు M.B.B.S. రామంగా వెళ్లడవుతావు—తెలిసిందా ?

రామం : వొద్దు. అలా అవటానికి వీల్లేదు. చేస్తాను. ఇప్పుడే వెళ్తాను (సోఫాలోంచి రివాల్వరును తీసేడు. చేతులు వణుకుతున్నాయి. నెమ్మదిగా కల్యాణి ఫోటోను సమీపించి) కల్యాణి నీకోసం, నువ్వు బ్రతకటానికోసం ఈపని చెయ్యాల్సొచ్చింది. కల్యాణి ! నన్ను చేరదీసి నా కష్టసుఖాలను నీవిగా ఎంచిన నిన్ను మోసం చేసాను. కల్యాణి క్షమించు. (ఫోటోని తిరుగవేసి) నవ్వుతూ నీ ప్రక్కన మసలిన ఈ రామం అపశైన అమాయకుడు కాదు—గోముఖవ్యాఘ్రం—కల్యాణి— నీ జీవిత మంతా చీకటిమయం చేసి తాను నిశ్చింతగా పోతున్నాడు. కల్యాణి— క్షమించకల్గితే— (రెండడుగులు వేసి) క్షమించు (విసవిసా వెళ్లిపోయేడు. స్టేజి క్షణ కాలం నిశ్శబ్దంగా ఉంది. కల్యాణి మంచినీళ్ల చెంబుతో ప్రవేశించి అక్కడ రామం లేకపోవటం చూచి కంగారుగా.)

కల్యాణి : రామం !—రామం (పలుకలేదు. లోపికెళ్తూ) నాన్నా! నాన్నా!

శ్రీరంగం : ఏమిటమ్మా (లోనుండే)

కల్యాణి : నాన్నా యిటురా నాన్నా !—రామంగారు లేరు (శ్రీరంగం వచ్చేడు).

శ్రీరంగం : ఎక్కడికైనా వెళ్లాడేమో.

కల్యాణి : లేదు నాన్నా ! యింత రాత్రప్పుడు ఆయన ఎక్కడికీ వెళ్లరు.

శ్రీరంగం : ఎప్పుడూ వెళ్లకపోతే యివాళ వెళ్లకూడదా ఏమిటమ్మా !—ఆయనకి పనేదైనా ఉండొచ్చు—

కల్యాణి : కాదు నాన్నా !—ప్రొద్దుటనుండీ ఆయన అదో రకంగా ఉన్నారు—మధ్యాహ్నం కాఫీ త్రాగలేదు—యిప్పుడు భోజనం చెయ్యలేదు. కంచం దగ్గర కూర్చుని, ఏమైందో ఏమిటో 'కల్యాణి' అని పిచ్చిగా కేకపెట్టి వెళ్లిపోయేరు. పగలంతా ఈ గదిలో కూర్చుని ఏడవటమే—చూడు నాన్నా—అలా పైకెళ్లి చూసిరా.

శ్రీరంగం : అత నెక్కడుంటాడని చూసిరమ్మంటావమ్మా !

కల్యాణి : ఎక్కడో అక్క డుంటారు నాన్నా !—ఆ వేణు దగ్గరకు వెళ్లారేమో వెళ్ళు నాన్నా.

శ్రీరంగం : సరే—(వీధిలోకి వెళ్లాడు.)

(కల్యాణి నిట్టూర్చి వెనక్కి తిరిగి సోఫాలో కూర్చుంది. తన ఫోటో తిరగేసి ఉండటం చూచి త్రుళ్లిపడి—దాన్ని తిరిగి సరిగ్గా పెట్టపోతుంది. అది జారిపోయింది.)

కల్యాణి : అయ్యో ! (టేబిలుమీదుంచి—గదంతా సర్దుతోంది. ఇంతలో పైన పరుగెత్తిన అడుగుల సవ్వడి—తుపాకి పేలిన శబ్దం—కొంచెం నిశ్శబ్దం— రామం కుడిచేతిమీద దెబ్బతో బాధగా మూలుగుతూ వచ్చి గదిలో కల్యాణిని చూచి నిశ్చేష్టుడై వెనక్కి అడుగు వేస్తాడు. కల్యాణి అతణ్ణి చూచి భయపడూ దగ్గరికి వచ్చి.)

కల్యాణి : ఏమయిందండి !—అరె !—ఈ చేతిమీద ఈ దెబ్బేమిటి ?—మాట్లాడరేం ?

రామం : చిన్న దెబ్బలే కల్యాణి.

కల్యాణి : రక్తం ధారాప్రవాహంలా కారుతుంటే చిన్న దెబ్బంటారేం. లేవండి—అలా సోఫాలో కూర్చోండి (సోఫాలో కూర్చోబెట్టింది.)

రామం : నీ హృదయంలో యిప్పుడు తగలబోయే దెబ్బకంటె ఈ దెబ్బ ఎన్నో రెట్లు చిన్నదే కల్యాణి.

కల్యాణి : అంటే (అర్థంకాలేదు.)

రామం : నిన్నూ, నీ వారినీ అందర్నీ మోసం చేసాను కల్యాణి—నీ బ్రతుకు నాశం చేసేను. నే నొక డాక్టరు చదువు కొంటున్న స్టూడెంటునని మిమ్మల్ని నమ్మించేను.

కల్యాణి : అయితే మీరు డాక్టరు చదవటంలేదా ?

రామం : లేదు. కల్యాణి. నేను రామం M.B.B.S. ను కాదు. M.B.B.S రామాన్ని. అంటే పచ్చి జేబుదొంగని.

కల్యాణి : ఆఁ! (వెనక్కు జరిగింది.)

రామం : భయంలేదు కల్యాణి !—అదంతా ఒకనాడు—అంటే నిన్ను మొదటిసారి కలుసుకొన్నప్పుడు—ఇప్పుడు ఆపని పూర్తిగా మానుకొన్నాను—నాకై నేనుగా ఆ పనిని మనస్ఫూర్తిగా చెయ్యాలి అని ఏ ఒక్కనాడూ అనుకోలేదు. నా జీవితం పాపపు మార్గంలో పడి పతన మవకుండా కాపాడుకొన్నా ననుకొన్నాను. కాని పరిస్థితులు తారుమా రయేయి. విధి నామీద ప్రళయ నృత్యం చేసింది. నాకు తెలియని అజ్ఞాతశక్తులేవో నన్నా రొంపిలో కీనాడు దింపేయి—

ఈ సమాజంలోని మనుష్యులు, విధి అన్నీ ఏకమై బాగుపడబోతున్న నన్ను బాగునుండి దూరంగా నెట్టివేసాయి. ఆరు నెలల క్రిందట వదలుకొన్న దొంగతనాని కీరోజు వెళ్లవలసి వచ్చింది. కాని కల్యాణి! దానికి కారణం నేను కాదు. మానవుడు పరిస్థితులకు బానిస—నేను పరిస్థితుల కబంధహస్తాలలో నలిగి పోరాడి అలసిపోయిన నిర్భాగ్యుణ్ణి !—

కల్యాణి : రామం !—జేబుదొంగ !

రామం : అవును—జేబుదొంగనే—కానీ దొంగా మనిషే. అతనికీ హృదయం, మమతా, జాలీ, దయా అనేవి ఉన్నాయని ఎందుకు అనుకోరు. దొంగతనం చేసాడు అని నేరారోపణ చేసేముందు అతడా దొంగతనా న్నెందుకు చేయవలసి వచ్చింది అనేందు కాలోచింపరు. ప్రభుత్వానికి, ప్రజలకీ అది అనవసరం.

కల్యాణి : ఎంతపని చేసావు రామం ! నా హృదయంలో యిలాటి చిచ్చు నెందుకు రగిల్చేవు. నన్నొక్కసారి చంపితే పోయేదిగా—

రామం : నిన్ను నేను చంపుకోటానికీ, నీ హృదయంలో చిచ్చు పెట్టటానికీ అయితే నే నీ పని చెయ్య నక్కర్లేదు కల్యాణి. నిజమైన ప్రేమ ప్రతిఫలాన్ని కాంక్షించ దంటారు.

కల్యాణి ! నే నీరోజు సేఠ్ సోనాచంద్ ధర్మానంద్ యింట్లో దొంగతనం ఎందుకు చేసేనో తెలుసా ?—నీ కోసం, నీ క్కావలసిన సుఖం కోసం. నేను దొంగని లోకానికి తెలిసిన వ్యక్తులు నిన్నటి వరకూ ఒక్క వేణూ—

కల్యాణి : (ఆశ్చర్యంగా) వేణూ

రామం : అవును కల్యాణి—అతనూ నేనూ కలిసి చేసేవాళ్లం. నన్ను తిరిగి తీసికెళ్లటానికే ఆరోజు వచ్చేడు. రమ్మని బ్రతిమాలేడు. రానన్నాను. చివరికి బెదిరించి తీసికెళ్ళకల్లేడు కల్యాణి !—నా ఈ రహస్యాన్ని నీకు, నీ తండ్రికీ చెప్తానన్నాడు. దాని ఫలితా న్నొక్కసారి నా మనస్సుకు హత్తేలా, నా కళ్లకు కట్టేలా విప్పి చెప్పాడు. అలా నాశన మవటం నాకు ఒక్కనాటికీ యిష్టంలేదు. అందుకే నే నీ పని చేయటాని కంగీకరించేను. మధ్యలో వచ్చిన నన్ను మధ్యలోనే మరచిపో కల్యాణి.

కల్యాణి : రామం—

(ఇన్స్పెక్టరు వచ్చేడు)

రామం : Oh ! యిన్స్పెక్టర్ Come in!

ఇనస్పెక్టర్: రామం M. B. B. S. — Oh Sorry! M.B. B.S రామం! you are arrested (చేతికి బేడీలు వేసాడు.)

కల్యాణి : ఎంతపని చేసేవు రామం!— రామం— (శ్రీరంగం గారొచ్చేరు).

శ్రీరం : ఏమిటిదంతా యినస్పెక్టరుగారూ.

ఇనస్పెక్టరు : చెప్పవయ్యా చేసిన ఘనకార్యం.

రామం : ఇనస్పెక్టరుగారూ!—నన్ను వేగంగా తీసుకుపోండి యినస్పెక్టరు గారూ.

ఇనస్పెక్టర్ : ఇతను ఒక ప్రఖ్యాత జేబుదొంగ. తప్పించుకొని తిరుగుతున్నాడు. కాని అసత్యం ఎంతోకాలం దాగదు కదూ— నేటికి చేసుకున్న ఖర్మ పక్వ దశ కొచ్చింది. పట్టుబడ్డాడు. ఎరస్టుచేసి తీసికెళ్తున్నా.

శ్రీరంగం : రామం—జేబుదొంగవా ? రామం జేబుదొంగ ....! (సోఫాలో కూలబడ్డాడు.)

రామం : ఒక్కసారి పాపను తీసుకొస్తారా కల్యాణిగారూ ! (కల్యాణి పాపను తీసుకొచ్చింది)

సుగుణ : బావా ! వెళ్ళిపోతున్నావా !—అమ్మ దొంగ ! అయ్యో ! ఈ చేతికి గాజులేమిటే ఆడపిల్లలాగ—అక్కయ్యా బావ యినపగాజులు వేసుకొన్నాడు—హాష్—హాష్. (సుగుణ చేతులకు రక్తం అయింది) అమ్మో ! రక్తం ! ! అక్కయ్యా ! బావచేతికి రక్తం ! నాన్నా—

(కల్యాణికి సుగుణ మాటలు విని కళ్ళల్లో నీళ్ళు పళ్ళ తిరిగేయి. దుఃఖంతో గొంతు పెగల్లేదు—మాట కరువయింది. చేతుల్లో ముఖం దాచకొంది. శ్రీరంగంగారు నిస్పత్తువతో సోఫాలోంచి కదల్లేక పోయేరు. ఇది చూచిన రామంకి బాధ అధికమైంది—)

రామం : (బాధగా) యినస్పెక్టర్ !—నన్నిక్కడ నుండి త్వరగా తీసుకుపోండి యినస్పెక్టర్ !— నేనీ చిత్రవధని భరించలేను. ఈ బాధని సహించలేను.

సుగుణ : బావా !—నువ్వెళ్ళిపోతావా ?—(యినస్పెక్టరుతో) యినస్పెక్టరుగారూ ! —మా బావని తీసికెళ్ళొద్దు. బావా నేను జట్టు—యినస్పెక్టరుగారూ—కావలిస్తే నా బొమ్మలన్నీ యిచ్చేస్తాను. యినస్పెక్టరుగారూ బావను వదిలేయండి—

(బాధతో మెలికలు తిరిగిపోయేడు రామం—కల్యాణి బావురుమంది.)

రామం : కల్యాణి !— ఒకనాటి యిటువంటి సంఘటనవల్ల మీ జీవితంలో ప్రవేశించి, అదే సంఘటనతో మిమ్మల్ని విడిచి వెళ్తున్నాను. కాని ఈమధ్యకాలంలో మనిషిగా బ్రతకటం నేర్పిన మిమ్మల్ని, మీ అభిమానాన్ని, ఆదరణనీ, మీ అనురాగాన్నీ నే నే జన్మలో మరచిపోలేను—కల్యాణీ ! మరచిపోలేను.

పరిస్థితులూ, పరిసరాలూ, సంఘంలోని వ్యక్తులూ మనిషిని అధఃపతనానికి అణచివేస్తుంటే తను నమ్మిన వ్యక్తులే తనని నిలువునా ద్రోహంచేస్తే, ఒకసారి చేసిన తప్పుకి ఆ మనిషిని మానసికంగా చిత్రవధ చేస్తుంటే, మనిషి ఎంతవరకూ సహించగలడు?—మంచివాడుగా జీవించా లనుకొన్నాను. మనిషిగా గౌరవంగా బ్రతుకుదా మనుకొన్నాను. కాని దురదృష్టం తరుముకు వస్తుంటే బాగుపడలేని హతభాగ్యుణ్ణి !— నన్ను మరచిపోండి—కల్యాణి—మరచిపోండి. (కల్యాణికి దుఃఖం ఆపుకోటం చాతకాలేదు. వెక్కివెక్కి ఏడుస్తోంది.)

శ్రీరంగంగారూ !—యింతకాలం మీ ఎదుట నిజాన్ని దాచి, మీలో లేనిపోని ఆశలకు అవకాశాలు కల్పించి ఈనాడు వాటి నన్నిటినీ కూకటివ్రేళ్లతో పెకిలించి నిశ్చింతగా వెళ్లిపోతున్న నన్ను క్షమించమని అర్థించటానికి సిగ్గుపడటం లేదు నేను—(నెమ్మదిగా చేతుల్లో ఉంచుకున్న తలని పైకెత్తి రామం ముఖంలోకి చూసేరు శ్రీరంగంగారు. రామం సిగ్గుతో ముఖం దించుకొన్నాడు. తర్వాత నెమ్మదిగా పాపని సమీపించి)

పాపా !—బాగా చదువుకొంటావు కదూ— (కంఠం దుఃఖంతో బరువైంది) ఈనా డిలా, నేను నీ చిన్ని లేత హృదయాన్నింత నిర్దాక్షిణ్యంగా ముక్కలు చేయవలసి వస్తుందని, ఆనాడు వూహించివుంటే, నేను నీ బావను కాదనీ, ఆ అర్హత నాకు లేదనీ చెప్పేసి ఉండేవాడినమ్మా!—పాపా (కళ్లల్లో నీరు తిరిగింది. సుగుణని దగ్గరగా హృదయానికి హత్తుకొన్నాడు. పాప అతని కన్నీళ్ళు తుడుస్తోంది) పాపా !—(దుఃఖం ఆపుకోలేక పోయేడు. పాపని క్రిందకి దింపేసి యినస్పెక్టర్తో) పదండి యినస్పెక్టర్గారూ—పదండి (తొందరగా అడుగులు వేసుకొంటూ బయటకు వెళ్లి పోయేడు. ఇనస్పెక్టరు అనుసరించేడు. కల్యాణి రెండడుగులు వేసి "రామం" అని కేకేసింది. కాని అది ఆమె మూగ హృదయంలోంచి బయటకు రాలేదు. శ్రీరంగంగారు లేచి పిలవబోయి కుప్పగా నిస్పృహతో కూలబడిపోయేరు. పాప మాత్రం బావురుమంటూ వీధిలోకి పరుగెత్తింది. కాని అప్పటికే జీపు బయలుదేరిపోయింది. పాప ఏడుస్తూ లోనికి వచ్చి కల్యాణి చెయ్యి పట్టుకు 'బావా' అంటూ ఆమె హృదయంలో ముఖం దాచుకొంది. కల్యాణి శిలలా అచేతనంగా శూన్యంలోకి చూస్తూ నిలబడిపోయింది. కళ్లవెంట ధారగా ప్రవహిస్తోంది కన్నీరు.)

# నన్నయ ఎఱ్ఱనల ఉపజాతులు

శ్రీ వి. రామకృష్ణారావు

నన్నయ యెఱ్ఱనలు సీసము—తేటగీతి— ఆటవెలది అను పద్యములలో నియమములు కొన్ని పాటించినారు. లాక్షణికులు 'అవకలి ప్రాససీసము— అక్కలి ప్రాససీసము' మొదలైన విభాగములు సీసముల విషయమున చేసినారు. కాని తేట గీతి, ఆటవెలది పద్యములలోను అట్టి నియమములు పాటింపబడినవి. కేవల యతితోగాని లేదా కేవల ప్రాసయతితోగాని పద్యమంతటనుగాని, లేదా దాని ఖండములందు వేర్వేరుగా గాని నడపుటయే వీరు పాటించిన నియమములు. ఇట్టి నియమములు సంస్కరణ లోపమువలన కొన్నిచోట్ల భ్రష్టములైనవి. ఈ వ్యాసములో అట్టి నియమ భంగములు జరిగిన స్థలములయందు సాధు పాఠములు విశ్లేషింపబడుచున్నవి. భాషావేత్తలు బాగోగులను పరిశీలింతురుగాక.

(1) సీ. బ్రహ్మణ్యుఁడగు కశ్యప బ్రహ్మ వరమున
వినతకుఁ బుట్టిన యనఘమూర్తి
వాలఖిల్యుల దయ వర పక్షికులమున
కింద్రుఁడై పరగిన యిద్ధతేజుఁ
డుదధిలోనున్న యత్యుగ్ర నిషాదుల
వారంగ మ్రింగిన ఘోర వీరుఁ
డిభకచ్ఛపముల రోహిణ శాఖతో నెత్తి
కొని దివిఁ బరచిన యనిలవేగి
(ఆది 2—83)

పై నాలుగు పాదములలో ద్వితీయ పాదపు రెండవ ఖండమున నియమభంగము జరిగినది. ఈ పద్యములో పూర్వఖండములయందు యతులును, ఉత్తర ఖండములయందు ప్రాస యతులును పాటించుట నన్నయ అవలంబించిన పద్ధతి. 'వినతకుఁ బుట్టిన యనఘమూర్తి, ఆరంగ మ్రింగిన ఘోరవీరుఁడు, కొని దివిఁ బరచిన యనిలవేగి'' అను మూడుచోట్ల ప్రాసయతులు వేయబడ్డవి. 'ఇంద్రుఁడై పరగిన యిద్ధతేజుఁడు' అన్నచోట ప్రాసయతియే కావలెను. యతి ముద్రితమైనది. ఇది రామా అండ్ కో వారి ముద్రణము. పాఠాంతరములు చూపబడలేదు. వావిళ్ళవారి ముద్రణములలో (1954—1959 ముద్రణములు) 'ఇద్ధతేజుఁడు' అనుచోట 'సాంద్ర, ఇంద్ర'' అన్నవి పాఠాంతరములుగా చూపబడినవి. (ఆది 2—84) కాబట్టి 'ఇంద్రుఁడై పరగిన సాంద్రతేజుఁడు' నన్నయ పాఠమని నిర్ణయింపవచ్చును.

(2) సీ. జనమేజయుని చేయు సర్పయాగమునకు
విఘ్న మందఱము గావింత మతఁడు
ధర్మార్థి గావున ధారుణీ సురులెల్ల
యడుగుద మీ క్రతు వుడుగు మనియుఁ
గొందర మతనికిఁ గూర్చు మంత్రులమునై
యా క్రతు క్రియ జేయ నిహపరముల
కగుఁ జెక్కు దోషంబులని హేతువులు సూపి
యుడిగింత మందఱ మొక్క మొగిన
ఆ. భక్ష్య భోజ్య లేహ్య పానీయముల మీఁదఁ
సదములోని విప్రజనులమీఁదఁ
వెగడు పడఁగఁబాఱి వెరపింత మొజ్జలు
తత్ప్రయోగ విధులు దప్పె ననిన

(ఆది 2—130 రామా అండ్ కో ముద్రణము) ఇది వడి సీసముగా నన్నయ వ్రాసినాడు. దీని ద్వితీయ చరణపు రెండవ ఖండమున ప్రాసయతి ముద్రితమైనది. వావిళ్ళ ముద్రణములలో 'అడుగుదమిష్టి సేయకుమటనియు' అని యున్నది. ఇదే నన్నయ్య పాఠముగా చెప్పదగును. (2—131 వావిళ్ళ) 'సూ. వి'లో 'ఉడుగు' వద్ద ఈ పద్యపాదము కూడ చూపబడినది. అది సరి కాదు.

(3) గీ. ధరణి యెల్లను రక్షించు ధర్మ చరితు
నా పరీక్షితు రక్షించి యతని చేత
నపరిమిత ధన ప్రాప్తుండ నగుదుఁ గీర్తి
యును ధనము ధర్మువును వాకుఁ గొనుటయునిదె
(ఆది 2—186 రామా అండ్ కో)

ఈ పద్యము కేవల యతిగీతముగా ఉద్దిష్టము. కావున నాలుగవ పాదములో నియమ భంగము జరిగినది. 'కీర్తి, యును ధనము ధర్మువును వాకుఁ గొనుట యునిదె' అని ప్రధాన పాఠముగా ముద్రించి వావిళ్ళ ముద్రణ పరిష్కర్తలు ''గొనుటరుదె వాకు'' అన్నది పాఠాంతరముగా చూపినారు. (2—187) దీనినిబట్టి ''కీర్తి, యును ధనము ధర్మువును గొనుటరుదె వాకు''

సరియైన పాఠమని చెప్పవచ్చును. "కీర్తియును ధనము ధర్మువును గొనుటువుగాదె" అని కాకినాడ సుజనరంజనీ ముద్రాశాలయందు 1911 లో ముద్రితమైన ప్రతిలో కలదు. (2—183) ఇదే నన్నయ పాఠమనుట ఉచిత తరముగా కనబడుచున్నది.

(4) ఆ. చండ కోపుఁడయిన మాండవ్యమునివరు
శాపమున జముండు సంభవించె
విదురుఁడనగ ధర్మ విదుఁడు పారాశర్య
వీర్యమునను భువి నవార్యబలుఁడు
(ఆది 4—260 వావిళ్ళ)

ఈ పద్యములో ఒకటి మూడు పాదములందు ప్రాస యతి, రెండు నాలుగు పాదములందు యతి, ఉద్దేశింపబడినట్లు చెప్పదగును. రెండవ పాదములో యతివేయబడుట స్పష్టము. నాలుగవ పాదములో 'నవార్య వీర్యబలుఁడు' అన్నది పాఠాంతరముగా చూపినారు. కాన 'వీర్యమున నవార్య వీర్యబలుఁడు' సాధు పాఠమని నిర్ణయింపవచ్చును. రామా అండ్ కో ముద్రణలోను (4—258) పూర్వోక్త సుజన రంజనీ ముద్రణలోను 'అవార్య వీర్యబలుఁడు' అన్నదే గ్రహింపబడిఉన్నది. 'భువి నవార్య బలుఁడు' అన్నది పాఠాంతరముగా కూడా చూపబడి ఉండలేదు.

(5) ఆ. ఎట్టి రాజులును మహీసురోత్తము లెదు
రరుగు దెంచునప్పు డధిక భక్తి
నెఱఁగి ప్రియము పలికి తెరువిత్తు రట్టిద
ధర్మువీవు దీని దలప నెట్లు
(7—111 రామా అండ్ కో)

ఇది కేవల వడి గీతముగా చెప్పబడినది. తృతీయ చరణములో నియమ భంగముముద్రితము. మీదు మిక్కిలి రేఫ ఱకార సాంకర్యము కూడా ఏర్పడినది. కాన "శ. ర.నా.వి" కర్తలు 'ఎరఁగు' పాఠముతో దీనిని చూపినారు. ఇట్లే వావిళ్ళ ముద్రణములలో రేఫఱకార సాంకర్యమును వారించుటకు 'ఎరఁగి ప్రియము పలికి తెరువిత్తురట్టిద' (7—112) అని ముద్రింపబడినది. దీనినిబట్టి శ్రీవజ్ఝలవారు తమ వైయాకరణ పారిజాతములో ఇట్లు వ్రాసినారు. "ఎఱఁగు = ఎరఁగు=దిగు, మ్రొక్కు—ఇందుఁ దమిళ కన్నడములలో శకటమేయుండుట వింత. నన్నయ దీనిలో రేఫమును ప్రయోగించియుండగా నెల్లరును దీనిలో శకటమే కలదనుటయు వింతయె" ఇత్యాది. 'ఎరఁగు'లోనిది రేఫ మనుటకు ప్రకృత పద్యముపకరింపదు. ఏలన 'ఎరఁగు' అన్నది యిక్కడ నన్నయప్రయుక్తము కాదని నియమభంగమువల్ల తెల్లమగుచున్నది. రామా అండ్ కో ముద్రణమున "గ. దెరలి" అనియు వావిళ్ళ ముద్రణములలో "దివిరి, దెరలి" అనియు పాఠాంతరములు చూపబడినవి. ఈ రెండు పాఠాంతరములలో ఒకటి నన్నయ పాఠమని చెప్పదగును. "తెరలి ప్రియము పలికి తెరువిత్తురు" అని నన్నయ పాఠము కావగునని నా యభిప్రాయము. "తెరలు—ఆది 8—283; సభా 1—227; అర 1—188, 195; 4—68." (వై. పా)

(6) ఎ.గీ ఘోర వనమున వీరుఁ గిమ్మీరుఁడనుఁ సు
రారి నిశ్చలఘనభీకరాంగుఁబట్టి
పోరవధియించినట్టి సమీరజునకు
భూరిభుజునకు మార్కొనువారుఁ గలరె
(అరణ్య 1—102)

ఇది ప్రాసయతి గీతము. రెండవ పాదములో యతి ముద్రితమైనది. వావిళ్ళ 1952, 1960 ముద్రణములు రెండింటిలోను ఇట్లే యున్నది. పాఠాంతరము చూపబడలేదు. రామా అండ్ కో ముద్రణలో "అ. నిశ్చల భీకరాకారు" అనిపాఠాంతరము చూపబడినది. కాన 'సు, రారి నిశ్చల భీకరాకారుఁబట్టి' అన్నది అసలు పాఠమని చెప్పదగును.

(7) గీ. క్షత్రవధనైన పాపంబు గ్రాఁగవలయుఁ
గడఁగి నాకును సద్గతి గలుగవలయు
నవియుఁ బుణ్యతీర్థంబులై యుద్ధరిత్రిఁ
బరగుచుండంగవలయు మీ కరుణఁజేసి
(అరణ్య 2—262 రామా అండ్ కో)

మొదటి మూడు చరణములలో యతులు, నాలుగవ చరణములో ప్రాసయతి ముద్రితమగుటచే ఇది కేవల వడిగీతమని పించును. కాని వావిళ్ళ ముద్రణములలో (1952—1960) రెండవపాదమువద్ద "సద్గతియును నాకుఁ బడయువలయు" అన్నది పాఠాంతరముగా చూపబడెను. కాబట్టి "కడఁగి సద్గతియును నాకుఁ బడయువలయు" అన్నది సరియైన పాఠమని నిర్ణయింపదగును. అప్పుడు ఒకటి మూడు పాదములలో యతులు, రెండు నాలుగు పాదములలో ప్రాసయతులు, పాటింపబడినట్లు చెప్పవచ్చును. కాన పాఠాంతరమే గ్రాహ్యము.

(వావిళ్ళ అరణ్య 2—263)

(8) సీ. మృగనేత్ర దారుణమృగసమాకులమైన
యువ్వనాంతరమున నేకతంబ
యిట్లు నీయున్కికి నెయ్యది మూల మి
వ్వనదేవతవొ సురేశ్వరునితోడ
సరిగ ధరిత్రికి నరుగుదెంచిన శచి
లలనవో హరియురస్స్థలిదొరంగి

కేలిఁ గ్రుమ్మరు పద్మగేహా భవదీయ
జనకత్వమున సముజ్జ్వలితుఁడైన
(అరణ్య 6—151 వావిళ్ళ)

ఇది కేవల వడిసీసము. దీని ద్వితీయ చరణపు ద్వితీయ ఖండమున ప్రాసయతి ముద్రితమగుటచే నియమభంగము కలిగి నది. "దేవిహో హరి యురస్స్థితి" అన్నది పాఠాంతరముగా చూపబడ్డది. కాని "శచీ, దేవిహో హరి యురస్స్థితి దొరంగి" అన్నదే అసలు పాఠముగా గ్రహింపదగును.

(9) సీ. అతఁడును దద్భావ మరయంగ మదిఁగోరి
రూపించి యుటపోయి రేవవత్తు
నని పోయి నడికిరేయర్థితోఁ జనుదెంచు
రేయి వచ్చెదనని రేపువచ్చు
నే ప్రొద్దు వచ్చిన నింత యప్పుడు భక్ష్య
భోజ్యముల్ గ్రొత్తపాల్పుగ నొనర్చు
నెయ్యది గోరిన నిచ్చకు రాఁబెట్టు
నలయఁడు మదినైన నలుగఁడెపుడు
(అరణ్య 7—323 వావిళ్ళ)

ఈ పద్యములో కూడా పాఠాంతరములే గ్రహింపవలసి నవిగా ఉన్నవి. రెండవ చరణములో 'రేయి వచ్చెదనని రేపువచ్చు' అని ముద్రితము. 'మాపు వచ్చెద' అన్నది పాఠాంతరముగా చూపబడినది. 'మాపు వచ్చెదనని రేపు వచ్చు' అన్నచో ప్రాస యతి సరిపడును. తృతీయ చరణమునకు "నెప్పుడు వచ్చిన నింతి యప్పుడు క్రొత్తలుగ భక్ష్య భోజ్యాదు లొగి నమర్చు" అన్నది పాఠాంతరముగా చూపబడియున్నది. ఈ పాఠాంతరమునే సరియైన పాఠముగా గ్రహించినచో ద్వితీయ ఖండమున ప్రాస యతి నియమము సరిపోవును. కాగా ఈ పద్యమున పూర్వ ఖండము లలో యతులు, ఉత్తరఖండములలో ప్రాసయతులు, పాటింప బడినట్లు చెప్పదగును.

(10) సీ. శ్యామాంగు నారక్తజలరుహనేత్రు సా
లప్రాంశు నున్నతలలితబాహు
నకులుని బ్రదికింపు నావుడు యక్షుండు
భీమఫల్గును లతిభీమబలులు
ప్రియులు నీ కెంతయుఁ బృథివీశ వీరిలో
నొకనిఁ గోరక యుట్లు నకులుఁ గోరి
తనుఁడు ధర్మాత్ముఁడనియెను మా తండ్రి
యగు పాండువిభునకు మగువ లిరువురు
(అరణ్య 7—457 వావిళ్ళ)

ఈ పద్యపు ద్వితీయ ఖండములో ప్రాసయతి ఉద్దిష్టము. ఈ నియమము మొదటిపాదములోతప్పినది. రామా అండ్ కో ముద్రణమున 'దీర్ఘబాహు' అన్నది పాఠాంతరముగా చూప బడెను. (7—456). అదే గ్రాహ్యము. "సా,లప్రాంశు మున్నత దీర్ఘబాహు" సాధు పాఠము కాదగును.

వావిళ్ళ ముద్రణములందును, రామా అండ్ కో ముద్రణ లోను పాఠాంతరముఁ చూపబడక నియమ భంగములు ముద్రి తములైన స్థలములు కనబడుచున్నవి. పాఠాంతరము లుపక రింపని స్థలములును కొన్ని యున్నవి. వాటిని కూడా యిక్కడ చూపి నాకు తోచిన పాఠములను నిర్దేశించెదను.

(10) సీ. అప్పురుషుం డింద్రుఁడయ్యక్ష మైరావ
తంబు గోమయు మమృతంబు నాగ
భువనంబులోఁ గన్న పాలతు లిద్దఱు ధాత
యును విధాతయు వారి యనువయించు
సితకృష్ణతంతు రాజిత తంత్ర మది యహో
రాత్రంబు ద్వాదశారములు గలుగు
చక్రంబు మాసాత్మ సంవత్సరంబు గు
మారులయ్యార్వురు మహిత ఋతువులు
(ఆది 1—119)

ఇది కేవలము వడి సీసముగా రచింపబడినది. ద్వితీయ చరణపు రెండవ ఖండమున ప్రాసయతి పడుట యీ నియమము నకు బాధకముగా ఉన్నది. 'ధాత, యును విధాతయు వారియును వయించు' నన్నయ పాఠము కాదగును 'వయించు' అని ఉప సర్గ విరహితముగా ఉండవచ్చును.

(2) గీ. సకల ధర్మ విదుండవు సర్వలోక
వర్తనము లెఱింగిన పుణ్యకర్త వీవు
నెయ్య మొనరంగ నెఱింగింపుమయ్య మాకు
వెలయఁ బుణ్యలోకంబులు గలవె యనిన
(ఆది 3—224)

ఇది ప్రాసయతి గీతము. ప్రథమపాదమున యతి ముద్రితమగుట ఈ నియమమునకు బాధకము. 'సకల ధర్మ విదుండవు సకల లోక' అనియే నన్నయ పాఠము కాదగును. "సర్వతీర్థాభిగమనంబు సర్వవేద, సమధిగమము" (ఆది 4—94) అనుచో 'సర్వ' శబ్దపునరుక్తివలె ఇక్కడ 'సకల' శబ్దపునరుక్తి అంగీకరింపదగును.

(3) గీ. కడఁగి సూతుండు పుత్రకుఁ గౌఁగిలించు
కొని తదీయ మూర్ధాఘ్రాణ మొనరఁజేసి
యంగ రాజ్యాభిషేకార్ద్రమైన శిరముఁ
దడిసె వెండియు హర్షాశ్రు తతుల నొప్పి
(ఆది 6—53)

ఇది వడి గీతముగా ఉద్దిష్టము. కాన ద్వితీయ చరణమున నియమ భంగ మేర్పడినది. "కౌఁగిలించియునుఁ దదీయ మూర్ధా ఘ్రాణ మొనరఁజేసి" యన్నది పాఠము కానగును.

(4) సీ. వేల్పంగ నమకట్టె వేల్పడున్న య
యింద్రనందను రుచిరేంద్ర నీల
సుందర శ్యామాంగు మరరాజ కరికరా
కారమహోబాహుకలితుఁ జూచి
నరివాక్షి యందొక్క నాగకన్యక కామ
పరవశయై వానిఁ బట్టి తిగిచి
కొని నాగపురమున కొనరంగఁ జని రమ్య
హర్మ్యంబునందు నెయ్యమున నుంచి (8—128)

ఇందు చతుర్థ పాదపు ప్రథమ ఖండమున యతియే కావలెను. కాన 'కొని నాగపురమునకును జని విజరమ్య' అను సుజనరంజనీ ముద్రణమే గ్రాహ్యము.

(5) సీ. మీ వంశమున నరదేవోత్తములదైన
సద్ధర్మ మార్గంబు సలుపుదయ్య
ధర్మ విదుండవై ధర్మార్థ కామంబు
లొండొంటి బాధింపకుండ నుచిత
కాల విభక్తముల్ గాఁజేసి సేవింతె
ధర్మంబునంద చిత్తంబు నిలిపి
యుమ్మల నపర రాత్రములం దెప్పుడుఁ
జింతింతె నిజబుద్ధిఁ జేయఁదగిన
(సభా 1—25)

ఈ పద్యములో ప్రథమ ఖండములందు ప్రాసయుతులు పాటింపబడెను. మూడవచరణములో నియమభంగము వాటి ల్లెను. 'కాల విభక్తతఁ గ్రాలంగ సేవింతె' అని కవి పాఠమని తోచుచున్నది.

(6) సీ. వసుమతీ రాజ్యంబువలన నిరస్తులై
ముని వృత్తి నత్యుగ్ర వనములోన
నవయుచుఁ బాండు భూనాథ నందనులున్న
వారని విని యతి క్రూరమతుల
ధృతరాష్ట్ర సుతుల నిందించుచుఁ బాంచాల
యాదవ వృష్ణి భోజాంధులెల్ల
నచ్యుత ప్రముఖులై యప్పాండవులకడ
కేతెంచి శోకపరీతులగుచు
(అరణ్య 1—122)

ఈ పద్యములో ద్వితీయఖండములందు ప్రాసయుతులు కావలెను. తృతీయ చరణపు రెండవ ఖండమున ఈ నియమము తప్పినది. "యాదవవృష్ణి భోజాదులెల్ల' కవి పాఠము కావోవును.

(7) సీ. అ. ఆచరించుచున్న నీచ దుర్యోధనా
దులకు వర్తనమును నలఘులైన
పాండునందనులకు దండితారుల కవ
ర్తనమును నిట్లు సేయఁదగునె విధికి
(అరణ్య 3—162)

దీనిలో నాలుగవ పాదమున ప్రాసయతి లేకపోవుటచే నియమభ్రంశము జరిగినది. "అవర్తనము నిట్లు సేయఁ జనునె విధికి" అన్నది సరియైన పాఠము కానగును.

(8) సీ. సత్య క్షమా దమ శౌచ దయా తపో
దాన శీలంబు లెందేనిఁగాన
నగు నట్టివాఁడు బ్రాహ్మణుఁడగు సుఖము దుః
ఖంబునై నెడవిమోహమును బొంద
కునికియు వానికి నుత్తమంబగు వేద్య
మనిన నీ చెప్పిన యుగ్గుణములు
క్రియాశూద్రునందుఁ గల్గిన నతండుత్తమ
ద్విజుఁడు గానేర్చునే నిజము నిడిచి
(అరణ్య 4—128)

ఈ పద్యపు ద్వితీయ ఖండములలో ప్రాసయతులు ఉద్దేశింపబడినవి. 'అనిన నీచెప్పిన యుగ్గుణములు' అనుచో నియమ భంగము కలిగినది. "అనిన నీ విపుడు చెప్పిన గుణ ములు" అని కవి పాఠము కావచ్చును. ద్వితీయ చరణమున 'దుఃఖంబునై నెడ విమోహమును బొంద' అనుచో యతి భ్రంశము. 'విమోహంబు బొంద' అనిగాని 'దుఃఖమును నైనెడ విమోహమును బొంద' అనిగాని గ్రహింపవలసియున్నది.

(9) గీ. పీని పుట్టిన పాపంపువేళఁ బెక్కు
దుర్నిమిత్తముల్ పుట్టిన నిర్ణయించి
యేనుఁ జెప్పితిఁ దొల్లియు నీనిచేత
నెట్టుఁ గౌరవులకు నెగ్గు పుట్టుననియు
(అరణ్య 1—49)

ఇందు ఒకటి మూడు పాదములలో యతి కావలెను. లేదా మొదటి పాదములో ప్రాసయతియైనను కావలెను. తృతీయ చరణములో 'నీనిచేయి' అన్న పాఠాంతరము చూపబడి యున్నది. కాని అదియు ఉపకరించుటలేదు. 'ఏను సెప్పితిఁ దొల్లియు నతని చేత' అని గ్రహింపదగును. తాను నేను పదములు కలవని శ్రీ వజ్ఝలవారు నిర్ణయించినారు. కాబట్టి 'ఏను సెప్పితి' అనియే ముద్రింపవలసియున్నది.

(10) సీ. జతనంబు మిగుల మాసములు దొమ్మిది యుద
రంబునం గరము భరంబుతోడ
భరియించి పదపడి ప్రాణసంశయ దశ
పొంది పుత్త్రుఁ గాంచు పొవరఁ దల్లి

తపములు యజ్ఞముల్ దానముల్ వ్రతములు
దేవతా సజ్జన సేవనములుఁ
గావించఁ బుత్త్రునిఁ గామించి జనకుఁడి
ట్లిరువుర పాటున పరియె తలఁప
(అరణ్య 5—5)

ఎఱ్ఱన ఈ పద్యములో పూర్వార్ధమున యతులు ఉత్తరార్ధమున ప్రాసయతులు వేసినాడు. ద్వితీయ చరణపు రెండవ ఖండములో ఈ నియమము చెడిపోయినది. 'పొసర' అన్నచోట 'పొరపి' అన్నది పాఠాంతరముగా ఈయబడినది. కాని అది కూడా సరిపడలేదు. "ప్రాణసంశయ దశ, పెనసి పుత్త్రునిఁ గాంచు పొసరఁ దల్లి" అని యెఱ్ఱన పాఠము కావచ్చునని నా యభిప్రాయము.

(11) సీ. అయ్యగ్నిసంభవు నాయతోన్నత బాహు
నాముక్తకవచు దేజో మహిష్ఠుఁ
నాలోహితాంబరు హారి కుండల కర్ణుఁ
గనక రత్నోజ్జ్వల ఘనకిరీటు
సంపూర్ణ యౌవను సర్వ లక్షణ యుక్తుఁ
గని యను రాగిల్లి కమలనిలయ
సాకారయై వచ్చి యఖిలంబుఁ జూడంగ
సితపద్మహస్తయై యతనిఁబొందె
(అరణ్య 5—22)

ఈ పద్యమున తృతీయ చరణపు ద్వితీయ ఖండమున ప్రాస యతి లేకుండుటచే నియమ భంగముకలిగినది. 'కని యనురాగిల్లి వనజ నిలయ' అని యెఱ్ఱన పాఠము కావచ్చును.

(12) గీ. ధర్మజుఁడు దూర్పు భీముఁడు దక్షిణంబు
నర్జునుండు పడమర గవలర్థి నుత్త
రంబుగా వేఁటవోయిరి రాజ ముఖ్య
లనఘు లింతకు వత్తురు వినుత బలలు
(అరణ్య 6—158)

ఇందు చతుర్థ పాదములో ప్రాసయతి ముద్రితము. ఇది వడిగీతము. కాన "అనఘులింతకు వత్తురు నధికబలులు" అను రీతిని కవిపాఠము కానగును.

(13) సీ. విప్రులు గడు నర్థి వేఁడినఁ గడిమితోఁ
బొచ్చెంబు సేయక యిచ్చుటొకటి
బలితంపుఁ బగతురఁ బరిమార్చు టొక్కటి
దండియై యనిఁ జచ్చుటొండె నొకటి
శరణాగతునినెట్టి శత్రువునైనను
గరుణించి చంపక గాచుటొకటి
భామినీ ద్విజ వృద్ధ బాలాతురులకైన
యాపదఁ జెచ్చెరఁ బాపుటొకటి
(అరణ్య 7—295)

ఇందు తృతీయ చరణపు రెండవ ఖండమున యతి ముద్రింపబడినది. యతియే కావలెను. కాన 'కరుణించి చంపక యరయుటొకటి' కవి పాఠము కానగును. (అరయు = రక్షించు; అను 1—160)

ఈ విధముగా నన్నయ యెఱ్ఱనల ఉపజాతులలో నియమ భంగములు మూడు పర్వములలోను గలవు. నన్నయ అరణ్య పర్వమును గూడా పూర్తిగా వ్రాసినాడనియు, అందులో కొంత భాగము శిథిలమైనదనియు, ఆ శిథిలమైన భాగములో చిన్న చిన్న అతుకులు వేసినవాడు ఎఱ్ఱన అనియు అరణ్య పర్వ శేష పూరణమనగా ఆ శిథిల భాగములను అతుకుటయే అనియు శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు వ్రాసినారు. అరణ్య పర్వ శేషములో ఈ నియమ భంగములు కలుగుట యెఱ్ఱన అతుకుటలో జరిగిన పని యని వారి వాదము. ఈ నియమ భంగములు ఆది సభా పర్వములలోను అరణ్య పర్వ పూర్వభాగమ్ములోను ఉన్నట్లు గుర్తించిన యెడల వీ రిట్లు వాదించియుండెడివారుకారు. ముద్రణ లోపమువల్ల ఎట్టి అనర్థములు వచ్చునో దీనివలన తెలియుచున్నది. కాన ఈ నియమ భంగములను తొలగించుకొనుట కర్తవ్యము.

# అజ్ఞాత తపస్వి

శ్రీ పురాణం కుమారరాఘవశాస్త్రి

[కథియవాడలో ఒక శిలాఫలకముపై కొన్ని ఆంగ్లపద్యములు వ్రాసియున్నవి. రచయిత యెవరో. క్రింద పేర్లులేదు. పేరుకోసము గాక పరులకొరకే బ్రతుకని విశ్వసించిన ఒక పుణ్యమూర్తి కాబోలును. ఆ పద్యాలకిది స్వేచ్ఛానువాదము]

ఏడి చిరువెల్గు చా లొకటి పంపితినో యెవడేని నొక్క త
మ్ముడు పయనించు త్రోవ తమమున్ విదళింప; స్వధర్మదీక్ష యే
ర్పడి నిజమేదొ గుర్తెరుగు లాగొక జీవికి సుంత సాయమున్
నడపితినో! విషాదనయనంబుల జిందు కవోష్ణబాష్పముల్
తుడిచితినో! భవంబు దలతున్ భువిపై కృతకృత్యమైనటుల్

పొరపడి తప్పుత్రోవ బడిపోయెడి గుండెకు నేను సత్యపున్
దెరువును ధర్మచింతనము దెచ్చితినేని; గులాబి మొక్కకున్
బరువము, తావి, యందము వివర్ధితమౌనటు దోహదక్రియల్
నెరపితినేని; యొక్కనికి నేన్ బరమున్ బరమేశు డిందె చే
కురునను నమ్మకంబు నొడగూర్చితినేని కృతార్థుడయ్యెదన్.

ఎదగల సంశయమ్ములు త్యజించి, భయంబు విదిర్చి, సర్వభూ
తదయ, యహింస, సత్యము ప్రధానముగా బ్రదు కొప్పచుండ, స
మ్ముదమును పెంపుసొంపులు విముగ్ధముగా జగమెల్ల నింపి వై
చెదన? మనస్సు లందలము చీకటి చించుదునా? ప్రజల్ సుఖం
బధికము, దుఃఖ మల్పముగనై మనునట్లు సదా శ్రమింతునా?

శ్రమలు తొలంగ పాంథులకు చల్లని నీడ యొసంగునట్టి వృ
క్షమొకటి నాటి పెంచుదునుగా కెడగా నొకప్రక్క జీవితా
ధ్వమున; మరేను దాని విభవంబును చూడనొ, దాని నీడ సౌ
ఖ్యముగన నోచనో, అయినగాని తరించును దాన నాదు జ
న్మము-నను, నాదు పేరును జనంబు లెరుంగనె వద్దొకప్పుడున్.

# విశ్వనాథ-ప్రయోగ దక్షత

శ్రీ వేదాంతం గోపాలకృష్ణమాచార్యులు

లక్ష్య పరిజ్ఞానము లేని లక్షణ పరిజ్ఞానమంత శ్లాఘ్యము కాదని సూరిగారి సూక్తి. ఈ సూక్తి నుపలక్షించక శ్రీ కొత్త సత్యనారాయణచౌదరిగారు భారతి సెప్టెంబరు, అక్టోబరు సంచికలలో 'విశ్వనాథ—ప్రయోగ వైలక్షణ్యము' అను పేర నొక వ్యాసమును ప్రచురించిరి. వారందు చేసిన ఆక్షేపములకు ప్రకృత వ్యాసము ప్రత్యాఖ్యాన రూపము.

## 1. ఆద్యసమాసములలో రేఫ సంయుక్తాక్షర పూర్వాక్షరమునకు గురుత్వము వైకల్పికము

గణభంగమను శీర్షిక క్రింద చౌదరిగా రిచ్చిన యుదాహృతులలో మూడు స్థలములందు తక్క శేషించిన స్థలములలో సిద్ధ సమాసములందు రేఫ సంయుక్తాక్షర పూర్వాక్షరమునకు కవి లఘుత్వమును వివక్షించుట కానవచ్చును. ఇది దోషమనియు సంయుక్తాక్షరమునకు పూర్వాక్షరము గురువన్నమాట ఇంగ్లీషు బడులలో కుర్రకారునకు సైతము తెలిసిన చదువనియు వారాక్షేపము. ఈ ఆక్షేపమున కీ క్రింది సామాన్య విధి ప్రమాణముగా నొప్పును.

'దీర్ఘ స్సంయుక్తాద్యః పూర్ణాను స్వార పూర్వ వర్ణశ్చ
ఏ తే గుర వశ్శేష స్సర్వే లఘ్వక్షరా ఇతిజ్ఞేయాః'
ఆథర్వణుడు

''సంయుక్తే సంస్కృతాద్యే స్యాత్పూర్వమాత్న పదంలఘు
భవే దాద్య సమాసేపి రేఫయోగా త్పదంతథా'

అను కారికచే సిద్ధ సమాసమునందును రేఫ సంయుక్త పదాది వర్ణము మూలమున పూర్వ పదాంత్యాక్షరము లఘువగునని విధించి నాఁడు. ఆద్య సమాసమున రేఫసంయుక్తాక్షర పూర్వాక్షరమునకు గురుత్వము వైకల్పికమనుట కీ క్రింది వన్నియు ప్రయోగములు ప్రమాణములనజెల్లును.

ఘనదరితానుబంధ కలి కాలజ దోషతుషార సంహతిం
దనయుదయ ప్రభావమున — ఆది 1—5 (ప్రకార పూర్వాక్షరము గురువు)

అవనిజమువలన నమ్మని, ప్రవరు పృథూత్సంగతలము
పై వడిఁ బడియెన్—సభా 1—143

ప్రకార పూర్వాక్షర మీ లక్ష్యమున లఘువుకానిచో ఛందోభంగమనివార్యము. కావుననే కూచిమంచి తిమ్మకవి సర్వ లక్షణ సార సంగ్రహమున క్రింది విధముగా లక్షణమును గావించి నాఁడు.

'సంస్కృత పదంబు లొగి సమాసములు గూర్చు
నపుడు రకారము గూడిన యక్కరంబు
లాది యుండు నొక్కొక్కచో నాదకుండఁ
దెనుఁగుఁ గృతులందు సామజాజినవిచోళ'—వు 103

కృప కృతవర్మలం గడిమి గిట్టి ఖండి ప్రభద్రకుల్
మహోగ్రపువడిఁ దోడ్పడంగ—శల్య 1—221

సంధ్యాభి వందన శ్రద్ధ యుజ్ఝన సేయు
గీతవాద్య వినోద క్రియలఁ దగులు—కాశీఖండము

మున్నగు ప్రామాణిక ప్రయోగము లాతనిచే ప్రదర్శితములు. 'తత్సమసమాసే రేఫసంయోగే పరే పూర్వపదస్య లఘుత్వేక. శతతాళదఘ్న హ్రదమునఁ బడియె నిత్యాదయః కవి ప్రయోగా ఉదాహరణమ్' అని అహో బలపతి. చౌదరిగారు రేఫసంయుక్తాక్షర పూర్వాక్షర గురుత్వమునకు లక్ష్యముగా నుదాహరించిన 'చక్రము' సమాన పదము. కల్పవృక్షమునందలి లక్ష్యములగు 'అశ్వమేధ క్రతు' 'రాజక్రతువిరామ' యాదులు సమాసములు. ఈ భేదమును గుర్తింపవలెను.

## 2. అఖండయతి విద్వజ్జన సమ్మతము గాదా?

యతి చ్యుతియను శీర్షిక క్రింద చౌదరిగారు నలువది మూఁడు లక్ష్యముల నిచ్చి తుద కీ క్రింది వాక్యమును వ్రాసినారు. 'తెలిసియే అఖండయతివేసిరి నన్నచో ఆ వాదములోని పాటవముగాని ఆ కవనములోని విలువగాని విద్వజ్జనులు గుర్తింపరు' అఖండయతి నిరాకరణమునకు (ఉభయ యతులుగా నాతఁడు పరిగణింపనివానికి) వీరి కప్పకవీయము ప్రమాణము గానోపును. తదంగీకృతికి కవిజనాశ్రయసర్వలక్షణసారసంగ్రహాదులు ప్రమాణములు గావచ్చును. ఈ యిరు వర్గములకును సమాధానము కుదురుట దుష్కరము.

పదాంతగతాక్షరములతో పై శబ్దములకు మొదలఁ గలుగు స్వరములకు సంధి కలిగినేని ఉభయవళి స్థానములందు తక్క తక్కిన యెడల నవ్వలి స్వరములకే విశ్రామము చెల్లునని అప్పకవి నియమము. 'అతుల గుణధామ భానువంశాబ్ధి సోమ!'— ఇట్టి స్థలములలో స్వరమునకేగాని ప్రాణికి విశ్రామము చెల్లదని నిషేధము. ఈ నిషేధమును కవి జనాశ్రయకర్త, లింగముగుంట తిమ్మకవి, చిత్రకవి పెద్దన్న, కస్తూరి రంగకవి, కూచిమంచి తిమ్మకవి మున్నగు లాక్షణికులు నిరాకరించిరి.

'హల్లునకు హల్లు వడియుడునప్పుడు దాని
తుదిని స్వరము ఘటిల్లిన నది యఖండ
వడియనఁగఁ బొల్చుఁ గృతుల దేవాదిదేవ!
యనుచుఁ జెప్పిన శైలకన్యాధినాథ—సర్వ లక్షణ
సారసంగ్రహము పు 125.

'హల్లుగా నిల్చియున్న విశ్రమాక్షరమందు స్వరము కూడియున్నను నా యక్షరమునే యతిగాఁ జెప్పి నట్లైతే అది యఖండయతి యనబడున'ని (పు 112) వ్రాసి కస్తూరిరంగకవి లక్ష్యములను ప్రదర్శించెను. కూచి మంచి తిమ్మకవి

'అన్నవు తండ్రి యట్లు నిను మంతియు గాదటమీఁద రాజ వే
మన్నఁ గొఱంతలేదు మణి మండన ముఖ్యములైన కానుకల్
—భాస్కర రామాయణము.
ర, త్నాకర వేష్టితావని వినంబడ దాతఁడు మేరు వెత్తినన్
—భైరవుని శ్రీరంగ మహాత్మ్యము

ప్రభృతి ప్రయోగముల నుదాహరించి త్రికవుల ప్రయోగములు లేవని స్పష్టీకరించెను. కాని కస్తూరిరంగకవి భారతము నుండి క్రింది నాలుగు లక్ష్యముల నుదాహరించెను.

పీవుసు దల్లులు బంధుజనావళి పురజనులు హస్తినా
పురమునకున్—అశ్వమేధ
ను, గ్గ్రుధిరమ్ములో మునుఁగఁ
గ్రమ్మిన యేనుఁగు పిండు వక్షముల్—ద్రోణ
నూనె మనంబునను దలఁచు చుండుదు నేనున్—ఆది
విను, లమతీ నీ కొడుకునట్లు లయురంగనగున్—ఉద్యోగ

కూచిమంచి తిమ్మకవియు కస్తూరిరంగకవియు నప్ప కవికి పరమందున్నవారు. అప్పకవి తనకు పూర్వుఁడగు లింగమ గుంట తిమ్మన వ్రాసిన లక్ష్యముల నప్రశస్తములని దూషించి పురాతనకవి ప్రోక్తములగు సాధుపాఠములను వివరించినాఁడు. అప్పకవి ప్రక్షిప్తములన్న పాఠములనే తిమ్మకవియు, రంగ కవియు నుదాహరించిరి. వీరిలో నెవ్వరు విశ్వాసపాత్రులో నిర్ణ యించుటకు మార్గమున్నదా?

'రాజవే, మన్నఁగొఱంతలేదు మణిహారము లాదిగాఁ బెక్కు కానుకల్'—భాస్కర—ఇది అప్పకవి పాఠము. ఈ పాఠము సర్వ లక్షణసారసంగ్రహానందరంగరాట్ఛందములందు నిరాకృతము. అట్లే 'చూనె మనంబునఁ దలంతు నుందరి యెపుడున్' 'అ,మల మతీ కన్నకొడుకు లట్లరయఁ జనున్' అను నప్పకవి సంస్కృత లక్ష్యములను రంగకవి ఆనాదరించినాఁడని స్పష్టము.

అప్పకవియే చౌదరిగారికి ప్రమాణముగుచో నఖండయతి కవిత్రయ ప్రయోగసమ్మతమని నిరూపించుట సులభమని నా ప్రతిపాదనము. ఈ క్రింది రెండుదాహరణములను తిలకిం పుఁడు.

వీరలు దైవశక్తి ప్రభవించిరఁ వారను టేమి సందియం
బీరమణీయ కాంతినుపమింపఁగ నేల్పులెకాక—ఆది. 5 ఆ.

పాండవులనఁ గీడొక్కొండును, లేదధిప వీడుకొడుకులు ధరణీ శ్రీ—1—83. (సర్వ లక్షణసార సంగ్రహోదాహృతము పు 179)

అప్పకవి భిన్నయతి కీ క్రింది విధమున లక్షణ నిర్వచ నము కావించి లక్ష్యములను ప్రదర్శించెను.

గుడుసు పైక్రియ నడుమ నా గుడుసు వచ్చి
భిన్నయతియగు రానిచోఁ బెఱయతియగు
నెదను లచ్చిని హరి ధరియించె ననఁగ
రిపుల నెల్లను బోరహరించెననఁగ— 3—81

'గురు విరహితంబులయి యయాంతంబులయిన నేక స్వరద్విస్వరంబుల యించుగ్వ్రకంబుల' కియుడాగమంబు విభాష నగు (బా. వ్యా. క్రి. ప. 50) ననుసూత్రముచే నియుడాగమము ప్రాప్తించిన స్థలములందు స్వరమునకే విశ్రామము చెల్లు ననియు నీ సూత్రమునందుపదేశింపఁబడిన విధి వైభాషికమగుట టచే నించుగాగమము మాత్రమే ప్రాప్తించిన స్థలములందు వ్యంజనమునకే యతి వేయవలెననియు నప్పకవి ప్రతిపాదనము. అప్పకవి లక్షణలక్ష్యములను దృష్టిలో నిడుకొని భారతము నుండి నేనుదాహరించిన లక్ష్యములలో తొలి దానిని పరిశీ లింపుఁడు.

వీరలు దైవశక్తి ప్రభవించిన—ఇది ప్రాణి విరామోదా హరణము.

సందియం, బీరమణీయ కాంతి నుపమింపఁగ—ఈ పాదమునం దప్పకవి స్వరప్రధానయతి నిర్వచనము ననుసరించి 'ఇ' కారమునకుఁగదా విశ్రమము చెల్లవలెను. విశ్రమస్థానమున నిత్యఘటిత మకారమున్నది. కావున యతిభంగ మనివార్యము. ఇంచుక్కులోని (సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు) 'ఇ' కార మీతని మతమున నిలువఁగదుగాన, ప్రసక్తస్థలమున పూర్ణాను స్వార పూర్వక బ కారమునకు మ కారము చెల్లినదని గ్రహింపక తప్పదు. స్వరమూదిన బ కారమున కనుగుణాక్షరమును కవి గ్రహించుటచే నిది యఖండవిశ్రామమున బిందుయతియని యంగీకర్తవ్యము.

ఏను దియ్యమున నటించిన హరుఁడైన
మరుని కన్నులనన్నఁ దిరుగుననిన—నృసింహపురాణము
2—56

పూర్వోక్త సమన్వయము ఈ లక్ష్యమునకును చెల్లును. సర్వలక్షణసారసంగ్రహోదాహృతమైన శ్రీ పర్వమందలి పద్యమును పరిశీలింతము :

కీడొ, క్కొండునులే దధిప నీదు కొడుకులు ధరణీ

ఏకార్థకశబ్దమునకు మహదమహదర్థములలో 'ఒకొండు' ప్రథమైక వచనరూపమని బాలవ్యాకరణమున సూరిగారి నిర్దేశము. ఇది యఖండ పదమని భావము. అప్పకవి ఈ యాశయము నంగీకరింపఁడు.

అని మది నిశ్చయించి తగనందఱిఁ బిల్వఁగఁబంచి వారితో
నవిచిన మాటలాడి వినయంబునఁ బ్రార్థనచేసి మీరు మా
కొనరిన సైన్యముల్పదునొకొంటికిఁ బ్రాభవ మాచరింపఁ జొ
చ్చిన సకలంబునొప్ప నభిషేకము గైకొనుఁ డుత్సవంబునన్.
ఉద్యోగ 4—140

దీని మూఁడవ పాదంబునందు 'పదునొకొంటికి'నని యున్నచోట సంధిఁగూర్చి స్వరప్రధానవడిగాను సోమయాజులు ప్రయోగించినారు. ఇది తెలియక కొందరు మూర్ఖులు దేశ్య నిత్య సమాస పడియని యనుకొందురు—
(అప్పకవీయము 3—211, 212)

పై పంక్తులచే 'ఒక్కొండు' 'ఒకొండు' అను స్థలములందు 'ఒక+ఒండు' అను ఛేదమప్పకవి కభిమతమని స్పష్టము. పై యుదాహరణమునం దీ ఛేదమును ప్రవర్తింప జేసినచో ప్రాణి విశ్రామము చెల్లనేరదు. ఛేదము నప్పకవి త్యజించిన పక్షమునఁ దానుదాహరించిన లక్ష్యమం దఖండ విరామము సిద్ధము. ఈ చర్చకేమి? ముద్రిత గ్రంథములఁ గాన వచ్చు క్రింది రెం డుదాహరణములను దిలకింపుఁడు:

'మంథనక్రియా, తంత్రము నాచరించి వసుధామర
ముఖ్యులు నీతి హోత్రునా'—కాశీఖండము 5—304

నీవ కడునేర్పుకాఁడవు,
గావలవదు నీవింగొన్ని గణించితిమేమున్,
నీ విద్యలెల్లఁ జూపుదు,
మీవీరులు సూచి మేలు మేలనిపొగడన్— ఆది —633.

పై పద్యము క్రీడి తన యస్త్ర విద్యాకౌశలమును ప్రదర్శించిన పిమ్మట కర్ణుఁడు నిజ విద్యాకౌశలమును ప్రదర్శింప నడుకట్టి రంగమధ్యమున నిలిచి యాతని నాక్షేపించు ఘట్టమందలిది. వ్రాతప్రతిలో నాల్గవపాదము పై విధముగా నున్నదని పరిష్కర్తలు సూచించి 'చూపుదు, మే వారలు సూచి మేలు మేలని పొగడన్' అను సంస్కృత పాఠమును పద్యములో నిలిపిరి. ఏ పాఠము సరసమో విజ్ఞులు గ్రహింపఁగలరు.

చౌదరిగారు తమ కప్పకవి నిరాకరించుటచే సమ్మతము లుగాఁ దోఁచని యుదాహరణములతోపాటు క్రింది దానినిగూడ యతిచ్యుతికి లక్ష్యము గావించుట వింత.

మెడ మలుపు నోర చూపుల నిలచి చూచి

డకార లకారములకు ప్రాసయతి చెల్లదని వీరి భావమా? ఇది యచ్ఛేద విరతి. అప్పకవి లక్షణమును గాంచుఁడు.

పెద్ద లాకుమ దనకు నచ్ఛేద మగుట
అళలకు నచ్ఛేద మట్లన కలుగుకతన
క్షితిని మూఁడవ వరళంబు యతులఁ బ్రాస
ములను లఘ్వలఘు లకారములకు నిలుచు 3—93.

వీరు యతిచ్యుతికి లక్ష్యములుగాఁ బ్రదర్శించిన క్రింది యుదాహరణములును నిరాకరణీయములు.

మా యెడంద, లాచి కొన్నని యరితమిస్రాపతంగ

అఖండయతి లాక్షణిక సమ్మతమని ప్రతిపాదితము. రకార లకారములకు యతి మైత్రి కస్తూరిరంగ కవిచే నంగీకృతము.

క్షుభితుండగు వృషసేనుఁడు,
రభసంబున నతని శరములనుగడు నొంచెన్—భార—ద్రోణ

లోకుల్మెచ్చ ప్రతంబు నాతలఁపు తీరున్—
కాళహస్తీశ్వరశతకము (ఆనంద రంగరాట్ఛందము పు 107, 108)

వసుచరిత్రకారునికీ యతి సమ్మతమనుటను వ్యాకరణ మార్మికులెఱుఁగుదురు. (రోలంబాలక యోరు ప్రగుంకి బినవల్లి ల్యన్మి తూటాడి—3—162. తక్కిన లక్ష్యములలో 38 43 44 54 59 62 65 68 69 70 74 యతి చ్యుతి అంగీకార్యము.

## 3. చ్యుతసంస్కార దోష నిరసనము :

రామాయణ కల్పవృక్ష రచనము వ్యాకరణ సంస్కారహీనమనుట కసంఖ్యాకముగా చౌదరిగారు లక్ష్యములనుదాహరించిరి. వానిలో పెక్కు దోషభాసములని సులభముగా నిరూపింప వచ్చును. పాఠకసౌకర్యార్థము వారవలంబించిన క్రమమునువీడి లక్ష్యములను కొన్నివర్గములుగా నేర్పఱిచి వాని సాధుత్వమును ప్రమాణ పురస్సరముగా నివేదింతును.

(1) అందుకు, ఎందుకు, ముందుకు, వెల్గకు, ఎందుకు, కస్తూరిబొట్టుకు, సురరాజుకు, పెండ్లికూఁతుకు, క్రోతిరాజుకు.

'కువర్ణకంబు పరంబగునపు డుకార ఋకారంబులకు నగాగమంబగు' అను సూరిగారి యను శాసనమును కల్పవృక్ష కర్త అతిక్రమించినాడని విమర్శకుల ఆక్షేపము. ఈ సూత్రమును ప్రౌఢవ్యాకర్త 'కువర్ణకంబు పరంబగునపుడు కవిత్రయంబు వారి ప్రయోగంబులం దక్కఁడక్కఁడ మహాకవి ప్రయోగములందునుం గొన్ని యెడల నగాగమంబు చూపట్ట'దని సవరించెను. అతఁడుదాహరించిన లక్ష్యములను గ్రింద ప్రదర్శించు చున్నాను.

సంగరంబునిన సుత్సవము కేఁగెడు క్రియ
పిలవక చనియెదు తూరులార!—ఉ. హరి 6—140
లాలనఁ గ్రొత్త బెబ్బులి కళానము వెట్టెరి యాసనంబుగా
గోలయు సాధువైన యొక కోమటికిన్ విషఘేంద్రు
బచ్చుకున్—నైష 6—115

రెండు వేల జివ్వా లండజాధీశ్వరు
కొనఁగఁ బోలుబంక జోడ్పువుండు—విక్ర 4—16
బలవంతపుఁ బాపము దెచ్చుకొంటివే, లా పగుబాటుకోర్చి
భోజ 5—95.

లలి తృతీయాదులగు విభక్తులకు నెల్ల
గలుగు మధ్యనకారంబు దొలఁగుచుండు
రాముచే రాముకొరకు శ్రీరాముకంటె
రాముకును రామునక్షిదన రాజభూష—వు 80

యను పద్యముచే తిమ్మకవియు నగాగమపాక్షికతను సమ్మతించెను. ఇంత యేల? 'కవిన పదంబుఁ ద్రివ్వఁ గ జగత్పతి పద్మజుకైనఁ బాడియే' (నృసింహపురాణము—2—28) యని శంభుదాసుడు నగాగమ విరహిత రూపమును ప్రయోగించెను. ఈ ఆక్షేపము దుర్బలమనుట కింతకంటె ప్రమాణము లేమి కావలెను? ఈ శ్రేణిలో చౌదరిగారు 'అందుకు, ఎందుకు, ముందుకు, (శిర్షిక 'చ' సంఖ్య 34) అనువాని నుదాహరించుట మాత్రము వింతగా నున్నది. ఈ పదములకును 'కు' వర్ణ పరకత్వమున నగాగమమువచ్చి 'అందునకు—ఎందునకు, ముందునకు' అను రూపములు నిష్పన్నములగునని వీరి అభిప్రాయముగా నోవును. ఇట్టి రూపములు తెలుగులో నెన్నఁడేనికలవా? ఈ మూఁడిటిలోఁ దొలి రెండును ద్రుతాంతములగు నవ్యయములు. (చూ. శ.ర.నూ. ని). 'త్రిషులింగేషు సర్వాసుచ విభక్తిషు వచనేషుచ యన్నవ్యేతి తదవ్యయమ్'అని అవ్యయనిర్వచనము. కావున వీనికి విభక్తి ప్రత్యయములు చేరుట కవకాశమేలేదు. కు వర్ణ పరకత్వమేలేని యెడ నగాగమ ప్రాప్తి కవకాశమేది? ఈ ఆక్షేపమునకు శ్రీ గిడుగు వెంకటరామమూర్తిపంతులుగారి సమాధానమును వారి 'ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజము' పేరాలు 118—121 లలో చూడవచ్చును. న గాగమ ఘటిత రూపములు సిద్ధింపక పోయినను, కల్పవృక్షకర్త ప్రయోగించిన 'అందుకు, ఎందుకు, ముందుకు' అను రూపములు సాధువులనుటకు ప్రమాణములను ప్రదర్శింపవలెను.

అందు, ఎందు అను పదములను గూర్చి నూ. ని ఏమనుచున్నదో తిలకింపుఁడు.

"అందు—ద్రుతాంతమగు నవ్యయము—మొదట ఇది కళగానుండి 'ఆ చోటు' అను నర్థమిచ్చి యుండును. పిదప దానికి సప్తమ్యర్థకద్వితీయావిభక్తిప్రత్యయమగు 'ను' చేర్పఁగా 'అందును' ఆయి 'ఆ చోటును' అను నర్థ మిచ్చి క్రమముగా అధికరణప్రత్యయవిశిష్టతద్భబ్దార్థకమయి 'దానిలో', వానిలో', వారిలో', దానియందు' మొదలగు అర్థములు తెలిపి, తర్వాత కేవల సప్తమీ విభక్తి ప్రత్యయముగా మాఱియుండును. ఈ యర్థములందే భట్టారకుని ప్రయోగములు కానవచ్చుచున్నవి. తర్వాతి కవుల ప్రయోగములలో కళయై కొన్ని ఇతర విభక్తులతో గలిసి కేవల తచ్ఛబ్దార్థకమైనది. తచ్ఛబ్దార్థకము అది, అవి, వాడు, ఆమె మొదలగు వానిని తెలుపును. ఇది సర్వనామమువలె విభక్తిప్రత్యయములను చెందుటయు ఇతర పదములతో సమసించుటయుఁ గూడఁ గలదు.

కర్మం, బున కొరనుఁడందులోన ముఖ్యండరయన్
—భార. అను 2—255.

అందు కప్పెరువూన—చంద్రాంగద చరిత్రము 3—6

ఎందు—అవ్య.ద్రు—దీనికి కొన్ని విభక్తులు చేరుటయుఁ గలదని నూ.ని.లో అంగీకృతమై లక్ష్యములు ప్రదర్శింపఁబడినవి. ప్రయోగ బాహుళ్యము నపేక్షించువారు బాలకవి శరణ్యము పు 86—88 చూడవచ్చును.

(2) మిధిలేశులొద్ద (మిధిలేశులయొద్ద) విదేహులిండ్ల (విదేహుల యిండ్ల) రఘువులిండ్ల, తాతలిండ్ల

అత్తునకు సంధి బహుళముగానగు నను సూత్రమునకిచ్చిన యుదాహృతులలోసూరిగారు పుట్టిన+ఇల్లు=పుట్టినిల్లు,పుట్టిన యిల్లు—అని కర్మధారయ సమాసమును మాత్రమే ఉదాహరించుటచే షష్ఠీ సమాన స్థలములలో నత్తునకు సంధి కాదని విమర్శకుల ఆశయమా? 'ఏనా లవర్ణం నోసంధి ర్మిశ్ర తత్సమయోర్నకి' అని అధర్వణుఁడు. మిశ్రసమాసమునందును తత్సమ శబ్దములసమాసమునందును షష్ఠ్యర్థక ద్వితీయారూపద్రుతము లోపించినదై యుండగా మిగిలిన అకారములలో 'ఽ' అనునది తప్పఁ దక్కిన 'అ' కారమునకు సంధికాదని నియమము. కూచిమంచి తిమ్మకవి సంధి పరిచ్ఛేద ప్రారంభమున 'అ' కారమునకు సంధి వైకల్పికమనుటకు 'మగువ లిండ్లు' లక్ష్యముగా ప్రదర్శించి, 'కప్పడాల్ గట్టుకొను మునిముచ్చులెల్ల తామరసనేత్రలిండ్ల బందాలు గారె' (మను చరిత్రము 2—73) ను ప్రమాణముగా నుదాహరించెను.

పాండవ జ్యేష్ఠునకుఁ బ్రీతిఁ బరమయావ
రాజ్యమిచ్చితి కురువృద్ధరాజులొద్ద—భార ఆది 6 వ ఆ
ఉగ్ర మృగంబుల యుదరంబులో నున్న
దానవే నీ తల్లి దండ్రులొద్ద —భార ఆర 2 వ ఆ
(బాల వ్యాకరణ గుప్తార్థ ప్రకాశిక పు 31)

తన చెలులిండ్ల యుందదవత్రావుడు త్రావుమ—పాండురంగ 3—19

ప్రౌఢ వ్యాకర్త 'షష్ఠీ సమాసమందలి విలలమీఁది యుచ్చులకు హల్లు పరంబగుచోఁ గొన్నియెడల లోపంబు గానంబడియెడి' నని మాత్రమే సూత్రించుటచే నచ్చరకత్వమున లోపమురాదని చౌదరిగారు భ్రాంతి పడియుందురు.

(3) పల్లకిబొంగు—'పల్లకీ' శబ్దము దీర్ఘాంతమగు దేశ్యపదమగుటచే 'దీర్ఘాణాంహ్రస్వస్స్యాన్నచదేశ్యపదేష్వైకవర్జేపి' అను సూత్రముచే నిషేధింపఁబడిన దేశ్యశబ్దముల తుది దీర్ఘముయొక్క హ్రస్వత్వమున కీ లక్ష్యము విషయమని విమర్శకుల భ్రాంతి. ఈశబ్దము తద్భవము. కావుననే కవిజనమందన టీకా కారుడు దీనిని 'తద్భవ స్యాపి శబ్దస్య దీర్ఘాంతత్వం క్వచిద్భ

వేఁట్' అను నియమమున కుదాహరణము చేసినాఁడు. (పల్లకీలు ఇత్యాదులు తద్భవ శబ్ద దీర్ఘోదాహరణంబులు—పు 69). శబ్ద రత్నాకరమును, 'పల్లకి' శబ్దమును, వైకృత విశేష్యముగానే నిరూపించెను. కావున 'నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వంబగు' నను సూత్రముచే 'పల్లకి' యను రూపము నిర్వివాదము. దీర్ఘాంతము ప్రయోగ ప్రామాణ్యముచే తద్భవ పదముల కథర్వణునిచే సమ్మతింపఁబడినది.

పల్లకులన్ మహోగ్రమ్ములు భద్రగజంబుల నందలంబులన్—జై. భా. 2 ఆ

పల్లకీలు నం, దలములు వారువంబులును దంతులు నాదిగఁ గల్గు వాహనంబులు డిగి వచ్చి—కళా 2 ఆ (చూ. శ. ర)

(4) కనిపించక, పిచ్చరించఁగా, పంపించను, పల్కరించన్ శపించవలయునే, సహించదని, కదలించరాని, వాంఛించదు, తిలకించన్, ఒరిగించనిదేమి, నిద్రించదు, గోచరించునట్టి, రుచియించదు, పాలించవలె, ఘటించక, వారించదు, ఉడికించన్ లేదు, సవ్వళించక, తలంచన్, మండించ రయా, గుబాళించడా, దాటించవలెన్, తీర్చఁగా వలయున్, త్యజించన్, దుఃఖించనేలను—ఇట్టి షత్వ విరహిత రూపములే కల్పవృక్షకర్త కభిప్రేతములు.

'ప్రేరణింపుము క్కు పరంబగునపుడు షకారంబు చకారంబునకగు; అగమాన్య చ కారంబుల కద్విరుక్తంబులకు ముత్తుపరంబగునపుడు ప, వలగు' అను సూత్రములచే (క్రి 87, 88) షత్వాదేశము నిత్యముగా విధింపఁబడుటచే నీ రూపము లసాధువులని చౌదరిగారి తాత్పర్యము. త్రిలింగ లక్షణ శేషకర్త 'కవిత్రయేతర ప్రయోగంబులం గొన్నియెడల నిప్రత్యయాదులు పరంబు లగు నపుడు పకారం బింముక్కకారంబునకేనిఁ గానబడదు' (క్రి. ప 16) అను విధిచే షత్వాభావమును సమ్మతించెను.

ఎవ్వారినిఁ బోరించని క్షణ మొక్కటియుఁ దరింపఁగ వశమే—కళా 2—4

ఊహించ నొక వాల్గు గడియల సంచారము వలయు —3—59

(ప్రౌ. వ్యా. క్రి. సూ 16)

అపి శబ్దార్థముచే 'అంగన భీతులకెల్ల భీతిఁ దీర్చుము వెనఁ బొమ్ము నమ్ము మనుచుంగదలెన్' కళా 6—14 మొదలగునవి.

కాంచనదీప్తిచేఁ బసిఁడి గట్టు తెలుంగు నగళ్ళ కోట సూచించగ (ప్రభా 5—198)

పరమేష్ఠి నుండి నీ తరముదాఁక విశుద్ధ
తరమైన వంశంబు దలఁచనైతి
తలఁదక్కియున్న యా తల్లిదండ్రులఁ జాలఁ
పరచనై సంతోష పరచనైతి—పాండురంగ3—36

ప్రయోగబాహుళ్యము నపేక్షించువారు బాలకవి శరణ్యము పు 121—127 చూడనగును.

(5) బ్రతికినాను, చేసిపోయినాను, ఎఱిఁగినావా, ఎంచినావో, అరుదెంచినాను, చేసినావు, తెచ్చినాను—ఇత్యాదులను మహద్వాచకములుగా కల్పము చూపినది.

బాలవ్యాకరణ క్రియాపరిచ్ఛేదమందలి సూ. 46 ధాతువులకుసత్వాభిధానమున 'ఉన్న,కలవ'వర్ణకములనుభవద్వాశిత్వక్తవదర్థముల విధించినది. ఈ సూత్రముచే నేర్పడిన ధాతుజ విశేషణములకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దమునుప్రయుక్తమగును. (సమా.సూ 9). అట్టి'వాఁడు, వారు' శబ్దముల మొదట హల్లగు వ కారము క్రియాపరిచ్ఛేదమందలి 117వసూత్రముచే లోపము వైభాషికముగా విధింపఁబడినది. ఈ లోపము ప్రవర్తించిన పిదప 'అత్తునకు సంధి బహుళముగానగు' నను సూత్రములోని బహుళ గ్రహణమున నిత్య సంధి కల్గుటచే 'బ్రతికివాఁడు, చేసివాఁడు' మున్నగు రూపములు సిద్ధించుచున్నవి. ఇట్టి విశేషణములు కారకపరిచ్ఛేదమందలి 33వ సూత్రము చొప్పున 'బ్రతికినాఁడను, చేసివాఁడను' మున్నగు రూపములను పొందును. (ప్రథమాంతంబులగు యుష్మ దస్మ ద్విశేషణంబుల కేకత్వంబున వు—ను లును, బహుత్వంబున రు—ములు సంతాగమంబులు ప్రాయికంబుగనగు. ఈ యాగమంబులు పరంబులగునపు డుత్వంబున కత్వంబగు). డకార లోపమును సాధించుటకు మార్గము కానరామి చౌదరిగారు 'బ్రతికినాను, చేసిపోయినాను' మున్నగురూపముల నసాధువులగా నుదాహరించిరి. ఈ 'డ' కారము లోపించిన రూపములను గూర్చి కళాప్రపూర్ణ వర్ణించిన సీతా రామస్వామిశాస్త్రిగారేమనుచున్నారో చూడుఁడు.

"నన్నయ 'వండుచున్నవాఁడను' అనువకారము లోపము లేని రూపములనే యుపయోగించెను. తర్వాతి తిక్కనాదులు ధారాళముగా వకారము లోపించిన 'వండుచున్వాఁడను' అను దానివంటి రూపములను ప్రయోగించిరి. పిదప 'డ' కారము సైతము లోపించిన రూపములను 'వండుచున్నాను' మున్నగు వానిని గవులు ప్రయోగింపసాగిరి. ప్రాచీనములలో నయితము రంగనాథరామాయణము వంటి సామాన్య కవుల గ్రంథములలో నీ డకార లోపముగల ప్రయోగములు పొడచూపుచున్నవి. కవి పితామహుఁడు, రామరాజభూషణుఁడు మున్నగువారు సైతము లుప్త డకారక రూపములను బ్రయోగింపలేదు. ధూర్జటి 'ఒనరించినాను' అని (కాళ 3—218) ప్రయోగించెను. అది మొదలు నీ రూపములు విస్తరించినవి. 'రక్షించినాను' మున్నగు రూపము లర్వాచీన కవులచేఁ బ్రయోగింపఁబడినవగుటంజేసి (చంరింపకిట్టు సాహసకృత్యంబు చేసినావుగాన—నిరంకుశోపాఖ్యానము—4—44; అవితరవాములూరు జనవాంతరవాసముజెందినావు—ఉత్తరరామాయణము— పు 317) నేఁడు వానిని సాధువులుగ నంగీకరించుట తప్పుగాదు"—

ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము—సంపు 805

(6) ముడుచుక, పట్టుక, త్రవ్వుక, దూముక, దిగ్గపట్టుక, వైచుక, కుంచుక, తోలుక, చాముక, తప్పించుక

'చేసికొని, చదువుకొని ఇత్యాది క్త్వ్యంతంబులకు బదులుగా 'చేసుక, చదువుక ఇత్యాది క్త్వ్యప్రత్యయాంతసంగ్రహ రూపంబు లనంతామాత్యతిమ్మకవ్యప్పకవ్యాది లాక్షణికులచే దమ గ్రంథములయందు వాడంబడినవి. ఈ రూపంబు సూత్రంబున (బా. వ్యా. క్రి.సూ. 52, 53) నిరూపింపబడలేద'ని శ్రీ కల్లూరి వేంకటరాయశాస్త్రులవారు.

(బా. గు. ప్ర. పు. 345)

అరద మెక్కుక పూని పురికి వచ్చినవాని—అప్పకవీయము 4—313

దిక్కుడుంగముల్, చించుక పారవార్చుచు

—కా. మా-2—26

కరతల యుగళి వక్త్రములు గప్పుక విన్న

వంబుల కొలకు దిక్పతులు సేర —కా. మా 2-4

గరళంబెత్తుక క్రోలఁగాఁ దలఁచితే కష్టాత్మ—భాస్కర ఆరణ్య

ఊదుక పోవు శంఖమునహా గళరేఖ—విజయవిలాసము 1—34

(బా. గు. ప్ర. చూ పు 346—47)

(7) చేతును, ఏమిసేతువో, పాయంగఁజేతు, వద్దన జేతురు, అర్పణచేతు.

క్రి. వ. 108 వ సూత్రముచే యాంతధాతువులకు 'చు' వర్ణము లేమి 22 వ సూత్రమువచే దుక్కు ప్రాప్తించినను తకారము వచ్చుట కవకాశములేదు. కావున 'చేయుదుము, చేయుదురు' మున్నగు రూపములే సూరిగారికి సమ్మతములు. వారు 'చేతురు, కొతురిత్యాదులు సాధువు'లనియు కంఠోక్తిగా నుడివిరి. కవిబ్రహ్మ కవితయందు తా దేశ ప్రయోగము కన్పట్టినదని బా.గు. ప్ర.కర్తలు. 'ఆకులతం బొందెదు నప్పుడు మంటపము సంక్షోభింపగా జేతు' (విరా 2—281). 'లేతు, ఏతు' అను పాఠము లిట స్వీకార్యములని సీతారామస్వామిశాస్త్రులవారి ప్రతిపాదనము. ఈ తా దేశ ప్రయోగములు కవి సమ్మతములనుటకు బాలకవి శరణ్యము 72—81 పుటల నుండి గ్రహింపనగును.

(8) అయిపోతిని, రాకపోతిని (ఒకటికాదు వందల తరబడి) 'పోవు', ధాతువుకు 'పోయితిని' అనునది భూతకాలమునం దుత్తమ పురుషైక వచన రూపము. ధాతువు కడ్రవాయికి నిత్యరకత్వమున ప్రాప్తించిన యు కారమునకు లోపము ఘటిల్లుట కవకాశము లేదు. (అగు, పోవుట కడ్రవాలకి ద్వ్రికంబులు పరంబులగునపుడు యకారంబగు—క్రి. వ. సూ 99). సర్వలక్షణ సార సంగ్రహమునం దుదాహరింపబడిన బిందుయుతి లక్ష్యమగు క్రింది పద్యమును గాంచుఁడు.

'కడు దడవు నిద్రబోతిం,
బడఁతీ నను దెలుపవలదె మఱియొక్కరుఁడె
క్కుడు జవమునఁ బట్టె బలిం
బెడలఁగ నను దిగిచె నాతఁ డెవ్వఁడు చెపుమా' పు. 133

ఈ పద్యము భారతారణ్య పర్వమందలిది. ఈ లక్ష్యమున 'పోతిన్' అను రూపము మార్పరాక యున్నది. ఈ ప్రయోగ మాధారముగా కల్పవృక్షకర్త ప్రయోగములు సాధువులని ప్రతిపాదనము. లేదా 'అన బాభ్రవ్యుఁడు నిట్లు లప్పుదన నాహో కూటిమాత్రంబునన్, మనమే యుమ్మడు పోతిమో యితనికిన్' (వరాహ 10—37) ప్రమాణముగా గ్రహించునది.

(9) పాదుకమ్మ (292) పాదుకా—ఆ, స్త్రీలింగము

ఆకారాంత స్త్రీలింగముగు 'పాదుకా' శబ్దమునకు 'నామముల తుదిదీర్ఘంబునకు హ్రస్వంబగు (తత్స 53). 'స్త్రీ లింగంబుల ప్రథమైకవచనంబున లోపంబునగు' (తత్స 57) అను సూత్రములచే 'పాదుక' అను రూప మేర్పడును. మువర్ణక ప్రాప్తి కవకాశములేదని చౌదరిగారి భావము. సూరిగా రేమను చున్నారో చూడుఁడు.

'కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగానగు

కంధరము—కంధర విధా శబ్దమునకుఁ గ్లీబతుల్యత్వంబు విత్యంబు—విధము కంధరా నాసికా భిక్షా దంష్ట్రాగ్రీవా పాదుకోల్కా ప్రభృతులు కంధరాదులు' —తత్స సూ 66

10 అందియాయు—అందీయు యనుటకు

అందిచ్చు, అందియిచ్చు అను రెండు రూపములను సూ. ని స్వీకరించినది. అందియిచ్చు అను రూపము స్వీకార్యమనుటకు క్రింది ప్రమాణములు ప్రదర్శింపబడినవి.

ప్రీతిఁ బేర్వేరఁ బిలిచి చేసేత సోమ
మమ్మహాయోగి యంది యీ నెమ్మిఁ బాన
మాచరించి సహస్ర నేత్రాదులైన
యమరులానందమునఁ దేలి రధిపముఖ్య.

—అశ్వమేధ 1—103

గోపిక లందియా బసిఁడి కోర సుదార సుగంధి శీధు వి
చ్ఛాపరిపూర్తిగా గొని—హరివంశము ఉత్తరభాగము 2—81

అందునను దినము సంయమి
నందనులేతెంచి వేడినం దరువుల మీ
దం దిరుగుచునుండి సమి
త్పందోహములంది యిచ్చు శాఖా మృగముల్

—వరాహ 4—91

(11) పశిష్మల్ సేవకు (పశిష్మల సేవకు)

షష్ఠీ సమాసమందలి విలల మీఁది యుచ్చులకు హల్లు పరంబగుచోఁ గొన్నియెడల లోపంబు గానంబడియెడి

ప్రీతిన్ సూరెల నశ్వినీసుతులురాఁ బెంపొందు నింద్రు న్వలెన్—ఉత్తర రామాయణము 2—33

తూలెరజనీచరభాస్కరబింబము ప్రబుదుల్—రామాభ్యుదయము 5—75

అజ్ఞానసాండముల్ పెంపు—చంద్రాంగదచరిత్ర 1—187

ప్రౌ. వ్యా—సం. వ 17 సూ.

పశిష్మశబ్దమునకుఁ బూజ్యతయందు బహుత్వము వివక్షితమగుటచే 'బహుత్వంబున ద్వితీయాదివిభక్త్యులకు లడాగమం బగు' (బా. వ్యా. తత్స సూ 31) అను సూత్రముచే శేష షష్ఠీ పరకత్వమున లడాగమ ప్రాప్తియు హల్పరకత్వమున దాని యందలి ప్రాస్వీకారమునకు ప్రౌఢ వ్యాకరణ మందలి యుదాహరింపబడిన సూత్రముచే లోపము వచ్చుటయు సమంజసములు.

(12) పదిక్రోసులు—క్రోశము వికృతి కోసుగాని 'క్రోసు' గాదు.

క్రోసు—కోసు. వి (సం. క్రోశః) క్రోశము

రేఫఘటిత రూపమును సూ. ని. స్వీకరించినది.

అపుడు వారాణసీక్షేత్ర మైదుక్రోసు

లంత మేర యుపద్రవం బందకుండు—

కాశీఖండము 2—51 (సూ. ని.)

(13) తల్లక్రిందు—అయోధ్య217—తల + క్రిందు అధోముఖము. తల్లక్రిందని వ్యవహారమున్నను ఒక్క పానందో పాఖ్యానకర్త మాత్రమే వాడియుండెను. నేటికీ కల్పకము వాడినది.

శ. ర, సూ. ని. ద్విరుక్త లకార ఘటితరూపమును గ్రహించినవి. తల్లక్రిందు. దే. విణ. తలక్రిందుయొక్క రూపాంతరము.

విటలాటనములుగా విఱిగి చక్రములతోఁ

దల్లక్రిందైన రథవ్రజములు—జై. 2 వ ఆ

(చూ. శ. ర)

ఈ పద్యమును సూ. ని. 'తలక్రిందులైన రథ వ్రజములు' అను పాఠముతో ప్రదర్శించినది. సూ. ని. పానందోపాఖ్యాన కర్తృ ప్రయోగమును మాత్రమే ఉదాహరించుటచే వాఙ్మయమున ప్రయోగాంతరము కానరాదనఁ జెల్లునా?

(14) మీ గడప, గడప—ఈ పదము క కారాది యని చౌదరిగారు·

సూ. ని. రెండు రూపములను సమ్మతించినది.

గడప—కడప వి. దేహళి, ద్వారముయొక్క క్రింది కమ్మి

(వా. చి. వి., శ. ర.)

గడప యన దేహళిసంజ్ఞ నడరునభవ

ఆం. భా. 2—17 (చూ. సూ. ని.)

(15) కండ్లున్న పుణ్యాకారంబు, కండ్లార, కండ్ల కద్దుచు

—బాల 335

నేత్రార్థకమగు 'కన్ను' శబ్దమునకు 'కండ్లు' అను బహువచన రూపమును సాధించుట కవకాశములేదు. అది హేతువుగా 'ఏవేల్పు తలపంగనిన చంద్రులను బండి కండ్లుగాఁ గండ్లుగా ఘనతజేసె' (భల్లాణ చరిత్రము ఆ1) అను ప్రయోగ మాధారముగా శ. ర. కర్తచే 'కల్లు' శబ్దమునకు నేత్రార్థకత వివక్షితము.

కదుపడిఁ దా నొకొక్కయెడఁ గండ్లోఁ జేయుచు రాజసౌఖ్యముల్—

కవిజన చకోరచంద్రోదయము—4—17

అంజనమును కండ్లఁదీర్చె— రాజశేఖరచరిత్రము3—26

వీని నాధారపఱచుకొని అర్వాచీనులు 'కల్లు' శబ్దమునకు ప్రసిద్ధమై యున్న 'బండికన్ను' అను నర్థమునుబట్టి దానిని నేత్రార్థకముగా ప్రయోగించినారనవలెను. అప్పుడు 'ఔపవిభక్తికంబుల లి వర్ణ నలలు వర్ణంబులకు బహువచనంబు పరంబగునపుడు పూర్ణబిందు పూర్వక డు వర్ణంబు బహుళంబుగానగు (అచ్ఛి, సూ 16) అను విధిచే'కండ్లు' అని బహు వచనమున రూప మేర్పడుట నిర్వివాదము.

(16) సభికులు—సభ్యులన్న భావములో ఈ శబ్దము సభ్యమైనదిగాదు.

సభికుడు—సం. వి. అ పుం· 1. సభయందుండు ధర్మజ్ఞుడు, 2·జూదమాడించువాడు 3. న్యాయవాది (చూ. శు. ర)

ఈ సభికుల్ గనుంగొనఁగ నిట్లుయితిస్ వగ నాకు వింతయే

విరాట 2—76

అదియుఁ దాఁ గాంచి సభికు లాహ్లాదమంద—

కా. మా 2—11

కొలువుండి యక్కుమారల

బిలిపించి సమీప భూమిఁ బ్రీతి వసింపన్

పిలిచిచ్చినఁ బ్రతిబింబ యు

గళమువ్వలె నున్న వారి గనుకొని సభికుల్.

—ఉత్తర రామాయణము

ఈ శబ్దమును సభ్యులను భావములో నాంధ్రమహాకవులు వాడిరను విషయమును గూర్చిన విపుల విచారము 'ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజము' పేరాలు 89—101 లలో చూడవగును. (సశేషము)

# తీర్థయాత్ర

'హవిస్'

సూర్యోదయం అవుతున్నది.

ఆరోజు కార్తీక పున్నమి. నదీ స్నానమూ, వీలైతే సముద్ర స్నానమూ, ఆరోజు శుభప్రదమూ, మంగళదాయకమూ అయినవి. అందువల్లనే అందరు ప్రజలు ఆ నదీ తీరానికి వచ్చేశారు. సూర్యునిదిక్కు మొగమై, చాతనయిన వాళ్ళు స్వంతంగానూ, తదితరులు పురోహితుల ద్వారానూ మంత్రాలు చదువుతూ, చదివిస్తూ తర్పణాలు వొదులుతున్నారు. పొడిబట్టలు, పట్టు బట్టలు వొడ్డున కూచుని ఉన్న బ్రాహ్మణ కుర్రవాడికి వప్పజెప్పి పంచెలు ఎగదోపి నదిలోకి దిగుతున్నారు పురుషులు. ఆ కుర్రవాడికి అవతిదూరంలో కూచునివున్న పండు ముత్తయిదువుకు, మెడలో నగలూ, వెంట తెచ్చుకున్న బట్టలూ యిచ్చి, చీరె వొంటి చుట్టూ చుట్టుకుని నీళ్ళలోకి దిగుతున్నారు స్త్రీలు. అదంతా గమనిస్తూ రంగనాథం నదిఒడ్డు దగ్గరకు వొచ్చారు. ఆ బ్రాహ్మణ కుర్రవాడు "పట్టు పంచె యిలా యివ్వండి పంతులుగారూ! వెళ్ళి స్నానం చెయ్యండి" అన్నాడు చెయ్యిజాపి. రంగనాథం నవ్వి వాడిచేతికి పట్టుపంచె యిచ్చి, కట్టుకున్న పంచె ఎగదోపి నీళ్ళలోకి దిగారు. జందెప్పోగులు సరిజేసుకున్నారు. వొడ్డుకు దగ్గరగా ఉన్న నీటిలో జనం క్రిక్కిరిసి ఉన్నారు. ఆయన నీటినీ, మనుషులనూ చేతులతో తొలగించుకొంటూ కాస్త విశ్రాంతిగా ఉన్న ప్రదేశం జేరారు. నడుంలోతు నీళ్ళున్నాయి అక్కడ. "హరహర మహదేవ" అనుకుంటూ వొక్క మునుగు మునిగారు. లేచి వొళ్ళంతా చేతులతో రుద్దుకుంటూ మనసులో "హరేరామ హరేరామ" అనుకుంటూ అవతలా యివతలా చూశారు. ఆయనకు ఎడం ప్రక్కగా నాలు గయిదు గజాల దూరంలో ఇద్దరు యువకులు స్నానాలు చేస్తున్నారు. ఇద్దరూ సుస్ఫురద్రూపులు. నవ్వుకొంటూ వొకళ్ళ మీద వొకళ్ళు నీళ్ళు విసురుకుంటూ స్నానాలు చేస్తున్నారు. ఇంతలో వొకడు రెండవవాడి బుజం చరిచి 'అటు చూడు అటు చూడు" అన్నాడు ఆత్రంగా. ఆ యువకుడు అటు చూశాడు. ఒక అందమయిన పద్దెనిమిదేళ్ళ అమ్మాయి నీళ్ళల్లోకి దిగుతోంది.

"ఎవరో గుర్తు పట్టావా ?" అన్నాడు మొదటివాడు.

"ఉహుఁ" అన్నాడు రెండో అతను.

"రాజారాంగాడి కూతురోయ్! సుభద్ర."

"ఛా!? అయితే ఆ వెంట ఉన్న ముసలామె ?"

"పొన్నలు వార్డెను. ఈవిడగారి కేర్‌టేకరు."

"అంటే ?"

"అంత అమాయకంగా అడుగుతా వేమిటోయ్ ? ఈమధ్య ఈవిడగారు చాలా పెద్ద గ్రంథం నడిపింది. పాపం బద్దలయేవేళకి గుంటూరు ఆసుపత్రి ఆదుకుంది."

"గుడ్‌గాడ్!"

"నా మాటమీద నమ్మకం లేకపోతే సుందరంగాడ్ని అడుగు" అంటూ నీళ్ళలోకి మునిగాడు మొదటతను. రెండో యువకుడు కొన్ని క్షణాలు ఆ యువతి వైపే చూసి "ఎవడో గాని .... స్వర్గం అనుభవించి ఉంటాడు" అన్నాడు. ఇద్దరూ పగలబడి నవ్వుకున్నారు.

'శివశివా' అనుకున్నారు రంగనాథం. ఎంత దిగజారిపోయింది నేటి యువత ? తీర్థయాత్రకని వొచ్చి యువతుల అంగసౌష్ఠవాలూ, వాళ్ళ తాలూకు దిక్కుమాలిన కబుర్లూ చెప్పుకుంటూ ఎంత నేలబారుగా బతుకుతున్నారు ? అసహ్యంతో ఆ యువకుల వంక వొక్కసారి చూసి దూరంగా నడిచారు. సూర్యకిరణాలు లేతగా ప్రసరిస్తున్నాయి. ఆయన మరొక్కసారి మునిగి లేచి వొళ్ళు రుద్దుకోసాగారు. ఆ పరిసరాల్లో ఎక్కడా యువకులు గాని యువతులుగాని లేరు. నలుగు రయిదుగురు నడి వయసు ఆసాములు "హరేరామ హరేరామ" అంటూ స్నానాలు చేస్తున్నారు. రంగనాథంగారి మనసు కుదుటపడింది. భారం తీరినట్లు నిశ్వసించి జంధ్యాన్ని చేతులతో రుద్దుతూ అటూ యిటూ చూశారు. కాస్తంత అవతలగా ఇద్దరు నడి వయసు ఆసాములు స్నానం చేస్తున్నారు. ఇద్దరూ నల్లగా బలిష్ఠంగా ఉన్నారు. కేశాలు అక్కడక్కడా నెరిశాయి. వా రిద్దరూ వొకరి కొకరు తెలిసినవారే అయివుండవొచ్చు వనటానికి నిదర్శనంగా అందులో కాస్త పొట్టిగా ఉన్నాయన రెండో ఆయన్ను పలకరించాడు.

'ఏఁవయింది మొన్న ?" అన్నాడు రెండో ఆయన.

"ఆయేందుకేఁవుంది ?"

"నాలు గయిదు వందల్దాకా వొదిలిందని విన్నాన్లే."

"తప్పేదేవుంది బాబూ! ఆ పాత పంతులు పోయి ఈ నాయుడు వొచ్చాడు.? మన ప్రాణానికి యములాడిలా తయారయాడు. పంతులులో వొక సుగుణం ఉండేది. నాలుగు వందల బేరానికి యాభయి యిస్తాం అంటే సరేనని పూరుకునేవాడు. అంతేనా ? ప్రస్తుతానికి లేదయ్యా తర్వాత సర్దుతా నంటే కూడా చూసీ చూడనట్టు పోయేవాడు. ఈ నాయుడో ? యముడు. కాసులు రాల్తేనే గడప దాటతా

నంటాడు. పైగా నాలుగొందలకీ నూట యాభయి కావా అంటాడు ?"

"నూట యాభయ్యే ?"

"అదేగా చెప్పేది. మొన్న జగ్గయ్యపేట సోమరాజు గారి దాంటో ఆరొంద లొచ్చింది. అప్పటికీ ఎవరికీ తెలియకుండా నేనే స్వయంగా సరుకు యిచ్చొచ్చాను. ఎలా తెలుసుకున్నాడో ? ఆరొందలకీ రెండొందలు పారెయ్యమని కూచున్నాడు."

"ఇచ్చెయ్యలేకపోయావా ?"

"ఇది మరీ బావుంది. ఈయ నొక్కడేనా ఏమిటి మనకి పిస్తాది గురువు ? అవతల రెడ్డెమ్మ కొంత గుంజాతా డయ్యె ! గుమాస్తాలకీ వాళ్లకీ పండగ మామూళ్ళు తగలెయ్యా లయ్యె. ఆయన్నీ అందులోనే రావాలంటావా. ఎక్కడనుంచయినా ఎత్తుకొస్తావా ?"

"ఇయ్యకపోతే .... ఎంత రబస అయిందో అనుభవించావుగా ?"

"అదీ నిజమేలే ! అయినా ప్రాణం పీకుతుంది చూడు."

"అసలు గలాటా ఎలా అయింది ?"

"మామూలే ! రామచంద్రపురం శర్మగారు వంద తులాలు పంపాడు. అది మా యింట్లో పందుగు పెట్టెలో పెట్టాను. ఆ సంగతి పసిగట్టాడు నాయుడు. "నాలుగువంద లిస్తావా ? రిపోర్టు రాయించనా ?" అన్నాడు. ఇచ్చాను."

"బావుంది !"

"నువ్వు అదృష్టవంతుడివయ్యా ! నీ కీ బాధలు లేవు."

"ఏమదృష్టంలే .... కానీ ! వొక్క మునుగు మునుగు."

ఇద్దరూ ఒక్కసారిగా నీళ్లల్లో మునిగారు. రంగనాథం జుగుప్సగా అవతలికి నడిచారు. దొంగ వ్యాపారం చేస్తూ దాని బేరీజులు ఇక్కడా వేసుకునేది ? మనిషి ఎంత అధఃపతితుడై పోయాడు ? పాపవిసర్జనానికి, పుణ్య సంపాదనకు పెద్దలు తీర్థయాత్రలు ఏర్పాటు చేశారు. స్వర్గానికి పోయినా సవతి పోరు తప్పలేదన్నట్లు ఇక్కడి కొచ్చినా ఇదే గొడవా ? బుర్రలోంచి ఆలోచన తొలగించడానికి ఆయన గట్టిగా నాలు గయిదు సార్లు "హరేరామ హరేరామ" అనుకున్నారు. సూర్య కిరణాలు కొంత ముదురుబారాయి. రంగనాథం సంధ్యావందన మంత్రాలు పఠిస్తూ ఆచమానం చేశారు. కొంత అవతలగానే మరో యిద్దరు ఆసామీలు కూడా అదేపని చేస్తున్నారు. ఇద్దరూ 'క్రాప్‌బెల్టు' గాళ్ళు. రంగనాథం గారికి వొక్క క్షణంపాటు వారూ ఏదయినా పాపిష్టి సంభాషణ ప్రారంభిస్తారేమోనన్న భయం కలిగింది. కాని వారు అదేం చెయ్యక సంధ్యావందనంలో నిమగ్నులు కావడంతో కుదుటపడి తమ కార్యక్రమం కొనసాగించారు. పావుగంట సేపటికి సంధ్యావందనం పూర్తయింది. రంగనాథం వెంట తెచ్చుకున్న చెంబులో నీళ్ళు పట్టుకొని మరొక్కసారి సూర్యుడికి నమస్కరించి వొడ్డు కేసి బయలుదేరారు. అప్పటికే సంధ్యావందనం పూర్తిచేసిన ఆ యిద్దరు ఆసామీలు కూడా వొడ్డుకు బయలుదేరుతూ ఆయన్ను చూసి "పారుగూరువారా పంతులు గారూ ?" అంటూ ఆయన పక్కన నడవసాగారు.

"అవునండి ! తాడేపల్లి గ్రామం" అన్నారు రంగనాథం.

"కరిణీకమా ?"

"కాదు బాబూ ! అక్కడ మాకు కొద్దిగా పొలా లున్నాయి. వాటిమీద అజమాయిషీ చేస్తూ అక్కడే ఉన్నాను."

"మంచిపని చేస్తున్నారు. ఈ రోజుల్లో కౌలుదార్ల భరోసా మీద పొలాలు విడిచిపెట్టేనంత బుద్ధితక్కువ లేదు."

"నిజమే గానండి. వ్యవసాయంలో కూడా చాలా కష్టాలు వస్తూ ఉన్నాయి. అందులో ఈమధ్య వర్షాలు సరిలేక పంటచేలు దెబ్బతింటున్నాయా ? కొంత పచ్చగా ఎవడయినా కనబడితే వాడి వెంట ఈ సన్నకారు రైతులంతా వేటకుక్కల్లా పడుతున్నారు. అప్పులు ! అప్పులు ! అవి. ఇస్తే తీర్చేనాథుడుండడు."

"ఏమయినా పట్నవాసులకన్నా మీరే నయం. మా గతులు చూడండి. ఇతను నా బావమరిది. పెళ్లీడుకి దిగిన కూతురుంది. సలక్షణంగా ఉంటుంది. సంబంధాలు దొరకవు. ప్రతి సన్నాసిగాడికీ వేలకువేలు కట్నాలు కావాలి. ఎక్కడ్నుంచి తెస్తాం చెప్పండి ?"

"అయితే పల్లెటూరి వారికి కట్నాల బాధ లుండ వంటారా ?"

"అదికాదు. మీరు నాలుగు రాళ్ళు వెనకేసుకో గలుగుతారు గనక మా అంత ఇబ్బంది పడవలసిన అవసరం ఉండదు మీకు."

"అదేంకాదు లెండి ! అంతా వొక రకంగానే ఉన్నాం."

ముగ్గురూ బ్రాహ్మణ కుర్రవాడి దగ్గర్నుంచి పంచెలు తీసుకుని తడివి తీసి అవి కట్టుకున్నారు. తడి పంచె పిండి బుజాన వేసుకున్నాక రంగనాథంగారు నీళ్ళచెంబు లోంచి రెండణా కాసులు తీసి ఆ కుర్రవాడి కిచ్చారు. అతనవి తీసుకుని పక్కనే ఉన్న పళ్లెంలో వేశాడు. మిగతావా రిద్దరూ చెరో అణా యిచ్చారు. రంగనాథం వారు వొస్తున్నారు కదా అనే తలంపుతో ముందుకు సాగారు. కొంతదూరం పోయాక వెనుదిరిగి చూస్తే వారు కనపడలేదు. రంగనాథం ఓ క్షణం పాటు వారెక్కడన్నా కనపడతారేమో నని చూసి, కనపడకపోగా ముందుకు సాగారు.

నది వొడ్డునుంచి రెండు ఫర్లాంగులు నడిస్తే దేవాలయం వొస్తుంది. ఆ దారంతా బిచ్చగాళ్ళు, రకరకాల వాళ్ళు—గుడ్డలు పరుచుకుని యాత్రికుల్ని దీనంగా అర్థిస్తున్నారు. అందులో కొందరు బలిష్ఠులూ, దృఢకాయులూ కూడా ఉన్నారు. అందరికీ ధర్మం చేసుకుంటూ వొస్తున్న ఆసామీలు అవిటివాళ్లతోపాటు వాళ్ళకీ ధర్మంచేసి "దుండు ముక్కల్లా ఉన్నారు. పనీ పాటా చేసుకోలేరూ ?" అనుకుంటూ కదలిపోతున్నారు. కొందరు పెద్దమనుషులు బిచ్చగాళ్ళు కూచున్న చోటుకి వెనగ్గా ఉన్న పిట్టగోడ మీదికి ఎక్కి

పళ్లు తోముకుంటూ వొచ్చే పోయే స్త్రీలమీద 'కామెంట్స్' విసురుతున్నారు. రంగనాథం 'హరేరామ హరేరామ' అనుకుంటూ బిచ్చగాళ్లకి పైసలు వేస్తూ ఆలయం మెట్లదాకా వొచ్చారు. అక్కడ దాదాపు ఇరవైదాకా పెట్టె దుకాణాలు ఉన్నాయి. అందరూ 'రండి బాబూ' అని గోలగా అరుస్తున్నారు యాత్రికుల్ని. రంగనాథం ఒకక్షణం నిలువబడి అన్ని కొట్లవంకా చూశారు. చివరగా ఉన్న ఒక కొట్లో పదకొండు పన్నెండేళ్ల అమ్మాయి కూచుని కొబ్బరికాయలు అవీ అడిగినవారికి యిస్తున్నది. రంగనాథం ఆ కొట్టువైపు నడిచారు. ఆపిల్ల ఆయన్ని చూడంగానే "ఏం కావాలి బాబూ?' అన్నది వినయంగా. రంగనాథం కావల్సినవి చెప్పారు. ఆపిల్ల అవన్నీ వో బుట్టలో పెట్టి ఆయన చేతికిచ్చి "వెళ్లేటప్పుడు బుట్ట యిచ్చేసి పొండి బాబూ" అన్నది. రంగనాథం తల వూపి బుట్ట చేత్తో పట్టుకుని ఆలయం మెట్లెక్కసాగారు. ఆలయం కొండమీది వుంది. సోపానాలు కూడా చాలా ఉన్నాయి. అన్నింటిమీద ఇరు వయిపులా బిచ్చగాళ్లు కూచుని 'ధర్మం బాబూ' అని అరుస్తున్నారు. మెట్లు కవతలగా కొండ భాగంలో నాలుగయిదు పూరిళ్లున్నాయి. వొక ఇంటిముందు వొక వృద్ధురాలు కూచుని బియ్యంలో రాళ్లు ఏరుతూ "రాముని చరితము" అంటూ కూని రాగాలు తీస్తోంది. కాస్తంత అవతలగా వో మేక కట్టేసి ఉంది. రంగనాథం అంతా గమనిస్తూ భగవధ్యానం చేసుకుంటూ కొండ ఎక్కారు. ఆలయం కోనేటిలో పాదాలు కడుక్కుని ప్రదక్షిణం చేసి దర్శనార్థుల 'క్యూ' లో నిలబడ్డారు. క్యూ చాలా పొడుగ్గానే ఉంది. ఎండ బాగా పైకి వచ్చింది. యాత్రీకుల మీదికి ఎండ రాకుండా ఆలయ ప్రాంగణంలో విశాలంగా పెరిగిన రావి వృక్షం అడ్డుపడుతున్నది. అయినా ఎలాగో దారి చూసుకు వొచ్చిన కిరణాలు చుక్కల్లా, నక్షత్రాల్లా నేలమీద మెరుస్తున్నాయి.

ఆ ఆలయం కట్టి చాల కాలమే అయింది. అయినా చాలా ఆదాయం ఉండటంచేత ప్రాంగణమంతా శోభాయమానంగా నిర్మింపజేశారు. ఆలయ కుడ్యాలమీద చిత్రితమయిన దైవ స్వరూపాలు యాత్రికుల్ని భగవధ్యాన తత్పరుల్ని చేస్తున్నాయి. నేల అంతా తెల్లటి రాళ్లు పరిచి పరిశుభ్రం చేయటానికి అనువుగా చేశారు. ధ్వజస్తంభం పచ్చగా 'తళతళ' మెరుస్తున్నది. లోపలకు వెళ్లే తోవలో గర్భాలయం ప్రాంగణం వరకు మధ్యగా 'దడి' కట్టారు. ఎడమవైపు పురుషులూ, కుడివైపు స్త్రీలూ 'క్యూ' లో నిలబడి అమ్మవారి దర్శనం చేసుకుంటున్నారు. గంటలు ఎడతెరపి లేకుండా మోగుతున్నాయి. ధ్వజస్తంభానికి ఇవతలగా ఉన్న డిబ్బెంలో కానుకలు వేసి 'క్యూ'తో పాటు ముందుకు కదిలారు రంగనాథం. ముందు యింకా పదిమంది దాకా ఉన్నారు. వారి తలలపైనుంచి అమ్మవారి ముఖము కొద్దిగా కనుపిస్తున్నది. కళ్లు మూసుకుని నమస్కారం చేసి ఎవరో తోసినట్లు కాగా కళ్లు తెరిచారు. వెనుక నిల్చున్న యువకుడు "క్షమించండి! అనుకోకుండా తగిలింది" అన్నాడు. రంగనాథం "ఫరవాలేదు లెండి" అని ముందుకు తిరిగారు. మొదట్లో ఉన్న వ్యక్తి శఠగోపం పుచ్చుకొని ప్రసాదం తీసుకుని బయటకు వెళ్లుతున్నాడు.

అతన్ని చూసి తుళ్లిపడ్డారు రంగనాథం.

ఆ క్షణాన అతని కోసం తాను ఎంత వెదికిందీ గుర్తుకొచ్చింది రంగనాథంగారికి. అతని పేరు రాజయ్య సుమారు ఆరు నెలల కిందటిదాకా తాడేపల్లిలోనే ఉండేవాడు అతను. సన్నకారు రైతు. భార్యా, ఇద్దరు పిల్లలూ ఉన్నారు. కష్టపడి వాళ్లని పోషిస్తున్నాడనీ, నీతిమంతుడని, అతనంటే రంగనాథంగారికి ఎంతో ఆపేక్ష ఉండేది. అతనూ రంగనాథంగారంటే ఎంతో గౌరవంతో విధేయతతో ఉండేవాడు. అలాంటివాడు ఉన్నట్లుండి చెప్పా పెట్టాకుండా పెళ్లాం బిడ్డలతో ఆ వూర్నించి మకాం ఎత్తేశాడు. ఆ సంఘటన జరిగిన మర్నాటినుంచీ అతన్ని గురించి రకరకాల మాటలు బయలుదేరాయి. వాటి సారాంశం అతడొక పెద్ద మోసగాడని. అతడు కవులు చేస్తున్న పొలం ఖామందు ప్రసాదరావుగారికి అతడు దాదాపు నాలుగు వేల రూపాయలు బాకీ అట. ఆ మాట వినంగానే రంగనాథంగారి గుండె గుభేలుమన్నది. విత్తనాలకీ వాటికీ డబ్బు లేదనీ, క్రితం ఏడాది పంటలు బాగా పోవటాన రోజు గడవటమే కష్టంగా ఉందనీ మొరపెట్టుకుంటే రూపాయి పావలా వడ్డీకి ఆయన అతడికి మూడు వందల రూపాయలు అప్పు యిచ్చారు. అతడు పారిపోయాడని తెలియడంతో అంత డబ్బుకీ తిలోదకాలేనని ఆయన ఎంతగానో బాధపడ్డారు. అవును మరి! దమ్మిడీ దమ్మిడీ కూడబెట్టుకొని సంపాదించుకున్న డబ్బు! పుణ్యానికి పోతే పాపం ఎదురయిందని సహాయం చేయబోతే మోసం జరిగింది. ఆ తరువాత అతన్నిగురించి చాలా వాకబు చేశారు రంగనాథం. ఎక్కడా జాడ దొరకలేదు. అన్నాళ్లకి యిప్పుడు యిక్కడ దర్శన మిచ్చాడు. "త్రాష్టపు వెధవ అందరికీ దేవుఁ డొకడు దొరికాడు. దగుల్బాజీ పనులు చేసేదీని, గుళ్లోకొచ్చి దణ్ణాలు పెట్టేదని" అనుకున్నా రాయన కసిగా. ఆ కసిలోనే ఆయనకు పట్టుదల కూడా కలిగింది. ఈ వేళ ఏమయినా సరే వాడి అంతు తేల్చాలి. వాటం చూస్తే నాలుగు రాళ్లు సంపాదించినట్లుగానే ఉన్నాడు. నాలుగూ జాడిస్తే వడ్డీ లేకపోతే మానె అసలయినా రాలకపోదు.

అలా అనుకుంటూ 'క్యూ'తో పాటు ముందుకు వొచ్చారు. రంగనాథం. కొబ్బరికాయలూ, పూలూ, పళ్లూ ఉన్న బుట్ట పూజారి చేతికిచ్చి "తొందరగా కానియ్యి బాబూ" అన్నా రాయన. ఆలస్య మయితే మళ్లీ ఆ దౌర్భాగ్యుడు చేయి జారి పోతాడు. పూజారి కొబ్బరికాయలు కొట్టి హారతి పళ్లెం ఆయన ముందు ఉంచాడు. దక్షిణ వేసి కుంకం నొసట పెట్టుకొని బుట్ట అందుకున్నారు రంగనాథం. పూజారి ఆయన కదలబోతూండగా అన్నమాట ఆయన చెవిని పడ లేదు. వడివడిగా బయటకు వొచ్చి నాలుగు వైపులా వెదికారు. రావిచెట్టు అవతల ఉన్న అరుగుమీద అప్పటిదాకా కూచుని ఉన్న రాజయ్య లేచి వెళ్లబోతున్నాడు. ఆయన నడక వేగం హెచ్చించి "రాజయ్యా" అని కేకవేశారు. అంతమంది జనంలో ఆ కేక వినపడలేదో ఏమో రాజయ్య ముందుకు

అడుగు వేశాడు. రంగనాథం మరి కాస్త వేగం హెచ్చించి జనాన్ని తప్పించుకుంటూ మళ్ళీ కేక వేశారు. ఈసారి అతను తిరిగిచూసి తనను కాదన్నట్లుగా ముందుకు నడవసాగాడు. రంగనాథంగారిలో పట్టుదల హెచ్చింది. త్వరత్వరగా నడిచి అతన్ని జేరి బుజంమీద చేయి వేసి "రాజయ్యా" అన్నారు రొప్పుతూ.

అతను వెనక్కు తిరిగి "మీరా పంతులుగారూ ?" అన్నాడు.

"ఇందాకట్నుంచీ గొంతు నెప్పెట్టేలా అరిచాను .... ఏమయిపోయావు యిన్నాళ్లనుంచీ ?" అన్నారు రంగనాథం అతడు తనను గుర్తించి మాట్లాడుతున్నాడు గదా అని స్థిమితపడి.

"ఈ వూళ్ళోనే ఉంటున్నాను" అన్నా డతను.

"ఏం చేస్తున్నావు ?"

"పెద్ద సెంటర్లో కిళ్లీకొట్టు పెట్టాను."

"బాగా సాగుతోందా ?"

"భగవంతుడి దయవల్ల యింతదాకా సక్రమంగానే సాగుతోంది."

రంగనాథం వొక్క క్షణం ఆగి "నా బాకీ మాట ఏంజేశావు ?" అన్నారు మంద్రస్వరంలో.

అతను మాట్లాడలేదు.

ఆయన మరీ కాస్త గట్టిగా "ఏం చేశావు రాజయ్యా నా బాకీ సంగతి ?" అన్నారు.

అతను అర్థం కానట్లుగా "బాకీయా ?" అన్నాడు.

రంగనాథంగారు తెల్లబోయినా తమాయించుకుని "అవును రాజయ్యా ! నువ్వు తీసుకున్న మూడు వందలూను" అన్నారు.

"మూడు వందలా ? నేను తీసుకున్నానా ?!"

"అదేమిటి రాజయ్యా అలా మాట్లాడతావు ? ఆరోజు రాత్రి తొమ్మిది గంటలవేళ వొచ్చి బతిమలాడలేదూ ?"

"ఇది మరీ బావుంది. మిమ్మల్ని నే నెందుకు బతిమలాడతాను ?"

"అబద్ధాలాడకు. బిడ్డా పాపా కలవాడివి."

"అతిగా మాట్లాడకండి. నేను మీకు బాకీ ఉన్నట్టు రుజువేమిటి ?"

నిర్ఘాంతపోయారు రంగనాథం. కళ్లవెంట నీరు తిరిగినంత పనయిం దాయనకి. కాళ్లావేళ్లా పడితే జాలిదలిచి నోటు మరునటిరోజు రాయించవచ్చు గదాని యిచ్చాడు తాను అంత సొమ్ము. ఇప్పు డితడు .... ఆయనలో కసీ బాధా విజృంభించాయి. నవనాడులూ కూడ గట్టుకుని "ఇంత అన్యాయం చేస్తావా ? నా ఉసురు నీకు తగలదూ ?" అన్నారు.

"నోరు సంబాళించుకొని మరీ మాట్లాడండి. మీ ఉసురు నాకు తగల్డమేమిటి ?" అన్నా డతను కోపంగా.

రంగనాథంగారి కోపం కట్లు తెంచుకుంది. "నోరు మూయ్ ! పశువా !" అన్నారు తారస్థాయిలో.

"నువ్వే నోరు మూసుకో ! నోటి కొచ్చినట్టు పేల్తే మర్యాద దక్కదు."

"ఏంచేస్తావురా ? దౌర్భాగ్యుడా"

"ఏమిట్రా కూశావ్ ?"

ఆ పోట్లాట చూసి అప్పటికే గుమికూడిన యాత్రికులు రాజయ్య రంగనాథంగారి మీద చేయి చేసుకోబోవడం చూసి "వూరుకోండి" అన్నారు. ఒక యువకుడు రాజయ్యకు అడ్డంవెళ్లి "వూరుకోండి. పెద్దవాడిమీద దౌర్జన్యం దేనికి ?" అన్నాడు. రాజయ్య బుసలు కొడుతూ "మీరు అడ్డం రాకపోతే వీడి అంతం చూద్దు నివాళ. ఛీ !" అంటూ వెళ్లిపోయాడు అవతలికి. ఆ సన్నివేశం అంతవరకూ వస్తుందని వూహించని రంగనాథం దుఃఖంతో బాధతో "నాకు మూడు వందలు బాకీ బాబూ ? అడిగితే తంతానంటున్నానంటున్నాడు" అన్నారు దీనంగా. ఒకరిద్దరు ఆయన్ని వోదార్చి "ఏంచేస్తారు? అలాంటివాడికి అప్పు యివ్వటం మొదట మీ తప్పు" అంటూ ఆయన్ను అరుగుమీద కూచోబెట్టి వెళ్లిపోయారు. చిత్రం చూస్తున్నట్టు నిలబడిన జనం మెలమెల్లగా వెళ్లిపోసాగారు.

రంగనాథంగారి నయనాలనుండి అశ్రువులు స్రవించాయి. పై పంచెతో కళ్లద్దుకుని బుట్టలో కొబ్బరిచిప్ప అందుకున్నారు. ముక్క కొట్టి నోట్లో పెట్టుకోబోతూ ఎదురుగా నడిచిపోతున్న యువకుల్ని చూసి ఆగారు. వారిద్దరూ యిందాక నదీ స్నానానికి వచ్చినవారే. అందులో ఒకతను "ఈ ముసలాళ్లకి దైవభక్తి వో వంకరా భాయ్ ! ఆలయానికి వొచ్చినా అప్పులాళ్ల గొడవలే" అంటూ నడిచిపోతున్నాడు. అతన్ననుసరిస్తున్న రెండో అతను క్రీగంట రంగనాథంగారి వంక చూసి కిసుక్కున నవ్వాడు.

అంత దుఃఖంలోనూ రంగనాథంగారికి వాళ్లమీద కోపం కలిగింది. తన బాధ వీళ్లకేం తెలుస్తుంది ? అనుకొంటూ కొబ్బరిముక్క నోట్లో పెట్టుకోబోయారు.

కుళ్లిన కొబ్బరి వాసన 'గుప్' మని కొట్టింది ఆయన నాసికకు.

# వ్యాకరణసంహితా సర్వస్వము - దాని పరామర్శము

శ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి

బ్ర. శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రులుగారు తాము రచించిన చింతామణి విషయ పరిశోధనము'నఁ బాణినీయము కావ్యభాషానుశాసకము కా దనిరి. అందులకుఁ బ్రబలాధారము లని తా మనుకొనిన నిదర్శనముల ననేకములఁ బ్రదర్శించిరి. అవి యట్టివి కావని సయుక్తికముగా సప్రమాణముగా నిరూపించుచు నేను భారతియందే చాల వ్యాసముల వెలువరించితిని. శ్రీ శాస్త్రులవారు తరువాతఁ బ్రచురించిన యనుబంధమును గూడఁ బరామర్శించుచు మరల మరల ననేక వ్యాసముల నందే ప్రకటించితిని. 'పాణినీయము—కావ్యవాఙ్మయ' మను పేర వాని నన్నిటిని నొక గ్రంథముగాఁ బ్రచురించితిని. శ్రీ సీతారామస్వామి శాస్త్రులుగారు నా గ్రంథమందలి విషయముల నెల్లఁ జాలవరకుఁ దా మంగీకరించి యందలి యే నాలుగు విషయములనో తమ 'వ్యాకరణ సంహితా సర్వస్వము' న స్పృశించి, వానియందుఁ దమకుఁ గల విప్రతిపత్తిని వెల్లడించిరి. అందు, శ్రీ శాస్త్రులుగారు నా వ్రాతలలోఁ గొన్నిటి నపలపించిరి. మరికొన్నిటి కన్యథా వ్యాఖ్యానము లొనర్చిరి. వేయేల! శ్రీ శాస్త్రులుగారు తమ వాదమును నిలిపికొనుటకు వివిధ ప్రయత్నములఁ దా మొనర్చిరి. ఇందలి సత్యమును లోకమునకు విప్పి చెప్పుటకే నే నీ వ్యాసమును వ్రాయుచున్నాను. ఇకఁ బ్రకృతమున కుపక్రమించెదను.

శ్రీ శాస్త్రులుగారు సంహితా సర్వమునఁ దా మధిక్షేపించిన వ్రాతలను నాలుగు శీర్షకములుగా విభజించిరి. వాని నుదాహరించి క్రమముగా వానికి నే నుత్తరవాది నయ్యెదను.

I. వ్యధికరణ బహువ్రీహి భాష్య సమ్మతము కాదు.

II. శ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి యాక్షేపము సరి కాదు.

III. వీరి మఱికొన్ని యపసిద్ధాన్తములు.

V. వీరి ప్రసంగ మప్రయుక్తతా దోషమునకే నిర్విషయత్వమును ఘటించును. మేకాధీశ శబ్దార్థ శతకోటి.

## I. వ్యధికరణ బహువ్రీహి భాష్యసమ్మతము కాదు
### (మొదటి యాక్షేపము)

శ్రీ శాస్త్రులుగా రీ సందర్భమున వ్రాసిన వ్రాతలఁ గ్రింద నుదాహరించినాను. *ఈ వ్రాతలలోని సారాంశ మిది. "పాణినీయ వ్యాఖ్యాత లందఱు వ్యధికరణ బహువ్రీహి నేకగ్రీవ

---

*పాణినీయుల మతమున వ్యధికరణ బహువ్రీహి సమ్మతము కాదు. "సమానాధికరణానాం బహువ్రీహి ర్వక్తవ్యః, కిం ప్రయోజనమ్? వ్యధికరణానాం మాభూ దితి, పఞ్చభిః మస్యేతి (మహా భా. 2 అ. 2 పా. 2 ఆ. 450 పు).

'సప్తమీ విశేషణే బహువ్రీహౌ' (2.2.35) 'సప్తమ్యన్తం విశేషణం చ బహువ్రీహౌ పూర్వం ప్రయోజ్యమ్' కణ్ఠేకాలః—అతఏవ జ్ఞాపకా ద్వ్యధికరణపదో బహువ్రీహిః— అను దీక్షితులవారి వృత్తి చొప్పున వ్యధికరణబహువ్రీహి పాణినీయసమ్మతమే కాదా! యని శఙ్కింపరాదు. 'సప్తమ్యుపమాన పూర్వపద స్యోత్తరపదలోపశ్చ' సప్తమ్యన్తమ్ ఉపమానంచ యస్య తస్య పదాన్తరేణ సమాసః, ఉత్తరపదలోపశ్చ భవతీత్యర్థః. కణ్ఠేస్థః కాలః యస్య సః కణ్ఠేకాలః, ఉష్ట్రముఖమివ ముఖం యస్య సః—ఉష్ట్రముఖః (2 అ. 2 పా. 2 ఆ, 450 పు. ప్రదీపోద్ద్యోత సహిత మహాభాష్యము; బాల మనోరమా సహిత సి. కౌముది. 'అనేక మన్యపదార్థే' 2.2.24—పుట 530 సూత్రమునొద్ద). ఇక నీ వ్రాతల వివరించుచు విస్తరము I లో శ్రీ శాస్త్రులుగారు నన్ను గురించి యిట్లు వ్రాసిరి. "ఇట్టి స్థితిలో బ్రహ్మశ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు 'మనుమార్గః' అనునది 'ఉష్ట్రముఖః' అనుదానివలె సమానాధికరణ బహువ్రీహి గనే సాధితమైనది. దీనిని శ్రీ శాస్త్రిగారు వ్యధికరణ బహువ్రీహి యనుట ప్రమాదము. వ్యధికరణ బహువ్రీహులు కణ్ఠేకాలాదులు. (పాణినీయము—కావ్యవాఙ్మయము 39 పు.) అని యెట్లు వ్రాయఁగలిగిరో! తెలియకున్నది. 'ఉష్ట్రముఖః' అను దానివలెనే కణ్ఠేస్థః కాలో యస్య సః—అను పదియు సమానాధికరణబహువ్రీహి యనుటలో విరోధ మేమియుఁ గన్పట్టదు. 'సప్తమీ విశేషణే బహువ్రీహౌ' అను పాణిని సూత్రములో సప్తమీగ్రహణమున సప్తమ్యన్తఘటితోపపదసమాసమునకే పూర్వనిపాతము విధింపఁబడె నని గ్రహింపవచ్చును. వ్యధికరణ బహువ్రీహి జ్ఞాపిత మగుచున్న దని వ్యాఖ్యాతలు వ్రాసిరే కాని, మునిత్రయము వారు వచింపలేదు. ఇట్లే 'ప్రహరణార్థేభ్యః పరే నిష్ఠాసప్తమ్యౌ' వార్తి 1425 (వాహితాగ్న్యాదిషు. 2.2.37 అను సి. కౌ. 900 సూత్రము నొద్దది) మున్నగు స్థలము లందును 'దణ్డః పాణిగతః యస్య సః దణ్డపాణిః—అను రీతిని విగ్రహము నంగీకరించి సామానాధికరణ్యమును సంపాదింపనగును. ఇట్టివానిని బట్టి సప్తమ్యంతపదఘటితోపపద

ముగా నంగీకరించినారు. ఈ వ్యాఖ్యాతలే వ్యధికరణ బహువ్రీహి జ్ఞాపిత మగుచున్న దనుచున్నారు. కాని, మునిత్రయమువా రట్లు వచింపలేదు. ప్రథమాన్తములకే బహువ్రీహి యను నది పాణినీయసిద్ధాన్తము. ఇందులకు 'సమానాధికరణానాం బహువ్రీహి ర్వక్తవ్యః, కిం ప్రయోజనమ్, వ్యధికరణానాం మాభూత్ —ఇతి (2. అ. 2 పా. 2 ఆ. 450 పు.) మహాభాష్య మాధారము. కణ్ఠేకాలః—ఇత్యాదులు 'సప్తమ్యుపమానపూర్వ పద స్యోత్తరపదలోపశ్చ' అను వార్తికమున 'కణ్ఠేస్థః కాలః యస్య సః' అను రీతిని సమానాధికరణ బహువ్రీహులే! ఇట్టిచో 'కణ్ఠేకాలః' ఇత్యాదులు వ్యధికరణ బహువ్రీహులు; 'మమ మార్గః' ఇత్యాదులు సమానాధికరణ బహువ్రీహులు— అని పొతుకుచ్చి సుబ్రహ్మణ్య శాస్త్రులుగారు వ్రాయుట వింత. 'సప్తమీ విశేషణే బహువ్రీహౌ' 'ప్రహరణార్థేభ్యః పరే నిష్ఠా సప్తమ్యౌ' అను వానిలోని సప్తమీ శబ్దము సప్తమ్యన్త పదఘటితోపపదసమాసపదపరము. ఇట్లు వ్యాఖ్యాత లర్థము జేసికొనఁ జాలకపొరపడిరి. 'దణ్డపాణిః' ఇత్యాదులు 'దణ్డః పాణిగతః యస్య' అను రీతి విగ్రహ వాక్యములతో సాధింపఁబడ వలసినవి."

శ్రీ శాస్త్రులుగారు పాణినీయ వ్యాఖ్యాత లందఱు వ్యధికరణ బహువ్రీహి నంగీకరించినారని యొప్పికొనినారు. కాని, వా రందఱుఁ బాణినీయమును సరిగా నర్థము చేసికొనక ప్రమాద పడినా రనుచున్నారు. పాఠకులారా! ప్రమాదపడి రని వీ రను

---

సమాసమునకుఁ బరనిపాతము జ్ఞాపిత మగుచున్న దని వ్యాఖ్య చేయవలసి యుండును. ఇట్టి స్థితిలో వ్యధికరణబహువ్రీహి పాణినీయ సమ్మతము కాదని నేను వ్రాయుటలో (విం. వి. ప. 115 పు. 81 వి. వ) నేమి విరోధ మున్నదో తెలియకున్నది. మహాభాష్యకర్త సామానాధికరణ్యమును జూపుచు వివరించిన సప్తమ్యుపమానపూర్వపదస్యోత్తరపదలోపశ్చ .... కణ్ఠే కాలః (మహాభాష్యము 2 అ. 2 పా. 2 ఆ. 450 పుట. ప్రదీపోద్ద్యోత సహిత మహాభాష్య పుస్తకము) అను మహాభాష్య పంక్తులను గొంత మార్చి స్వవాదానుకూలము లనుకొనుచు సుబ్రహ్మణ్య శాస్త్రులుగా రుదాహరించుట వింతగ నున్నది. వ్యధికరణ బహువ్రీహి నంగీకరింప నక్కఱలేకున్నను బాణిన్యాచార్య సూత్రములోని సప్తమీ గ్రహణము వ్యర్థము కావలసి వచ్చు నను భీతిచేతఁ బాణినీయ వ్యాఖ్యాతలు వ్యధికరణ బహువ్రీహిని సైత మంగీకరించిరి. పాణిని సూత్రములోని సప్తమీ శబ్దము సప్తమ్యంతపదఘటితోపపదసమాసపదపరమని వారేల తలపరైరో! తెలియకున్నది. పైరీతిని వ్యధికరణ బహువ్రీహి నంగీకరించు పక్షమునఁ బ్రథమాంతములకే బహువ్రీహి యను తమ సిద్ధాంతమును బాణినీయులు విడుచుకొనవలసినదే! ఇంతమాత్రమే కాదు. వెనుక నుదాహరించిన 'సమానాధికరణానాం బహువ్రీహి ర్వక్తవ్యః, వ్యధికరణానాం మాభూ దితి (2 అ. 2 పా. 2 ఆ. 450 పు. ప్రదీపోద్ద్యోత సహిత మహాభాష్యము)—అను మహాభాష్యసిద్ధాంతమును సయితము విడిచికొనవలసినదే!

చున్న యీ వ్యాఖ్యాత లెవ రని మీ రనుకొనుచున్నారో! యిందో, మహాభాష్యాబ్ధి నంతను నవలోడించి వైయాకరణ సిద్ధాన్తామృతమును విబుధుల కందించిన ప్రదీపకర్త కైయటుఁ డొకఁడు, వైయాకరణ సిద్ధాన్త కౌముదీ కర్తయై వైయాకరణు లందరచే నేఁడు కులపతిగా నాదరింపఁబడు చున్న భట్టోజి దీక్షితుఁడు మఱియొకఁడు! మఞ్జూషాది మహా గ్రంథ కర్తయై మహాభాష్యోద్ద్యోతమునే కాక, శబ్దేన్దు శేఖ రాదుల సైతము రచించి పాణినీయ మహాసౌధమునకు మూల స్తంభముగా నిలిచిన నాగేశ భట్టారకుఁ డింకొకఁడు! ఇఁక నిత రులఁ బేర్కొన నేల? ఇట్టి వ్యాఖ్యాత లందరును దమకుఁ బ్రామాణికులుగా ననుచున్న యీ శాస్త్రులవారే 'త్రిలోక' శబ్దముకడ నా వ్రాసినది కాదనుటకు బాల మనోరమా కర్త యొక మహాప్రామాణికుఁ డని యె ట్లంగీకరించిరో! ముందు విశదపరచెదను. ఇఁక వీరి యభిమతము చొప్పున నేనుగూడ నా వ్యాఖ్యాతల మాట లటుండనిచ్చి, వీరు ప్రామాణికు లని యొప్పికొనిన మునిత్రయమువారే వీరి యీ వాద మంగీ కరింపరని నిరూపించెదను.

'న ము నే' (8.3.3) సూత్ర మహాభాష్యమున ని ట్లున్నది. "ఇహాఙ్గితేన చేష్టితేన నిమిషితేన మహతా వా సూత్ర నిబన్ధనే నాచార్యాణా మభిప్రాయో లక్ష్యతే'—సూత్రకర్త కేవల సూత్ర నిబన్ధనముచేతనే కాక, తన యభిప్రాయ మును జ్ఞాపకాదులచే ననేక విధములుగాఁ గూడఁ దెలుపు చుండు నని పై మహాభాష్యము మనకుఁ దెలుపుచున్నది. పాణి న్యాచార్యుఁడు 'సప్తమీవిశేషణే బహువ్రీహౌ' అను సూత్రములోని సప్తమీ గ్రహణముచే సప్తమ్యన్తమునకు బహువ్రీహి సమాస మునఁ బూర్వనిపాతము విధించి, వ్యధికరణములకును బహువ్రీహి కల దనినాఁడు. "జ్ఞాపకసిద్ధం న సర్వత్ర" అను న్యాయమున నిది సార్వత్రికము గా దనుటకే సూత్రకర్త యీ విషయ మును ముక్తకంఠముగాఁ గాక, జ్ఞాపకసిద్ధముగా మనకు బోధించినాఁడు. శ్రీ శాస్త్రులుగారు పై సూత్రములోని సప్తమీపదమునకు లక్షణాశ్రయమున 'సప్తమ్యన్తపద ఘటితోపపదసమాసపద' మని యర్థము చెప్పెద మను చున్నారు. అట్లయిన, 'కణ్ఠేస్థః కాలః యస్య' అనునప్పుడు 'కాలః' అను దానికి 'కణ్ఠేస్థః' అనునది విశేషణమే యగు చున్నది. 'సప్తమీ విశేషణే బహువ్రీహౌ' అను దానిలోని విశే షణ గ్రహణముచేతనే 'కణ్ఠేస్థః' అను దానికి (విశేషణ మగుటం బట్టియే) పూర్వనిపాతము సిద్ధమైనది. సూత్రములోని సప్తమీ గ్రహణమున కిఁకఁ బ్రయోజన మేమి? లక్షణాద్యాశ్రయణ మునుఁ బడరాని పాట్లు పడి శ్రీ శాస్త్రులుగారు విధించు పూర్వనిపాతము 'కణ్ఠేస్థః' వంటి వానికే కదా! అవి విశేషణ ములే కదా! 'ప్రహరణార్థేభ్యః పరే నిష్ఠా సప్తమ్యౌ' అనుచో గూడ నిట్టి సమన్వయమే వీరు చేసెద మనినారు. 'దణ్డ పాణిః' అనుచో 'దణ్డః పాణిగతః యస్య సః' అని విగ్రహ ప్రదర్శన మొనర్చి పై వార్తికమునకు లక్ష్యముగా 'దణ్డపాణిః' అను దానిని సాధించెద మనుచున్నారు. 'పఞ్చాస్త్రజన్మా' మొద

అగునవి గూడ నిట్లే సాధింపఁబడవలసిన వని వీ రనివారు. పై వార్త్తికములోని సప్తమీ పదమునకుఁ గూడ సప్తమ్యన్త పద ఘటితోపపద సమాసపద మని శ్రీ శాస్త్రులవారి వ్యాఖ్య, దీనికి లక్ష్యము 'దణ్డపాణిః' మొ. వీనికి 'దణ్డ పాణిఃగతః యస్య' అను రీతిని విగ్రహ ప్రదర్శనము—అని శ్రీ శాస్త్రులవారి వివరణము. ఇఁకఁ బాణినిచే 'పాణిం గతః—పాణి గతః' అను రీతిని 'ద్వితీయా శ్రితాతీత పతిత గతాత్యస్త ప్రాప్తాపన్నైః' అను సూత్రమ్ముచేఁ బ్రతిపదోక్తముగా ద్వితీయా సమాస మిచట విధింపఁబడినది. ఇది యుపపద సమాస మగుట యెట్లు ? సప్తమ్యన్త పదఘటిత మనుట యెట్లు ? 'ఉపపద మతిఙ్' అను సూత్రమున విధింపఁబడిన సమాస ముపపద సమాసము. 'తత్రోపపదం సప్తమీస్థ' మ్మను దానిచే నుపపద సంజ్ఞ విహితము. శ్రీ శాస్త్రులుగా రే మనుకొని యిట్లు వ్రాసిరో నా కర్థమగుటలేదు. పైఁగా, వీరు వ్యాఖ్యాత లెల్లఁ దమవలెఁ బై సూత్ర వార్త్తికముల కర్థ నిర్వచన మేల చేయఁ జాలకపోయిరో ! యని విస్మయం పడుచున్నారు. పై వ్యాఖ్యాతలు పాణినీయ పారంగతులు గదా ! వా రిట్లు వ్యాఖ్యానము చేయుట కుపపద మన నెట్టిదో ! యుపపద సమాస మన నేదియో ! యెరుంగనివారు గారుగదా ! కావుననే, దీక్షితాదులు 'సప్తమీ విశేషణే బహువ్రీహౌ' 'సప్తమ్యన్తం విశేషణంచ బహువ్రీహౌ పూర్వం ప్రయోజ్యమ్, కణ్ఠేకాలః, అతఏవ జ్ఞాపకా ద్వ్యధికరణపదో బహువ్రీహిః' అను రీతిని వివరించిరి. ఇందు వారు చేసిన మహాపరాధ మేమియు లేదు. ఇట్లు, వీరు సూత్రవార్త్తికములకుఁ జేసిన వ్యాఖ్యానము, దాని సమన్వయము నసంగతము లైనవి. వ్యధికరణ బహువ్రీహి పాణినీయ సమ్మత మని సూత్రకారుఁడు తెలిపె ననుట కింక సందియము లేదుగదా !

వార్త్తికకారుఁడో ! 'బహువ్రీహి స్సమానాధికరణానామ్' అను వార్త్తికము నారంభించినాఁడు. 'కిం ప్రయోజనమ్, వ్యధికరణానాం మాభూత్' (2.2.2) అని మహాభాష్య కర్త వార్త్తికమును వ్యాఖ్యానించినాఁడు. సామాన్యాకారముగా 'విశేషణం విశేష్యేణ బహులమ్' మొదలగు వానిచేఁ బ్రథమాన్తములకును సమాస ముక్త మైనందున శేషపదము ప్రథమాన్త బోధకము కాఁ జాల దని పై వార్త్తికమును వార్త్తికకారుఁ డారంభించెను. 'కిం ప్రయోజనమ్ ? వ్యధికరణానాం మాభూత్—అని మహాభాష్యకర్త వార్త్తికార్థమును బై రీతిని వివరించి, ప్రథమాన్తములకు సామాన్యముగా సమాసము చెప్పఁబడినను 'ద్వితీయా శ్రితాతీతపతితగతాత్యస్త ప్రాప్తాపన్నైః' (ద్వితీయాన్తం శ్రితాదిభి స్సమస్యతే)—అను రీతిని విశేషాకారముతోఁ బ్రథమాన్తములకు సమాసము చెప్పఁబడనందునఁ బ్రథమాన్తము శేషపద వాచ్యమే ! యని 'బహువ్రీహి స్సమానాధికరణానామ్' అను వార్త్తికమును సైతము 'శేషో బహువ్రీహిః' అను సూత్రములోని శేషపదము చేతనే సంగ్రహించెను. సమానాధికరణములకు (ప్రథమాన్తములకు) బహువ్రీహి యనునది ప్రాయికము. వ్యధికరణములకు (అప్రథమాన్తములకు) బహువ్రీహి యనునది (జ్ఞాపకసిద్ధ మైనందున) క్వాచిత్కము. దీనిని వార్త్తికకారుఁ డేమియుఁ గా దనుట లేదు. కా దనకపోఁగా, వ్యధికరణ బహువ్రీహి పాణినీయ సమ్మత మని తాను దన వార్త్తికము మూలమున విస్పష్టముగా బోధించుచున్నాఁడు. ఇది యెట్లో ! శ్రీ శాస్త్రులవారి కింక విశదపఱచుకొనెదను.

వ్యధికరణ బహువ్రీహి వార్త్తికకారుఁ డంగీకరించువాఁడే యైన 'సప్తమ్యుపమానపూర్వపద స్యోత్తర పదలోపశ్చ' మొదలుగాఁ గల వార్త్తికముల వార్త్తికకారుండు రచించుట కాని "సప్తమ్యన్తమ్ ఉపమానంచ యస్య తస్య పదాన్తరేణ సమాసః, ఉత్తరపదలోపశ్చ భవతీత్యర్థః; 'కణ్ఠేస్థః. కాలః యస్య సః కణ్ఠే కాలః', ఉష్ట్రముఖమివ ముఖం యస్య సః ఉష్ట్రముఖః, (2అ. 2పా. 2ఆ) అను రీతిని మహాభాష్యకర్త వ్యాఖ్యానించుట కాని యెట్లు సంగతము అగు నని శ్రీ శాస్త్రులుగారి కొక సందేహము ! ఈ సందేహముతోడనే, వీ రీ వార్త్తిక మహాభాష్యములు వ్యధికరణబహువ్రీహుల సమానాధికరణబహువ్రీహులఁ గా సాధించుట కేర్పడినవని భ్రమపడి వీని సమన్వయమునఁ జాలఁ బ్రమాద పడినారు. బాలమనోరమాకారుఁ డుద్ధరణ చిహ్నముల నడుమ వీని నుంచి కౌముదీ గ్రంథమునఁ జేర్చినాఁడు. శ్రీ శాస్త్రులుగారిపై యభిప్రాయము బాలమనోరమా కర్త కైన నుండుచో నాతఁడు 'కణ్ఠే కాలః' అనునది వ్యధికరణ బహువ్రీహి యని వచించుట యసంగతమే కదా ! యగును. 'గో రతద్ధితలుకి' అను సూత్రమున 'పఞ్చగవధనః' అనుదానిని వివరించుచు బాలమనోరమాకర్త యే మనుచున్నాడో చూడుఁడు! "సప్తమీ విశేషణే బహువ్రీహౌ" ఇతిజ్ఞాపకేన కణ్ఠేకాల ఇత్యాదావివ వ్యధికరణ బహువ్రీహి స్సమ్భవా చ్చ". ప్రామాణికుఁడుగా వీరనుమతించిన బాలమనోరమాకారుఁ డైనను నీ సందర్భమున వీరి కనుకూలుఁడుగా లేఁ డనుట స్పష్టపడినది కదా ! ఇఁక, వీ వార్త్తిక మహాభాష్యముల యాశయ మేమియో ! వివరింతును.

కణ్ఠశబ్ద ముపపదముగా నుండ స్థాధాతువుకంటెఁ 'సుపి స్థః' అను సూత్రముచే 'క' ప్రత్యయము వచ్చి యుపపద సమాసముతో 'కణ్ఠేస్థః' అని యగును. దీనికి 'కణ్ఠేస్థః కాలః యస్య' అను రీతిని బహువ్రీహి సమాస మేర్పరచిన, 'కణ్ఠేస్థకాలః' అని కావలసి వచ్చుచున్నది. ఇట్లే 'ఉష్ట్రస్య ముఖమ్—ఉష్ట్రముఖమ్, దీనికి 'ముఖ' శబ్దముతో బహువ్రీహి సమాస మేర్పఱచిన 'ఉష్ట్రముఖముఖః' అని కావలసి వచ్చుచున్నది. ఇట్టి యనిష్ట రూపములు—అనఁగా నసాధు శబ్దములు. వీనిని వారించుటకే 'సప్తమ్యుపమానపూర్వపద స్యోత్తరపదలోపశ్చ' అనువార్త్తికానుశాసనము తద్వివరణ మహాభాష్యము ప్రవృత్తము లైనవి. చాలవఱ కిప్పటి వార్త్తికము లన్నియు నిట్టివే ! 'కేశ సమాహార చూడః' 'సువర్ణవికారా లఙ్కారః' మొదలగునవెన్నియో వీనిచే నివారింపఁబడుచున్నవి. సమానాధికరణములే చాలవఱ కివి యగుటంబట్టి, సమాసము 'బహువ్రీహి స్సమానాధికరణానామ్' అని సిద్ధమే కాఁగా, దాని ననువదించి యుత్తరపద లోపము మాత్రము

విధింపఁబడుచున్నది. బహువ్రీహిలో నుత్తరపదలోపము సిద్ధి కేర్పడినందున నుత్తరపదలోపముతోఁ గూడిన 'కణ్ఠేకాలః' వంటివే సాధువులు కాని, బహువ్రీహి సమాసమున 'కణ్ఠేస్థకాలః' వంటి వెట్లును సాధువులు కావని శాసించుటయే యిచ్చటి వార్తిక మహాభాష్యములు చేసిన పని. తరువాత 'పఞ్చ భుక్తవన్తః అస్య' మొదలగుచోట్ల బహువ్రీహి సమాసము రాకుండుటకై యనభిధానాశ్రయణ మెట్లయినను నావశ్యక మగుటంబట్టి 'కణ్ఠేస్థకాలః' ఇత్యాదులకుఁ గూడ ననభిధానమే (శిష్ట ప్రయోగములు లే కుండుటవలని యసాధుత్వమే) చెప్పవచ్చునని 'బహువ్రీహి స్సమానాధికరణానామ్' అని యారంభించి 'న కోఽస్త్యర్థానాంచ' అనుదాని వరకును గల యీ వార్తికముల నన్నిటిని 'సర్వేఽనభిధానా దసమానాధికరణేషు సంజ్ఞాభావః' అని ప్రత్యాఖ్యాన మొనర్చినాఁడు. ఇచ్చటికైయటోద్ద్యోతములయం దిది యంతయు స్పష్టము. ఇచ్చటి తత్త్వ మిది. కణ్ఠేకాలః యస్య సః—అనురీతిని వ్యధికరణ బహువ్రీహులే! అవి యిచ్చటి లక్ష్యములు గావు. వాని ప్రసక్తి యిట లేదు. వ్యధికరణ బహువ్రీహులను సమానాధికరణ బహువ్రీహులనుగా సాధించుట కేర్పడినవిమాత్ర మివి కావు. వ్యధికరణ బహువ్రీహులను వార్తికకారుఁ డంగీకరించి వానికిఁ గార్యమును గంఠోక్తముగా విధించియే యున్నాఁడు. 'సప్తమీ విశేషణే బహువ్రీహౌ' (2. 2. 35) సూత్రమున 'సప్తమ్యాః పూర్వనిపాతే గడ్వాదిభ్యః పరవచనమ్' అనువార్తికమును వార్తికకారుఁ డారంభించెను. మహాభాష్యకర్త 'సప్తమ్యాః పూర్వనిపాతే గడ్వాదిభ్యః పరా సప్తమీ భవతీతి వక్తవ్యమ్'—గడుకణ్ఠః, గడుశిరాః' అని యుదాహరణములతో నీ వార్తికమును వివరించి యున్నాఁడు. 'కణ్ఠే గడుః యస్య సః' 'శిరసి గడుః యస్య సః' అను విగ్రహములతో వ్యధికరణ బహువ్రీహు లగు వీనికి 'సప్తమీ విశేషణే బహువ్రీహౌ' అను దానిచేఁ బూర్వ నిపాతము ప్రాప్తము గాఁగాఁ బై వార్తికముచే సప్తమ్యన్తమునకుఁ బరనిపాతము విధింపఁబడుచున్నది. దీనిచే వార్తిక కర్తయు సూత్రకర్తవలె వ్యధికరణ బహువ్రీహిని విస్పష్టముగా నంగీకరించినాఁ డనుట కిఁక సందియమేమి ? బహువ్రీహిలో సప్తమ్యన్తమే యసంభవ మైనప్పుడు దానికి బరనిపాత మెట్లు సంభవమగును ? ఇంకొకమాట ! శ్రీ శాస్త్రులుగారి సమన్వయము ప్రకారము వ్యధికరణ బహువ్రీహులను సమానాధికరణ బహువ్రీహులుఁగా సాధించుటకే "సప్త మ్యుపమాన పూర్వపద స్యోత్తర పదలోపశ్చ' మొదలగు వార్తికములు ప్రవృత్తములైన, 'గడు కణ్ఠః, గడు శిరాః' అను నవి యేల సమానాధికరణములుగా సాధింపఁబడక వదలఁబడి నవి ? ఇవి వ్యధికరణ బహువ్రీహులు కావని శ్రీ శాస్త్రులుగా రనుటకైనను గాత్యాయనుఁడు వార్తికము మూలమునను బతంజలి యుదాహరణములతోడి తద్వ్యాఖ్యా మూలమునను వ్యధికరణ బహువ్రీహు లివి యని స్పష్టపఱచుచునే యున్నారు కదా !

ఇఁక, 'కణ్ఠేస్థః కాలః యస్య' అను రీతిని 'కణ్ఠేస్థః గడుః యస్య' అనురీతి విగ్రహముల నంగీకరించి, యీ వార్తికములోని సప్తమీపదము సప్తమ్యన్తపదఘటితోపపదసమాన పదపరమని యిదివఱకు నా నిరూపించినరీతి ననంగతము గా ననన్వితముగా నర్థము చెప్పుటకు శ్రీ శాస్త్రులు గారు పాల్పడినను, 'గడు కణ్ఠేస్థః, గడు శిరస్థః' అనురీతి రూపములే యగును గాని, యీ వార్తికమునకు మహాభాష్యకర్తచే నుదాహృతములైన 'గడు కణ్ఠః, గడుశిరాః' అనునవి నిష్పన్నములు కావు. 'సప్తమ్యుపమానపూర్వపదస్యోత్తరపదలోపశ్చ' అనునది యిట నుత్తరపదలోపమును విధింపలేదు. పూర్వపదములోని యుత్తర పదమునకే కదా ! దీనిచే లోపము విధింపఁబడునది. ఇఁక గత్యంతర మేమి ? వార్తిక కర్తయు మహాభాష్య కర్తయు వీనిని వ్యధికరణ బహువ్రీహులుఁగా నంగీకరించినా రనక తప్పున దేమి ? మఱియొకమాట ! 'సప్తమ్యుపమానపూర్వపద స్యోత్తరపదలోపశ్చ' మొదలగు వార్తికముల, ననిష్టాంశమున ననభిధానము చెప్పి ప్రత్యాఖ్యాన మొనర్చెను. అప్పుడు, 'కణ్ఠేకాలః' అను ప్రయోగమే (సమానాధికరణముగాఁ గాని వ్యధికరణముగాఁ గాని) లోకమున లేకపోవలసి వచ్చునుగదా! 'సప్తమ్యాః పూర్వనిపాతే గడ్వాదిభ్యః పరవచనమ్' అను నీ వార్తికము, పాణినీయము నంతను ననంగతముఁగా సమన్వయించుకొని ప్రమాదపడినారు శ్రీ శాస్త్రులుగారని వొక్కి వక్కాణించుచున్న దనుటకు సందేహమేమి ? కావుననే, మహాభాష్యకర్త ముందు నా చెప్పఁబోవు రీతిని 'కణ్ఠేకాలః' అనునది వ్యధికరణ బహువ్రీహి యని కంఠోక్తముగా వచించుట సంభవించినది. వ్యధికరణ బహువ్రీహి పాణినీయ సమ్మతమని పాణినితో పాటు కాత్యాయనుఁడును విస్పష్టముగా మన కెఱుకపఱచినాఁ డనుట కిఁక నెట్టి సందియమును లేదు గదా !

శ్రీ శాస్త్రులుగారు 'సమానాధికరణానాం బహువ్రీహి ర్వక్తవ్యః' ఇత్యాది గ్రంథము నుదాహరించియే కదా! వ్యధికరణ బహువ్రీహి పాణినీయ సిద్ధాన్తముగా దనఁ జూచిరి. అది యంతయు వారి వాదమునకుఁ బ్రతికూలమని నిరూపించితిని. ఇఁక, మహాభాష్యకర్తయో ! ముక్తకంఠముగా నొకచో 'కణ్ఠేకాలః' అనునది వ్యధికరణ బహువ్రీహి యని యుద్ఘోషించినాఁడు. దానినే శ్రీ శాస్త్రులవారి కిఁకఁ బ్రదర్శింతును. "సమానాధికరణ సమాసాద్బహువ్రీహిః" † సమానాధికరణ సమాసా ద్బహువ్రీహి ర్భవతి విప్రతిషేధేన, సమానాధికరణ సమాసస్యావకాశః 'వీరః పురుషః—వీరపురుషః', బహువ్రీహే రవకాశః 'కణ్ఠేకాలః', ఇహోభయం ప్రాప్నోతి, వీరపురుషకో గ్రామః, బహువ్రీహి ర్భవతి విప్రతిషేధేన (2 అధ్యా 1 పా. 3 ఆ. 69 సూ.). పై మహాభాష్యమున, సమానాధికరణ సమాసమునకు (కర్మధారయసమునకు) అవకాశము 'వీర పురుషః' అనునది యని ప్రదర్శించి, సమానాధికరణ సమాసమున కవకాశము లేని స్థలమున బహువ్రీహి సమాసమున కవ

† సమానాధికరణసమాస మనునది కర్మధారయ సమాసమునకే నామాంతరము.

కాశముఁ జూపుచు, 'కణ్ఠేకాలః' అనుదాని నుదాహరించుచున్నాఁ డీ మహాభాష్యకర్త. సమానాధికరణము కానిది వ్యధికరణమే కదా! యగును? ఇప్పుడైనను 'వ్యధికరణ బహువ్రీహి మహాభాష్య సమ్మతము; పాణినీయ సిద్ధాన్తము' అని శ్రీ శాస్త్రులుగా రంగీకరింతురా ? అంగీకరింపరా ? ఇదిగాక, స్వయముగా మహాభాష్యకర్త వ్యధికరణ బహువ్రీహులఁ గొన్నిటిని విగ్రహ ప్రదర్శన పూర్వకముగా వ్యాఖ్యానించినాఁడు. (చూ: ) 'వ్యక్తవాచాం సముచ్చారణే' అను సూత్రమును వ్యాఖ్యానించుచు 'వ్యక్తాః హి వర్ణాః యేషాం త ఇమే వ్యక్తవాచః' అని సూత్రములోని 'వ్యక్త వాచామ్' అనుదానిని వ్యధికరణ బహువ్రీహిగానే వ్యాఖ్యానించినాఁడు. (చూ: మహాభా. 1.3.2.48). దీనిని నేను నా 'పాణినీయము—కావ్య వాఙ్మయము'న నుదాహరించియే యున్నాను. (చూ: పాణి. కా. 38 పు) దీనికి శ్రీ శాస్త్రులుగా రేమి సమాధానము చెప్పిరి ? తమ వాదమునకు బాధకములగు ప్రతివాదుల వాదము లపలపించుటయే సమాధానమా ? ఇదివరకుఁ గూడ వీరు విషయముల నెన్నిటినో యపలపించియుఁ దన్యథా వ్యాఖ్యానము లొనర్చియు నా వ్రాఁతలఁ బ్రదర్శించినందులకే కదా ! పాఠకలోకమున కది యంతయు 'అనుబంధ పరామర్శ' మను పేర విప్పి చెప్పవలసి వచ్చినది! శ్రీ శాస్త్రులుగారు ప్రత్యర్థులపై నసత్యముల నారోపించి ఎంత చతురతతో విజయము సాధింపఁ బ్రయత్నింతురో గమనింపుఁడు ! "మహా భాష్యకర్త సమానాధికరణ్యమును జూపుచు వివరించిన 'సప్తమ్యుపమాన పూర్వపద స్యోత్తర పదలోపశ్చ' .... కణ్ఠేకాలః మహాభాష్యము (2 అ. 2 పా. 2ఆ. 450 ప్రదీపోద్ద్యోత సహిత మహాభాష్య పుస్తకము)" అను పంక్తులను గొంత మార్చి స్వవాదానుకూలము లనుకొనుచు సుబ్రహ్మణ్య శాస్త్రులుగారు వ్రాయుట వింతగ నున్నది."—ఇవి శ్రీ శాస్త్రులవారి వ్రాఁతలు ! చూచితిరా ! పాఠకులారా ! నేను మహాభాష్య పంక్తులనే మార్చితినఁట ! ఎంతటి యారోపమిది ! శ్రీ శాస్త్రులవారు తాము చెప్పఁదలఁచినదాని కడ్డు వచ్చునప్పుడు, చింతామణ్యాదుల నైతము స్వాభిలషితమున కనుకూలముగ సవరించుచుందురు. అట్లె యితరులు నని వారనుకొనుట తప్పు కాదు. ఇందలి సత్య మెట్టిదో పరిశీలింపుఁడు ! "సప్తమ్యుపమాన పూర్వపద స్యోత్తరపద లోపశ్చ' సప్తమీ పూర్వపద స్యోపమాన పూర్వపదస్యచ బహువ్రీహి ర్వక్తవ్యః ఉత్తర పదస్యచ లోపో వక్తవ్యః కణ్ఠేస్థః కాలోఽస్య కణ్ఠేకాలః, ఉష్ట్రముఖమివ ముఖ మస్య—ఉష్ట్రముఖః, ఖరముఖః 'సముదాయ వికార షష్ఠ్యాశ్చ' సముదాయ వికార షష్ఠ్యాశ్చ బహువ్రీహి ర్వక్తవ్యః, ఉత్తర పదస్యచ లోపో వక్తవ్యః, కేశానాం సమాహార శ్చూడా అస్య—కేశ చూడః, సువర్ణస్య వికారోఽలఙ్కారో యస్య సువర్ణాలఙ్కారః ఇత్యాది" (2.2.2.24). ఇవియే నా యుదాహరించిన మహాభాష్య పంక్తులు. (చూ: పాణినీయము—కావ్య వాఙ్మయము—38 పు.) ‡ మహాభాష్యమున నీ పంక్తు లిట్లే యున్నవి. ఈ పంక్తుల స్వవాదానుకూలములఁగా నేను మార్చితి ననెడి శ్రీ శాస్త్రులుగారు, మం దే ముండినదో, యేమి నేను మార్చితినో, యా మార్పువలన నా వాదమున కవి యె ట్లనుకూలము లైనవో, లేనిచో నవి యెట్లు ప్రతికూలము లయ్యెడినో ! పాఠకలోకము నెదుటఁ బ్రదర్శింపవలదా ? ప్రదర్శింపరేమి ? శ్రీ శాస్త్రులుగారి వాదమునకే మహాభాష్యపంక్తు లెట్లు ప్రతికూలములో విశదపరచితిని. ఇట్లు పాణినీయ వ్యాఖ్యాతలే కాక, మునిత్రయమువారు నైతము, వ్యధికరణ బహువ్రీహి నైకకంఠ్యమున నంగీకరించిరని విశదపడినది. ఇఁక 'కణ్ఠేకాలః' వంటివి వ్యధికరణ బహువ్రీహులని నే ననుట కభ్యంతరము లేదుకదా ! 'మనుమార్గః' వంటివి సమానాధికరణ బహువ్రీహు లని నే ననుటకుఁ గారణ మిఁక వెలుకపఱచెదను. 'ఉపమానాని సామాన్య వచనైః' (2.1.55) అను సూత్రమున, మహా భాష్యకర్త 'శస్త్రీశ్యామా' (దేవదత్తా)' ఇత్యాదులలో 'సాదృశ్య మతిరిక్తః పదార్థః' అను పక్షము నాశ్రయించి, యుపమానోపమేయములు భిన్నార్థకము లగుటంబట్టి వ్యధికరణములు గావలసి వచ్చుచున్నవని యాశఙ్కించి, "ఏవంతర్హి తస్యామే వోభయం వర్తతే—ఏత చ్ఛాత్రయుక్తం య త్తస్యామే వోభయం వర్తత ఇతి' అని, 'గౌ ర్వాహీకః' మొదలగువాని యందుఁ బోలె, సాదృశ్య నిమిత్తక మగు నభేదారోపణమున సమానాధికరణములఁగానే (ఏకార్థ బోధకములఁ గానే) నిర్వచించినాఁడు. కానిచో, 'శస్త్రీశ్యామా' ఇత్యాదులందు 'ఉపమానాని సామాన్య వచనైః' అను దానిచే సమానాధికరణ సమాసము వచ్చుట కాని, 'మృగీవ చపలా—మృగచపలా' మొదలగు చోట్లఁ బుంవద్భావ మేర్పడుట గాని, యసంగతము లయ్యెడివి. 'మనుమార్గ మార్గః' ఇత్యాదుల కసాధుత్వము బోధించుటకే 'సప్తమ్యుపమాన పూర్వపద స్యోత్తరపదలోపశ్చ' అనువార్త్తికమని నిరూపించియే యుంటిని. ఇట్టిచో, శ్రీ శాస్త్రులుగారు 'మనుమార్గుఁడు' అనునది వ్యధికరణ బహువ్రీహి యని వ్రాసినప్పుడు, మహాభాష్య సిద్ధాన్తమునుబట్టి దానిని నేను ప్రమాదమనక మ ఱే మందును ? వీరు నా వ్రాఁతల కిఁక వింతపడవలసిన దేమియు లేదు. పాణినీయులందఱు నేకముఖముగా నంగీకరించు వ్యధికరణ బహువ్రీహిని గాదనఁదలఁచి, పాణినీయ వ్యాఖ్యాతలెల్లరు నప్రమాణికు లని యుపపదసంజ్ఞ, యుపపద సమాసము నన నేమో కూడ గుఱుతింపక, లేనిపోని యపోహములతో సూత్రవార్త్తిక మహాభాష్యముల నసంబద్ధములుగా సమన్వయింపఁ జూచుటయే కాక, యసత్యారోపణములను నపలాపములను నైత మొనర్చి తమ వాదము నెగ్గించుకొనఁ జూచు శ్రీ శాస్త్రులవారి సాహసమునకు మనమే వింతపడవలసి యున్నది. తమ వాదము దుర్బలమని తెలిసినపుడు సహృదయతతో నంగీకరింపక, కేవల మభినివేశముతో నీ రవమార్గములఁ ద్రొక్కుట యేలయో ! ఈ విషయము నింతటితో వదలి యిఁక రెండవ యాక్షేపమును గుఱించి చర్చింతము.

‡ 1939 వ సంవత్సరపు శ్రీ రాజస్థాన సంస్కృత 'కాలేజి' గ్రంథమాలా ప్రచురణము.

## II. శ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి గారి యాక్షేపము సరికాదు—

(ఇది రెండవ యాక్షేపము)

ఇప్పటి సంహితా సర్వస్వములోని శ్రీ శాస్త్రులవారి వ్రాఁతలను గ్రింద నుదాహరించినాను.[1] వీరి వ్రాఁతలలోని సారాంశ మిది. "త్రిలోకములు, త్రిపురుషులు, చతుర్యుగములు, పంచపాండవులు—అనునవి సంజ్ఞావాచకములని 'దిక్సంఖ్యే సంజ్ఞాయామ్' అను సూత్రముచే 'పఞ్చర్షయః, సప్తర్షయః'—అనువాని వలెనే 'త్రయశ్చ తే లోకాశ్చ (త్రిలోకాః)' అను రీతి విగ్రహములతోఁ గర్మధారయ సమాసములుగా నేను పాణినీయమును బట్టి సాధించితి ననిరి. అందు 'త్రిలోకాః' అనునది సూత్రము 'త్రిసఙ్ఖ్యా లోకాః (త్రిలోకాః) అను రీతిని మధ్యమపదలోపి సమాసముగా సాధింపఁ బడవలసిన దనిరి. ఇందులకుఁ బ్రబల ప్రమాణములుగా, బాలమనోరమాకారుఁ డగు వాసుదేవ దీక్షితుఁడు, త్రిలోక

[1] "త్రిలోకీ, త్రిలోకాః, త్రిభువనమ్, త్రిభువనీ, త్రిభువనాని" ఇవెల్ల మహాకవి ప్రయుక్తము లగునపుడు పాణినీయ సూత్రములతో సమర్థించుటకై యిట్టి వెల్ల సంజ్ఞావాచకములని బ్రహ్మశ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు ధారాళముగా వచించిరి. (పాణినీయము—కావ్య వాఙ్మయము 40 పు) "త్రిలోక శబ్దస్య అసంజ్ఞాత్వాత్—బాలమ. వ్యా. సిద్ధాంత కౌముది. అని వాసుదేవ దీక్షితులు గారు చెప్పిరి. (చూ: విస్తర II. 268 V విష)". ఇవి సంజ్ఞావాచకములు కావు గానఁ 'దిక్సంఖ్యే సంజ్ఞాయామ్' (2.1.50 సి. కౌ. 727 సూ.) అను సూత్రము చెప్పునఁ గర్మధారయములు కానేరవనియు 'త్రి సంఖ్యాకాః లోకాః—త్రిలోకాః'—అను రీతిని మధ్యమపద లోప సమాసము నంగీకరింప నగుననియుఁ బ్రామాణికుల యాశయము. 'త్రిలోక శబ్దస్య అసంజ్ఞాత్వాత్ త్ర్యవయవో లోక ఇతి మధ్యమపదలోపీ సమాసః (సి. కౌ. 727 సూ. బాలమ. వ్యాఖ్య) ఇట్లే—శతాబ్దములు—శతాబ్దము—అను రూపములు సాధువు లగుచున్నవి. శతసఙ్ఖ్యకా అబ్దాః—శతాబ్దాః—శతాబ్దములు. శతావయవో అబ్దః—శతాబ్దః—శతాబ్దము' దీనివలన 'శతాబ్ది' అను సమాహార ద్విగ్వర్థము నిర్వహింపఁబడుచున్నది. "దిక్సంఖ్యే సంజ్ఞాయామ్" అను సూత్రముచేఁ గర్మధారయ సమాసము రాఁగా "త్రయశ్చ తే లోకాశ్చ—త్రిలోకాః (త్రిలోకములు) అనురీతి నీ శబ్దములు పాణినీయము చేతనే సాధితము లైనవి" అనెడి బ్ర. శ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి వ్రాఁత పై సందర్భమును బట్టి సరి కాదనుట స్పష్టము. (చూ: పాణినీయము—కావ్య వాఙ్మయము 41 పు)—ఇవి 'వీరి మణికొన్ని యపసిద్ధాంతములు' అను శీర్షకమున శ్రీ శాస్త్రులవా రుదాహరించిన వ్రాఁతలు.

విస్తరము నందలి వ్రాఁతలఁ గూడ వీక నుదాహరింతును. "చతుర్యుగములు—మున్నగు సమాసములె యసాధువు లని కొందఱి యాశయము. 'తద్ధితార్థోత్తర పద సమాహారేచ' (సి. కౌ. 728 సూ.) అను సూత్రమునఁ జెప్పబడిన మూఁడు విధములలోను బయువాని సమాసమేదియుఁ గాకుండుటచేత వాని ద్విగుసమాసమునకే సాధుత్వము లేదని వారి యాశయము. 'దిక్సంఖ్యే సంజ్ఞాయామ్' (2.1.50) బాలమ. 'దిక్సంఖ్యే సమానాధికరణేన సుబన్తేన సమస్యేతే స తత్పురుష ఇత్యర్థః (సి. కౌ. 727 సూ) అను చెప్పున దిగ్వాచకములు సంఖ్యావాచకములును సంజ్ఞావాచిత్వమందే సమానాధికరణ మగు సుబంతముతో సమసించునని చెప్పఁబడుటచేత నవి సప్తర్షయః=సప్తర్షులు" అనువాని వలెనే సంజ్ఞావాచకములె యనఁదగును. (చతుర్యుగములు—కృత త్రేతా ద్వాపర యుగములకే సంజ్ఞ) కాన, వాని సమాసము సాధు వనఁదగును. "చతుశ్శ్రుతులు నేరక యున్నవి వాకు శక్యమే" (నిర్వ. 1 ఆ. 18 ప) మ. విన రెవ్వారుం ద్రిలోకంబులన్ (ద్రోణ. 3 ఆ. 162) చ. కొను మిదె నీ మనఃప్రియుఁ గోమలి పీఁడు చతుశ్శతాబ్దముల్ మను నిట పీఁద .... (అర. 2 ఆ. 251) 'చతుశ్శతాబ్దముల్' అనునది తక్కిన వానివలె సంజ్ఞావాచి కాదనక తీరదు. కాన నిట చతుశ్శత సఙ్ఖ్యాః అబ్దాః' అనురీతి విగ్రహము గల యుత్తరపదలోప మనఁదగును. "షోడశ పదార్థానా మిత్యత్ర—షోడశ సఙ్ఖ్యకాః పదార్థా ఇతి మధ్యమపదలోపీ సమాసః" (సి. కౌ. 727 సూ. బాలమ. వ్యాఖ్య). ఇంకఁ బ్రాతాదులలోని దగు 'త్రిభువనమ్' అనుదానికి 'త్రిభువనీ' రూప మెట్లు సిద్ధించునని యాలోచింపవలసి యున్నది. చ .... కలిత ప్రభవస్థితిసంహృతిక్రియా విరతి వివర్తిత త్రిభువనీ మహనీయుని దైత్యమర్ది .... (శల్య. 1 ఆ. 265) స్రగ్ధర. భువనీ చక్రాచలేంద్రాంబుధి కుహర దిశా పూర్ణమై .... శేరిరవ (నన్నె. కు. 11 ఆ. 633) ఇట్లు భువనీ శబ్దము వెలయుచుండుటచేత 'త్రిసః భువన్యః—త్రిభువన్యః—తాను మహనీయః—అనురీతి నర్థము చేయ నగును. మ. ధరణీనాథ .... తఁ యరదం బెక్కి వధింపు మీవును మదీయ స్ఫారసారథ్య నిర్భరభంగిన్ దశకంధరుం ద్రిభువనీ భంగోన్న మత్కంధరున్' (అర. 2 ఆ. 142 విస్తర. II 268 V విష.)

మరియొకచో (60 పు. మొదటి 'వాల్యము') 'శతాబ్దములు, త్రిపురుషులు' సాధువులె ! అనుబంధము — ఇట్లు, త్రిసంఖ్యాకాః పురుషాః—త్రిపురుషాః—అను మధ్యమపద లోపి సమాసాశ్రయణమున. 'సప్తర్షయః' అనుదాని వంటి సంజ్ఞ కాదను పక్షమందును నిర్బాధముగా 'త్రిపురుషాః' అనునది సమ్మత మగుచున్నది' అని వ్రాసిరి. ఇక మొట్టమొదట 'చింతామణి విషయ పరిశోధనము' నందలి వీరి వ్రాఁతలఁ గూడ నుదాహరింతును. "త్రిలోకములు చతుర్యుగములు, త్రిపురుషులు, పంచపాండవులు—మున్నగు ప్రయోగములెల్ల నపప్రయోగములే కదా !" (చింతామణి. వి. వ. 115 పు.)

శబ్దము సంజ్ఞావాచకము గా దనుటకు; 'షోడశ పదార్థాః' అను చోట 'షోడశసఙ్ఖ్యాకాః పదార్థాః' అను రీతి విగ్రహ ప్రదర్శన మొనర్చుట వీరు ప్రదర్శించిరి. 'చతుశ్శతాబ్దముల్'— అనునది సంజ్ఞావాచకము కాదనక తీరనందున, నిందుల కైనను దాము చెప్పిన రీతిని మధ్యమపదలోపి సమాసమును నే నంగీకరింపక తప్పదనిరి. ఇకఁ బొత్రాదులలోని దగు 'త్రిభువన' శబ్దమునకు 'త్రిభువనీ మహనీయుని' 'త్రిభువనీ భంగోన్న మత్కంధరున్'—అను ప్రయోగము లెట్లు సపన్నము లని విచారించి 'తిస్రః భువన్యః—త్రిభువన్యః, తాసు మహనీయః' అను రీతిని సాధ్యము లనిరి. 'భువనీ' శబ్దము స్త్రీలిఙ్గమును నున్న దనుటకు నన్నెచోడుని కుమార సంభవ ప్రయోగ మాధార మనిరి."

ఇక వీరి వ్రాతలఁ బరామర్శింతము. పాఠకులారా! క్రింద నుదాహరించిన చింతామణి విషయ పరిశోధనము నందలి వీరి వ్రాతలఁ జూచితిరి కదా! ఇప్పుడు వీరు వ్రాయుచున్న వ్రాత లెట్టివియో చిత్తగించితిరి కాదా! త్రిలోకాది శబ్దములు పాణినీయ సాధ్యములు గాని యపప్రయోగములని యిదివఱకు వీరు వ్రాసిరి. ఇప్పుడో యివి యన్నియుఁ బాణినీయ సాధ్యము లగు సాధు శబ్దములే! యని యంగీకరించి, త్రిలోకాది శబ్దముకడ విగ్రహ ప్రదర్శనము నే నొనర్చినట్లు కాక, వేరుగా నొనర్పవలయు నని మాత్ర మిప్పుడు వ్రాయుచున్నారు. వీ రీ శబ్ద సాధుత్వమునకై యంగీకరించిన మధ్యమపదలోపి సమాస మైనను బాణినీయ విహితమే! ఇట్టివి పాణినీయ సిద్ధములని వీ రంగీకరించునపుడు, పాణినీయ సిద్ధములు గాని యపప్రయోగము లివి యని తమ చింతామణి విషయ పరిశోధనమున వీనిని దా మెట్లుదాహరించిరి? ఇప్పుడు వీరి వాద మేమైనది? 'పాణినీయము కావ్య భాషానుశాసకముకా దనుటకుఁ దా మొనఁగిన తమ ప్రయోగముల చేతనే 'పాణినీయము కావ్య భాషానుశాసక' మని తామే సిద్ధాంతీకరించుకొనుచున్న ట్లయినది కదా! ఇట్టి పూర్వాపర విరోధములు వీరి గ్రంథములం దెల్ల విరివిగాఁ గానవచ్చును. ఇక 'త్రిలోక' శబ్దముకడ విగ్రహ మెట్లుండవలయునో విమర్శింతము. ఇట శ్రీ శాస్త్రులుగారు 'ప్రామాణికులు' 'అప్రమాణికులు' అను రెండు తెగ లేర్పఱచి 'త్రిసంఖ్యాకాః లోకాః (త్రిలోకాః)—అనురీతిని మధ్యమ పదలోపి సమాస మిటఁ జెప్పువారు 'ప్రామాణికు' లనిరి. ఇట్లనుటచే, ''త్రయశ్చ తే లోకాశ్చ' (త్రిలోకాః)—అనురీతి విగ్రహ మొనర్చినవా రిఁక 'అప్రామాణికు' లనిన ట్లయినది. వారు ప్రామాణికులు వీ రప్రామాణికులు నగుటకుఁ గారణము—బాలమనోరమాకారుఁడు 'త్రిలోకస్య అసంజ్ఞాత్వాత్ త్ర్యవయవో లోక ఇతి మధ్యమపదలోపీ సమాసః' అనినాఁ డనుటయే! నేను 'త్రిలోక' శబ్ద మెట్లు సంజ్ఞావాచక మగునో నిరూపించియుండ, నది సంజ్ఞావాచక మెట్లు కాదో నిరూపింపఁజాలక శ్రీ శాస్త్రులుగారు బాలమనోరమాకర్త యగు వాసుదేవ దీక్షితుని నడ్డుపెట్టఁ జూచిన నేమగును? వాసుదేవ దీక్షితుఁడును నిన్న మొన్నటి యొక వ్యాఖ్యాతయే కదా! ఈతఁడు తమకుఁ బ్రామాణికుఁడే యగువాఁడు 'కణ్ఠేకాలః' అనునది పూర్వము నా ప్రదర్శించిన రీతిని 'వ్యధికరణ బహువ్రీహి' యని యాతఁ డనినప్పుడు వీ రేల యంగీకరింపరు? ఇదిగాక, కైయట వృత్తికార హరదత్త దీక్షిత నాగేశాదు లందరు 'కణ్ఠేకా' లాదులు వ్యధికరణ బహువ్రీహు' లని, వ్యధికరణ బహువ్రీహి పాణినీయ సమ్మత మని యొక కంఠ్యమున వ్యాఖ్యానించిరికదా! వారి నందఱిఁ బ్రామాణికులఁగా నంగీకరింపక త్రోసిరాజనిన శ్రీ శాస్త్రులుగారు వారి నందఱిను మించిన ప్రామాణిక వతంస మనియా బాలమనోరమాకర్త నింతగాఁ జేయూఁత గొనుట! ఎన్ని పర్యాయములు తా ముదాహరించినను నెంతగాఁ దాము వివరించినను వీ బాలమనోరమయే కదా! యిందులకు వీరి కాధారము. వీరైనను బాలమనోరమాకారుఁ డైనను సంజ్ఞావాచక మిది యేల కాదో! చెప్పినవారు కారే! కావున, శ్రీ శాస్త్రులుగారికి కీ విషయమున న్యాయ్యముగా నే నుత్తరవాదిని గావలసిన యావశ్యకత లేదు. ఐనను వాదప్రధానుఁడనుం గాని నేను శ్రీ శాస్త్రులుగారి చందము ననుసరించి, బాలమనోరమా కర్తను గూడ నొక ప్రామాణికునిఁగా నంగీకరించియే సమాధాన మొనఁగెదను. పురాణాదులయందు లోక విభాగ మిట్లు వివరింపఁబడినది—(1) భూర్భువ స్స్వరాది లోకము లేదు. ఇందు 'భూర్భువస్స్వర్లోకములు మూడే 'త్రిలోకశబ్ద వాచ్యము' లని యొక విభాగము. (2) కృతకము, అకృతకము, కృతకాకృతకము'—అనురీతిది 'త్రిలోక వ్యవహార' మని మరియొక విభాగము. (3) 'అధోలోకము, మధ్యమలోకము, ఊర్ధ్వలోకము—అనునవి 'త్రిలోకము' లని యింకొక విభాగము. ఈ విభాగము లన్నియు విష్ణుపురాణ భాగవతాదులయందు సుప్రసిద్ధములే! ఈ విభాగములలోని రెండు మూడు విభాగముల ననుసరించి 'త్రిలోకశబ్ద' మన్ని లోకములఁ జెప్పఁగలుగును. కనుక, నిది యప్పుడు సంజ్ఞావాచకము కాదు. ప్రథమ విభాగమున భూర్భువ స్స్వర్లోకములు మూడే కాని, మహరాది లోకము లేవియుఁ త్రిలోక శబ్దముచేఁ జెప్పఁబడ నందున నిది సంజ్ఞావాచకము. 'త్రిలోకాధిపుఁడు' మొదలగు స్థలముల నింద్రాదు లర్థ మగునపుడు త్రిలోకశబ్దము సంజ్ఞావాచకము. భూర్భువస్స్వర్లోకములు మూడే యీ త్రిలోక శబ్దమునకు వాచ్యము. బ్రహ్మదుల ప్రళయ మింద్రాదుల ప్రలయమునకుఁ దరువాతిది. భూర్భువస్స్వర్లోకములు గతించిన తరువాతఁ గూడ మహర్లోకాదు లుండును. 'త్రిలోకజననీమ్' ఇత్యాదులలోని 'త్రిలోక శబ్దము' ద్వితీయ, తృతీయ విభాగముల ననుసరించి సర్వలోక వాచక మగుటంబట్టి సంజ్ఞావాచకము కానేరదు. కావ 'దిక్సంఖ్యే సంజ్ఞాయామ్' అను సూత్రమున సమాసము రాకపోఁగా 'త్ర్యవయవో లోకః (త్రిలోకః)—అను రీతిని మధ్యమపదలోపి సమాసాశ్రయణ మిట్టి చోట్ల నావశ్యకము. మధ్యమపదలోపి సమాస

మగతిక గతికము.. మధ్యమపదలోపి స్థలములందుఁ బూర్వ పదమునకు (శాక పార్థివః—మొదలగువానిలోని శాకపదము మొదలగువానికి) శాకప్రియాద్యర్థమున లక్షణ చెప్పనగును. అప్పుడు 'విశేషణం విశేష్యేణ బహులమ్' అనుదాని చేతనే 'శాక పార్థివాదులు' సిద్ధించుచుండ 'శాకపార్థివాదీనాం సిద్ధయే ఉత్తరపదలోప స్యోపసంఖ్యానమ్' అను విధానము 'శాకప్రియపార్థివః' వంటి ప్రయోగముల కసాధుత్వము చెప్పుటకే! కావున, 'త్రిసంఖ్యాకా లోకాః (త్రిలోకాః) అను రీతి విగ్రహ ప్రదర్శనమే యుక్తమ్తో 'త్రిసంఖ్యాక లోకము' ల వంటి ప్రయోగములు లోకమున నసాధువు లగునని తెలియ వలయును. ఇప్పటి వ్యవస్థ యిది. ఇఁక, నేను 'త్రిలోక శబ్దము' సంజ్ఞావాచక మనుట కాని, బాల మనోరమా కర్త సంజ్ఞావాచకము కా దనుట కాని, రెండును నుపపన్నములే! ఆయా సందర్భములఁ బట్టి వక్తృవివక్షాధీనములుగా 'త్రయశ్చ తే లోకాశ్చ (త్రిలోకాః), త్ర్యవయవో లోకః (త్రిలోకః) అను విగ్రహములు వ్యవస్థితములు. కనుక, 'త్రిలోకశబ్దము సంజ్ఞావాచకము, త్రయశ్చ తే లోకాశ్చ (త్రిలోకాః)' అను వారు గూడ 'త్రిలోక శబ్దము సంజ్ఞావాచకము కాదు; త్ర్యవయవో లోకః (త్రిలోకః)' అనువారి వంటి ప్రామాణికులే! యని స్పష్టమైనది. ఇట్టిచోఁ బై బాలమనోరమనే యుదాహరించి "దిక్సంఖ్యే సంజ్ఞాయామ్' అను సూత్రముచేఁ గర్మధారయ సమాసము రాఁగా 'త్రయశ్చ తే లోకాశ్చ' (త్రిలోకాః త్రిలోకములు)' అను రీతి నీ శబ్దములు పాణినీయము చేతనే సాధితము లైనవి" అనెడి బ్ర. శ్రీ పాతుకుచ్చి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి వ్రాత పై సందర్భమును బట్టి సరి కాదనుట స్పష్టము" అని శ్రీ శాస్త్రులుగారు వ్రాయుటయే సరికాదని స్పష్టమైనదికదా! ఇఁక శ్రీ శాస్త్రులుగారు 'చతుశ్శతాబ్దముల్' అను భారత ప్రయోగమును జూపి, యది సంజ్ఞావాచకము కాదనక తీర దనుచున్నారు. మధ్యమపదలోపి సమాసాశ్రయణ మిటఁ దప్పని దనుచున్నారు. ఏలయో! ఇదియు సంజ్ఞావాచకమే యేల కారాదో! మనుష్యుల కగు 360 సంవత్సరములు దేవతల కొక సంవత్సరము. అట్టి నాలుగు దేవతా శతాబ్దములు దీనిచేఁ జెప్పఁబడవు. ఇది సంజ్ఞావాచకము గాక మే మగును? సంజ్ఞావాచకమై నప్పుడు నా చెప్పిన రీతిని 'పఞ్చామ్రాః' మొదలగువాని వలె నిదియు సాధువగుట కభ్యంతర మేమి? ఇట మధ్యమపదలోపి సమాసాశ్రయణావశ్యకత యేల? ఇదిగాక, వీరు 'త్రిభువనీ మహనీయుని దైత్యమర్ది' "..... దశకంధరుం ద్రిభువనీ భంగోన్నమత్కంధరున్" అను ప్రయోగముల నుదాహరించినారు. భువనీశబ్దము స్త్రీలింగ మొకటి కలదనివారు; ఈ ప్రయోగముల సాధింపఁ బ్రయత్నించినారు. ఆ సందర్భములోని శ్రీ శాస్త్రులవారి వ్రాత లివి. "భువనీ శబ్దము వెలయుచుండుటచేత 'తిస్రః భువన్యః త్రిభువన్యః—తాసు మహనీయః" అనురీతి నర్థము చేయఁదగును." శ్రీ శాస్త్రులుగారు త్రిభువనీ శబ్దము సంజ్ఞావాచకము కాదనువారు కదా! ఐన 'తిస్రః భువన్యః—త్రిభువన్య' అని వీ రనుట యెట్లు సంగత మగును? సమాసార్థ బోధక వాక్యమే కదా! విగ్రహము! శ్రీ శాస్త్రులుగారి యీ విగ్రహ ప్రదర్శనమును బట్టి 'దిక్సంఖ్యే సంజ్ఞాయామ్' అను సూత్రము చేతనే యిట సమాస మనక తీరదు. "సంజ్ఞాయామేవేతి నియమార్థ మిదం సూత్ర' మ్మనుటచే, సంజ్ఞావాచక మైననే కాని యిది ప్రవర్తింపదు. 'త్రిభువని' శబ్దము వంటిదే కదా! త్రిలోక శబ్దము! ఇదివర కిది సంజ్ఞావాచకము కాదనిన వారు వీరే! ఇప్పుడే విగ్రహ ప్రదర్శనముచే సంజ్ఞావాచక మనుచున్నవారును వీరే! భువనీ శబ్దము స్త్రీలింగ మొకఁ డున్న దనినను 'త్రిభువనీ' శబ్దము సంజ్ఞావాచకము కాదనువాఁడు వీరు చూపిన విగ్రహములో నీ ప్రయోగము లసాధువులే యగును. ఇంతగా నీ విషయమున వివాద పడుచున్న శ్రీ శాస్త్రులుగారును దుదకు నా మార్గము ననుసరించి 'దిక్సంఖ్యే సంజ్ఞాయామ్' అను సూత్రమునకు లక్ష్యములుగానే యీ ప్రయోగముల సాధింపఁ గలిగినారు. నేను జెప్పునది కూడ నివి యిట్లు సాధింపఁబడవలసినవనియే! మల్లినాథాదు లిట్టి స్థలములయం దుత్తరపదపరకసమాస ములఁగానే వీనిని వ్యాఖ్యానించిరి; అవి విమర్శనీయములు. ఇట్లు శ్రీ శాస్త్రులుగారి యాక్షేపము లన్నిటికిని సమాధాన మొసఁగితిని. వారి వాదము ప్రామాదికమని సప్రమాణముగా నిరూపించితిని. ఇంతటితో దీనిని ముగించి విషయాంతర మందుకొనెదను.

(సశేషము)

# పూవులు

"చారుబాల"

నీలిమబ్బులవోలు కాంతల
కేశపాశములందు వాసవ
చాపరీతిగ నమరజాలెడి
చారుతామధులసితముల్.

కాలి అందెల కలరవంబుల
పాణి కంకణ నిక్వణమ్ముల
తోడుగా నీ కుసుమ సౌరభ
మలరు సౌభాగ్యాంకమై.

భక్తి భావన తోడ నారా
ధనము చేసెడి ధన్యజీవులు
హృదయ మంతటితో నొసంగెడి
కాన్క లియ్యవి స్వామికై.

ఎవరు నింపిరి జలధి జలముల
నెవరు పఱచి రనంత వ్యోమము
సీ సుమమ్ముల సృష్టిచేసిన
వాడు వాడేలే.

అనిలవేగ మ్మనలతేజ
మ్మతి భయంకర మేఘ గర్జయు
ప్రసవముల లాలిత్య మొక్కని
సృష్టియందలి మాయలా!

తాను మలచిన విశ్వశిల్పస
మీక్ష చేసెడి శిల్పకారుని
సురుచిరస్మిత మధురిమల్ భువి
వరలెనేమో పూవులై!

# ధనంజయ ప్రవరుడు; కవుల ప్రయోగములు

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

పూజ్యులు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు—1960 నవంబరు 'భారతి' లో—"ధనంజయ ప్రవరు—కరమ్ము (అర. 1. 332) అను అచ్చు ప్రతి పాఠము తప్పు. 'ధనంజయ ప్రవరుడు' అనునది 'రామకూరుడు' అన్నట్లు తల క్రిందు సమాస మగును. అట్టి సమాసములు భాషలో లేవు. నన్నయ ఇతరత్ర ప్రయోగించినట్లు కనబడదు. కాబట్టి 'ధనంజయ—ప్రవరకరము' అని సవరించవలె" నన్నారు.

'ధనంజయుడు' సంజ్ఞావాచకము గావున 'ప్రవరుడు' అను విశేషణమును దాని వెనుక చేర్చి, 'ధనంజయ ప్రవరుడు' అని సమాసము చేయుట వ్యాకరణ విరుద్ధమని వారి యభిప్రాయము.

నేను, 1961 మార్చి 'భారతి' లో—"అటువంటి ప్రయోగములు తెనుగు కావ్యములలో కావలసినన్ని యున్నవి. కావున ఆ పాఠమును సవరింప నవసరములే" దని చెప్పి, నన్నయ గ్రంథము నుండియు, ఇతర ప్రబంధముల నుండియు పదారు ప్రయోగములు చూపించినాను. నా వలెనే* శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తిగారును ఆ పత్రికలోనే—మరికొన్ని ప్రయోగములు చూపి, 'ధనంజయ ప్రవరుడు' అనుటలో తప్పేమియు లేదని చెప్పినారు. ప్రయోగము లున్నవి గనుక 'ప్రవరు—కరమ్ము' అను అచ్చుప్రతి పాఠమును 'ప్రవర కరమ్ము' అని సవరింప నక్కరలేదని తేలిపోయినది. ఇక ఆ పాఠమును గూర్చి వాద మేమున్నది ?

శ్రీ శర్మగారు ఆ వాదము నంతటితో పోనీయక "ధనంజయ ప్రవరకరమ్ము—బలియుడు పీనిన్" అను శీర్షికతో 1961 డిసెంబరు భారతిలో, మరల నొక పెద్ద వ్యాసమును ప్రకటించినారు. అందు, "ధనంజయ ప్రవరుడు—తప్పు కాదనుటకు చూపబడిన ప్రయోగములును తప్పులే" అన్నారు. ఇది ఇంకొక వాదము. పెద్దలు, అనరాదు గాని, అక్రమ వాదమునకు దిగినారు. మహాకవుల ప్రయోగములకు వ్యాకరణములును తలలు వంచుచుండగా, మన మేదో వాదము కొరకు ఆ ప్రయోగములు తప్పు లనవచ్చునా ? అనినను చెల్లునా ? ప్రామాణిక ప్రయోగములను బట్టి మనతప్పును సవరించు కొనవలసినదే గాని, ఆ ప్రయోగములు తప్పు లనుట తగదు. అది వాదక్రమము కాదు.

ఒకవేళ, శ్రీ శర్మగారి ఆక్షేపములు సరియైనవే యైన, మేము చూపిన ప్రయోగములు తప్పులని తేలినను, అందుకు ఉత్తరవాదులు ప్రయోక్త లగుదురేమో గాని, మేము గాము. కావున, వారి విమర్శలకు మేము సమాధానములు చెప్ప నవసరము లేదు.

కాని, మహాకవుల రచనలను తప్పు లన్నప్పుడు, అవి నిజముగా తప్పులేనా ? తప్పు లన్నవారు చూపిన ఉపపత్తులు ఒప్పదగినవేనా ? అని విచారింపక, ఉపేక్షించుట సాహిత్యోపాసక ధర్మము కాదు గావున, వారి వ్యాసమును చదివినపై నాకు తోచిన సత్యమును ఇక్కడ తెలుపుచున్నాను.

'ప్రయోగములు లే' వన్న తమ మొదటి వాదము వీగి పోవుటవలన గలిగిన పట్టుదలతో, వా రా ప్రయోగములు తప్పు లన్నారే గాని, అది సత్యముకాదు. ప్రాచీనకవుల రచనలేమి ! తప్పు లగుట యేమి ! ఆ ప్రయోగములైనను ఒకటా ? రెండా ? ఇంచుమించు ఇరవై. అవియును ఒక్క కవివి కావు. పెక్కు కవులవి. ఆ కవు లందరును వ్యాకరణజ్ఞానము లేక 'ఆ సమాసమునే' తప్పుగా కూర్చినా రనుట ఒప్పదు గదా ! వ్యాకరణరీత్యా అది నిజముగా అసాధువైనను, పలువురు కవు లనుమతించి ప్రయోగించినారు గనుక ఒప్పే గాని, తప్పు కాదు.

"శాస్త్రప్రయుక్త వచసో శ్శాస్త్రం బలవ దుచ్యతే
అవిప్పస్టే పదే తేన ప్రయోగాశ్రయణం హితమ్"

అని అథర్వణుని వచనము. (సంజ్ఞా. 31.)

అసలు తెలుగు భాషకు ప్రాచీన కవుల ప్రయోగములే ఆధారము. ఇది భాషా తత్త్వవేత్త లొప్పినమాట.

"తొలిబాసయందు బలె నీ
తెలుగుంబాస వెలయించు దీపము లేమిన్
విలువగల కవుల లక్ష్య
మ్ములె తా మీ భారమెల్ల మోయఁగ వలయున్"

అన్నారు శ్రీ తిరుపతి వేంకట కవులు. (పాణిగృహీత. 1. 17)

"లక్ష్య పరిజ్ఞానము చాలని లక్షణపరిజ్ఞానము అంత శ్లాఘ్యముకా" దన్నాడు చిన్నయసూరి.

కాబట్టి, ప్రాచీనకవి ప్రయోగములను తిరస్కరించుట సరిగాదు. లక్ష్యలక్షణ పరిజ్ఞానమూ, ప్రతిభావ్యుత్పత్తులూ కలవారికే గాని, కావ్య కృద్వానము అవగతముకాదు. ఈ విషయమునుగూర్చి శ్రీ శర్మగారే తమ మొదటి వ్యాసములో :—

---

*శ్రీరామమూర్తిగారి పేరును, శ్రీ శర్మగారు పేర్కొన్నారు గాని, ఆ వ్యాసము క్రింద రచయిత పేరు లేదు.

"సాధ్వసాధు పాఠములు నిర్ణయించుటకు భాషా వ్యాకరణ పాండిత్యము మాత్రము చాలదు. పాండిత్యముచేత శబ్దార్థముల ఔచిత్యము, కవిహృదయము అనుభవమునకు రావు. అట్టి యనుభవ జ్ఞానమునే వ్యుత్పత్తి యందురు. వ్యుత్పత్తి హేతువాదమును మీరినది. సహృదయత దాని మూలము. దాని విలువగూడ సహృదయులకే"—

అని చక్కగా చెప్పియున్నారు. చెప్పుటయే కాదు. తమ పూర్వ విమర్శలను చాలవరకు—తమ ఈ వాక్యములకు లక్ష్యములుగానే నడిపియున్నారు. ఈ 'ప్రవర' శబ్ద ప్రయోగ విచారణమున మాత్రము, కేవల హేతువాదము నవలంబించినారు. ఇది వారి నిర్వచనమున కనుగుణముగాని పని. హేతువాదము మూలమున వారి అర్థ వివరణాదులు సాహిత్య సంప్రదాయ దూరములై, వారి ప్రాజ్ఞతకు వెలితి వాపాదించుచున్నవి.

వారి వ్యాసము సుదీర్ఘము.(9 పుటలు). కావున, అందలి ప్రతి యంశమును పరామర్శింప పూనుకొన్నచో నా వ్యాసము దాని కిబ్బడియో, ముబ్బడియో అయి, పాఠకులకు విసువు పుట్టించునన్న భయముచేత, వారి వాక్యములు కొన్ని మాత్రమే యెత్తి చూపి, వాటి తత్త్వము సంగ్రహముగా వివరించుచున్నాను.

## 1. 'అస్వారస్యము'

"ధనంజయప్రవరు—కరమ్ము" అను ముద్రిత పాఠము మీద నాకు తోచిన అస్వారస్య మిట్టిదని పై యిరువురు పండితులును చక్కగా గమనించినట్లు కానరాదు. సంజ్ఞావాచకము మొదటిదిగా, దాని విశేషణము రెండవదిగా, విశేషణోత్తర పదకర్మధారయము చేయుట సంస్కృత భాషా సంప్రదాయమున సరికాదనుట నా యాశయము. అట్లు సమాసము కూర్చుట కాకరము (పాణినీయమున) కానరాదు" అని శ్రీ శర్మగారి వాక్యము.

ఈ వాక్యము వారి తొలి యాక్షేపమునకు భిన్నము. 'ధనంజయ ప్రవరుడు' అనునది 'రామకూరుడు' అన్నట్లు తల క్రిందు సమాసమనియు, అట్టివి భాషలో లేవనియు తొలి యాక్షేపము. వారు ప్రయోగములు లే వన్నందువలననే, మే మా ప్రయోగములు చూపినది.

ఇప్పుడు ఆ సమాసము సంస్కృతభాషా సంప్రదాయమున సరికాదనుట తమ యాశయ మనియు, తమకు తోచిన అస్వారస్య మట్టిదనియు, అది మేము సరిగా గమనింపలే దనియు అనుచున్నారు.

మొదటి ఆక్షేపము పొల్లపోవుటచేత వాదమును ఈ విధముగా మరియొక త్రోవకు త్రిప్పినారు. కాని, ఇదియును సరియైన వాదముకాదు.

ఆంధ్రభాషలోని సమాసమును, సంస్కృతభాషా సంప్రదాయముతో సరిచూచుటయు, పాణిని సూత్రముతో కొలిచి సరిపడలే దనుటయు చెల్లదు. తెనుగు సమాసపు కూర్పునకు ఆకరమును వెదకవలసినది తెనుగు కావ్యములలో గాని, పాణినీయములో కాదు.

'ధనంజయ ప్రవరుడు' ఆంధ్రభాషా సంప్రదాయము ప్రకారము సాధువే. అందు తమకేదో అస్వారస్యము తోచినదని సవరింపరాదు. సాధు పాఠ నిర్ణయమునకు సవరణకర్త అభిప్రాయమే ప్రమాణముకాదు.

## 2. 'పాండవవరులు'

"నన్నయగారి 'పాండవవరులు' (3. 1—378) అను ప్రయోగ మొకటి నా యభిప్రాయమునకు కంటే గడుపుగా మున్నదని అంగీకరింతును. యతిస్థానమున అతుకుకొని యున్నది గావున సవరణ చిన్నదిగా సూచింపనుగూడ వీలులేదు. పాఠాంతర మున్నదేమో పరిశీలింపవలెను. మరి అక్కడను పాండవ శబ్దము ధనంజయ పదమువంటి సంజ్ఞావాచకముగాదనుటయు మనము మరవరాదు" అని వారి వాక్యము.

నేను చూపిన ప్రయోగము కంటేగడుపుగా నున్నదని అంగీకరించియు, తమ వాదము నట్లే సాగించుట సరసపరణి కాదు. పాఠాంతరమున కానపడుట వాదదౌర్బల్యమునకు తార్కాణము. చిక్కిన ప్రయోగ మొక్కటియే అయి, సందేహము తీరనప్పుడు, సందేహ నివృత్తికి పాఠాంతరము వెదకవలెగాని, ప్రయోగము లనేక మున్నప్పుడు వెదక నక్కరలేదు. "యతిస్థాన ప్రయోగము గనుక సవరించుటకును వీలులే"దనుట వలన, వీలున్నయెడల, సవరించు తలంపున్నట్లు తెలియుచున్నది. అట్టి తలపు తగదు. వీలున్నను కవి పాఠమును మన వాదమున కనుకూలముగా సవరించుట తప్పు. అది గ్రంథకర్త కపచారము చేయుట యగును. అట్టి సవరణల వలననే ఎన్నో మంచి పాఠములు మారురూపువడి యున్నవి.

పాండవ శబ్దము సంజ్ఞావాచకముకాదు. విశేష్యమే. అయినను 'పాండవవరులు' విశేషణోత్తర పద కర్మధారయమే. 'శ్రేష్ఠులైన పాండవులు' అనియే అర్థము. 'పాండవులయందు శ్రేష్ఠ'లనుట కుదురదు.

నన్నయ 'పాండవ ప్రవరులు' అనియును ప్రయోగించియున్నాడు.

"పాండవ, ప్రవరుల కెల్లప్రొద్దును శుభంబ తలంతురు కాదె నెమ్మితోన్" (ఆది 8—56.)

"పాండవ ప్రవరులకున్—శ్రేష్ఠులైన పాండవులకు" అని చదలువాడ సుందరరామశాస్త్రిగారి టీక.

'పాండవ' శబ్దము సంజ్ఞావాచకము కాకపోయినను—'పాండవవరులు'—'పాండవ ప్రవరులు' అను రెండు ప్రయోగములును 'ధనంజయ ప్రవరుడు' వంటివే నని పర్యవసానము.

వా రిట్లందురనియే నేను 'పాండువరుడు' అను ప్రయోగమును గూడ ఇచ్చినాను. వారు దానిని గూడా ఒక వక్రమార్గమున త్రోసివుచ్చినారు.

## 3. 'పాండు వరుడు'

"పాండువరుఁడు పేర్మితో వివాహమయ్యె" అనునెడ, 'పాండు వను వరుడు=పెండ్లికొడుకు' అను నర్థము సుగ్రహము" అన్నారు వారు.

'వరుడు=పెండ్లికొడుకు' అను అర్థమునకు పాండిత్యముతో పనిలేదు. ఆ యర్థ మిక్కడ అనువుపడునా? అను విషయము పండితులైనవారు విచారింపవలసినది. దీనితత్త్వము తరువాత తెలియవచ్చును. మున్ముందు 'పాండువరుడు' అను సమాసము సంగతి విచారింతము.

వారు, "పాండువరుడు=పాండు వను పెండ్లికొడుకు" అన్నారు. ఆ యర్థము ప్రకారము, అది సంభావనా పూర్వపద కర్మధారయము కావలెను.

అట్లగుటకు 'వరుడు' అను పదము 'పర్వతము'—'వృక్షము'వంటి జాతి వాచకమై యుండవలె. పర్వతజాతి, వృక్షజాతి కలదుగాని 'వరజాతి' లోకమున లేదు. కావున 'వరుడు' జాతి వాచకము కాదు. అందువలన, అది సం. పూ. కర్మధారయము కాదు.

మరియు 'పాండువు' అను వరుడు—'పాండువరుడు' అగునేని, పాండువు అను జనకుడు—'పాండు జనకుడు'; పాండువు అను పుత్రుడు—'పాండుపుత్రుడు' అగుటయు నుండవలె. ఉన్నదా? అట్టి ప్రయోగములు నా కగపడలేదు. శ్రీ శర్మగారైనను చూచియుందురా!

ఇక "వరుడు=పెండ్లికొడుకు" అను అర్థము సంగతి—నే నుదాహరణగా చూపిన పద్య మిది—

"పృథయను కన్యక, నధిక వీర్యుఁడై స్వయంవరమునఁ
బడసి పరనరేంద్రపరిభావి యు ప్పాండు
వరుఁడు పేర్మితో వివాహమయ్యె" (ఆది 5.34)

"వివాహమయ్యె" అను మాట ఉన్నందున, స్థూల దృష్టి, తటాలున 'వరుడు=పెండ్లికొడుకు' అనుకొనును. కాని, అర్థపరిశీలనశీలుడైన పండితు డట్లనుకొనడు. పద్యమును చదివి, అచటి సందర్భమును, కవి హృదయమును గమనించి, సరియైన అర్థమునే ఊహించును.

నేను 'వర' శబ్దమునకు 'పెండ్లికొడుకు' అను నర్థముండుట యెరుగక, 'శ్రేష్ఠుడు' అని యర్థము చెప్పినట్లు తాము భావించుకొని, శ్రీ శర్మగారు "పెండ్లికొడుకు అను నర్థము సుగ్రహము" అని సుస్మితముగా ఎత్తిపొడిచినారు. అందువలన అడుగుచున్నాను.

అధికవీర్యుడై, స్వయంవరమున పరనరేంద్ర పరిభావియై, పృథను పడసినవాడు 'పాండుడు' కాడా? పెండ్లికొడుకేనా? పాండుడు స్వయంవరమునకు వచ్చునపుడే, పెండ్లికొడుకై వచ్చినాడా? లేక స్వయంవరమున పెండ్లికొడుకు వేషము వేసికొని, పరనరేంద్రులను పరిభవించి, పృథను పడసినాడా! పృథను పడయకముందే అతడు పెండ్లికొడుకై యున్నట్లు లోకవృత్త మెరిగినవారు భావింపరు. వివాహకాలమున పెండ్లికొడుకును చేయుదురుగాని, పెండ్లికి పూర్వమే ఎవడును పెండ్లికొడుకై యుండడు.

"ఇవ్విధంబున రుచికము నీంద్ర చంద్రుఁ
బెండ్లికొడుకునుజేసిరఁ బ్రేమమీఱ"
(దశ. చ .6—28)

ఇత్యాది రచనలు, ఈ యాచారమును దెల్పునవి కావ్యములలో ఎన్నో యున్నవి. కాబట్టి పిల్ల కుదరకముందే పాండుడు పెండ్లికొడుకైనాడనుట హాస్య హేతువైన మాట.

ఇంత వివరణ మెందుకు? "స్వయంవరమున పృథను పడసి వివాహమయ్యె" అను వాక్యమున కర్తృపదము 'పాండు' డగునేకాని, 'పెండ్లికొడుకు'కాదు.

నన్నయ, 'పాండు' శబ్దమునకే 'వరుడు' ((శ్రేష్ఠుడు) అను విశేషణమును చేర్చి, "పాండువరుడు—వివాహమయ్యె" అన్నాడు.

పాండువరుడు=పాండురాజు, స్వయంవరమున, పృథను పడసినాడనియు, తరువాత ఆమెను వివాహమైనాడనియు నన్నయ రచనకు అర్థము. అంతేగాని, 'పాండు వను పెండ్లికొడుకు—వివాహమైనా'డని కాదు.

'పెండ్లికొడుకు ఆపిల్లను పెండ్లి చేసుకొన్నాడు' అనిగాని, 'పెండ్లికూతురిని వాడు పెండ్లి చేసుకొన్నాడు' అనిగాని తెనుగు వా డనడు. నన్నయ్య అట్టి రచన చేయడు. కాబట్టి, 'వరుడు=పెండ్లికొడుకు' అను అర్థము సరిపడదు.

శ్రీ శర్మగారు పద్యమును సరిగా పరికింపక, 'వరుడు=పెండ్లికొడుకు' అన్న అర్థమును అలవోకగా చెప్పియుండవచ్చును గాని, వాదముకొరకు అనుచితములును—అసభ్యములును నగు అర్థములు కల్పించి చెప్పు పండితులు లేకపోలేదు. ఇందు కొక దృష్టాంతము చెప్పుచున్నాను.

ఒక సందర్భములో 'శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులు గారు (తర్కాలంకార వేదాంత పండితులు) 25—12—1960 'ఆంధ్రభూమి'లో—

"నన్నేలిన దేవయానికి నరేశ్వర! భర్తవుగాన నాకును
బోలఁగ భర్త వీవ" (ఆది. 3—174)

అను పద్యములోని సంబోధనను గూర్చిన చర్చలో—

"ఇక్కడ 'నరేశ్వర' అనేది సంబోధన అనుకోవడం పద్యం సరిగా అర్థము కాకనే. 'నరేశ్వర భర్త' అనేది ఏకపదం—అది. "రాజవైనమగడవు" అని దాని యర్థం. ఈ పద్యంలో ఇంకను జాల మంచి సారస్యం వుంది. కాని భాషామాత్రసేవకులకు తెలియరాదు."అన్నారు.

సరియైన వాదమేనా? దేవయానికి 'రాజైన మగ' డొకడూ, 'రాజుగాని మగ' డొకడూ—ఇద్దరు—మగ లున్నారా?

వా రిట్టి అసభ్యపు అర్థము కల్పించి చెప్పుటకు కారణమేమి? ఏమనగా: వారు, "నన్నయ పద్యములలో వాక్యమధ్యమున సంబోధన ముండ" దన్నారు. నేను, 'అట్టి సంబోధన లున్న'వని చెప్పి, ఆ పద్యమును (మరికొన్ని పద్యములు కూడా) చూపించినాను. వారు తమ వాదమును నిర్వహించుకొనుటకు కల్పించిన అర్థమిది. ఇట్టి వింకను చాల కలవు. (చూ. 5—8—1961 కృష్ణా పత్రిక.)

ప్రాజ్ఞులును, ఒక్కొక్కప్పుడు వక్రవాదములకు, కుతర్కములకు దిగుట కల దనుటకు ఈ దృష్టాంతమిచ్చినాను. పెద్ద పెద్ద శాస్త్రపండితులు పెడవాదములకు దిగినప్పుడు మావంటి భాషామాత్ర సేవకులు చేయగల్గిన దేమున్నది.

## 4. 'కందర్ప ప్రవరుడు'

"ఇందమని యుంద మనుమని
కందర్ప ప్రవరభీతిఁ గడతేర్పక" (కకుత్స్థ 3—122)

ఇది నే నిచ్చిన ప్రయోగము. దీనినిగూర్చి శ్రీ శర్మగారు ఈ క్రింది విధముగా వ్రాసినారు.

"కకుత్స్థ విజయము నాకు పరిచితమైన గ్రంథము కాదు. కవి చరిత్రములలో ఎత్తిచూపబడిన అందలి పద్యాలు కొన్ని చూచినాను. సంస్కృతాంధ్రములు రెంటియందును దిట్టమైన చొరవగలది ఆ రచన యనిపించినది. అందలి 'కందర్ప ప్రవర' అనుమాట 'ధన జయ ప్రవర' అనుదానివంటిదే యగును. అసాంప్రదాయికము."

ప్రయోగ గ్రహణమునకు గ్రంథము పరిచితమై యుండ నక్కరలేదు. ఆ ప్రస్తావ మనవసరము. కకుత్స్థ విజయ రచనపై మన మీనాడు అభిప్రాయ మొసగుటయు అనవసరమే. "గ్రంథకర్త గట్టి పాండిత్యము గలవా"డని మెచ్చుటయు, వెంటనే అతని ప్రయోగము "అసాంప్రదాయిక" మనుటయు, ఒండొంటితో అతుకని మాటలు. 'ధనంజయప్రవరుడు' వంటి ప్రయోగములు భాషలో లే వన్నవారు, అచ్చము దానివంటిదే అయిన ప్రయోగమును చూపినప్పుడును తమ వాదములోని లోపమును ఒప్పుకొనకుండుట, కేవలాభినివేశ మగును. "దానివంటిదేయగును. కాని అసాంప్రదాయికము" అనుట సాంప్రదాయికముకాదు.

శ్రీ శర్మగారు 'పాండవవరులు' అను ప్రయోగములో 'పాండవ' శబ్దము సంజ్ఞావాచకముకా దని వంకపెట్టినారు. 'పాండువరుడు' అను ప్రయోగములో 'వరుడు' శ్రేష్ఠవాచకము కాదని వంక పెట్టినారు. 'ఈ కందర్ప ప్రవరుడులో' ఏ వంక పెట్టుటకును, ఎడములేక, పూరక "అసాంప్రదాయిక" మన్నారు. "దీని భావమేమి.........."

## 5. 'విదుర రాజు'

నేను 'విదురరాజు' అను ప్రయోగమునిచ్చి, ఈ సమాసమున 'రాజు' శ్రేష్ఠ వాచక మన్నాను.

శ్రీ శర్మగారు, ఇట్లు ఆక్షేపించినారు—

"విదురరాజు (ఆది 5—157) అనుచో 'విదురుడను రాజు' అని విగ్రహము చూపుటయే సరి. "ఇక్కడ రాజు శబ్దము ప్రభువాచకముకాదు. శ్రేష్ఠ వాచకము" అని శాస్త్రిగారేల సాధింతురో తెలియదు. విదురుడు రాజుకా డను కొన్నారేమో! కాని మూల భారతము'

'తథా పాండు ర్నరపతిః సత్యసంధో జితేంద్రియః
రాజా కురూణాం ధర్మాత్మా సువ్రత స్సుసమాహితః
జ్యేష్ఠాయ రాజ్య మదదాత్ ధృతరాష్ట్రాయ ధీమతే
యవీయసే తథా క్షత్త్రే కురూణాం వంశవర్ధనః'
(మ. భా. ఉ. 148—3, 4)

అని స్పష్టముగ నున్నది. రాజ్యము నతడు చెలాయించెనో లేదో తెలియదు. కాని రాజత్వము మాత్ర మతనికి లేకపోలేదు."

శ్రీ శర్మగారు తాము చూచిన శ్లోకములనుబట్టి విదురునకు రాజత్వ మున్నదనుకొన్నారు గాని, వాస్తవమునకు లేదు. వారిచ్చిన శ్లోకములు, 148 వ అధ్యాయములోనివి కావు. 147 వ అధ్యా. లోనివి. వాటి క్రిందనే ఈ క్రింది శ్లోకము లున్నవి.

"పీఠే స్థిత్వా తు విదుర ఉపాస్తే స్మ వినీతవత్
ప్రేష్యవ త్పురుష వ్యాఘ్ర వాలవ్యజన ముత్క్షిపన్"(6)
"విసృజ్య ధృతరాష్ట్రాయ రాజ్యం స విదురాయ చ
చచార పృథివీం పాండుః సర్వాం పరపురంజయః" (8)
"కోశసంజననే దానే భృత్యానాం చాన్వవేక్షణే
భరణే చైవ సర్వస్య విదుర స్సత్య సంగరః" (9)
"సింహాసనస్థో నృపతిః ధృతరాష్ట్రో మహాబలః
అన్వాస్యమాన స్సతతం విదురేణ మహాత్మనా" (11)

పాండుడు రాజ్యమును ధృతరాష్ట్రునకును, విదురునకును వదలివేసి వెళ్ళిపోయినా డనియు, అందువలన ధృతరాష్ట్రుడు రాజైనా డనియు, విదురు డాతనిక్రింద సేవకుడుగా నుండి, వింజామర వీచి, వినీతుడై సేవించుచు, అతని యాజ్ఞ మేరకు పనులు చక్కబెట్టినాడనియు శ్లోకముల తాత్పర్యము.

'విదురుడు (ప్రేష్యవత్) సేవకునివలె ధృతరాష్ట్రుని సేవించినా'డని మూల భారతము చెప్పుచుండగా, "అతడు రాజ్యమును చెలాయించినాడో లేదో తెలియ"దనుటయు, అది తెలిసికొనకయే "అతనికి రాజత్వము మాత్రమున్న" దనుటయు ఋజువాదము కాదు.

ఇంతయేందుకు! రాజ్య వ్యవహారములు నిర్వహించినవాడు భీష్ముడని ఆ పట్టుననే చెప్పబడియున్నది.

"సంధి విగ్రహ సంయుక్తో రాజ్ఞ స్సంవాహనః క్రియాః
అవైక్షత మహాతేజా భీష్మః పరపురంజయః"(147.10)

ధృతరాష్ట్రుడు—రాజు. భీష్ముడు—రాజ్య వ్యవహార విచారణకర్త. విదురుడు—వారి యాజ్ఞల ననుసరించి సేవక ధర్మముగా పనులు చేసినవాడు. అంతేగాని, అతనికి రాచరికములేదు.

విదురుడు రాజుకాడు గనుక, 'విదురుఁ డను రాజు' అని విగ్రహము చూపుట సరికాదు.

మూలములో అతనికి, పురుషవ్యాఘ్రుడు మహాత్ముడు అను విశేషణములు చెప్పఁబడినవి. అందువలన నన్నయ 'విదుర శ్రేష్ఠుడు' అను నర్థమున 'విదురరాజు' అన్నాడు. 'రాజు' శ్రేష్ఠ వాచకమేగాని, రాజవాచకము కాదు.

నన్నయ 'విదురరాజు' అన్నట్లే 'యమరాజు' అనియును అన్నాడు.

"అభిషిక్తుఁడైన యయ్యమరాజసుతునకు"

(సభా. 2—119)

యముడు రాజులలోనివాఁడు కాడు. కావున, 'యముఁడను రాజు' అను విగ్రహము సరిపడదు. 'శ్రేష్ఠుఁడైన యముఁడు' అనియే చెప్పవలె. శ్రీ శర్మగారి వాదమున కిది ప్రతికూలము. అందువలన అట్లు చెప్పరా దన్నారు. (చూ. 'యమనాథుడు' అను పదము క్రింద)

## 6. 'య మ నా థు డు'

శ్రీరామమూర్తిగారు—"జనా, నందనకీర్తియైన యమనాథ తనూజున కిష్టమిత్రుఁడై" (సభా 2—111) అను పద్యమును చూపి, "ఇందలి 'యమనాథ' సమాసము సంగతి యేమి?" అన్నారు.

శ్రీ శర్మగారు చెప్పిన సమాధాన మిది :—

"విష్ణునాథుడు, శివనాథుడు—ఇట్టి ప్రయోగము లుండవు.—ఉత్తరదేశమువారైన కొందరి సంజ్ఞలందు తప్ప. అదియును 'నాథ' యోగి సంప్రదాయము ప్రకారము వచ్చి చేర్చిన సంజ్ఞాపదము గావచ్చును. పై నన్నయగారి 'యమనాథ' పద మట్టిది. ఇందలి నాథపదము యతిస్థానమున కక్కుర్తిగా పడిన ఉదాసీన ప్రయోగము కాగలదు. ఇంద్రనాథుడు, అగ్నినాథుడు, భీష్మనాథుడు, నకులనాథుడు అన్నట్లు, నన్నయగారును తరువాతివారును ధారాళముగా వాడుకొనియుండిరేని శ్రీరామమూర్తిగారివలె నేనును ఇట్టి ప్రయోగము 'సంస్కృత భాషలో బహు సహజమైన విషయము' అని యూరకుందును. అట్లు లేదు గనుక పై యమనాథ పద ప్రయోగము సంప్రదాయ సిద్ధము కా దనక తప్పదు. 2—2—119 పద్యమందలి 'యమరాజ' పదమును ఇట్టిదే."

శ్రీ శర్మగారి విమర్శలో, అసలు విషయము తక్కువ. అనవసర చర్చలు ఎక్కువ. అందువలననే వ్యాసమంత పొడుగైనది. ఆ చర్చలను గట్టిగా పట్టిచూచిన విలువగలవికావు. ప్రకృత విషయమునే పరికింతము.

శ్రీ రామమూర్తిగా రడిగినదేమని? 'యమనాథుడు' అను సమాసము 'ధనంజయ ప్రవరుడు' వంటిది అవునా? కాదా? అని.

ఆ ప్రశ్నకు చెప్పవలసిన ఉత్తరము 'అవు'నని, 'కా'దనో ఏదో ఒక మాటయే కదా! ఆ ఒక్కమాటతో పోయేదానికి, ఎంత గ్రంథము పెంచినారో చూడండి:—

1. "విష్ణునాథుడు, శివనాథుడు ఇట్టి ప్రయోగము లుండ" వన్నారు. ఉండని ప్రయోగముల ఊసు ఎందుకు? ఉండిన ప్రయోగముల విషయమేగదా మనము విచారించవలసినది?

2. "నాథ పదము ఉత్తరదేశమువారైన కొందరి సంజ్ఞలయందే ఉండు" నన్నారు.

దక్షిణదేశమువారి సంజ్ఞలయందు ఉండదా?—

పాల్కురికి సోమనాథుడు (కర్ణాటదేశము); నాచన సోమనాథుడు (కడప మండలము); శేషనాథార్యుడు (శ్రీ పర్వత పురాణకర్త. కర్నూలు మండలము); మల్లినాథుడు (ఓరుగల్లు ప్రాంతము); ఏకనాథుడు (కిరాతార్జునీయ వ్యాఖ్యాతలలో ఒకడు. ఎక్కడివాడో!); విజయరంగ చొక్కనాథుడు (మధుర రాజ్యము నేలినవాడు); నిశినాథకవి. రాజనాథకవి. చొక్కనాథమఖి. (ఈ ముగ్గురును తంజావూరురాజుల ఆస్థానములలో ఉన్నవారు).

కనుక, 'నాథ' పదము దక్షిణదేశమువారి సంజ్ఞలలో ఉండ దనుట సరిగాదు.

3. "ఉత్తరదేశమువారి సంజ్ఞలలోని 'నాథ' పదము, 'నాథయోగి' సంప్రదాయము ప్రకారము వచ్చినది కావచ్చు" నన్నారు.

"కావచ్చు"నని ఊహయేగాని, నిర్ధారణకాదుగదా! వట్టి ఊహ కేమి విలువ?

దక్షిణదేశమువారి సంజ్ఞలలోను 'నాథ' పద మున్నదిగదా! ఇది యే సంప్రదాయము ప్రకారము వచ్చినది?

అది యట్లుండనిండు. అసలు ఆ 'నాథయోగి' శబ్దములోని 'నాథ' పదము, ఏ సంప్రదాయము ప్రకారము వచ్చినట్లు? ఇవి ఊహల కందే విషయము లేనా? తేలని విషయముల జోలి యేల?

4. "నన్నయగారి 'యమనాథ' పదమును అట్టిదే" అన్నారు. అది యెట్టిదో తేల్పకయే "ఇదియును అట్టిదే" అను టలో అర్థమేమి?

5. "నాథ పదము నన్నయ యతి కక్కుర్తికి వాడినది కాగల" దన్నారు.

ఇది వాదపు కక్కుర్తికి అన్నమాటయేగాని, నిజము కాదు. 'నన్నయ యతి ప్రాసలకు కక్కుర్తిపడి, వ్యాకరణ దుష్ట ప్రయోగములు చేయు—తక్కువ తరగతి—కవి' యను మాట విజ్ఞుల విమర్శలో నిలుచునది కాదు.

ఇవీ—వారి చర్చల స్వరూప స్వభావములు. ఇవి యన్నియు కేవల మప్రసక్తములు. యమనాథ పద మెట్లు పుట్టిన నేమి? నన్నయ యెందుకు వాడిన నేమి? ఆ విచారణ యిపు డెందుకు?

ప్రయోగ మున్నదా? లేదా? అది 'ధనంజయ ప్రవరుడు' వంటిది అగునా? కాదా? దానివంటిదే అయినప్పుడు, ఉదారముగా ఒప్పుకొనుట యుచితముగాని, తప్పనిపింప యత్నించుట యుచితము గాదు.

ఆ ప్రయోగము నొప్పుకొన నిష్టములేక, కాదన వీలులేక ఎన్ని లోపము లారోపించినారో, అవి యెట్టివో చూడుడి.

1. "నన్నయ ప్రయోగము అది ఒక్కటియేగాని, ఎక్కువలే" నన్నారు. కాదనవీలుగాని యతిస్థాన ప్రయోగమును చూపిన తరువాత ఇంకను ప్రయోగములు కావలెనని ప్రయోగప్రాచుర్యమునకు విలువ యెగిరిన వారవరు. బుజావాదులును అనరు.

2. "నన్నయయే గాని, ఇతర కవులు 'నాథ' పదమును వాడలే" దన్నారు.

ఇది శ్రీరామమూర్తిగారి వ్యాసమును సరిగా చదువక అన్నమాట. ఆయనగారు, "రామకృష్ణుడు, 'విరూరి వేదాద్రి'ని, 'వేదాద్రినాథుడు' అని యున్నా"డని వ్రాసియున్నారు.

వారి వ్రాత నట్లుండనిండు. వారు సూచించిన 'పాండురంగ' పద్యము సీసము (1.76) అందు, నాలుగు పెద్ద చరణము లలోను, 'వేదాద్రినాథుడు' అను నామ మున్నది. ఆ గ్రంథమునకు శ్రీ శర్మగారు వ్యాఖ్యానము వ్రాయుచున్నారు. చూచి యుండరా! చూచియు "నాథ పదమును ఇతర కవులు వాడలే" దనుటయేల! ఆ ప్రయోగము 'అసాంప్రదాయిక'మని మార్చి యుండరుగదా!

రామకృష్ణుడు 'వేదాద్రిరాజు' (1.72) అనియు వాడినాడు. విరూరి వేదాద్రి, 'రాజు' కాడు. మంత్రి. (నియోగికరణము—అన్నమాట). కాబట్టి, 'వేదాద్రి' అను సంజ్ఞకు, 'నాథుడు'—'రాజు' అనునవి రెండును శ్రేష్ఠార్థక విశేషణములే.

3. "నాథ పదమును కవులు ధారాళముగా వాడలేదు. వాడియున్న నేమను అంగీకరింతును" అని శ్రీ శర్మగారిది మరియొకమాట.

అది పట్టిమాట. 'ధారాళముగా వాడలే'దనుట ఒక నెపము. పాండవ వరులు; పాండవ ప్రవరులు; పాండు వరుడు; దర్పక ప్రవరుడు—అని 'వర—ప్రవర' శబ్దములు ధారాళముగానే ప్రయుక్తములై యున్నవిగదా! అంగీకరించినారా? ఇంక పది ప్రయోగములు చూపినను, ఈ 'నాథ' శబ్దమును అంగీకరించుటయును అంతే.

4. 'యమరాజు' శబ్దమునుగూర్చి వా రిట్లు వ్రాసినారు. "'విదురరాజు'వలె యము డను రాజు అని విగ్రహింపవలెనే గాని, సంజ్ఞావాచకముమీది శ్రేష్ఠ వాచకముగా గ్రహించుట సరి కాదు.......స్థూలముగా రాజ—నాథ పదములు రెంటికిని అర్థ మొకటే యైనను, వాని యుపయోగమందలి ఈ భేదము సంప్రదాయసిద్ధము."

విదురుడు, యముడు, వేదాద్రి—ముగ్గురును రాజులుగా రనియు, అందువలన ఆ నామములమీది 'రాజు' శ్రేష్ఠ వాచకమేగాని, ప్రభువాచకము కాదనియు ఇంతకుముందే తెలుపబడినది. కావున ఇక్కడ మరల చెప్ప పనిలేదు. శ్రీ శర్మగారి లక్ష్యములు సరియైనవికా వని చెప్పిన చాలును.

వారు 'యమరాజు' శబ్దము 'యమనాథుడు'వంటిదే—అన్నారు. నేనును అట్లే అనుచున్నాను. అర్థములోనే తేడా.

## 7. 'పేరుల మార్పతము'

"శ్రీరంగరాయాగ్రణిన్=శ్రీరంగరాయశ్రేష్ఠుని" అని వసుచరిత్ర (1.66) లోను—"కృష్ణదేవరాయాగ్రగణ్యుడు—కృష్ణదేవరాయ శ్రేష్ఠుడు" అని మనుచరిత్ర (1—11) లోను టీక లున్నవి.

నే నీ రెండు ప్రయోగములను, టీకలను ఉదాహరించి, నామవాచకములకు శ్రేష్ఠార్థక విశేషణములను చేర్చుట కల దన్నాను.

శ్రీ శర్మగారు ఇట్లు వ్యాఖ్యానము చేసినారు—

శ్రీరంగరాయాగ్రణి—కృష్ణదేవరాయాగ్ర గణ్య— ఇట్టి వానిలో అగ్రణీ శబ్దము ప్రధాన నాయకవాచకము. 'అగ్రే నీయతే—అగ్రేనయతి' అను వాచ్యార్థములే సమాస విగ్రహమునకు తగినవి. అగ్రగణ్య శబ్దమును ఇట్టిదే. పై సమాసములను ఇంకొక విధముగా గూడ విడదీయవచ్చును.—'శ్రీరంగడు అను రాయాగ్రణి' అని. రాయులందు మొదట పేర్కొనదగినవా డని యర్థము. రాజశబ్దపు ప్రాకృతరూపముగదా 'రాయ' అనునది."

సంప్రదాయార్థము ననుసరించి సమాసము చెప్పవలెగాని, సమాసమును—ఎవరి యిష్టము వచ్చినట్లు వారు—విడదీసి క్రొత్త అర్థము కల్పింపగూడదు.

'శ్రీరంగరాయ+అగ్రణి=శ్రీరంగరాయ శ్రేష్ఠుడు'—విశేషణోత్తరపదకర్మధారయము. శ్రీ శర్మగారు 'శ్రీరంగ+రాయాగ్రణి' అని విడదీసి, సం. పూ. కర్మధారయముచేసి, 'శ్రీరంగడు—అను రాయాగ్రణి' అని అర్థము చెప్పినారు. ఆ వ్యక్తుల పేర్లు 'శ్రీరంగరాయడు' 'కృష్ణదేవరాయడు'గాని, 'శ్రీరంగడు'—'కృష్ణదేవుడు' కాదు. కనుక అట్లు మార్పరాదు.

'రాయడు' అను పదము పేరుతో చేరినదేగాని, ప్రత్యేక పదముకాదు. దాని బహు వచన రూపమే 'రాయలు.'

"ధరావలయముందార్పెఁ గృష్ణరాయఁడు"(మను. 1.33)

"తిరుమల దేవరాయల నుతింపఁ దరంబె" (వసు. 1.49)

ఇత్యాది రచన లట్లుండగా, అథర్వణకారికావళిలో—

"సబిందుకవ్యఙో స్వా ప్నే ని ర్ణిత్య ముపతిష్ఠతే"(అజన్త 110)

"ఉదా :—కామినేనికులము. రంగారాయని వంగడము" అని స్పష్టముగా చెప్పబడియున్నది. వ్యక్తిపేరు 'రంగరాయఁడు' అనియు, అతని వంగడము 'రంగారాయని వంగడము' అనియు అర్థము. షష్ఠీతత్పురుష సమాసము.

ఏ సమాసమునైనను, రంగరాయడు; కృష్ణరాయడు—అను నామవాచకముల నట్లే ఉంచి చెప్పవలె గాని 'రాయ' పదమును వేరుచేసి చెప్పరాదు. అట్లు చెప్పినచో సరియైన

అర్థమే యేర్పడదు. కనుక శ్రీరంగరాయ+అగ్రణి అని చెప్పుటయే సరి.

'శ్రీరంగ+రాయాగ్రణి' అని విడదీసి చెప్పుట సరిగాదు.

ఎందువలన సరిగాదో, ఈ క్రింది రచనలు చదివిన తెలియగలదు—

"శ్రీరంగరాయ క్ష్మాలలనావల్లభుఁడు" (వసు. 1.74)
"కృష్ణరాయ మహీకాంతుఁడు" (మను. 1.36)

ఈ రచనలలోని సమాసములను, 'శ్రీరంగ+రాయక్ష్మావల్లభుడు'—'కృష్ణ+రాయమహీకాంతుడు' అని విడదీసి—'శ్రీరంగడు—అనెడు—రాయక్ష్మావల్లభుడు'—'కృష్ణుడు—అనెడు—రాయమహీకాంతుడు' అని అర్థము చెప్పుట కేవల మనుచితము. భాషా పరిచయముగల వారెవ్వరును అట్లు చెప్పరు.

అందువలననే, టీకాకర్తలు—'శ్రీరంగరాయాగ్రణి=శ్రీరంగరాయశ్రేష్ఠుడు', 'కృష్ణదేవరాయాగ్రణ్యుడు=కృష్ణదేవరాయశ్రేష్ఠుడు' అని చెప్పినారు. ఆ యర్థము తప్పని శ్రీ శర్మగారు సమాసములనుమార్చి, వ్యక్తుల పేర్లుగూడా మార్చినారు. అట్లు మార్చరాదు.

అది యట్లుండగా, 'రంగరాయడు' అను నతనిని 'రాయాగ్రణి'గా చెప్పవలెనంటే, 'రంగరాయ రాయాగ్రణి' అనవలెగాని, రంగరాయని, 'రంగడు'గా మార్చి 'రాయాగ్రణి' అని ప్రయోజనములేదు. అది సంప్రదాయముకాదు. 'రాయ రాయాగ్రణి' అనుటయే సంప్రదాయము. పూర్వకవులు అట్లే అనియున్నారు.

"రాయగ్రామణి కృష్ణరాయ! భవదుగ్రక్రూరఖడ్గాహిచే"
(చాటు. మణిమంజరి. ప్ర. భా. పు. 116)

ఈ క్రింది వాక్యము, 26.8.1527 నాటి కడప మండలములోని తిప్పలూరు శాసనములోనిది. (1962—జనవరి 'భారతి'నుండి గ్రహింపబడినది.)

"శ్రీకృష్ణదేవరాయల మహారాయలవారు అష్టదిగ్గజ కవీశ్వరులకు ధారవోసి యిచ్చిన తిప్పలూరి అగ్రహారమునందు..."
(భారతి. పు. 92)

ఇచట మనము గ్రహింపవలసిన విషయ మింకొకటి యున్నది—'రాయాగ్రణి' అను పదము 'రాయ' అను బిరుదనామముగలవారియందేగాని ఇతరులయందు చెల్లదు.

'రాయ' పదము తెనుగు. అది పేరుతో చేరియున్నప్పుడే గాని, ఇతరత్ర సంస్కృతపదముతో సమసింపదు. 'కదలి రాయడు'—'గట్టులరాయడు' అను పదములకు 'అగ్రణి'ని అతికించి, 'కదలి రాయాగ్రణి'—'గట్టుల రాయాగ్రణి' అనుట వ్యాకరణ విరుద్ధము.

సంజ్ఞతో సంబంధములేని, 'రాయాగ్రణి'—'రాయాగ్రగణ్యుడు', 'దొరాగ్రణి'—'దొరాగ్రగణ్యుడు' అన్నట్లు దుష్టసమాసము లగును. అట్టి సమాసములను బట్టుమూర్తి, పెద్దన వాడినా రనుట భావ్యముగాదు. కావున 'శ్రీరంగ+రాయాగ్రణి' అని సమాసమును విడదీయుటయు 'రాయులందు మొదట పేర్కొనదగినవాడు' అని అర్థము చెప్పుటయు భాషా సంప్రదాయ విరుద్ధము.

వా రీ విధముగానే, నే నిచ్చిన తక్కిన ప్రయోగములలోని సమాసముల నన్నింటిని మార్చి, అసాంప్రదాయికార్థములు చెప్పి, నా విమర్శ నాక్షేపించి, 'త్రోసిరా'జన్నారు. పైగా నామీద ఇట్లొక చిన్న సొడ్డు వేసినారు.

"వారిచ్చిన మౌళి, మణి, చంద్ర, అగ్రణి ఇత్యాది పదములు ఉత్తర పదములుగాగల సమాసములు ఏమాత్రపు తెలుగువారికైనను తెలిసినవే. ఆ యింతమాత్రమైనను తెలియక నే నీ చర్చకు చేయివేసి యుండనని శ్రీ దీపాలవారు ఉదారముగా భావించి యుండవచ్చును" అన్నారు.

ఆ ప్రయోగములు వారికి తెలియవని నేననుకొనలేదుగాని, వాటి సరియైన అర్థమును గమనించియుండరనియు, అందువల్లనే ఈ చర్చకు చేయివేసినారనియు మాత్రము భావించినాను. వారి విమర్శ వ్యాసము వెలువడుటతో, నా భావన సరియైనదేనని స్థిరపడినది. ఇక నా ఉదారభావములో లోపేమున్నది? వారు చెప్పిన అర్థములు సరియైనవికావని నాకు తోచినది. ఆ విషయమును తెల్పి ఉపపత్తులు చూపించినాను. వారు నేను చెప్పిన అర్థము లంగీకరింపక, వాటికి ప్రమాణముగా నేను చూపిన తత్సమచంద్రికను, దానికి మూలమైన గణరత్నమహోదధిని లోతుగా విమర్శించి, తీవ్రముగా విరసించి, దీర్ఘముగా ఆక్షేపించినారు. ఆక్షేప మతి దీర్ఘముగా నున్నందున, వ్యాస విస్తరభీతిచేత ముఖ్య భాగములు మాత్రమే ఉదాహరించుచున్నాను.

"తత్సమచంద్రిక చెప్పవచ్చును, గణరత్న మహోదధి చెప్పవచ్చును. భద్ర, శౌరి, భట్ట, ఇంద్ర ఇత్యాది పదములు శ్రేష్ఠవాచకములని. కాని అవి ఆ యర్థమునకు 'వాచక'ములు కానేరవు. కానేర్చునేని శ్రేష్ఠజాతి అనవలసినచోట 'భద్రజాతి' 'శౌరిజాతి' ఇత్యాదిగా ప్రయోగింపవీలుండవలసి వచ్చును. అట్టి స్వతంత్రత భాషలోలేదు. పై పదములు రూఢిచేతగాని, అర్థ విశేషము తెలుపుటకైగాని భాషలో వ్యాప్తికివచ్చును. కనుక వానిని లక్షకము లనికాని, వ్యంజకములనికాని అనవచ్చును. వాచకము లనుట స్థూలమైన విమర్శ సహము కానిమాట—రామభద్ర శబ్దమందలి భద్ర పదము మంగళకరుడు అను వాచ్యార్థమును పూర్తిగా పోగొట్టుకొని......తెలుగులో అయ్య, అప్ప, అమ్మ అన్న ఇత్యాదులవలె పేరుతో కలిసి కాని, స్వతంత్రముగా గాని, ప్రాచీన వ్యవహారమున నిలిచినది.......కాబట్టి యిప్పుడు 'భద్ర శ్చాసౌ రామశ్చ—రామభద్రః' అని విగ్రహించి సమసించుట అయ్యయైన రాముడు—రామయ్య అని చెప్పబోయినట్లగును. 'తిక్కశౌరి' అనునది రూపక సమాసముగాని ఉపమిత సమాసముగాని కాగలదు. తిక్కడే శౌరి, లేక తిక్కడు శౌరివంటివాడు—అని. అట్లుగాక, శ్రేష్ఠుడైన తిక్కడు అని విగ్రహించుట యే 'టీకాకారులు' చెప్పినను, ఏ వ్యాకరణము చెప్పినను

అని చారితరమణీయమే అనక తప్పదు. అట్లే మౌళి, మణి, లలామ, తిలకాది శబ్దములు ఉత్తరపదములైనప్పుడు విగ్రహింప వలయును."

ఈ తీరున శ్రీ శర్మగారు, పూర్వ ప్రయోగములను, పూర్వ వ్యాఖ్యానములను, పూర్వ వ్యాకరణములను తప్పులుగా సిద్ధాంతించినారే! కారణమేమి? ఏ మున్నది? అవియున్నియు తమ వాదమున కనుకూలింపకపోవుటచేత, అవియే తప్పులన్నారు. మరి వీరి వాదము కనుగుణముగా, అవియన్నియు ఇపుడు సంస్కరింపబడవలసినదేనా? అది సంభవమేనా? ఎన్నటికినికాదు. అది నిరంకుశవాదముగాని, నియమబద్ధమైనవాదము కాదు.

తత్సమచంద్రిక చెప్పిన లక్షణము ఒప్పో, తప్పో నిర్ణయించుటకు నే సమర్థుడను గాను. అది శాస్త్రవిషయము. నా కచుంబితము. అదియునుగాక, తత్కర్త శిరోమణి శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగా రున్నారు. వా రీ విషయమున తమ యభిప్రాయమును పత్రికాముఖమున ప్రకటించుట యుచితము. మావంటి జిజ్ఞాసువుల కది యుపకరించును. ఉదాసీనత వహింపవలదని శ్రీ శాస్త్రిగారికి నేను మనవి చేయుచున్నాను.

శ్రీ శర్మగారి ఆక్షేపములలో కొన్ని సరియైనవి కానట్లు నాకు తోచినది. వాటి నిక్కడ తెలుపుచున్నాను.

(1) వారు భద్రాది పదములను శ్రేష్ఠార్థ 'వాచకము' లనుట తప్పన్నారు.

అథర్వణుడు, "ఆర్యాంబాది శబ్దానాం శ్రేష్ఠార్థవాచకా మతః" (అజన్త. 111) అని, 'వాచక' శబ్దమునే వాడినాడు. అహోబలపండితుడు, (అజన్త 12—సూ) వ్యాఖ్యానములో "రత్నశబ్దస్య శ్రేష్ఠ వాచకత్వమ్" (పుట. 323) అన్నాడు.

'శ్రేష్ఠ—వాచకము' అని శాస్త్రకర్త లందరును అని యుండగా, 'తత్సమ చంద్రిక' అనుట తప్పెట్లగును?

(2) శర్మగారు, "శ్రేష్ఠజాతి—అనవలసినచోట 'భద్ర జాతి'—'శౌరిజాతి' అనుట లేదు గనుక, భద్ర శౌరి పదములు శ్రేష్ఠవాచకములు కా"వన్నారు.

అథర్వణుడు, ఆర్య—అంబాది శబ్దములు శ్రేష్ఠవాచకము లన్నాడు. అమరుడు, వ్యాఘ్ర సింహ శార్దూలాది పదములు శ్రేష్ఠార్థ గోచరము లన్నాడు. 'శ్రేష్ఠజాతి' అను సర్థమున 'ఆర్య జాతి'—'అంబాజాతి' యనుటగాని, 'వ్యాఘ్రజాతి'—'సింహ జాతి' యనుటగాని భాషలోలేదు. మరి అవి యన్నియు శ్రేష్ఠార్థ వాచకములు కావనవలసినదేనా? ఆక్షేపము సరియైనదేనా?

ఆ విశేషణ పదములు, సమాసమున, విశేష్యమునకు ఉత్తర మునసేగాని పూర్వముండవు. కావున శ్రీ శర్మగారి ఆక్షేపము శాస్త్ర మర్యాద ననుసరించినదిగాదు.

(3) వారు, మణి, మౌళి, చంద్రాది శబ్దములను శ్రేష్ఠ వాచకములు కా వన్నారు. అదియును పొరపాటే.

శ్రీ శర్మగారివలెనే, పూర్వమెవరో 'మణి' శ్రేష్ఠార్థకము కాదన్నట్లున్నది. ఆ ట్లనువారి కందరికిని సమాధానముగా, అహోబలపండితుడు, ఈ క్రింది విధముగా వివరించినాడు.

"మణి శబ్దస్య రత్నశబ్ద స్యేవ న శ్రేష్ఠపరత్వ మభిధానే షూపపద్యతే. తథాపి మణి ర్ద్వయో రజాకంఠస్తనే రత్నేపే త్యాద్యుక్తేః రత్నపర్యాయత్వేన త ద్వాచకత్వ మవ్యాహతమ్. స చ పర్యాయ గ్రహణ మరూఢమ్". (పు. 325)

(4) శర్మగారిమతమున ఇంద్ర శబ్దము గూడా శ్రేష్ఠ వాచకము కాదు. 'కృష్ణరాయేంద్రుడు=కృష్ణరాయ(శ్రేష్ఠుడు' అనుట తప్పనియు, 'ఇంద్రునివంటి కృష్ణరాయుడు' అనవలె ననియు వారి వాదము. నన్నయ, వరుణుని 'వరుణేంద్రుడు' అన్నాడు. (ఆది 3—140) అక్కడను, 'ఇంద్రునివంటి వరుణుడు'అనియే చెప్పవలెనా? చెప్పుట యుచితమగునా?

(5) వారు భద్ర శబ్దమునకు 'శ్రేష్ఠ'డను అర్థము లేదన్నారు.

ఆ యర్థము నిఘంటువులలోనే యున్నది—

"శుభ మంగళయోర్భద్రం స్యాత్ ద్రవ్య(శ్రేష్ఠయో స్త్రిషు" (నా. ర.)

"భద్రః=శ్రేష్ఠః" (శబ్దార్థ కల్పతరువు); "భద్రము=శ్రేష్ఠము" (శ. ర.) " "భద్రము=శ్రేష్ఠము" (సూ. ని); గురు. ప్ర.బో. లో—బలభద్ర శబ్దమునకు, బలేన భద్రః శ్రేష్ఠః—బలముచేత శ్రేష్ఠుడు'— అని వ్యుత్పత్త్యర్థము చెప్పబడినది.

కాబట్టి, భద్ర శబ్దమునకు శ్రేష్ఠార్థము లేదనుట నిజము కాదు. ఆ యర్థమున్నప్పుడు, 'తత్సమచంద్రిక'—'భద్ర శ్చాసౌ రామశ్చ రామభద్రః' అని విగ్రహించి సమసించుటలోను, 'శ్రేష్ఠుడైన రాముడు' అని యర్థము చెప్పుటలోను తప్పేమున్నది?

(6) 'భద్ర' శబ్దము 'అయ్య' వంటిందిగాని, శ్రేష్ఠార్థక విశేషణము కాదనియు, 'రామభద్రుడు' అనగా 'రామయ్య' అని అర్థమనియు, అందువలన, 'భద్రుడైన రాముడు' –'రామ భద్రుడు' అనుట 'అయ్యయైన రాముడు—రామయ్య' అని చెప్పబోయి నట్లగుననియు వారి ఆక్షేపము.

సంస్కృతభాషలో 'భద్ర' పదము, తెనుగులోని 'అయ్య' వంటిదట! అందువలన 'రామభద్రుడు' అంటే 'రామయ్య' యని అర్థమట! ఇది యొక క్రొత్త సిద్ధాంతము.

తెనుగులో 'భద్ర' పదమునకు 'అయ్య' అను అర్థము లేదు. కనుక రామభద్రుడు, రామభద్రుడేగాని, 'రామయ్య' కాడు. రామయ్య, రంగయ్య, కోటయ్యలను, రామభద్రుడు, రంగ భద్రుడు కోటభద్రుడు అనుటయును లేదు. 'భద్ర=అయ్య' అగునేని, రామభద్రయ్య, వీరభద్రయ్య ఇత్యాది నామములలో అయ్యమీద మరియొక 'అయ్య' చేరి, 'రామయ్యయ్య' 'వీర

య్యయ్య' అని వికృతార్థ మేర్పడును. కాబట్టి ఆ సిద్ధాంతము తెనుగున నరిపడదు.

'రామభద్రుడు=రామయ్య' అను అర్థము శ్రీ శర్మ గారిది గావున, వారి ఆక్షేపము వారి యర్థమునకే గాని, తత్వమ చంద్రిక చెప్పిన అర్థమున కన్వయించదు.

(7) వారి ఈ వాదములో 'లలామము' కూడా స్త్రీ వాచకముకాదు. నేను, భావాంబా లలామము" (భద్రా 1.77) అను ప్రయోగమును, "స్త్రీరత్నమగు భావాంబ" అను వ్యాఖ్యానమును గూడా చూపించినాము. ఏమిలాభము! "లలామము— స్త్రీ వాచకముకాదు. పో"మన్నారు. ఏ వాచకమో సెలవీయలేదు.

"అశ్వ భూషాపుండ్ర పుష్ప శ్రేష్ఠ శృంగార కేతు వా
లింగే ప్రభావే పురుషే లలామో స్త్రీ లలామ చ"

అని, నానార్థమాల. వారు దీనినైన నంగీకరింతురో! అంగీక రింపరో!

ఇక్కడ చెప్పవలసిన విషయమొకటి యున్నది—వసు చరిత్రలో,—పురంధ్రీ మణియగు తిమ్మమాంబ (1.35) అన్నచోట, టీకాకర్త, తం.వేంకటపెరుమాళ్లయ్యగారు, "తిమ్మ మాంబ—తిమ్మమ్మ యను నామె. అయ్య, అమ్మ యిత్యాదులు నామములమీఁదను వరంబై, వరంబగు ఆర్యా అంబాది పదము లతో సమసించుట. 'నన్నయార్యుఁడు', 'తిక్కమాంబ' యిత్యా దులం గనునది" అని వ్రాసినారు. అంతేగాని 'తిమ్మమ' అను సంజ్ఞావాచకముమీద 'అంబ' యను స్త్రీవాచకముచేర్చి సమ సింపబడినది; కనుక యీ రచన తప్పు—అని వ్రాయలేదు.

భాషా సంప్రదాయజ్ఞు లట్లేల వ్రాయుదురు! సంజ్ఞా వాచక సమాస తత్త్వము నెరిగినవారు గనుకనే, భారతమును పరిష్కరించునపుడు, ఆయనగారు 'ధనంజయు ప్రవరు—కరము' వంటి ప్రయోగములను మార్చలేదు. ఆనాటి పరిష్కర్త లంద రును అవ్యుత్పన్నులై, అది తప్పు పాఠమని గుర్తింపలేక వదలి వేసినా రన్న భావముతో శ్రీ శర్మగారిపుడు నవరింపవలె ననుచు న్నారు. అది పొరపాటు. ఆ పరిష్కర్తలు గుర్తింపని అపపాఠములు భారతములో లేకపోలేదు గాని, ఇది మాత్ర మట్టిదిగాదు.

## 8. కొంటె ప్రత్యుత్తరము

"ప్రవరుడు—అను విశేషణము సాభిప్రాయము. ధనం జయుడు మహా వీరు డనియు, పాశుపతము సహస్రభాను మండల సమప్రభమనియు, అందువలననే, ఆ యస్త్రమును చూచిన దేవ దానవులు భయపడినా రనియు నన్నయ రచన కర్థము. ఆ విశే షణమును తొలగించినచో రచన నీరస మగును" అని నేను వ్రాసినాను.

నా వ్రాతను శ్రీ శర్మగారు ఇట్లు వ్యాఖ్యానము చేసినారు. "అర్జునునివంటి సుప్రసిద్ధ మహా వ్యక్తులకు గూడా మన మొక విశేషణము వేయకపోతే దైత్యదానవ యక్ష రాక్షస గణమ్ము—నావలో తెలిసికొనకపోవునా? ఈ కథ వినుచున్న శౌనకాది మహామునులకుగాని, జనమేజయునికిగాని అట్టి సందే హమే కలుగునా?—ఇదే సందర్భమందే—"హరుచేత సంప్రాప్త వరుఁడయ్యె నరుఁడని యెఱిఁగి యింద్రుండువచ్చె"(3.1–337) అని నిర్విశేషణముగానే నన్నయ రచించినాడే! ఆచోట ఇంద్రుని యెరుక యెట్లు కలిగినది! పట్టి నరుడు, ఏ కిన్నరుడో, వాన రుడో కావచ్చునుగదా! దీపాలవారిపై పలుచని 'కవితా తత్వము'నకు ఈ కొంటె ప్రత్యుత్తరము చాలును. అట్టి సహృదయత్వము నన్నయ కుండినదను నమ్మిక నాకు లేదు నాకు లేదను చింతయు లేదు."

వారి కొంటె ప్రత్యుత్తరముపై నా కుంటి ప్రశ్నలు

(1) "ధనంజయుడు సుప్రసిద్ధ మహా వ్యక్తి గనుక, అతనిని 'ప్రవరు'డని మనము చెప్ప నక్కరలే" దన్నారు. సరే. అట్టి మహావ్యక్తికి 'చచ్చుకర' ముండు ననుకొను అవివేకు లుండరు గదా! మరి అతని కరము 'ప్రవర'మని చెప్పవలెనన్న వాదమేల?

ఆ విశేషణమును కరమునకు చెప్పవలెనని తా మన్నారు. ధనంజయునకు చెప్పుట ఉచితమని నే నన్నాను. నామాట సరి కాదేని, ఎందువలనకాదో తాము వివరింపవలె. అంతేగాని, కొంటె ప్రత్యుత్తరము లెందుకు? వాటివలన ప్రయోజన మేమి?

(2) "మనము విశేషణమును వేయకున్న ధనంజయుని నచటివారు తెలిసికొనలేక పోవుదురా?" అన్నారు.

'అచటివారు ధనంజయుని తెలిసికొన్నా'రనిగాదు—పద్య మున నున్నది. అతనిని చూచి "యక్షరాక్షసగణమ్ము భయమ్ముఁ బొందె"నని. కాబట్టి ప్రశ్న అసంగతము.

ధనంజయునిని ప్రవరత్వము, పాశుపతముయొక్క భాను సహస్రసమప్రభ—యక్షరాక్షసులు భయపడుటకు కారణములుగా యుగా చెప్పబడినవి. కావున సాభిప్రాయములు. 'ప్రవరుడు'—సాభి ప్రాయ విశేషణమని నే నన్నందుకు శ్రీ శర్మగారు—నాది 'పలు చని కవితాతత్వ'మని నన్ను హేళన చేసినారు. అట్టి విశేషణము లను వాడగల సహృదయత్వము నన్నయకు లేదని, ఆ మహాకవిని పలుచని మాట అన్నారు. ఉచితమేనా?

నన్నయకు సహృదయత్వము లేకపోయినను, ఆ సంద ర్భమున ఆ విశేషణములు వాడకతప్పదు. వాడకున్నచో యక్ష రాక్షసులు భయపడినా రనుటయే కుదరదు. అవ లా విశేషణములు మూలము ననుసరించినవే.

తత స్త్వధ్యాపయామాస సరహస్య నివర్తనమ్
త దస్త్రం పాండవశ్రేష్ఠం మూర్తిమంత మి వాంతకమ్
(40.20)

ఉపతస్థే చ త త్పార్థం యథా త్ర్యక్ష ముమాపతిమ్
ప్రతిజగ్రాహ త చ్చాపి ప్రీతిమా నర్జున స్తదా"
(„—21)

"తత శ్చచాల పృథివీ సపర్వత వనద్రుమా" („—22)

"ఆ శ్చాస్త్రం జాజ్వలత్ ఘోరం పాండవ స్యామితౌజసః
మూర్తి మద్వై స్థితం పార్శ్వే దదృశు ర్దేవదానవాః"

అని మూలము. („—24)

వ్యాసుడు అర్జునునకు 'పాండవశ్రేష్ఠుడు'—'అమితౌజసుడు' అను విశేషణములనూ, అస్త్రమునకు 'ఘోర'మను విశేషణమునూ ఏ భావముతో వాడినాడో, ఆ భావముతోనే నన్నయ ధనంజయునకు 'ప్రవరుడు'— అస్త్రమునకు 'సహస్రభాను మండల సమప్రభము' అను విశేషణములను వాడినాడు. అందు వలననే నేను, 'ప్రవరుడు' అను విశేషణమును తొలగించినచో, రచన నీరసమగు నన్నాను. నా మాటను, పద్యమును సరిగా అర్థము చేసికొనక శ్రీ శర్మగారు, నాది 'పలుచని కవితాతత్త్వ' మన్నారు. 'నన్నయకు సహృదయత్వమ్మిలే' దన్నారు. పండితులు—నిరంకుశులు. ఏమైనను అనగలరు.

(3) "అట్టి సహృదయత్వము నన్నయ కుండినదను నమ్మిక నాకులేదు. నాకు లేదను చింతయులేదు." అని ఒక మాట అన్నారు.

'సహృదయత్వము, అది లేదను చింత'—తమకు లేక పోయినను, దానివలన లోకమునకు వచ్చు నష్టి లేదుగాని, నన్నయకు సహృదయత్వములే దనుటవలన, ఆయన రచన అంత సుహృదనికా దన్న అసద్భావ మొకటి యేర్పడి, అది లోకమున కపకారక మగుట నిజము. కాబట్టి, లబ్ధ ప్రతిష్ఠులైనవారు, అనాలోచితముగా అట్టి మాట లనుట పాడిగాదు. మరచినాను. ప్రవర శబ్దమును కరమునకే చేర్చవలెననియు, అది, ఆ కరము హరునితోపోరి గెల్చిన దనుటను తెల్పు విశేషణ మనియు, వారి అసలు వాదము—ఆ వాదమునను, ఆ విశేషణము సాభిప్రాయమే గదా! అట్లా విశేషణము నుపయోగించుకొనియు, నన్నయకు సహృదయత్వము లేదనుటలో—సహృదయత్వము కలదా?

(4) "అస లీ ప్రవర శబ్దము పద్యములో ప్రాసయతులను నిర్వహించుటకై తోచి అతుకుకొన్నది" అని వారి యింకొక వాక్యము.

ఇంతకుముందు, ప్రవర శబ్దము విశేషణ మనీ, దానిని కరమునకే చేర్చవలెననీ—అన్నారు. ఈ వాక్యమున, అది ప్రాసయతులను నిర్వహించుటకై వచ్చి అతుకుకొన్న వ్యర్థపదమన్నారు. ఏమాట నిజము? పూర్వోత్తర విప్రతిపన్నములైన వాక్యములు వాదములో ఉండవచ్చునా?

అది యట్లుండనిండు; భట్టారకుడు ప్రాసయతుల బాధకులోనై పనికి మాలిన పదములతో, పద్యములను పూరించు అసమర్థ కవియగునా? ఇట్టి వ్రాతలు ప్రాజ్ఞులకు సహ్యము లగునా?

(5) "హరుచేత సంప్రాప్తవరుండయ్యె నరుండని యెఱిఁగి యింద్రుండు వచ్చె" అన్నచోట, నన్నయ 'నరుడు' అని నిర్విశేషణముగానే రచించినాడే! ఆ చోట ఇంద్రుని యెరుక యెట్లు కలిగినది"—అని వారి ప్రశ్న

ఆచోట ఇంద్రునకు గలిగిన యెఱుక యేమి? 'నరుడు హరునిచేత వరము పొందినా'డని. ఆ సంగతి యింద్రునకు తెలియుటకు 'నరుని' కొక విశేషణ ముండవలెనా? ఉండవలెనని నాకు తోచలేదు. ఎందు కుండవలెనో? ఎట్టిది ఉండవలెనో తెలుప వలసినదిగా శ్రీ శర్మగారినే కోరుచున్నాను.

(6) శ్రీ శర్మగారి ప్రశ్న అతి విచిత్రమైనది—ఇంకొకటి—"నన్నయ నిర్విశేషణముగా 'నరుడు' అన్నాడే! నట్టి నరుడు, ఏ కిన్నరుడో—వానరుడో కావచ్చును గదా!" అని ప్రశ్న.

'నరుడు', కిన్నరుడు—వానరుడు ఎట్లు కావచ్చునో, నాకు బోధపడలేదు. అస లది ఉళక్కిమాట. నట్టి నరుడైనను, ఎట్టి నరుడైనను నరుడు నరుడేగాని, కిన్నరుడు—వానరుడు ఎన్నటికిని కాడు.

భారతము చదువ నేర్చినవాడు, అర్జునుని కథలో, 'నరుడు అర్జునుడు' అని గ్రహింపలేకపోడు. ఆ యర్థము తెలియకున్నను, కిన్నరు డనిగాని, వానరు డనిగాని అనుకొనుట అసంభవము—ఎందు కిన్నిమాటలు 'నరుడు' అంటే, కిన్నరుడనీ, వానరుడనీ అనుకొను 'నరుడు' ఉండడు. కాబట్టి, ఆక్షేపము అసంగతము. అస్వాభావికము.

## (9) అచ్చుప్రతులు - అపపాఠములు

అచ్చువారి అజాగ్రత్తవల్ల అపపాఠము లేర్పడుచుండు ననియు, 'ప్రవరు—కరమ్ము' అను తప్పు పాఠ మట్లేర్పడ్డదే ననియు శ్రీ శర్మగారి దొక వాదము.

ఆ వాదము సరియైనది కాదని, వెనుకటి నా విమర్శలోను, శ్రీ రామమూర్తిగారి విమర్శలోను నిర్వివాదముగా నిర్ధారితమైనది.

వారు మరల ఈ వ్యాసములో, అచ్చులో తప్పులుండు ననుటకు తార్కాణగా,—వావిళ్ళవారి 1927—ఆదిపర్వము (1—109) లో— 'అనువయించు' అను పదము 'అనునయించు' అని ముమ్మారు ముద్రితమై యున్నదని—అది యొక అపూర్వ విషయముగా—పేర్కొని, పెద్ద చర్చ చేసినారు. ఆ చర్చ 'భారతి' పుటలో సగము స్థలము నాక్రమించుకొన్నది. అందువారు, 'అనువయించు' అనునది సరియైన పాఠ మనుటకు మూలమును చూపినారు. ఆ రెండు క్రియలకునుగల అర్థభేదమును తెలిపినారు. పరిశోధకులకు 'అనువయించు' అపరిచితమైనందున 'అనునయించు'ను ముద్రించినా రన్నారు. ఇంకను చాలా వ్రాసినారు.

ఆ చిన్న ప్రమాదమున కంత పెద్ద చర్చ అనవసరము. అచ్చులో అక్షరములు వ్యత్యస్తములగుచుండుటయు, అట్టివి వచ్చినప్పుడు ప్రత్యంతర సహాయమున సరిపరుచుకొనుచుండుటయు, చదువరులకు నిత్యానుభవములోనున్న విషయము. సందేహాస్పదమైన పాఠము, అన్ని ప్రతులలోను అట్లే యున్నప్పుడు, దానిని కనిపెట్టినవారు, పరిశీలనార్థము పండితులకు పత్రిక ద్వారా తెలుపుట అవసరము.

శ్రీ శర్మగారు కనిపెట్టిన "అనునయించు" అటోది కాదు. వారు చూచిన ఆ ప్రతిలో అట్లున్నదిగాని, దానికి ముందును వెనుకను ముద్రితములైన— ఈ క్రింది—ప్రతులలో "అనువయించు" అని సరిగానే యున్నది.

(1) 1904 బరూరు త్యాగరాయశాస్త్రి ప్రతి. (2) 1915 'చదలువాడ' వారి టీకా సహితప్రతి—అందులో "అనువయించుచున్న—వేయుచున్న" అని టీకయు నున్నది. (3) 1928. 'ఆనంద' ప్రతి. (4) 1957 వావిళ్ళ ప్రతి.

మరియు, సూర్యరాయ నిఘంటువులో, 'అనువయించు' అను పదముక్రింద, "పటంబు ననువయించుచున్న" అను పాఠమే ఉన్నది.

శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులుగారు (25—12—1960) 'ఆంధ్రభూమి' లో "ధాతయును, విధాతయు వారి యనువయించు" అను అచ్చు ప్రతిపాఠము తప్పనియు—

"ధాత యనువిధాతయు వారి యనువయించు" అని గాని—"ధాతయును విధాతయు వారియును వయించు" అనిగాని, సవరింపబడవలె ననియు వ్రాసియున్నారు.

కాబట్టి, ఆ 'అనువయించు' అందరెరిగినదేగాని క్రొత్తది కాదు. భారత ప్రతు లన్నిటిలోను సుముద్రితమై యున్న ఆ పదమును గురించి అంత పెద్ద విమర్శ అనవసరము.

## 2

ఇక 'బలియుడు' అను రెండవ పాఠము విషయము—

"దారుకుఁ డిట్లనియె మహో
పేరు నుపేక్షింపఁదగునె వీనిని మాయా
ప్రారంభు నుపేక్షింప ర
పార పరాక్రములు పోర బలియుఁడు వీనిన్"
(అర.1. 196)

అని అచ్చు ప్రతిపాఠము—"పోరఁ బ్రాకృతు వయినన్" అని పాఠాంతరము.

శ్రీ శర్మగారు "బలియుఁడు" అను పాఠము తప్పని తెలిపి—"బలియుఁడు—కాదు నన్నయ వ్రాసినది. మరి 'బలియుడు'; బలి వేయుమని యర్థము" అన్నారు.

వారు 'బలియుడు' అని నన్నయయే వ్రాసినట్లు చెప్పినారు. ఆ మాట నిరాకరము. అది వారి సవరణగాని, నన్నయ వ్రాసినది కాదు. వారి సవరణ పాఠమున అర్థము సరిపడదు. పునరుక్తి దోషము కూడా ఉన్నది.

నే నీ విషయములు తెల్పి, "పోరఁ బ్రాకృతు వయినన్" అను పాఠాంతరమును పాఠముగా గ్రహించితిమేని, పద్యము చక్కబడి అర్థము సరిపడు నన్నాను. అర్థము వివరించినాను. ప్రాచీన పాఠముతోనే పద్యము బాగుపడుచున్నది గనుక 'బలియుడు— వీనిన్' అను సవరణతో నిమిత్తము లేదన్నాను.

శ్రీ శర్మగారు, వారి పాఠములో నేను చూపిన లోపములకు సమాధానములుచెప్పి, తమ సవరణ సరియైనదే నన్నారు. అంతేగాని, నేను సూచించిన పాఠమును గాని, నేను చెప్పిన అర్థమునుగాని కాదనలేదు—"ప్రాకృతువయినన్—అను పాఠము నా కనభిమతముగాదు. కాని అది 'బలియుడు వీనిన్" అను దానికంటె ఉత్తమమని భావింపలేకున్నానంతే" అన్నారు.

వారట్లు ఉదారముగా నా సవరణను అంగీకరించిన తర్వాత నేను వారి సవరణ సరిగా దనిపింప పెనగులాడుట అనుచితముగా నా యంతరాత్మకు తోచినది. అదియునుగాక, మనకు కావలసినది సాధుపాఠము. అట్టి పాఠము ప్రాచీనమైనదే కుదిరినది. ఇక శ్రీ శర్మగారి పాఠము సాధువా? అసాధువా? అన్న చర్చ యెందుకు? అనవసరము. కాబట్టి, వారి సమాధానములు నాకు తృప్తికరములు కాకున్నను, విమర్శించు తలపు లేదు. కాని, ఒకటి రెండు విషయములు విధిగా విమర్శింపవలసినవిగా ఉన్నవి. వాటిని తెల్పుచున్నాను.

## 1. పునరుక్తి

తమ పాఠములోని పునరుక్తిని గురించి శ్రీ శర్మగారిట్లు వ్రాసినారు.

"పునరుక్తి దోషమా? కారకములందు సంభవించు పునరుక్తిని తప్పించుటకే భాషలో సర్వనామము లేర్పడినవి. వానిని గూడ రెండవతూరి ప్రయోగింపరా దను సుకుమార చిత్తులతో వ్యవహరించుట యెట్లు? పై పద్యమునకు ముందరి పద్యముననే—'నన్నుఁ దెరలఁగప్పు—నన్నుఁ జూచి' అని రెండు 'నన్ను' లున్నవి. మరియు, 'వారలచేఁ బూజితులై —వారల కిట్లనిరి.' (3—2—308). ఇట్టి వెన్నియో కలవు. మరి (ఒక) కారకమునే ఒక పద్యమున, ఒకవాక్యమున పునరుక్తి చేయుటకు నన్నయభట్టారకుడు సంకోచింపడు. కనుక ఈ ప్రశ్న అతనికే వేయవలసినది. నాకు గాదు."

వారి పాఠములో నేను చూపినది కేవల సర్వనామ పునరుక్తి గాదు. ఆ సర్వనామములతో గూడిన అర్థ పునరుక్తి. అర్థపునరుక్తి దోషమనియే శాస్త్రోక్తి.—"ఒక పద్యములోనే, ఎన్ని మారులు "వీనిని (ఈసాళ్వుని) చంపుట! అది రచనలో పునరుక్తి దోషముగాదా!" అని నా విమర్శలోని వాక్యము. కాబట్టి, నా యాక్షేపమునకును, వారి సమాధానమునకును సంబంధము లేదు.

'బలియుడు వీనిన్' అను పాఠము శ్రీ శర్మగారిదిగాని, నన్నయదికాదు. తమ పాఠములోని దోషమును గార్చి నన్నయ నడుగుమనుటలో అర్థములేదు.

శర్మగారి పాఠములోని పునరుక్తివంటి పునరుక్తిని, సామాన్య కవియును చేయడు. నన్నయ చేయునా! "పునరుక్తి చేయుటకు నన్నయభట్టారకుడు సంకోచింప" డనుట సత్యమున కెడసిన మాట.

"గిరులు వచ్చి నన్నుఁ దెరలఁ గప్పు వాని నన్నింటిని బాచి యున్న నన్నుఁ జూచి" (అర 1—195) అన్న రచనలో సర్వనామ పునరుక్తి యున్నట్లు శ్రీ శర్మగారనుకొనుట పొరపాటు.

## పెట్టుబడిదారులకు ఆహ్వానం



ఆంధ్రప్రదేశ్ లో దృఢమైన శ్రామిక శక్తికి తోడు అనుకూలమైన భౌగోళిక పరిస్థితులు, సహజ వనరులు, అపారమైన ఖనిజ సంపద వున్నందున పరిశ్రమల స్థాపనకు చక్కని అవకాశాలున్నాయి. రాష్ట్రానికి చాలినంత బొగ్గు సరఫరా అవుతున్నది. సింగరేణి బొగ్గుగనులలో ఉత్పత్తి త్వరితగతిని పెరుగుతున్నది. పంచవర్ష ప్రణాళికల క్రింద విద్యుదుత్పత్తి పెరుగుతూ వుంది; ద్వితీయ ప్రణాళిక ముగింపు నాటికి 129, 570 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అయింది. తృతీయ ప్రణాళికా కాలంలో ఈ శక్తి 542·000 కిలోవాట్లకు పెరిగే అవకాశం వుంది.

రాష్ట్రంలో నూతన పరిశ్రమలను ప్రారంభించే పారిశ్రామిక వేత్తలకు తగు ప్రోత్సాహాన్నిచ్చే దృఢ సంకల్పంతో భారీ పరిశ్రమలకు, లఘుపరిశ్రమలకు, గనులకు ఆర్థిక సహాయం చేయడానికి రాష్ట్రప్రభుత్వం మూడు కొత్త సంస్థలను నెలకొల్పింది.

ఈ విధంగా ఆంధ్రప్రదేశ్ లో కొత్త పరిశ్రమలకు అపారమైన అవకాశాలే గాక, పెట్టుబడిదారులకు ప్రోత్సాహకరమైన అవకాశాలు వున్నాయి.

2. తీర్థానికి తీర్థం; ప్రసాదానికి ప్రసాదం.

ఇది యొక లోకోక్తి. ఈ లోకోక్తిని నేను వాడినందుకు శ్రీ శర్మగారు తమాషాగా వెనకినారు. ఈ క్రిందిది వారి వాక్యము.

"అపార పరాక్రమములు పోర నుపేక్షింపరు' అన్న—ముందరి వాక్యమునకును, 'పీనిని చంపుము' అన్న వెనుకటి వాక్యమునకును సంబంధమేమి? ఆ రెండు వాక్యములును, 'తీర్థానికి తీర్థం—ప్రసాదానికి ప్రసాదం' అన్నట్లు దేనికది విడిబడియున్నవి'—అని మఱొక్క యారోపణ. తీర్థమును ప్రసాదమును ఒక దేవతవే అని తెలిసినవారికి ఆ రెండును అసంబద్ధము అను భావనయే కలుగదు. అట్లే పై రెండు వాక్యములును ఒక ప్రకరణమున ఒకడే చెప్పినవి గనుక సుసంబద్ధములే యగును."

తీర్థము—ప్రసాదము ఒక దేవతవే—అన్న సంగతి తెలియక, నేనా విధముగా అన్నట్లు అర్థము చేసికొని, శ్రీ శర్మగారు అట్లు నన్ను వెనకినారు. వారు, అది సామెతయని యెరుగరు.

ఆ సామెత తెనుగు దేశమున పండితులేకాదు; పామరులును ఎఱిగినదే. ఒకదానితో నొకటి కలియక విడివిడిగా నుండుటను తెలుపు లోకోక్తి—అది. తీర్థము, ప్రసాదము ఒక దేవతవే యైనను, ఆ రెంటిని ఇచ్చు అర్చకు డొకడే యైనను, పుచ్చుకొను భక్తు డొక్కడే యైనను, ఆ రెండును వేరు వేరుగా ఇయ్యబడునేగాని, తీర్థములో ప్రసాదముగాని, ప్రసాదములో తీర్థముగాని కలిపి ఇయ్యబడవు. (ఈసంగతి శ్రీ శర్మగారెరుగనిదికాదు) ఆ రెంటికిని కలయిక ఎన్నటికిని జరుగదు. 'తీర్థానికి తీర్థం—ప్రసాదానికి ప్రసాదం' అనుటలో భావమదే.

ఈ లోకోక్తితత్త్వము, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడెమీవారు ప్రచురించిన 'పదబంధ పారిజాతము' ద్వి సం. లో చక్కగా వివరింపబడియున్నది. తిలకింతురు గాక.

తీర్థ ప్రసాదములు 'సుసంబద్ధ' మనుకొనుట యెట్టిదో, ఆ పాఠములోని వాక్యములు సుసంబద్ధము లనుకొనుటయు నట్టిదే. కావున ప్రత్యేక వివరణము పనిలేదు.

ఇప్పటికే నా వ్యాసము కొండవీటి చేంతాడైనది. శ్రీ శ్రీ శర్మగారి ఆక్షేపముల స్వరూప స్వభావములు కొంతవరకు తెలిపినాను. ఇంతమాత్రము చాలుననియే నా యభిప్రాయము. అందువలన ఆ చర్చ ఇంతటితో ఆపి, వారి విమర్శలో నాకు గలిగిన సందేహ మొకటి యున్నది. దానిని తెలిపి ఈ వ్యాసమును ముగించుచున్నాను.

### అవదాత వర్ణము

వారు,—"ధరణి దుర్లభమగు నవదాతవర్ణ మారఁగల్గుట వర్ణును డంద్రు నన్ను" అను (విరా. 4—145) పద్యము నుదా

హరించి—"అతని దేహము నీలము. కాని, అంత పరిశుద్ధమైన నీల వర్ణము ఇంకెవరికిని పృథివిలో లేదుగనుక అర్జును డనుపేరు వచ్చినదట" అని వ్రాసినారు.

"అర్జును'—డనగా తెల్లనివాడని అర్థము. ఆ పేరు వచ్చుటకు కారణముగా చెప్పబడినది 'అవదాతవర్ణము'. ఆ వర్ణము 'నీల'మగునేని 'అర్జును' డను పేరు వచ్చునా? అని నాకు గలిగిన సందేహము.

తిక్కన పద్యమునకు మూల మిది—

"పృథివ్యాం చతురంతాయాం వర్ణో మే దుర్లభ స్సమః
కరోమి కర్మ శుక్లం చ తేన మా మర్జునం విదుః"
(44—21)

శుక్ల (=పవిత్రములైన) కర్మలను చేయువాడను, శుక్ల (=తెల్లని) వర్ణము గలవాడను అగుటచేత, నాకు అర్జును డనుపేరు వచ్చినది—అని శ్లోకార్థము.

ఈ యర్థమే తిక్కన పద్యమున నున్నదియును. ఇందలి శుక్లవర్ణమే ఆందలి 'అవదాత వర్ణము'. కాబట్టి, ఆ వర్ణము తెలుపుగాని 'నీలము'కాదు. తెలుపువర్ణముగలవాడు గనుకనే అర్జును డను పేరు వచ్చినది.

'అవదాతము=నీలవర్ణము' అనుట సరిగాదని నా యభిప్రాయము.

## ముగింపు

మాననీయులు శ్రీ శర్మగారు 'ధనంజయ ప్రవరు—కరమ్ము' అను పాఠము సంస్కృత భాషా సంప్రదాయమున సరికాదన్నారు. అంతవరకు వారి వాదము సమంజసమే. ఆ పాఠము ఆంధ్ర భాషా సంప్రదాయమున సరియైనదే నని బహు ప్రయోగములతో నిరూపించినను అంగీకరింపక, 'ధనంజయ—ప్రవర కరమ్ము' అని మార్చవలసినదే నన్నారు. అట్లనుట మాత్రము సమంజసము కాదు.

ఏ భాష సంప్రదాయము ఆ భాషదే. ఒక భాషనుబట్టి మరియొక భాషను ఆక్షేపించుటగాని, సవరించుటగాని చెల్లదు. కనుక వారి వాదము నిరాకృతము. 'ధనంజయ ప్రవరు—కరమ్ము' అను పాఠమును మార్చ నక్కరలేదు.

'ప్రాకృతునయికన్' అను సాధు పాఠము అచ్చు ప్రతిలోనే ఉన్నది గావున 'బలియుడు—నీనిన్' అను కల్పిత పాఠమును గూర్చిన ప్రసక్తియే అనవసరము.

ఆంధ్రభాషతో పరిచయ మున్నంతలో నాకుతోచిన సత్యమును తెలిపినాను. అపుగాములకు సహృదయులు ప్రమాణము. ఈ చర్చ కింతటితో స్వస్తి.

'సత్యమేవజయతి.'

# ధనంజయ ప్రవరకరము

శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి

ధనంజయ ప్రవరకము—అని శ్రీరాళ్ళపల్లి వారి దిద్దుబాటు. ధనంజయ ప్రవరుడన్నది వింత ప్రయోగము. తల్లక్రిందైనది, భాషలో లేదు. నన్నయ ఇతరత్ర ప్రయోగింప లేదన్నవి వారు చూపిన కారణములు. ప్రవర శబ్దము కరమునకు విశేషణము చేసినపుడు పరమ శివునితో పోరాడి యతని యనుగ్రహమును సంపాదించు కొన్నది కాబట్టి తంటాలేని యర్థము లభించునని వారు చెప్పిన స్వారస్యము. ధనంజయప్రవరుకరమని యుండుటయే యుక్తమని నావాదము. శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు కూడా నాతో నేకీభవించిరి. ప్రవరశబ్దము ధనంజయునికి విశేషణము చేయక పోయినను అగ్నితోడి సావమ్యము శబ్దశక్తి వల్ల ధ్వనించుననియు, ప్రవర శబ్దము వల్ల తేజో గుణాధిక్యము సూచితమగుననియు, కరమునకు విశేషణము చేసిన పోరాడుటలో నర్జునుడు సవ్యసాచి కావున రెండు కరములలో దేనికి ప్రవరత్వము చెప్పుటకు వీలులేదనియు, నిచ్చట కరశబ్దము లక్షకమనియు, లక్షక శబ్దమునకు విశేషణము లక్ష్యార్థమందు విశేషాధాయకము కాదనియు, అందుచేత ప్రవరశబ్దము కరముతో నన్వయించుటలో చాలా తంటా యున్నదనియు నేను వ్రాసితిని. దానిమీద శ్రీ శర్మగారు బహుకాలమునకు మొన్న డిశంబరు భారతిలో తమవాదమును పునరుద్ధరించు కొనుచు పెద్దవ్యాసము వ్రాసినారు. ఆవ్యాసములో వారు, మేము చూపిన ప్రయోగములలో కొన్నిటిని అన్యథా సమర్థించుటకు ప్రయత్నించిరి. కొన్నిటి నసాంప్రదాయికమ్ము లనిరి. వీరివాద మెంత యసంగతముగా నున్నదో కొంచెము విమర్శించి చూపుదును.

1. పాండవోత్తముల చరిత్ర : దీనికి శర్మగారు పాండవుల యందుత్తములు అని సప్తమీ తత్పురుష చెప్పుద మన్నారు. పాండవులనగా యుధిష్ఠిరుని నుండి రాజరాజ నరేంద్రుని వఱకు నున్నవారందరు. వారియం దుత్తముల్ యుధిష్ఠిరాదులని అర్థముచెప్పిరి. ఈ దృష్టిలో 'పాండవులు' అనురూపము పాండు శబ్దము మీద గోత్రాపత్యార్థమున 'అన్' ప్రత్యయము చేయగా సిద్ధించును. ఈఅర్థవ

సంగతమనుటకు క్రింది ఆపత్తులను సహృదయులు పరీక్షింప గోరెదను.

1. పాండవ శబ్దము గోత్రాపత్యార్థమున లోకప్రసిద్ధము కాదు. నన్నయ తిక్కనాదులా యర్థమందు వాడియుండ లేదు. పాండవులనగా యుధిష్ఠిరాది పంచపాండవులే ఝడితిగా స్ఫురింతురు.

2. ఇట్టి ఝడితి స్ఫూర్తిని వదలి గోత్రాపత్యార్థమును స్వీకరించి మరల వారిలో నుత్తములు పంచపాండవులని స్వీకరించు గౌరవము.

3. అస్మదీయ వంశమున ప్రసిద్ధులై విమలసద్గుణ శోభితులైన పాండవోత్తముల చరిత్రయని రాజరాజ వాక్యము. ఈ రాజరాజ చెప్పిన 'అస్మదీయ వంశము'నకు వంశకర్తలలో పాండు రాజు కూడానున్నాడు. అందుచేత ఈమాటకు పాండు రాజునుండి తనవఱకు గలవారు— "అర్థము'. పాండవోత్తముల చరిత్ర యన్న చోటకూడా గోత్రాపత్యార్థము ఇదియేమగును. అప్పుడు పునరుక్తిదోషము వచ్చుటయే కాక వాక్యార్థము కుదురుబాటు కాదు. పాండురాజు నుండి నావఱకుగల వారనగా పాండవులే. పాండవులలో మఱల పాండవు లెవరు? పాండవ శబ్దమునకు గోత్రాపత్యార్థము చెప్పుట వలన వచ్చునిబ్బంది ఇది. నన్నయగారు ఇచట పాండవ శబ్దము అపత్యార్థమందే వాడినారనుట స్పష్టము. ఉత్తములైన పాండవులని కర్మధారయము చెప్పుటయే నన్నయగారి కభీష్టమని సహృదయులు గమనింపక పోరు.

2. పాండువరుడు : పాండువను వరుడు—అని శర్మ గారు సంభావనా పూర్వపద కర్మధారయమును చెప్పిరి. వరుడనగా పెడ్లి కొడుకని వారియర్థము. వరుడను శబ్దము జాతివాచకముకాదు. క్రియావాచకము. జాతివాచకమైనచో సంభావనా పూర్వపదము చెప్పుకొన వచ్చును. కాదు కావున విశేషణోత్తర పదము చెప్పుకొనుటయే ఈ అర్థమునందును సముచితము. అసలు వరుడన్నది ఇచట శ్రేష్ఠవాచకమనుటయే యుక్తతరము. పాండువను పెండ్లి కొడుకు వివాహమయ్యె అను నర్థము బలవంతముగా లాగినట్లున్నది. ఈ అర్థములో పాండువరుడు ఒప్పైనచో రామకుమారుడన్నప్పుడు రాముడను కుమారుడని ఎందుకు చెప్పుకొనరాదు ? పాండువరుడు అనునది శర్మగారు దిద్ద ప్రయత్నించలేదు కాన ఇట్టి ప్రయోగము లుండియే యొప్పుకొన్నారా ? అని ప్రశ్న పుట్టును. పాండు వరుడు ఒప్పుకొనుటకు నకులవరుడు, భీష్మవరుడు—ఇట్టి ప్రయోగము లున్నచోనే గదా శర్మగా రొప్పుకొవలసినది. మఱి దీనిని వీ రొప్పుకొనుటకు హేతువేమో ?—వీరే వీరి పూర్వ వ్యాసములో అభిమన్యు కుమారుడని వ్రాసినారు. మఱి అక్కడ గూడ సంభావనాపూర్వపదము చెప్పెదరేమో తెలియకున్నది వైయాకరుణులు మాత్రము విశేషణోత్తర పదమే చెప్పుదురు. వీరు రావణ క్రూరు డన్నది తల్క్రిందులు ప్రయోగ మన్నారు. దానికి సౌబలఖలుడు తక్షకాథముడు చూపెగా నవి కుత్సితాని కుత్సనైః—అను సూత్రముచే సాధింపవచ్చు నన్నారు. మఱి రావణక్రూరు డన్నది మాత్ర మా సూత్రము క్రిందికి రాదా ?? వచ్చినచో తల్క్రిందు లెట్లగును ? తక్షకాథముడు, సౌబలఖలుడు ఈ సూత్రము క్రిందకు వచ్చినచో మూర్ఖదుర్యోధనుడు మొదలైన ప్రయోగము లెట్లు సాధువు లగునో ? పాండువరుడు సంభావనాపూర్వపద మైనట్లే వీరి దృష్టిలో ధనంజయ ప్రవరు డన్నది కూడా సంభావనాపూర్వపదము కావచ్చును గదా ! ప్రవరు డనగా ఎవరికంటె ప్రవరుడు అని బాధ వచ్చునని వీరి యుద్దేశ మైనచో నా శబ్దమునకు సామాన్యాకారేణ విశేషాకారేణ అర్థము చెప్పికొన దగియున్నది కావున దీనిని సాపేక్షక మన నక్కఱలేదు.

3. కందర్ప ప్రవర, మారవీర :—ఇవి రెండును అసాంప్రదాయికములే నట. వీనికి గూడ కందర్పుడను ప్రవరుడు, మారుడను వీరుడని అర్థము చెప్పి 'పాండవరు' తోబాటు శర్మగారు సాంప్రదాయికత ప్రసాదించలేదు. కారణము మనకు తెలియదు. ఒకవేళ కందర్ప ప్రవరుడు సాంప్రదాయికమనిన ధనంజయప్రవరుడును సాంప్రదాయిక మగును కావున దానిని అసాంప్రదాయికమని రనుకొనవచ్చును. మారవీరుడు— అన్నదానికి మారుడను వీరుడని చెప్పిన సరిపోవునుగదా. శర్మగా రట్లు చెప్పలేదు. ఎందుచేత. వీరశబ్దము గుణవాచకము. అందుచే విశేషణమే కావలసియున్నది. అని శర్మగారి అభిప్రాయ మనుకొంద మన్న ఆ చిక్కు పాండువరు డన్నచోట గూడ నున్నది. అట వర శబ్దము క్రియావాచకము గాన అదియు విశేషణమే కావలయును.

4. పాండవవరులు :—ఇది మాత్రము వీరి యభిప్రాయమునకు వ్యతిరేకముగా నున్నదని ఒప్పుకొన్నారు. పాండవోత్తములకు చెప్పినట్లు చెప్పలేదేమి యున్పించినది.

5. యమనాథుడు :—ఇంద్రనాథుడు, నకులనాథుడు, భీష్మనాథుడని ప్రయోగము లున్నచో శర్మగా రొప్పుకొందురట. లేనిచో లేదట. రామచంద్రుడు—అని యున్నది గదా. దీనిని శర్మగారు సహజమని ఒప్పుకొనరు. ఏలనన లక్ష్మణ చంద్రుడు, భరతచంద్రుడు, శత్రుఘ్న చంద్రుడని ప్రయోగములు లేవుగదా. 'యమరాజ' అన్నచోట 'యముడను రాజ' ని చెప్పుదురట. కాని ఇదియును 'యమనాథుడు' వలెనే అసాంప్రదాయికమట. 'యమో రాజా' అని వేదమందున్నది. అది ఎరిగినవాడు కావున నన్నయ్యగారు యమరాజు—అని ప్రయోగించిరి. మరి శర్మగారు సంజ్ఞాపూర్వపద కర్మధారయము చెప్పెద మందురు. ఏమైనను నన్నయగారి 'పాండవ వరులు'—యమనాథుడు—యమరాజు అన్న ప్రయోగములు— అసాంప్రదాయికము లన్నారు శర్మగారు. 'వరుణేంద్రు' డన్న నన్నయగారి ప్రయోగమును గూర్చి శర్మగారు వ్రాయలేదు. మరి దానిని సాంప్రదాయికమే అందురో అసాంప్రదాయికమే అందురో. సాంప్రదాయికమో కాదో ఆ సంగతి యట్లుంచి

కిట్టి ప్రయోగములు నన్నయభట్టు ఇతరత్ర చేసినా డన్నది, కందర్ప ప్రవర—మారవీర మొదలగునవి ఇతరకవులు కూడ చేసినారన్నది శర్మగా రంగీకరించినట్లే కన్పడుచున్నది. నన్నయ భట్టాదులు చేసిన ప్రయోగములను అసంప్రదాయికములని వీ రన్నచో ఎవ రొప్పికొందురో ? ఒప్పుకొనకపోవుట యట్లుంచి అట్లనుట కుంటి యెద్దయినను మా యెద్దే గెల్చినది అను పద్ధతిలోనికి వచ్చును. మరి సంజ్ఞగా ఏర్పడిన తర్వాత ఆ సంజ్ఞల ప్రవృత్తినిమిత్తము దుర్బలమైనదట. కవులందరు దానిని యథాసంభవముగా ప్రయోగించిరట. పరికరాంకురాలంకారములకు కాదట. వీరి ఈ వాదములోని దౌర్బల్యమును చెప్పుటకా పరికరాంకురాలంకారమన్న మాటే చాలును. పరికరాంకురాలంకారమునకు కవులలో నుదాహరణములు దొరుకకున్నచో అసలా యలంకారమే పుట్టెడిది కాదు. విస్తర భీతిచే నుదాహరించుట లేదు. నైషధము చూడగలరు. 'ప్రకృత ధనంజయ ప్రవరుడ' డన్నచోట చెప్పినది పరికరాంకురమను కొనుట పొరపాటు. వ్యతిరేకాలంకార ధ్వని చెప్పితిని గాని పరికరాంకురము గాదు.

6. 'అర్జునుడు సవ్యసాచి గదా. ఇచ్చట ప్రవరత్వమే కరమునకు చెప్పవలెను.' అని వీరు చెప్పిన యర్థమునకు ఆపత్తి నీయుగా ఇది ఎంత సందేహ మనియు, ఎడమచేత చేయు పనులు కుడిచేత చేయునంత అవివేక ప్రతిభయా అతనిది— అతనికి కుడి ఎడమల భేదము తెలియదా అనియు శర్మగారు పత్తి స్వరూప మర్థముగాక అపలాపించినారు. ఆపత్తి స్వరూప మిది. ఈ అస్త్ర మొకవేళ బాణమే యని యంగీకరింతము. దానిని అర్జునుడు కుడిచేతితో పట్టుకున్నాడని యంగీకరింతము. ఇచట ప్రవరత్వము ఆ కుడిచేతికి కుదురదనే ఆపత్తి స్వరూపము యుద్ధము చేయుటలో నర్జునునకు కుడి ఎడమల భేదము లేదు కావున ప్రవరత్వము నిరుపయోగమే. ఇతరత్ర అన్నము తినుట వగైరాలచే సంభవించు ప్రవరత్వావరత్వములు ప్రయోజకములు కావు. శర్మగారేమన్నారు. 'పరమశివునితో పోరాడి ఆయన అనుగ్రహము సంపాదించినది కదా ఆ కరము' అన్నారు. అందుచేత ప్రవర శబ్దము కరమునకు విశేషణము చేయవలె' నన్నారు. కర మనగా కుడిచేయి యనియే శర్మగారి అభిప్రాయము గదా. శివునితో పోరాడిన దది ఒక్కటియే కాదు. రెండును. శర్మగారి అభిప్రాయములో ప్రవరత్వము పోరాడుటవలన సంభవించినది కాబట్టి తాదృక్ ప్రవరత్వము కుడిచేతి కొక్క దానికే చెప్పుట కుదురదని ఆపత్తి. విషయమును వదిలి ఏమేమో వ్రాయుదురు.

'చేతిలో వెల్గుచున్న పాశుపతము వెక్క ఎంత ప్రవరుడైనను ధనంజయు డొక మిణుగురుపుర్వు వలె కానవచ్చు'నట. కనుక ఈ ఔపమ్యధ్వని రహస్యము నిస్తేజస్కమైన'దట. 'ఇది ఎంత రహస్య' మట. అనలిది రహస్యమని నేను వ్రాయలేదు. ఇది వింతయు కాదు. శర్మగారు దీనిని వింత యనుట వింత. అర్జునుడు మహా తేజస్వి. ఆయనకు తోడు అంత కంటె తేజోవంతమైన పాశుపతము. అందుచే యక్షరాక్షసులు భీతిచెందిరి. అని కదా చెప్పిన అర్థము. పాశుపతాస్త్రము ముందు అర్జునుడు ఎంత తేజస్వి యైనను మిణుగురు పురుగువలె నిస్తేజస్కు డగునని యిట్లు చెప్పినచో నపార్థము సంభవించునట. ఇట్లు చెప్పము. చెప్పకపోయినను శర్మగారి యుద్దేశ్యము ప్రకారము అర్జునుడు తేజస్వి కూడా కాదు కాబట్టి వారి యర్థము ప్రకారము మిణుగురు పురుగైన కాకుండ మసిబొగ్గు కావలసి వచ్చునుగదా. ఒకడు సహజముగా సుందరుడు. వాడు రత్నాలహారము ధరించినాడు. దీనిముందు వాడు నిస్తేజస్కు డగునా ? లేక వాని సౌందర్యమున మునకుత్కర్ష కలుగునా ? ఇది యింత తేలికయైన విషయము. శర్మగారికై ఇంత వివరింపవలసి వచ్చినందులకు లజ్జించుచున్నాను. ఆ పాశుపతము అర్జునుని తేజస్సున కుత్కర్షాధాయకము ; అపకర్షాధాయకము గాదు.

'యదభిముఖముగ చెప్పిరో అల్ల దాని—తదభిముఖముగ జూచిన ధర్మ మొప్పు'

7. ''మూర్తిగారి ధనుర్వేద పాండిత్య మెట్టిదో నే నెరుగను.'' ఈ కొంచెము విషయమునర్థము చేసికొనుటకు ధనుర్వేద పాండిత్య మక్కరలేదు. నీవు చెప్పినది నేను విననే విన నన్నచో తప్పు అర్థము చేసికొనుట కిందులో పెద్ద కష్టమేమియును లేదు. అస్త్ర మన్నప్పుడు దాని ప్రధాన స్వరూపము మంత్రము. దానికి మూర్తి యుండదని ఎవరన్నారు మూలము నుదాహరించుటకు. మూర్తియు నుండును. దానిని ఉపదేష్ట ఆవిష్కరించి ఈయనక్కరలేదు. ఉపదేష్ట సిద్ధుడైనప్పు డుపదేశము పొందినవానికి ఆ మూర్తి వశమగును. ఏమాత్రము మంత్రములతో పరిచయమున్నను ఈ సంగతి తెలియును. అస్త్రమంత్రములే కానక్కరలేదు. ఒక్కొక్కప్పుడు అనుష్ఠిత బలమును బట్టి, ఇంకొకప్పుడు ఉపదేష్ట బలమును కిట్టి మంత్రాధిదేవతయొక్క ఆవిష్కరణ యుండును. శర్మగా రనుకొన్న ట్లామూర్తి పట్టి బాణము కాదు. అట్లయినచో ప్రయోగముండును. గాని ఉపసంహార ముండదు.. పైగా మూల భారతములో ఆమూర్తి ప్రక్కన ఉన్నట్లున్నది గాని చేతిలో నున్నట్లు లేదు.

అస్త్రము చేతిలో నున్నది అనగా దాని ప్రయోజ్యత్వమును దృష్టిలో నుంచుకొని యున్న మాట తప్ప అది బాణము కాబట్టి చేత పట్టుకొన్నాడని కాదు. ఆ మంత్రమును స్మరించి ఏ బాణమును సంధించినను దానియం దా మంత్ర దేవత ఆవేశించి కార్యకారిణి యగును. 'పాశుపతంబు వింట సంధించి'— 'వారుణాస్త్రంబు సంధించి'—ఇత్యాది ప్రయోగములు అభేదోపచారములుగా గ్రహింపవలెను. దివ్యబాణము లన్నప్పుడును అభేదోపచారమే.

8. 'ఎంత ప్రతిభావంతము !' అన్న మాటకు వెక్కిరింపు అర్థము కాదన్నట్లు శర్మగారు వ్రాసిరి. శర్మగారు చెప్పిరి గాన దానిని గురించి అంత పట్టింపు లేదు. వేదముల మొదలు వేమన్న పద్యాల కిట్టి అర్థములు చెప్పినవా రెందరో

కలరన్న వాక్యము శర్మగారి వాదమున కేమాత్రముపకరించదు. మల్లినాథ సూరి వ్యాఖ్యాతృశిరోమణి కదా! 'దిఙ్నాగానాం పథి పరిహరన్'— 'తవాభిధానా ద్వ్యథతే'—ఇత్యాది స్థలములందు ఆయన చేసిన వ్యాఖ్యానము చూడుడు. ధనంజయ ప్రవరు డన్నదానికి చేసిన వ్యాఖ్యానము ఆ త్రోవలోనిదే కావున ఆ యీ వ్యాఖ్యానము చేసినవా రాకోటిలోనికే చేరుదురు. వారు చెప్పిన యర్థము సాంప్రదాయికము కూడ యగును. దానిని మెచ్చుకొనువారు ప్రబుద్ధు లగుదురు. కాని అప్రబుద్ధులు కారు. ఒకరు చెప్పిన అర్థము కొందరు మెచ్చుకొందురు. కొందరు మెచ్చుకొనరు. భిన్నరుచిర్హి లోకః— కదా. ఈ మెచ్చుకొననివారు మెచ్చుకొన్నవారి మెప్పును భక్తి అని ఆశ్చర్యమని అనుట అపలపించుటతప్ప మరియొకటి కాదు. 'ఇట్టి యర్థములప్రబుద్ధులకాశ్చర్య భక్తులను కల్గించును. ఇతరులకు అసహ్యములో, ఉదాస్యములో అగు' నన్నారు శర్మగారు. ఇతరు లనగా అప్రబుద్ధుల కంటె నితరులని కదా అర్థము. వీరిలో ప్రబుద్ధులు దుష్టబుద్ధులు ఇద్దరు నుందురు. ఉదాసీనత ప్రబుద్ధుల లక్షణము కావచ్చు. కాని అసహ్యము మాత్రము దుష్టబుద్ధుల లక్షణ మనకతీరదు.

9. "ఇట్టివారినే నేను దద్దమ్మ లన్నది"—వగైరా—

శర్మగా రెట్టివారిని దద్దమ్మ లన్నారో వారు వ్యాఖ్యానము చేయ నక్కరలేదు. ఎట్టివారినన్నారోవారు అట్టివారినే గ్రహించి దద్దమ్మలు కాదని నేను చెప్పినది. వారి వ్యాసములోని మాటలు, వారి మాటలకు నా యనువాదాదికము నీ క్రింద ఇచ్చుచున్నాను. సహృదయులు పరిశీలింతురుగాక.

శర్మగారి మాటలు—

"ఈ 'ర' లో లేని కొమ్ముతికించి 'రు'—చేసిన దెవరు. నన్నయ ఒక్కడు చేసియుండడు గాని ఆయనగారి లేఖకుడు మొదలుగా నేటి ముద్రాశాలలోని ఏ కంపాజిటరు వరకు ఎవరైనా చేసియుండవచ్చును. చిత్తులు దిద్దువారు దద్దమ్మలై నప్పు డిట్టి గుప్త చమత్కారము లెన్నో అవతరింపగలవు."

ఈ క్రిందివి నా వ్యాసములోని మాటలు—

"మరి ఈ 'ప్రవరు' అను పాఠ మెట్లు వచ్చినది. అది ఆయన లేఖకుని నుండి నేటి కంపొజిటరు వర కెవరైనను చేసియుండవచ్చును. కంపోజిటరు చేసినను ప్రూఫులు దిద్దువారు దిద్ద నక్కరలేదా. వారు పట్టి దద్దమ్మలు కాబట్టి వారు దిద్దలేదు. (ఇది శర్మగారి వాక్యముల కనువాదము.)

"భాషలో నిట్టివి పరశ్శతములు. నన్నయ్యయు నితరత్ర ప్రయోగించినాడని ఋజువు చేసినచో చిత్తులుదిద్దిన వారు దద్దమ్మలు కారని శర్మగా రంగీకరింతురా అంగీకరింపరా."

ఈ పై మాటలలో చిత్తులు దిద్దువారు పట్టి దద్దమ్మలని పగటుగా వారన్నారని వారిమీద నేను మోపినానట. ఎక్కడ మోపినాను. వారే ప్రూఫురీడర్ల నుద్దేశించి దద్దమ్మ లన్నారో వారినే నేను గ్రహించినట్లు నా వాక్యములు స్పష్టము చేయుచున్నవో లేవో సహృదయులు చిత్తగింతురు గాక.

ర—కు కొమ్ము తగిలించినవారో, కంపోజిటర్లు తగిలించిన తీసివేయలేనివారో అని కదా శర్మగారి మాటల కర్థము. నా మాటలలో నంత కూడా గ్రహించలేదుకదా. కంపోజిటరు పెట్టిన కొమ్మును దిద్దలేనివారినే కదా నే నన్నది. నా 'ప్రశ్న వాక్య'ములో చిత్తులు దిద్దినవారని భూతకాలిక విశేషణము నేసి జాగ్రత చూపించితిని గదా. శర్మగారిని ఏమియు విచారించకుండా పగటుగా నా రన్నట్లు నేను నింద మోపినానని వ్రాసినారు. అంతతోనే గాక 'ఇది వారి అవివేచితమైన ఆక్రోశన ప్రతిఫలన మంతే' అని తిట్టుటకు కుపక్రమించినారు. ఈ అవివేచితేత్యాది పదములు పై సందర్భము విచారించిన వారికి వీరియందే చక్కగా నన్వయించుననియు నా కేమాత్రము నన్వయించవనియు స్పష్ట మగునని నా దృఢ విశ్వాసము. వీరు వినయవంతులని శాంతులని చెప్పగా విన్నాను. ఒకటి రెండు పర్యాయములు వీరిని కలిసికొని మాట్లాడుట తటస్థించినది. నాకు నట్లే కన్పించినారు. కాని వీరి రచనలో వెక్కిరించుటకును తిట్లకును దిగుట దానికి చాల వ్యతిరేక సాక్ష్య మిచ్చుచున్నది. శర్మగారు దద్దమ్మ లన్నది అట్టివారినే. 'అట్టివారినే ఎవరైనను దద్దమ్మ లనగల' రట. ఎవరైనను అనరాదు. ఏ సందర్భములో నైనను తిట్లలోనికి దిగరాదు. అది శేషం కోపేన పూరయేత్" క్రిందకు వచ్చును. శర్మగారు ప్రవరు—అనునది ప్రవర అని దిద్దినచో నచ్చనివారు చాల మంది యున్నారు. వా రందరు శర్మగారిని నిందించుటకు కుపక్రమించినచో నెట్లుండును. ఇట్టి ప్రయోగ ముండునని తాము సేవించిన సాహితీ రసిక పండితు లెవరు చెప్పలే దన్నారు శర్మగారు. వీ రడగలేదో వారు చెప్పలేదో ఆ యీ విషయము లేవియు వీరి వాదమున కుపకరింపవు. వారే చెప్పవలె నన్న నియమ మేమియును లేదు. విశేష మెవరు చెప్పినను గ్రహింపదగ్గదే. 'నహి సర్వః సర్వంజానాతి'—'ముఖేముఖే సరస్వతి'. అందుచేత ఎవరు చెప్పినను సరసముగా నున్నచో నొప్పుకొనుటయే నా పద్ధతి. నొప్పి చెందుట కాదు. మా గురువుగారు చెప్పలేదను బాధ నాకు లేదు. మనకున్న ప్రతిభా వ్యుత్పత్తులను నమ్ముకొని భారతాదులలోని ప్రయోగములు దిద్దుటకు పూనుకొనరాదని కింకవీంద్ర ఘటాపంచాననేత్యాది బిరుదాంకితులు శ్రీ చెళ్లపిళ్లవారు చెప్పియే యున్నారు. ('దిద్దకుడయ్య భారత ప్రయోగములన్'—ఇత్యాదిగా.) కొందరిక్కడ త కారము గురువగునని వాదమునకు కుపక్రమింతురు. రేఫ సంయుక్త పూర్వమునకు గురుత్వం వైకల్పికమని ప్రీవీ కౌన్సిలు తీర్పు లున్నవి. ఉన్నచో నేమి ? వారి కవేమియు నక్కరలేదు. విరిగిపోయిన కొయ్య కత్తులు పుచ్చుకొని యుద్ధమునకు సిద్ధపడుదురు.

భాష సముద్రము వంటిది. ఎక్కడ ఏ ప్రయోగ విశేష మున్నదో తెలిసికొనుట జిజ్ఞాసువుల లక్షణము. చట్టున ప్రతిదానిని తల్లక్రిందులనియు తప్పనియు ననకూడదు.

# ఏకవీర

## శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

కాకతమ్మ సప్తమాతృకలలోని చాముండియని వెనుకటివ్యాసములలో వ్రాసియుంటిని. ఈ చాముండియే క్రీడాభిరామపు చమడేశ్వరి అంటిని. శ్రీ వేటూరి శంకరశాస్త్రిగారు క్రీడాభిరామములో 'చమడేశ్వరీ మహాశక్తి' అని ఉన్నదికాని, "కాకతమ్మనగరు" అని లేదుకాబట్టి ఈ చమడేశ్వరి పేరూ, కాకతమ్మపేరూ అయి ఉండవలెనన్నట్లు వారి 'కాకతమ్మ స్వరూపము' అన్న వ్యాసములో తెల్పినారు. కాకతమ్మ అన్నపేరు చాముండికి కాకతీయులు పెట్టుకున్నపేరు. ఆమెనే నందవరీకులు చాడే



పానగల్లులోని పంచీశ్వరాలయంలో
"చాముండి" శిల్పం

శ్వరి అన్నారు. రెడ్డిరాజులు మూలఘూరమ్మ అన్నారు. ఊరూరా జానపదులు పేర్లు మార్చి ఆమెనే కొల్చినారు. ఈమె విగ్రహములు తెలుగుదేశపు అన్ని మూలలా కొల్లలుగా కనబడుతున్నాయి. హనుమకొండ కోటలో అర్ధశిల్పముగా శవాసనముతో కనబడే నాలుగడుగుల విగ్రహము మాత్రము కాక ఉత్తరపుకొండకు లోనైపున పెద్ద అర్ధశిల్ప రూపము చిత్రించబడివున్నది. ఇంకొక రహస్యము. భద్రకాళియని పూజలందుకుంటున్న దేవి 'మహాబల, ప్రేతాసనసమాయుక్త!'. ఆమె రూపము కాకతమ్మ రూపమే. మార్పాడీలు మార్చిఉండని రోజులలో ఆమె ఘోరరూపి, మహాబల, ప్రేతాసనసమాయుక్త, కృశోదరిగానే ఉండియుండవచ్చును. నేటి సౌమ్య రూపము ప్రేతాసనమును మార్చకపోవడము నయమే. చాముండి ప్రేతాసనసమాయుక్త. కనుక శ్రీ శంకర శాస్త్రిగారు ఒప్పుకొన్నట్లు "చాముండియే కాకతమ్మ అనడములో విప్రతిపత్తి యేమీ లేదు".

ఏకవీరరూప మేదో తేలలేదు. శిరస్సుమాత్రమేఉన్న ఎల్లమ్మ అలంపురం చేరువను ఉండవల్లిలో ఉన్నదీ, దక్షిణాన్న పరశురామక్షేత్రాలలో ఉన్నది. క్రీడాభిరామములోని 'ప్రిథ శూన్యకటీర మండలము'ను చూచి శ్రీపాదవారు భ్రమపడినారని వ్రాస్తూ శంకర శాస్త్రిగారు "ప్రిథాశూన్య కటీరమండలము దేవిదికాదు, శంభళీవ్రాతానిది" అని చెప్పినారు. నేను చూచి భ్రమపడలేదు, చూడకనే పొరబడినాను. శ్రీ శాస్త్రిగారు చక్కగాచూచి 'శంభళీవ్రాతానిదే' అని చెపుతూన్నారు కనక మనము నమ్మితీరవలసినదే. అయితే ఈ "పొరపాటు" శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారూ చేసినారు. అలంపురములో భూదేవి, రేణుకాదేవి అన్న పేర్లతో నగ్న కబంధాలు రెండున్నవి. ఒకటి గుడిలో జోగులాంబ ఆలయమునకు ఎదుటా, ఇంకొకటి మ్యూజియములోనున్నూ. ఇలాంటి నగ్నకబంధమే ఇక్ష్వాకులనాటిది నాగార్జునకొండ మ్యూజియములో పొరాతిది ఉన్నది. మరి భూదేవి (Earth goddess) ని రేణుకాదేవి అని అనడము ఎప్పటినుండి,ఎందువల్ల వచ్చినది? అన్న ప్రశ్నలు పుట్టుకొస్తాయి. మొదటిభాగానికి జవాబు ఇంకా తేలవలసే ఉన్నది. రెండోభాగానికి "రెండు విగ్రహాలూ నగ్నములు కావడమువల్ల" అన్న జవాబు చక్కగా కుదురుతుందంటున్నాను.

అయితే క్రీడాభిరామములోని ఏకవీరమ్మరూపము, సోమసూర్యానల నేత్రములూ, హైహయరాజదంతాస్థిపటల హారమూ తో ఎక్కడా నాకు కానరాలేదు నేను చూడగలిగినంత వరకూ. మొగిలిచర్లలో ఏకవీరమ్మగుడి ఉండినట్లు వింటిన్నాము. ఆ గుడి ఈనాడు శూన్యము. అందులో విగ్రహములేదు. దాని చేరువన కచ్చా అర్ధశిల్ప రూపము, పావడ ధరించిన స్త్రీ హముల నడుమ ఉన్నది. ఏకవీర 'ఫణిరాజమండన' అయితే ఈ మూలక

శిల్పమును ఏకవీర అనుబుద్ధి నాకులేదు. ఎవరికీ ఉండదన్నంత బండరూపమిది. నిన్నటిదో మొన్నటిదో.

పాలంపేట నాసికాస్తంభ ప్రతిమలలో ఒక ఫణిరాజముండన, నగ్న స్త్రీ విగ్రహము ఉన్నది. అయితే ఈమెను ఏకవీర అనడానికి వేరే సాక్ష్యమేమీ లేదు. ఈమె నాగకన్య కావచ్చును.

ఆంధ్రదేశములో అమ్మవారు అన్న నిర్దేశముతో గుండ్రని పసుపుముఖము, కుంకుమబొట్టు, కుంకుమరేఖల భ్రుకుటి, కుంకుమ చుక్క, ముక్కుకొన, కుంకుమరేఖనోరు, కుంకుమ చుక్క గడ్డముతో గోడకువేసి చల్ది నైవేద్యము చేస్తారు తల్లులు. ఈ ముఖము శిరస్సుమాత్రమున్న ఏకవీరమ్మ ముఖము కావచ్చును. మహారాష్ట్రులు శుభకార్యములకుముందు ఎల్లమ్మకు నైవేద్యాలు చేసి, ఎల్లమ్మబొట్టు అన్న చిన్న బంగారుబిళ్ళను —చతుర్భుజదేవిబొమ్మ ముద్రించినదానిని—మెడలో కట్టుకుంటారు. కనుక సంప్రదాయము అన్నది మారిపోయి అనేక రీతులుగా వస్తున్నది అనిపిస్తుంది. దానినిబట్టి ఏకవీరరూపం తెలియదు.

శ్రీ వేటూరి శంకరశాస్త్రిగారు, తమ వ్యాసము (కాకతమ్మ స్వరూపము)లో చాలా బొమ్మ లిచ్చారు. వాటిలో చాలా మట్టుకు కాకతిస్వరూపాలే. ఒక విగ్రహము—నర్తకి కాళ్ళవలె వంగిన కాళ్ళది—శ్యేష్మాదేవిది. నిల్చిన కాకతివిగ్రహాన్ని శాస్త్రిగారు 'ఏకవీర' అన్నారు. నమ్మడము ఎలాగ? అత్తిరాలలో నిల్చిన విగ్రహమొకటి కలదు. ఆమె చేతనున్న ఆయుధమును పాము చుట్టుకొని ఉన్నది. మిగిలిన ఆయుధాలు చాముండివే. నెల్లూరుజిల్లా సంగంలో నిల్చిన చాముండి సంప్రదాయపు ఆయుధాలతో కలదు. నిల్చిన చాముండిని ఏకవీర అని ఎలాగ అనగలము.?

పానగల్లులో పంచీశ్వరాలయమన్న శివాలయ మొకటి కలదు. దాని గోడలమీది శిల్పములు అద్భుతముగా ఉన్నవి. ఆ శిల్పములలో ఒక బొమ్మ 'చాముండి'... ఈమె నిలిచి ఉన్నది. ఆయుధాలు—కత్తి, రక్తపాత్రా, డమరుకమూ, త్రిశూలమూ—చాముండివే. ఆమె ఎడమవైపు రెండుకాళ్ళమీద లేచిన నక్క కలదు. ఈ గుడి శిల్పాలలోనే ఇంకొక నగ్నస్త్రీ విగ్రహము కలదు. ఆమె కుడివైపున నక్క; ఎడమవైపు హ్రస్వ విగ్రహుడు, నగ్నుడు. డాక్టరు బి. రామరాజుగారి "తెలుగు జానపదగేయసాహిత్యము"లోని రేణుక కథలో నక్క, దిగంబరయై స్నానమాడు రేణుక, ఆమెను పిలచు 'మునుకరేణుడు' కలరు. అయితే సరిగ్గా ఈ చిత్రములోని సన్నివేశము మాత్రము లేదు. ఈమె రేణుక—అనగా ఏకవీర—కాగలదా? కాగలదనే నేను



పంచీశ్వరాలయంలోని మరియొక శిల్పం

కుంటున్నాను. స్నానము చేస్తూ, వికలచిత్తయైన రేణుక కోరిక తీర్చుటకు జమదగ్ని 'మునకరేణు'ని సృజించినాడట! వాడిక్కడ ఉన్నాడు. నక్క, ఆమె కొంతకాలముక్రిందట చూచిన దృశ్యములోనిది. కనుక ఈ చిత్రము రేణుక కథలోనిదనిన్నీ, ఈమె రేణుక అనిన్నీ అంటున్నాను.

# అర్ధరాత్రి

శ్రీ మంగిపూడి కృష్ణమూర్తి

అర్ధరాత్రి గతించె నమస్తభూమి
నతిభయంకర నిశ్శబ్దమాక్రమించె
నంధకారము కబళించె నఖిల దిశల
నెల్లవారును నిద్రించిరేను దప్ప

జగతి పుట్టకమున్న చతురాననునిఁగూడ
జడిపించినట్టి యజ్ఞానరాశి
సకలలోకంబుల స్వాహాయొనర్చెడి
కాళరాత్రికిఁ జెలికత్తెయిన్న
దుష్టదురుద్యోగదుర్మార్గదానవ
వ్రాత సమాశ్రయ భూతగృహిణి
యాగరక్షశత్రువైనట్టి వెలుంగుపై
కోపించివచ్చు నారీపిశాచి
కాలపురుషుని యుంపుడుకత్తె తన త
మోగుణంబును ముజ్జగంబులకుఁ జాటఁ
దట్టమౌ నల్లని ముసుంగుఁ దాల్చినట్టి
స్వైరిణి యనంగ నీయంధకారమొప్పె

ప్రక్కనున్నట్టి పూరింటి ప్రాంగణమునఁ
గుక్కినులకమంచము పయిఁగుఱ్ఱువెట్టి
నిదురవోవుచు నున్నవాఁడదిగో! యతఁడ
గంజితోఁ దృప్తిఁ జెందెడి కష్టజీవి

పగలు పడునట్టి సంసారబాధ రాత్రి
మఱచి నిదురించుభాగ్య మందఱకుఁగల్గ
దెన్నఁడును మేలుకొనక నిద్రించువారి
దెంతటి యదృష్టమో! గణుతింపఁ దరమె?

ఇదిగో! యీ యింటిలోపల నేడ్చుచున్న
దో యభాగిని తన చెడ్డయోగమునకుఁ
దైవమును దూఱిమాటి తుదకు హృదయముఁ
కెలువు నేఱును సంద్రముగా జేసికొనునో?

అల్లదే వచ్చుచున్నట్టి యతఁడెవండో?
జారుఁడో? చోరుఁడో? గూఢచారుఁడేమొ?
అంధకారగర్భము నుండి యవతరించు
చున్నటుల ముందు తోతెంచుచున్నవాడు

జడలు విరయఁబోసి చలనంబు నెఱుఁగని
భూతమట్లున్నది యీత చెట్టు
ఇంటికప్పనవాలి, యిటునటుఁ జూచుచుఁ
గుండెలదరఁ గూసెఁ గుడ్లగూబ
తలతోఁక కదపక కలుగు సమీపానఁ
గడుఁబొంచియున్నది గండుపిల్లి
దిట్టమా ధాన్యపుఁ గొట్లుగోడను దొల్చి
సందడించుచు నుండెఁ బందికొక్కు—
కట్టుగొయ్యను గొమ్ముతోఁ గొట్టికొట్టి
తుదకు నిట్టూర్చె పాలలో దున్నపోతు
నిదురపోవు నిశ్శబ్దము నదరఁగొట్టి
గోలచేసెను దూరాన రైలుబండి

ఈ గతి నెన్ని రాత్రులు గతించినవో? యిఁక నెన్ని రాత్రముల్
రాఁగలవో? వసుంధర చిరంబుగ నిల్చునో? లేక నాశమై
పోఁగలదో? మదీయమగు పూర్వచరిత్రము, వర్తమానమే
యోగముఁ బొందునో తుద కయోమయమై కనుపించు రేపులోన్?

# మహత్తర పరివర్తనము - II

## [సామ్రాజ్యాల అవతరణ : వాటి స్వభావము]

### శ్రీ జాన్‌స్ట్రాచీ

ఇక నేను అసలు విషయాన్ని గురించి మాట్లాడుతాను. సామ్రాజ్యవాదం అంటే ఏమిటి ? ఈ ప్రశ్నకు నేను సమాధానం ఇచ్చేముందు, చారిత్రకమైన ఈ అపూర్వ సంఘటన యొక్క పరిమాణాన్ని గురించి మీరు ఒక క్షణం ఆలోచించమని కోరుతున్నాను. మానవ చరిత్రలోనూ, ప్రపంచంలోనూ అది విస్తరించిన భాగం యొక్క విస్తృతను గురించి కూడా ఆలోచించవలెనని నా మనవి. నాగరికత చరిత్రలో ఇంతటి అపూర్వ సంఘటన మరొకటి లేదు. నాగరికత అనేది ఏర్పడిన తరువాతనే సామ్రాజ్యాలు అనేవి కూడా ఏర్పడినవి. అంతకు పూర్వం లేవు. కేవలం సామాన్య రాజ్యాల వంటి వ్యవస్థలే కాక, మనం సామ్రాజ్యాలు అని పిలిచే ప్రత్యేకమైన రాజ్యాలు ఉన్నవి. పర రాజ్యాలను పాలించిన రాజ్యాలున్నవి. ఇలా అనగానే దానికి నిర్వచనం చేయవలసి ఉంటుంది. నిర్వచన చేయుట మనేది ఎవరికి తోచినట్లు వారు చేయటమే కాని, ఏ ఒక సూత్రాన్ని అనుసరించి చేయటం అనేది లేదు. సామ్రాజ్యాలను సామ్రాజ్యవాదాన్ని మీ ఇష్టం వచ్చినట్లు నిర్వచించవచ్చు. కాని సామ్రాజ్యవాద మనే పదాన్ని నేను వాడినపుడు, ఒక ప్రజ గాని, ఒక దేశము గాని, ఒక రాజ్యము గాని, మీరు—వాటిని ఏ పేరు పెట్టి పిలిచినా సరే— మరో ప్రజను గాని, దేశమును గాని, రాజ్యమును గాని జయించి, వారిపైన రాజ్యాధికారమును చలాయిస్తూ ఉండే విధానమని చెప్పటం నా ఉద్దేశము. ఆ విధానము స్థాపించిన స్థితిని సామ్రాజ్య మంటాను. ఇంతకన్న విపులమైన నిర్వచన చేయవచ్చు. ఏవిధమైన దురాక్రమణనైనా సామ్రాజ్యవాదమని నిర్వచించవచ్చు. ఏవిధమైన పీడనకైనా ఆ పేరును తగిలించవచ్చు. సామ్రాజ్యాలు అనేవి ఏర్పడటానికి చాలా పూర్వమే, దురాక్రమణలు, యుద్ధాలు, అనేకం జరిగాయి. పీడన అనేది ఏదో ఒక దేశంలో మాత్రమే జరుగవచ్చు. ఒక దేశంలో ఒక తరగతి జనులు, అదే దేశంలో మరో తరగతి జనులను పీడించుతూ ఉండవచ్చు. సామ్రాజ్యాలు లేకుండానే ఇది జరుగవచ్చు.

సామ్రాజ్య మంటేమో, సామ్రాజ్యతత్వ మంటేమో, ఏమిటనేది నిర్వచించటం జరిగినది కాబట్టి, తరువాత, అవి ఎలా అవతరించాయి ? ఎప్పుడు అవతరించాయి ? ఎందుకు అవతరించాయి ? అన్న ప్రశ్నలకి సమాధాన మివ్వవలసి ఉన్నది. ఈ మూడు ప్రశ్నలలో "ఎపుడు" అన్న దానికి ఎక్కువ ప్రాధాన్యత ఇస్తాను. ఎందుకనంటే దీని కిచ్చే సమాధానంలోనే మిగతా రెంటికీ సమాధానం లభిస్తుంది.

సూమేర్, బాబిలోనియా, సిరియా, రోము, గ్రీసు మొదలైన ప్రాచీన సామ్రాజ్యాలు మొదలుకొని, గత 70 సం. లలో సంఘటితమైన సామ్రాజ్యాలను గురించి హేతుబద్ధంగా వివరించటానికి నాకు తెలిసినంతవరకు ఒకేఒకరు ప్రయత్నం చేయటం జరిగినది. విషయాన్ని ఆమూలాగ్రంగా పరిశీలించి దానిని విస్తృతీసి తమ రచనలలో మార్క్స్, ఏంజిల్సు మనకు ప్రసాదించారు. సామ్రాజ్యతత్వం, దాని అవతరణ గురించి మార్క్స్, ఏంజిల్సు చేసిన వివరణను, వర్ణనను ఇదివరకు ఎంత గాఢంగా విశ్వసించానో, ఇపుడూ అంత గాఢంగానే విశ్వసిస్తున్నాను. సర్ప్లస్ వాల్యూ (Surplus Value) అనే సూత్రం వారి సిద్ధాంత సౌధానికి పునాది. వారి సిద్ధాంతానికే మూలము. సామ్రాజ్యాలకూ, సామ్రాజ్య తత్వానికీ మూలము, సర్ప్లస్ వాల్యూ (Surplus Value) అనే తమ మూలసిద్ధాంతము ననుసరించి వివరించారు. మొత్తంమీద మనుష్యులందరూ, తమ అవసరాలకు మించిన వస్తూత్పత్తిని చేయగలరా లేదా అన్న ప్రశ్న మీదనే ప్రతిదీ ఆధారపడి యున్నదని వారి విశ్వాసము. సామ్రాజ్యతత్వమును గురించిన వారి సిద్ధాంతము సర్ప్లస్ వాల్యూ గర్భంనుండి ఆవిర్భవించిన శిశువు.

ఏనాడు మానవులు తమ అవసరాలకు మించిన ఉత్పత్తిని చేయగల సాధన సామగ్రిని కనిపెట్ట గలిగారో, ఆనాటినుంచి సామ్రాజ్యాలు అనేవి ఆవిర్భవించినవని వారి అభిప్రాయము. ఇతరులనుండి కొంత రాబట్ట గలుగుటకు అవకాశ మున్నప్పుడే సామ్రాజ్యాలు అనేవి ఏర్పడుతాయి. దురాక్రమణ చేసేవారికి, ఆశ అనేది కలగడానికి అదే కారణ మవుతుంది. బలమైన దేశాలు, బలహీనమైన దేశాల నుండి (ఆ దేశ అవసరాలకు మించిన సంపద వున్నప్పుడు) వారి అద

వను సంపదను తమ వశం చేసుకొనటానికి ప్రయత్నించటమే సామ్రాజ్య నిర్మాణము. మొట్టమొదటలో ఇది సులువైన బానిసత్వ రూపంలో అమలు జరిగింది. అంటే వ్యక్తులను బానిసలుగా చేసి పశువులచేత పని చేయించినట్లు చేయించటము అన్నమాట. ఇది వర్తకం, వ్యాపారం మోస్తరు గాని, చిక్కు లెక్కలతో కూడిన మామూలు కూలి మోస్తరు గాని, ఏకపక్ష ప్రయోజనమును మాత్రము గమనించే బేరము వంటిది కాదు. కేవలమ్ము పశువులను తోలుకొచ్చి కట్టి పని చేయించినట్లు చేయించటమే.

ఆదిలో సామ్రాజ్యాలు అనేవి కేవలం బానిసల వేట కోసం ఏర్పడిన సంఘాల వంటివని, మార్క్సు, ఏంజిల్సు అభిప్రాయం. నాగరికోదయం అనేది అయ్యేవరకు సామ్రాజ్యాలు అనేవి రావని ఇప్పుడు సాక్షీభూతంగా రుజువైనది. ప్రాణం నిలుపుకొనటానికి మాత్రం పొట్ట నింపుకొనే ఆదిమ నివాసులకు మరొకరిని బానిసలుగా చేసికోవాలన్న వాంఛ ఎప్పుడూ కలుగనే కలుగదు. అయితే వారు అప్పుడప్పుడు యుద్ధంలో ఖైదీలను పట్టుకొచ్చేవారు. కాని వారిని ఏపని లేకుండా అట్టే పెట్టుకోవటంవల్ల ప్రయోజనం ఏదీ ఉండేదికాదు. వారి అవసరాలను తయారు చేసికొనటంలోనే వారి కాలం గడిచిపోయేది. మానవసంఘం ఈ స్థితిలో ఉన్నప్పుడు కనుక సామ్రాజ్యాలు నిర్మించటానికి ప్రయత్నిస్తే ఫ్రెంచి రైతును గురించి చెప్పిన కథలో జరిగినట్లే జరుగుతుంది. ఫ్రెంచి రైతులు పొదుపరితనానికి పేరుపొందినవారని మీకు తెలుసుననుకుంటాను. అక్కడి రైతు ఒకతను తన మతగురువు దగ్గరకు వెళ్లి ఇలా గోల పెట్టినాడట. "స్వామీ ప్రపంచంలో నాబోటి దురదృష్టవంతుడు మరొకడుండడు. తిండిలేకుండా బ్రతకడం ఎలాగో నా గాడిదకు నేర్పటం మొదలుపెట్టాను. మొద్దు మొహం అది నేర్చుకోకుండానే చచ్చిపోయింది." నాగరికత రాకపూర్వం ఉన్నవారుకనుక సామ్రాజ్య నిర్మాణానికి పూనుకుంటే, వారు కథలోని ఫ్రెంచి రైతు స్థితిలోనే ఉండేవారు. ఉత్పత్తిని పెంచే పరికరాలను కనిపెట్టేసరికి (ఒక విధంగా అణుశక్తిని కనుక్కోటం కంటె కూడా గొప్ప విషయం) అంటే వ్యవసాయం చేయుటం, చక్రాల ప్రయోజనాన్ని తెలిసికొనటం, పట్టణాలను నిర్మించటం మొదలైన నాగరికతా లక్షణాలను ఆచరణలోకి తెచ్చేసరికి సర్ప్లస్ అంటే మిగులు అనేది వచ్చింది. ఆ క్షణం నుంచి ఇతరులను బానిసలుగా చేసికొని వారిచేత సేవ చేయించుకొనటం ఆరంభమైనది. రుచి ఎరిగిన తరువాత మానవ స్వభావము పూరుకొన నిస్తుందా ? బానిసత్వం అమలులోకి వచ్చింది.

ఫ్రెడ్రిక్ ఏంజిల్సు రచనలోంచి కొంత ఎత్తి వినిపిస్తాను. అది మీకు జ్ఞాపకము చేయుటానికే కాక, మార్క్సు ఏంజిల్సుల నిజ సిద్ధాంత మిది అని నిరూపించటానికి కూడా వినిపిస్తాను. పెద్ద దయినా వినతగ్గది కాబట్టి వినిపిస్తాను. అది ఏంజిల్సు వ్రాసిన Anti - Duhring గ్రంథం లోనిది. ఆ గ్రంథం మీకు తెలుసుననుకుంటాను.

"ఉత్పత్తి పద్ధతి పొందిన అభివృద్ధిని చూస్తే ఒక వ్యక్తియొక్క శ్రమ, శక్తి, దాని పోషణకు అవసరమైన దాని కన్న ఎక్కువ ఉత్పత్తి చేయుగలుగు చున్నది. అదనపు పనివారిని పోషించటానికి కావలసిన ఉత్పత్తి నిస్తున్నది. వారికి పని కల్పించటానికి కూడా సావకాశం కలిగిస్తోంది. అందువల్ల కార్మిక కార్మికశక్తికి ఒక విలువ ప్రాప్తించింది. కాని ఒక సంఘంలో, ఒక వర్గంలో పనిలేని అదనపు జనాభా అంటూ లేదు. అలాంటి వారు ఎవరన్నా ఉంటే యుద్ధం అనేది వారికి పని కల్పించింది. విభిన్న వర్గాలు, సంఘాలు, ఏర్పడటంతో యుద్ధం కూడా వాటితోపాటు రావలసి వచ్చింది. అప్పటివరకు యుద్ధంలో పట్టి తెచ్చిన యుద్ధ ఖైదీలను ఏమిచేయాలో వారికి తోచలేదు. అందుకని వారిని చంపివేసేవారు. ఇంకా అంతకు పూర్వకాలంలో భక్షించేవారు కూడా. కాని "ఆర్థిక స్థితి" అనేది ఏర్పడేసరికి ఖైదీలకు కూడా ఒక రకమైన విలువ వచ్చింది. ఖైదీలను చంపి పారవేయకుండా, వారిచేత చాకిరీ చేయించటం మొదలుపెట్టారు. బానిసత్వము యొక్క సృష్టి ఈవిధంగా జరిగింది. ఆటవికజీవితవిధానాన్ని అధిగమించిన వారికి ఉత్పత్తి ప్రధాన సాధన మైనది. చివరికి దాని పతనానికి అదే కారణమైనది. వ్యవసాయికము, పారిశ్రామికము, అన్న శ్రమవిభజన (Division of Labour) జరగటానికి బానిసత్వమే కారణం. ప్రాచీన సంస్కృతి గుచ్ఛమైన హెల్లెనిజానికి (Hellenism) కూడా ఇదే కారణమైనది. బానిసత్వము లేకపోయినట్లయితే గ్రీసు రాజ్యము, గ్రీసు కళ రెండూ ఉండేవి కావు. అలాగే రోమను సామ్రాజ్యమూ ఉండేదికాదు. హెల్లెనిజము, రోమనుసామ్రాజ్యము లేకపోయినట్లయితే ఆధునిక ఐరోపా ఉండేదికాదు."

బానిసత్వమూ, తత్సంబంధమైన వాటిని గురించి ఆగ్రహించి, దురాచారములని దూషించి ఖండించటం చాలా తేలిక. నేటి మన ప్రవృత్తికీ, పరిస్థితులకీ, నాటి ఆచార వ్యవహారములకు సంయమం కుదరదు అని తేల్చటం కంటె, ఈ ఖండనవల్ల తెలియు వచ్చేది లేదు. అవి ఎలా వచ్చాయని కాని, చరిత్రలో అవి నిర్వహించిన పాత్రను గురించి కాని, మాటమాత్రం కూడా చెప్పవు. అయితే ఈ ప్రశ్నల దృష్ట్యా పరిశీలించి చూస్తే (ఎంత విరుద్ధంగా కనబడినా) అప్పటి కాలమానపరిస్థితులను బట్టి, బానిసత్వమనేదాన్ని ప్రవేశ పెట్టటం పురోగమన పథంలో పెద్ద ముందడుగు అని చెప్పి తీరాలి. మానవుడు మృగాల మధ్య నివసించి వచ్చినవాడు. అతని జీవిత విధానం కూడా జంతుజీవనమార్గంలోనే నడచింది. క్రూరకార్యములతో నిండి ఉండేది. ఆ పరిస్థితి నుండి తప్పించుకొని బయట పడటానికికూడా అమానుషమైన పద్ధతులను అవలంబించవలసి వచ్చినది. వెనుక

కమ్యూన్సు (Communes) ఉన్న దేశాలలో—ఇండియా నుండి రష్యా వరకు ఉన్న ప్రాక్ ప్రదేశాలలో—వేల సంవత్సరాల పాటు రాక్షసరాజ్యాలు ఏర్పడటానికి ఆధారభూతమైనాయి.

ఏ ప్రాంతంలో ఈ కమ్యూన్సు ముందుగా అంతరించాయో ఆ ప్రాంతంలో ప్రజలు ప్రథమంగా అభివృద్ధి మార్గంలో ముందడుగు వేయగలిగారు. బానిసలచేత పనిచేయించి, ఉత్పత్తి సాధనాలను, ఉత్పత్తిపరిమాణాన్ని పెంచగలగటమే ఆర్థిక రంగంలో వారు సాధించిన ప్రథమ విజయం. మనుష్య శ్రమవల్ల ఉత్పత్తి కాగల వస్తువులు, బహు స్వల్పమైనపుడు, అవి, జీవితావసరములకు మించి వుండవు. శ్రమ విభజన (Division of Labour) ఎక్కువైనపుడే ఉత్పత్తి ఎక్కువవుతుంది. ఉత్పత్తి ఎక్కువైనపుడే వర్తకము ఎక్కువవుతుంది. రాజ్యము, శాసననిర్మాణము పెరగటం జరుగుతుంది. కళలు, శాస్త్రము అంకురించటము మొదలు పెడుతవి. శ్రమవిభజన విస్తారమైనపుడు వీటన్నిటికీ అదే ఆధార మవుతుంది. శ్రమ విభజన రెండు తెగల మధ్య ఉంటుంది. కాయకష్టంతో పనులను నిర్వర్తించేవారిది ఒక తెగ. వీరికి పనిని పురమాయించటం, వ్యాపారం నడపటం, దేశ వ్యవహారాలను దిద్దటం చేసేవారిది రెండవ తెగ. వీరే కొంతకాలానికి కళలలోనూ, శాస్త్రపరిశోధనలోనూ కాలం గడుపుతారు. వాస్తవానికి బానిసత్వ మనేది అతి సామాన్యమైన, స్వాభావికమైన, శ్రమవిభజన. ప్రాచీన ప్రపంచంలో ముఖ్యంగా గ్రీసుదేశంలో, వర్గ వైషమ్యంతో కూడిన సంఘ నిర్మాణం జరగటం బానిసత్వ రూపేణా జరిగింది. ఇది బానిసలకు కూడా పురోగమనమే. ఎందుకనంటే, యుద్ధ ఖైదీలను బానిసలుగా నియమించేవారు. అందువల్ల వారికి ప్రాణాలన్నా నిలిచేవి. అంతకుపూర్వం వారిని చంపి పారవేశేవారు. ఇంకా పూర్వం నిప్పులో వేసి కాల్చి వేసేవారు."

ఏంజిల్సు రచన నుంచి నేను వినిపించిన ఈ భాగము చాలా గొప్పదని నా ఉద్దేశము. మీరు ఆసాంతమూ ఆ రచనను చదవాలి. అది ఏంజిల్సు యొక్క శాస్త్రీయబద్ధమైన సత్యాన్వేషణకు, నిశ్చలత్వమునకు నిదర్శనము. చరిత్ర క్రమంలోనే అనుకోండి. అయితే మట్టుకేం? ఏంజిల్సును బానిసత్వాన్ని సమర్థించడంకన్న అప్రతిష్టపాలు చేసేది, అపార్థం తీసేది వేరే ఉంటుందా? వారి పుస్తకంనుంచి నేను వినిపించిన భాగం చూస్తే, వారి తర్కం, వాదం, ఏ దారిని ఏ గమ్యస్థానానికి లాగుకొనిపోతే అక్కడికి పోవ సిద్ధముగా మన్నట్లు విదిత మవుతోంది. బానిసత్వ మనేది (నేడు కడు హేయమైనది) ఆరువేల సంవత్సరముల క్రిందటి దైనప్పటికీ, అప్పుడైనా సరే మానవజాతి తన పరిణామక్రమంలో దానిని అనుభవించి తీరవలసిన అవసరమున్నదని చెప్పటం కంటె ధైర్యంతో కూడిన దేమున్నది!

ఇక్కడ ఒక్క క్షణం ప్రధాన విషయం వదలి మరో విషయాన్ని గురించి మాట్లాడుతాను. ఇపుడు తెలిసికొనిన దానినిబట్టి, కమ్యూనిస్టు సిద్ధాంతానికి మూలాధారమైన, మార్క్సు, ఏంజిల్సు, లెనిన్ రచనలను, ఏరీతిని పరిగణించవలెను, ఎంచవలెను, అన్న ప్రశ్న మనల్ని ఎదుర్కొంటోంది. నే నింతకుముందు చెప్పినట్లు కమ్యూనిస్టు సిద్ధాంతము అప్రతిహతము కాదు. కాని అంతమాత్రంచేత మొత్తం మార్క్సు సిద్ధాంతాన్ని కాదని త్రోసివేయటానికి వీలులేదు. అందుకు అంగీకరించను. అతని సిద్ధాంతంలో అనేక ముఖ్య సమస్యలకు సమాధానం లభిస్తుంది. మార్క్సు తప్పులు చేశాడంటే, అతను కూడా ఒక మానవమాత్రుడే అని అనటానికి మించి మరేమి లేదు. ఈమధ్య ఈ విషయమై ఆర్నాల్డు టాయన్‌బీతో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపాను. ఆయన చక్కని సమాధానమిచ్చారు. "మార్క్సును తప్పులెరుగని ఉత్కృష్టమైన ప్రవక్త గానెంచవద్దు. అయితే 19 వ శతాబ్దం ప్రాతకాలపు సంఘశాస్త్రజ్ఞుడనీ త్రోసివేయవద్దు. మార్క్సుగూడా ప్రతిభావంతుడైన సామాన్యమానవుడు" అని టాయన్‌బీ వ్రాశాడు. ఆయన కాస్తలో బహురమ్యంగా క్లుప్తీకరించాడు.

సామ్రాజ్యాల అవతరణ గురించినంతవరకు మార్క్సు సిద్ధాంతాన్ని పూర్తిగా అనుసరిస్తాను. అయితే ఈమాట చెప్పిన వెంటనే మరొక మాట కూడా చెప్పటం అవసరం. ఆదిలో సామ్రాజ్య నిర్మాతలు, బానిసలవేటవంటి బండ పద్ధతులు అవలంబించారు. కాని పోను పోను చాలా సున్నితమైన పరోక్షమైన పద్ధతులను అవలంబించారు. బహు క్లిష్టమైన యంత్రాంగాన్ని నిర్మించారు. అయితే నే నిక్కడ చెప్పేది వాద ప్రతివాదాలకు దారితీయవచ్చు. ఈ యంత్రాంగము స్వప్రయోజనం కోసం సృష్టించబడినా, దానివల్ల పరప్రయోజనం కూడా కొంత జరిగింది. మంచీ, చెడూ, రెండూ జరిగాయి.

ఇంగ్లండు నుండి ఇక్కడికి భారతదేశం మీదుగా వచ్చాను. మొత్తంమీద చూస్తే బ్రిటిషువారి భారత సామ్రాజ్యము మిగతావారి సామ్రాజ్యా లనేకం కన్నా, తక్కువ పీడాకరంగానే కాక, కొంతవరకు పునరుద్దీపనకు తోడ్పడినదని కూడా నా అభిప్రాయం. నేను బ్రిటిష్ దేశీయుడను కాబట్టి, నా అభిప్రాయము కొంత పాక్షికంగా కనపడవచ్చు. అందుకు మీరు నన్ను మన్నించాలి. అయితే నా యీ అభిప్రాయాన్ని

బలపరచటానికి ఈ పర్యాయం ఏంజెల్సు చెప్పినది కాకుండా, సాక్షాత్తు మార్క్సు చెప్పిన మాటలనే నేను పేర్కొంటాను. మార్క్సును బ్రిటిషు సామ్రాజ్యాభిమాని అని అనటానికి వీలులేదుకదా ? ఆయన ఉండగానే, అనగా నూరేళ్లనాడు, భారతదేశంలో బ్రిటిషు సామ్రాజ్యాధిపత్యం కొంత మంచి కూడా చేసినదని విస్పష్టంగా వ్రాశారు. "బ్రిటిషు పరిపాలన మూలంగా భారతదేశంలో రాగల ఫలితాలు" అన్న శీర్షికతో న్యూయార్కు ట్రిబ్యూన్ పత్రికలో వరుసగా కొన్ని వ్యాసాలు వ్రాశారు. ఈ విషయాన్ని ఆయన ఎలా తేల్చి చెప్పింది, ఆ వ్యాసావళిలోంచి ఒకటి రెండు పంక్తులు చదివి వినిపిస్తాను. పారిశ్రామిక అభివృద్ధి అనేది ఆయన కాలంలోనే మొలకెత్తటం ఆరంభించింది. భారతదేశంలో అప్పటికి సాగుతున్న పారిశ్రామిక అభివృద్ధిని గురించి ఇలా వ్రాశారు.

"రైళ్లకు పని కల్పించాలి అంటే వాటిని నడపవలసిన అవసరాన్ని తెచ్చిపెట్టే ఇతర పరిశ్రమలను నిర్మించటం అవసరం. లేకపోతే అతి విస్తీర్ణమై, దేశవ్యాప్తమైన రైలు మార్గాల పోషణను భరించటము కష్టము. అందువల్ల రైళ్లకు సంబంధంలేని ఇతర పరిశ్రమలుకూడా ఆరంభమవుతాయి. కాబట్టి ఆధునిక పారిశ్రామికాభివృద్ధికి రైళ్ళు దోహద మిస్తున్నాయి. అంతేకాదు. భారత అభివృద్ధికి, శక్తికి విరోధకంగా ఉండే కులవృత్తిపద్ధతిని ( కులాన్ని అనుసరించి ఉండే వృత్తి విధానాన్ని ) తొలగించి వేయగలవు."

సామ్రాజ్యాల విషయమై మార్క్సు సవ్యమైన పరిశీలనా దృష్టినే ప్రదర్శించా డనటం నిస్సందేహం. సామ్రాజ్యతత్వమన్నా, పరపీడన అన్నా ఆయనకు పట్టలేని హేయభావమున్నది. అనుకునో, అనుకోకనో, సామ్రాజ్యాలు కూడా పునరుద్దీపన పాత్రను వహించినవని ఆయన గ్రహించాడు. నేను యీ ఉపన్యాసాన్ని రెండు ఆఖ్యానాలను చెప్పి ముగిస్తాను. నా వైఖరి ఏమిటో మీకు చిత్రించటానికే వాటిని చెప్పదలిచాను. ఆ రెంటిలో ఒకటి మళ్లీ భారతదేశానికి సంబంధించినదే. అది ఒక సామ్రాజ్యము యొక్క అస్వాభావికతనూ, విషాదస్థితినీ వ్యక్తీకరిస్తుంది. ఎంత సహృదయతతో వ్యవహరించినా బ్రిటిషు సామ్రాజ్యము కూడా (ఉన్నంతకాలమూ) ఒక సామ్రాజ్యముగానే ఉన్నది. పాలితుల హృదయాలను చూరగొనలేక పోయినది. కలకత్తా స్వతంత్రభారతదేశపు పట్టణములలో గొప్పది. ప్రపంచములోని ప్రముఖ పారిశ్రామిక పట్టణములలో ఒకటి కాగలదు. ఆ పట్టణం మధ్యలో నున్న ఒక స్మారకచిహ్నం ఈ విషయాన్ని తెలియజేస్తున్నది. స్మారకచిహ్నం 19 వ శతాబ్దం వైస్రాయిలలో ఒకరైన లార్డు మేయోది. దానిమీద ఈ క్రింది మాటలు (నాకు ఉన్నవి ఉన్నట్లుగా మాటలు జ్ఞాపకం లేవు) చెక్కి ఉన్నవి. "భారతదేశపు గవర్నరు జనరలు,వైస్రాయి అయిన లార్డు మేయో కే. జీ. బీదలపాలిట రక్షకుడు. సమబుద్ధితో తరతమ భేదము లేకుండా పరిపాలించినవాడు. బ్రిటిషువారు,హిందువులు, మహమ్మదీయులు అందరి ప్రేమను పొందినవాడు—17 మే 1872 సం. హత్య చేయబడినాడు." ఇది విచిత్రము, విచారము కూడాను. నేను చెప్పిన యీ ఆఖ్యానంవల్ల లార్డు మేయో నిజంగా విశాల హృదయుడు, సంస్కరణాభిలాషి అయిన రాజ ప్రతినిధులలో ఒకడని మీరు గమనించాలి.

ఈ ఆఖ్యానంతో సరితూగేదానిని మరొకటి మీకు చెబుతాను. "బలవంతంగా సుఖపెట్ట" వలెననే ప్రయత్నానికి మార్క్సు, ఏంజెల్సు విముఖులు. ఇవి ఎంతో ఆలోచనతో కూడిన మాటలు. ఈ మాటలు, సామ్రాజ్యవాదులు అనేవారుంటే వారూ, లేకపోతే మాజీ సామ్రాజ్యవాదు లయినవారూ, మననం చేసుకోవలసిన మాటలు. అయితే 1960 సం. లో వాటి అర్థాన్ని బాగా గట్టిగా హృదయస్థం చేసుకోవలసినవారు కమ్యూనిస్టులు. వారు కనుక తమ మతానికి పితృదేవత అయిన వారిలో ఒకరు చెప్పినట్లుగా "బలవంతంగా సుఖపెట్టవలెననే" ప్రయత్నాన్ని విరమించుకుంటే ఈప్రపంచం ఇంతకంటే యోగ్యంగానూ, శాంతిప్రదంగానూ ఉండగలదు.

# శ్రీనాథుని హరిభక్తి

## శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

శ్రీనాథుడు పరమశివునియం దద్వయభక్తి కలవాఁడనుటలో నెవ్వరికిని భిన్నాభిప్రాయములేదు. కాని ఆశైవము వీరశైవమా, లేక ఆరాధ్యశైవమా? యనుసంశయము తత్తన్మతాభినివేశముగలవారికేగాని, తటస్థులుగానున్నవారికి పొడమనే పొడమదు. ఆతడు వివిధ శాస్త్రములందు దలస్పర్శమైన పాండిత్యముగలవాఁ డగుటయేగాక, శాస్త్రీయ విషయములను దన రచనలో సమయోచితముగ సంతరించిపెట్టిన విద్వత్కవి. ఏ విషయమునైనను తెలుగు కరువులో కరగిపోయఁ గలిగినదిట్ట. అద్వైతభావనానివిష్టమతి గావున, శివకేశవుల నిరువురను సమానప్రతిపత్తితో భావించుచు, పార్వతీ పరమేశ్వరుల పరతత్త్వమును ప్రతిపాదించినట్టులే లక్ష్మీనారాయణుల దివ్యతత్త్వమును గూడ ప్రసంగవశమున తత్త్వమకష్టముగ ప్రతిపాదించియున్నాఁడు.

కాశీఖండమునకు కృతిభర్తయైన అల్లాడ వీరభద్రారెడ్డి వంశమునభివర్ణించు నెపమున నీ క్రింది పద్యమున పతగకేతుఁడైన శ్రీ మహావిష్ణువు పాదపంకజము నిట్లభివర్ణించియున్నాఁడు.

కలశాబ్ధి కన్యకా కర పల్లవ ద్వయీ
  సంవాహన క్రియా సముచితంబు
సకల వేదాంత వాక్వీధివధూధమ్మిల్ల
  బహుళ పుష్పామోద భాసితంబు
ప్రణత నానాసుపర్వ కిరీటసంఘాత
  రత్నాంశురాజి నీరాజితంబు
సనకాది సన్మునీశ్వర మనోమందిరా
  భ్యంతర రత్న దీపాంకురంబు
పతగకేతను శ్రీపాద పంకజంబు......కాశీ. 1—22

గరుడకేతనుఁడైన శ్రీ మహావిష్ణువు పాదపద్మము, లక్ష్మీదేవి తన పల్లవ సుకుమారములయిన హస్తములచే నొత్తుటకనువైనది. సకల వేదాంత వీధులలో విహరించు విలాసము గలది. నమస్కరించెడి వివిధ దేవతల కిరీట రత్నకాంతులచే నీరాజనమీయబడునది. సనకసనందనాది దివ్యమునుల మనస్సులను భవనముల నడుమ రత్నదీపకళికయై వెలుఁగునది. అట్టి శ్రీహరి పాదపద్మము, తనకాశ్రయదాతయైన అల్లాడ వీరభద్రారెడ్డి వంశమునకు మూలమని తెలియఁజెప్పుచు, శ్రీహరిపాదపంకజమునెడఁ దనకుగల భక్తిభావమును వ్యక్తము చేసినాఁడు. భగవన్మూర్తి యేదియయినను, తద్విభవము నత్యుదాత్తముగ చిత్రించుట యాతనికి సహజవిషయము. శ్రీనాథుఁడు కావున శ్రీనాథ పాదపంకజమునకింతటి దివ్యత్వము నాపాదింపఁ గల్గినాఁ డనవచ్చును.

ఇటులనే అగస్త్య మహర్షికి, మూలములో లేకున్నను భీమమండల యాత్రా ప్రసక్తిని గొనివచ్చి, దానిలో శరదృతువర్ణన మారంభించి, శ్రీమహావిష్ణువు శేషశయనము నుండి మేల్కాంచిన తీరును హరిభక్తిభావము తొలుకాడునట్లు చిత్రించి పెట్టినాఁడు.

అభినవోన్మేష జిహ్మంబైన తొలి చూపు
  కౌస్తుభారుణ రేఖలకు నలుగ
సాంగభంగంబైన యావులింతకు వేల్పు
  లంగుళి స్ఫోటంబు లాచరింప
సౌఖశాయనికులై సంవర్త భృగ్వాది
  మునులు హస్తాంభోజములు మొగుడ్ప
దృత చేతనంబులై దివ్యాయుధంబులు
  జయ జయ ధ్వనులతో సంస్తుతింప
నలరు ఱేకులువోలె నచ్చిలువ ఱేని
యురల కుబుసంబు పొరలు మైనంటియుండ
నిదుర మేల్కాంచి కూర్చుండె నుదధి నడుమ
విష్ణుఁ డఖిలేశ్వరుఁడు శరద్వేళయందు.—3—22.

అప్పుడే నిదురనుండి లేచుటచే అలసమైన తొలి చూపు, కౌస్తుభమణికాంతుల కెదురుగ నిలువ లేకుండెను. ఒడలు విరువుతో నావులింపగా, దేవతలు చిటికలు వేయుచుండిరి. సంవర్తుడు భృగువు మొదలగు మహర్షులు సుఖనిద్రనడుగుచు హస్తపద్మములను జోడించియుండిరి. శంఖ చక్రాది దివ్యాయుధములు చైతన్యము వహించి (దేవతాకృతిని వహించి) జయ జయ ధ్వనులతో స్తోత్రము చేయుచుండెను. పూలఱేకుల వంటి ఆదిశేషుని అరలుగల కుబుసపు పొరలు శరీరము నంటియుండెను. ఇట్టి తరుణమునందు శరత్కాలవేళలో సకలలోకాధిపతియైన శ్రీ మహావిష్ణువు క్షీరసముద్రము నడుమ నిద్రనుండి మేల్కొని శేషశయనముపైఁ గూర్చుండియుండెనని ఈ పద్యభావము.

ఈ పద్యము మొదటి సీసపాదములు రెండింటికి మూలము ముద్రారాక్షసమున విశాఖదత్తుడు శరదృతువును వర్ణించిన ఘట్టములో ఈ క్రింది శ్లోక పాదములు.

శ్లో. ప్రత్యగ్రోన్మేషజిహ్మాక్షణమనభిముఖీరత్నదీపప్రభాణా
  మాత్మవ్యాపారగుర్వీజనితజలలవాజృంభితైస్సాంగభంగైః

ఈ రెండింటిలో మొదటిపాదము యథాతథముగనే పై సీసములో మొదటి పాదముగ రూపొందినది. రెండవ పాదము మూల

ములోకంబె తెలుగులో కొంచెము మారినది. మూడు నాలుగు పాదములకు మూలము కాళిదాసు రఘువంశములో వర్ణించిన విషయము. ఏమయినను శేషతల్పమునుండి శ్రీహరి మేల్కాంచి నప్పటి యాతని స్వరూపము సాంగోపాంగముగా చిత్రించుట శ్రీనాథుని నామసార్థక్యమునకు నిదానము.

ఇక కొల్హాపురమునందలి లక్ష్మీదేవిని పరాశక్తి స్వరూపిణినిగా చిత్రించుటలో శ్రీనాథునకుగల అద్వైతభావన, మంత్ర శాస్త్ర పరిజ్ఞానము, పరిస్ఫుట మగుచున్నది. అచటి వర్ణనాక్రమమే విలక్షణము. మొందుగ శ్రీసూక్తప్రతిపాదితమయిన లక్ష్మీ స్వరూపము నీ క్రింది విధముగ వాకొనినాఁడు.

పరిపూర్ణ హేమకుంభములు హస్తంబుల
 ధరియించి యిరువంకఁగరులు గొలువ
బహుళమై వరశంఖ పద్మ మహాపద్మ
 మకరాదినిధులు నేమమునఁ గొలువ
వింజామరలుదాల్చి వెనుక దిక్కున దేవ
 గంధర్వ గుహ్యకాంగనలు గొలువ
వెలవంక బలువంక నింద్రాదిదివిజులు
 సేవాంజలులుమౌళిఁ జేర్చికొలువ
ధర్మపంకజకర్ణికాభద్రపీఠి
కాగ్రమున నుండు కొలువుండి యఖిలలోక
రక్షణముసేయు నిన్నేను బ్రస్తుతింతు
ననమసౌభాగ్యగుణధన్య! యబ్ధికన్య!

కాశీ—3—48.

ఈ విధము ఋగ్వేద ప్రతిపాదిత దేవీ స్వరూపమును వివరించియుఁ దనివిననక, మహాలక్ష్మిని పరాశక్తి స్వరూపిణిగా నిరూపింపఁదలఁచి, మంత్ర శాస్త్ర ప్రతిపాదిత స్వరూపము నామె యెడ నిబద్ధము చేసినాఁడు. ఈ ఘట్టమున శ్రీ శంకర భగవత్పాదులు సౌందర్యలహరిలో ప్రతిపాదించిన స్వరూపమును నిరూపించియున్నాఁడు. ఆ క్రమ మెట్లుసాగెనో పరికింతము.

“పరమార్థవస్తువిభాగంబు సేయవచ్చిన శక్తిమంతుం డైన ఈశ్వరునకు శక్తియగు నీకు భేదంబులేదు; గావున శక్తుం డగు నీశ్వరునకుంగల సృష్టి స్థితి సంహృతి (తిరోధానానుగ్రహ) రూపంబులైన కృత్యంబులైదును నీయవి. దహనునకుదాహ శక్తియు, నుష్ణాంశునకుదీధితియుఁ, జంద్రునకుజంద్రికయుం బోలె నీశ్వరునకు నీవు సహజవు ధ్రువవునై యుండుదు. ఇహ జన్మ జన్మాంతరంబుల విహితంబులైన వ్రతదానాదులచేత సంచితంబులైన దురితంబులు నిరసింపంబడుటంజేసి యస్తరజస్తములైన యుత్తములు విశుద్ధసత్త్వులై నీ తత్త్వంబుఁ జింతింతురు. భోగాపవర్గ లక్షణంబైన ఫలంబు పరమేశ్వరుండు పశుగణంబున కిచునప్పుడు నిన్ను మున్నిడుకొనికాని యీజాలండు.’

ఈ వాక్యములలో శ్రీ మహాలక్ష్మి స్వరూపమును శివశక్త్యభిన్నరూపమైన పరతత్త్వమునుగా ప్రతిపాదించుచు, శ్రీనాథుఁడు తనకుగల మంత్ర శాస్త్ర రహస్య వేతృత్వమును ఈశ్వరార్చనకళాశీలత్వమును తెల్లము చేసియున్నాఁడు. మహాలక్ష్మి తత్త్వమును పరతత్త్వమునుగా ప్రతిపాదించునపుడు, బహుజన్మ నిర్వర్తితవ్రతదానాదులచే సంచిత పాతక సంచయము నణచి విశుద్ధ సత్త్వులయిన యుత్తములుగాని, ఆ తత్త్వమును చింతింపఁజాలరనినాఁడు. ఈ విషయ మద్వైత సంప్రదాయానుగతము. “శబ్ద బ్రహ్మంబు కారణబిందు ద్వాత్మకంబై బిందు నిష్యందత్వంబునకుం బురుషేచ్ఛా ప్రయత్నంబున మూలాధారావస్థిత పవన సంధుక్షణంబునంజేసి యభివ్యక్తంబై పరా వాక్కనంబడు. ఆ బ్రహ్మం బీనాభి పర్యంతంబా వాయువుచే నభివ్యజ్యమానంబై మనంబుతోడంగూడి, సామాన్యస్పంద ప్రకాశ రూపిణియుఁ గార్యబిందుతత్త్వాత్మికయు నీశ్వరాధి దేవతయునై పశ్యంతీ వాక్కనంబడు. ఆ బ్రహ్మం బా వాయువుచేత హృదయ పర్యంతం బభివ్యజ్యమానంబై నిశ్చయాత్మకబుద్ధి యుక్తంబై విశేషస్పంద స్వరూపయు నాదబిందుమయుయు హిరణ్యగర్భాధి దేవతయునై మధ్యమావాక్కనంబడు. ఆ బ్రహ్మంబ యాస్య పర్యంతం బా వాయువుచేతన కంఠాదిస్థానంబుల యందభివ్యజ్యమానంబై యకారాది క్షకారాంత వర్ణమాలారూపంబై శ్రోత్ర గ్రహణయోగ్యంబై వైఖరీవాక్కనంబడు. ఈ చతుర్విధ సూక్ష్మ స్థూలమాతృకా స్వరూప విట్టి నీకు నమస్కారంబు.”

శ్రీ శంకర భగవత్పాదుల యీ క్రింది సూక్తిలోని భావము, ఈ పై వాక్యములలో మనకు చూపట్టుచున్నది.

శ్లో. మూలాధారాత్ప్రథమ ముదితో యశ్చభావః పరాఖ్యః
 పశ్చాత్పశ్యన్త్యథ హృదయగో బుద్ధియుఙ్మధ్యమాఖ్యః
 వ్యక్తే వైఖర్యథ రురుదిషోరస్య జంతోస్సుషుమ్నా
 బంధస్తస్మాద్భవతి పవనప్రేరితా వర్ణసంజ్ఞా.

శ్లో. యదయ మనుత్తరమూర్తిః నిజేచ్ఛయాజగత్స్రష్టుమ్
 పస్పందే సస్పందః ప్రథమః శివతత్త్వ ముచ్యతేతజ్ఞైః”

అను తత్త్వ సందోహ వచనముచే, ప్రాణ్యదృష్టవశమున పరాశక్తికి జగత్సిసృక్ష కలిగినపుడేర్పడు కదలికయే స్పందమనఁబడును. అట్టి స్పందస్వరూపిణియని తెలుపుటకే ‘స్పందప్రకాశరూపిణియు’ అనినాఁడు. “అస్మాచ్చ కారణబిందోః సాక్షాత్క్రమేణ కార్యబిందుః, తతోనాదః; తతోబీజ మిత్రయముత్పన్నం తదిదం పరసూక్ష్మ స్థూలపదైరవ్యుచ్యతే” అను భాస్కరార్య వచనమునుబట్టి పరాశక్తి కార్యబిందు స్వరూపిణి.

శివశర్మయను బ్రాహ్మణుడు పుణ్యక్షేత్రములయిన ఏడు పట్టణములు చూచుచు, వానిలో నొక్కటియైన ద్వారకా పురమునకుఁ జేరును. అచటి వైష్ణవుల విభవము మూలాతి క్రమమునఁ జిత్రించుతీరులోఁ దనకుఁగల విష్ణుభక్తి తత్పరత నుదాత్తముగ రూపొందించినాఁడు. ఆ విషయము కనుగొందము·

ఇచట సంస్కృత కాశీఖండ మందున్న విషయమిది.

శ్రీ ఖండే క్వన ఆమోదః స్వర్ణేవర్ణః క్వతాదృశః
తత్పావిత్ర్యం క్వవై తీర్థే తద్గోపీచందనే యథా.

గోపీచందనమందున్న ఆ పరిమళము మంచిగంధమునం దెక్కడ? అట్టి రంగులు బంగారమున కెక్కడ? దాని పవిత్ర భావము పుణ్య తీర్థమున కెక్కడ? అని యీ శ్లోకభావము. దీనిని ప్రస్తరించినతీరు పరికింతము.

కాంచన కేతకీ కుసుమగర్భ దళోదరసోదర ప్రభా
భ్యంచితమై పటీర ఘుసృణాగురు సౌరభలక్ష్మితోఁ బిసా
ళించుచుఁ గమ్మనై పరిమళించు సముజ్జ్వల గోపిచందనం
బించిన వేడ్కతోడ ధరియింతురు భాగవతోత్తముల్వరిన్

మొగలిపూవు లోపలి రేకుతో సమానమైన కాంతిగల గోపిచందన మనుటలో కేవలము రూపమేగాక పరిమళము గూడ జతపడియే యున్నది. అంతటితోఁ దనివి సనక మంచిగంధము, కుంకుమ పూవు, అగరు వీని సౌరభమును గూడ జోడించి, మఱింత గుబాళింపఁజేసి, దానిని విష్ణుభక్తులచే ధరింపఁజేసినాఁడు. అంత టితో పూరుకొనలేదు కూడ.

రమణి! ధరియింతు రూర్ధ్వపుండ్రములు మెఱయ
ఫాలతలమున నవ్విట భాగవతులు
కఠిన పాప పరంపరా కంఠనాళ
ఖండన ప్రక్రియా క్రూరఖడ్గలతలు

'తత్పావిత్ర్యంక్వవై తీర్థే' అనుదానికి విపులమైన వివరణము. వైష్ణవుల కూర్ధ్వపుండ్రధారణము దురుద్ధర పాప పరంపరా విచ్ఛేదకమని యొత్తి చెప్పుట కీ ప్రక్రియ నాతఁ డంగీకరించి యున్నాఁడు. ఏ విషయము నైనను తన కభిమతమైన దాని నొత్తి చెప్పుట అతనికొక యలవాటు.

అంతకుఁడు తన కింకరుల కిట్లాజ్ఞాపించునట.

శ్లో. దూతా: శృణ్వంతు యద్భాలం గోపీచందన లాంఛితం
జ్వలదింగలవత్సోపి దూరే త్యాజ్యః ప్రయత్నతః
తులస్యలంకృతా యే యే తులసీనామ జాపకాః
తులసీవనపాలా యే తే త్యాజ్యా దూరతోభటాః.

దూతలారా! వినుఁడు. గోపీచందన చిహ్నితమైన నుదురు గలవానిని, మండెడి నిప్పుబొగ్గు వలె ప్రయత్నపూర్వకముగ దూరముగ వదలిపెట్టుఁడు. తులసిదళము చెఱువుకొనినవారిని, తులసి నామము జపించువారిని, తులసి వనమును రక్షించువారిని, దూరముగ పరిహరింపుఁడని యీ శ్లోకముల భావము. దీనిని వివరించిన క్రమము నరయుదము.

కమనీయ గోపికా గంధ సారంబున
మూర్ధ్వ పుండ్రములు బా గొప్పఁ దీర్చి
వక్షస్థలంబున వనజాక్షమాలికా
చారునైపథ్యంబు సంతరించి
దక్షిణశ్రవణ రంధ్రములఁ గోమల కృష్ణ
తులసీ ప్రవాళంబు లలవరించి
నలినలోచనదివ్యనామసంకీర్తనా
భంగికి జిహ్వలఁ బాలువెట్టి
ద్వారవతి యందు ముక్తికాంతా విహార
మంటపమునందు నుండ్రు నిర్మల వివేక
నిరధిసంధి కృపాగుణ నిర్నిరోధ
పరమ భాగ్యాన్వితులు మహాభాగవతులు.

ద్వారకా పట్టణము కాశీఖండమునం దుపాత్తమగుటచే ముక్తి కాంతా విహార మంటప మైనది. తన్మూలముగ నిరంతరాయ మహాభాగ్య సమన్వితులయిన వైష్ణవోత్తములు నిర్మల వివేకము, నిర్వేలమైన దయాగుణము గలవారై సారూప్య ముక్తి నందుట కనువుగా గోపి చందనముతో నూర్ధ్వపుండ్రము లంద ముగఁ దీర్చిపెట్టినారు. వక్షస్థలములందు పద్మ బీజముల మాలలు, లేక తులసిపూసల పేరులు అలంకరించుకొనినారు. కుడి చెవులలో కృష్ణ తులసిదళములు చెఱువుకొనినారు. వారు నాల్క లను పద్మనేత్రుని దివ్యనామ సంకీర్తనమునకు వశము చేసి పెట్టినారు. ఈనాఁడు కూడ మన కిట్టి పరమభాగవతులు శ్రీనాథుఁడు చిత్రించిన తీరులో నప్పుడప్పుడు గానవచ్చెదరు. మూలములో గోపిచందన తులసిదళములను మాత్రమే పేర్కొ నఁగా, దానిని పెంచి పెద్దచేసి విశుద్ధ వైష్ణవస్వరూపమును మన యెదుటఁ బెట్టినాఁడు శ్రీనాథుఁడు. ఇది ప్రకరణోచితముగ ప్రపంచిత మైనది.

దీని తరువాత తుది యొక్క శ్లోకము, తత్పరివర్తనము ఎంత తీవిగఁ గొనసాగెనో కనుఁగొందము.

శ్లో. ద్వారవత్యాం మ్రియంతే యే జంతవః కాలచోదితాః
చతుర్భుజాః స్యుర్వైకుంఠే తే పీతాంబర ధారిణః.

ద్వారకా పట్టణమున కాల ప్రేరితులై మరణించు ప్రాణులు వైకుంఠమున నాలుగు భుజములు గలవారు పీతాంబరధారులు నగుదురని యీ శ్లోకభావము.

కట్టు రింగులు వారఁ గటిభాగమున యందుఁ
బసిఁడి కమ్మల పచ్చపట్టు చేల
వక్షస్థ్సలంబున వనమాల ధరియించుఁ
గౌస్తుభ గ్రైవేయకమునఁ గూర్చి
సేస కొప్పునఁ జుట్టు శిఖిపించరింఛోళి
మక్కళించిన జిల్గు మడుఁగు పాగ
గొజ్జంగి పూనీరు కులికి మేదించిన
కమ్మ కస్తూరి మేనఁ గలయనలఁదు

ద్వారకా పట్టణము పొలిమేర సీమఁ
గాల వశమున నీల్గిన క్షణమునందుఁ
గైటభారాతి సారూప్య గరిమఁ గన్న
కీట పక్షి సరీసృప క్రిమికులంబు.

ద్వారకా పట్టణము పొలిమేరలో కాలవశమున ప్రాణములు వీడిన సమయమునందు, కీటకములు పక్షులు సర్పములు క్రిములు మున్నగు అల్పప్రాణులు సైతము, తక్షణమే విష్ణు సారూప్య మోక్ష విభవము నంది, కటిప్రదేశమునందు కుచ్చెళ్లేర్పడునట్లు బంగారు అంచులు గల పీతాంబరమును దాల్చును. వక్షస్థలమునందు కౌస్తుభ కంఠాలంకారముతో జోడించి వనమాల ధరించును. శిరమున నెమిలి ఈక గుంపుతో నతిశయించు అందమయిన పాగను ధరించును. గొజ్జంగి పూనీటితో కలిపి నూరి పరిమళించు కస్తూరి శరీరమునఁ బూయును. ద్వారకా పట్టణమున ప్రాణములు వీడినంతనే యే నికృష్ట ప్రాణికైనను సారూప్యముక్తి లభించునని తెలుపుచు, ద్వారవతి ముక్తి మంటపికా ద్వారమునుగా వెలయించుచు, శ్రీనాథుఁడు తాను శ్రీ మహావిష్ణుని భావించు సంవిధానము నిట వ్యక్తము చేసెనని మన మూహింపవచ్చును.

ఈ వర్ణక్రమము భీమ మండలి మహాత్మ్యమును ప్రతిపాదించిన యీ క్రింది పద్యమును బోలియున్నది.

పాటలం బగు జటాజూటంబు నడునట్టు
పూప ముక్కలరాజు పొడవు చూపు
వెడఁదయైన లలాట వీథీ విటంకంబు
కట్టెఱ్ఱ క్రొవ్వేఁడి కన్నుఁ గూర్పుఁ
గంబు సన్నిభమైన కంఠ ప్రదేశంబు
గరళ కూటము ఛాయఁ గ్రాంచి యుమియుఁ
గడు మనోజ్ఞములైన కర్ణ పార్శ్వములందుఁ
బెను పాప ప్రోగులు బిత్తరించు
భీమ మండలికా పుణ్యభూమి యందుఁ
బ్రకట కైవల్య కల్యాణవేది ననఁగఁ
గీట పక్షి సరీసృప క్రిమికులాది
జంతు సంతతి ప్రాణావసానవేళ. —భీమ. 3.19.

శివకేశవ స్వరూపములను రెండిటిని సమాన ప్రతిపత్తితో భావించుట శ్రీనాథుని స్వభావ మనుట కిది యుత్తమమైన నిదర్శనము.

## గ్రంథములు : గ్రంథకర్తలు

# జాతక కథాగుచ్ఛము

ఈ జాతక కథలు బౌద్ధ ధర్మములను ప్రచారము చేయుట కేర్పడ్డవి. ఇవి మొదట పాళీ భాషలో వ్రాయబడినవి. జాతకమాల యని పేరుతో ఆర్యశూరుడను కవి ముప్పదిరెండు కథలను సంస్కృతీకరించెను. ప్రచార దృష్టితో వ్రాయబడినను ఈ కథలందున్న కథాకథన చమత్కారమే నవీన కాలమున వానికి బహుళ ప్రచారము తెచ్చి పెట్టినది. ఈ కాలములో వచ్చుచున్న ఉత్తమమైన చిన్న కథలశిల్ప మంతయు ఈ కథలలో మనకు కన్పించును. కథ యొక్క ప్రాణము పట్టుకొని చెప్పుట, అనవసరమైన కల్పనలు వర్ణనలు లేకుండ, నాకథ యేధర్మము వ్యక్తము చేయుట కేర్పడ్డదో ఆ ధర్మమును ప్రధానముగా దీపింపజేయుట కవసరమైన యంశములను మాత్రమే అంగాంగి సంకరము లేకుండ నిబంధించుట, కష్టమైన విషయము. ఎంతో నిగ్రహమున్న గాని కథా కథన మదుపులో నుండదు. ఈ జాతక కథ లింత చక్కగా వ్రాయబడ్డవి. అన్ని కథల యందును వ్యక్తమగుచున్న సారాంశము ఇంచుమించు నొక్కటే యైనను, ఆ కథలు చెప్పబడ్డ తీరులు భిన్నములై కథన శిల్పము పాఠకుల హృదయములను పట్టుకొని తుది దాక చదువునట్లు చేయును. తుదిదాక చదువునట్లు చేయుట అన్నది కథకున కుండవలసిన ఉత్తమ లక్షణము. దీనినుండి శిల్ప మంతయు పుట్టును.

ఈ జాతక కథలు ముప్పది రెండింటిలోను శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు పదునైదు కథలను తెలుగులో పద్య రూపమున ఇంతకు పూర్వమే వెలయించిరి. ఇప్పుడు మరి 8 కథలను కూడ తెనిగించి మూడు భాగములుగా జాతకకథాగుచ్ఛమను పేర ప్రకటించిరి. ఈ గ్రంథములో మొదటి రెండు భాగములలోని కథలు విడిగా ప్రకటింపబడ్డవే. అవి సాహితీ ప్రియులకు పరిచితములే. మూడవ భాగమందలి ఎనిమిది కథలు మాత్రము క్రొత్తవి.

గ్రంథకర్తయైన శ్రీ శాస్త్రులవారిని గురించి క్రొత్తగా చెప్పవలసిన యవసరము లేదనుకొందును. వారు రచించిన తత్సమచంద్రిక—కావ్యాలంకార సంగ్రహ వివరణము—ఈ రెండు గ్రంథములు వారికి తెలుగు సాహిత్యములో చిన్నయసూరి కున్న స్థానమును సంపాదించి పెట్టినవి. ఈ రెండు గ్రంథములు వారి విద్వత్తకు, పరిశ్రమకు నిదర్శనములు. ఈ జాతకకథా గుచ్ఛము వారి కవితాశక్తిని కొంత మనకు రుచి చూపించుచున్నది.

కవులు రెండు విధములుగా నుందురు. ఒకడు ఆవేశముతో సహజముగ కవియై దానియందు క్రమముగా వ్యుత్పత్త్యనుసంధానము చేయును. రెండవవాడు ప్రధానముగా పండితుడై అభ్యాస పాటవమువల్ల కవిత్వము చెప్పుటకు మొదలుపెట్టును. ఈ రెండు విధముల కవులలో నెవడు గొప్ప యన్న ప్రశ్న లేదు. ఇది ఆ దృష్ట్యా చేసిన విభాగము కాదు. ఉత్తమ కావ్యము లీ రెండు విధముల కవులును వ్రాయవచ్చును. ఒకని ప్రతిభ జన్మాంతరీయకమైనది. మరియొకని ప్రతిభ, వ్యుత్పత్త్యభ్యాసజన్యమైనది. ఇరువురికీ ఒక్క భేదము మాత్రము కొట్ట వచ్చినట్లు కన్పించును. ఆ మొదటి వాని కవిత్వములో లాక్షణికులు అనగా నాలంకారికులు చెప్పిన లక్షణము లన్నియు సంపూర్ణముగ నుండవు. కాని ఆ లక్షణము లే దృష్టితో చెప్పబడ్డవో ఆ దృష్ట్యా మాత్రము ఆ కవిత్వము సర్వ సంపూర్ణముగనే యుండును. కోసి చూచినచో మాత్రము లక్షణమునకు లక్ష్యములు సరిపెట్టుకొనవలసినదే తప్ప కచ్చితముగా దొరుకవు. ఈ రెండవవాని కవిత్వము నందు నూటికి తొంబదిపాళ్ళు లక్షణ సమన్వయము కుదురును. అట్లని సహజత కొఱవడియుండు ననుకొనరాదు. దేని అందము దానిది. రెండును రెండు మార్గములు.

శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు మొదట విద్వాంసులై తర్వాత కవులైన వారు. వారి కావ్యమునందు దొరుకని కావ్యగుణ మనుచు లేదు. తొలిపలుకులో శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు చెప్పినట్లు అతిమృదులమైన భాష, సరళమైన కూర్పు, పాత్రోచితమైన వృత్తి, తదనుగుణమైన రీతి, జాతీయమైన పలుకుబడితో మేళగింపు—ఈ అన్నియు సర్వత్ర శాస్త్రులవారి కవిత్వములో మనకు కన్పించును. అక్షర మాధుర్యము, ప్రసాదము కావ్యమం దంతటను నున్నవి. ద్రాక్షాపాకము, వైదర్భీరీతి మొదలైన ఆలంకారిక గుణము లన్నియు నున్నవి.

కావ్యభాషను సంతరింపజేసికొనుటలో గూడ రెండు పద్ధతు లుండును. ఒకటి జీవద్భాష తీసికొని దానిని సంస్కృ

రించి కావ్యయోగ్యముగ జేయుట. రెండవది కవి ప్రయోగ సిద్ధమైన భాష. ఈ భాష కూడ ఆయా కాలములందు జీవద్భాష యొక్క సంస్కృత రూపమే. అసలు భాషయందు శబ్ద స్వరూపము మారినను ప్రయోగ వైఖరి మారదు. ఆ భాష మాటలాడు జాతి ఆయా భావములు ప్రకటింపవలసి వచ్చినపుడు అనుసరించు వైఖరి ఆ భాషకు ప్రత్యేకముగా మార్పు లేకుండ ఒకేరీతిగనుండును. దీనిని పట్టుకొని భాష యొక్క బాహ్య స్వరూపమునకు మాత్రము వలసిన సంస్కారము చేసి మహాకవులు కావ్యములు వ్రాసిరి. ఈ భావ ప్రకటనా వైఖరి భాషకు ప్రాణము. నూటికి తొంబది సంస్కృత శబ్దములు, పది తెనుగుశబ్దములు వాడినను ఈ వైఖరి పరిపుష్టముగా నున్నపుడా కావ్యమునందు తెలుగుదన ముట్టిపడును. మహాకవులు పద్యము యొక్క ఎత్తుగడలలో, వాక్యముల పోటులలో, విఱుపులలో, సంబోధనలలో, దీర్ఘాక్షర సంయుక్తాక్షర లఘ్వక్షరముల కూర్పులలో, గాఢ శిథిల బంధములలో ఈ వైఖరిని నిక్షేపించి వారి కావ్యములందు ప్రత్యక్షరమును ప్రధాన రసమునకు వ్యంజకముగ జేసిరి. ఇది ఎక్కువగా వివరించుటకు సమయము కాదు. కాని కేవల కావ్య పరిచయ మెక్కువ యుండి లోక పరిచయము తక్కువ యుండి యున్నపుడు కావ్యభాషయందున్న ఈ గుణము—భాషకు ప్రాణభూతమైన గుణము—బుద్ధికి చిక్కదు. దీనిని వదలి కావ్య భాషనుండి పదజాలమును మాత్రమే కొందఱు స్వీకరింతురు. అట్టి భాష ప్రయోగ వైశద్యములేని ఆవగా పదనులేని భాషయై పైకి మాత్రము తళతళ లాడును. కావ్యము మెత్తగా వ్రాయవలెను. సుకుమారముగా వ్రాయవలెను. అని వ్రాయువారిలో నూటికి తొంబదిమంది కావ్యభాష ఇట్టిది.

ఇంత యేల చెప్పితి ననగా శ్రీ శాస్త్రులవారి కావ్య భాష మధురము మృదులము నైనను దానియం దుండవలసిన ప్రాణభూతమైన వ్యంజకతను పోగొట్టుకొనలేదని చెప్పుటకే.

క్షితిపతులఁ బనులగానిడి
శత యజ్ఞంబులు యజింప సంకల్ప మొన
ర్చితి తొంబది తొమ్మిది జే
సితి నీతో బూర్తియగును శిష్ట మొకటియున్

ఈ పద్యము సుతసోమ జాతకములోనిది. సుతసోముని రాక్షసు డెత్తుకొనిపోయి వాని ఉనికిపట్టయిన కొండ గుహలో డించి ఈ మాట అనును. ఈ పద్యమునందు వీరము వ్యంగ్యము. ఈ పద్యమునందు ఓజోగుణమునకు వ్యంజకమైన సమాస రచనము లేదు. కాని రసాశ్రయమైన ఓజోగుణమునకు పద్యమునందు వ్యంజకత సమృద్ధిగా నున్నది. ఇట్టి పట్టుల ఆలంకారిక సరణిలో సమాస భూయిష్ఠమైన రచన ప్రసిద్ధము.

ప్రధానముగ పద్యరచన యిచ్చట ఓజో గుణమునకు వ్యంజకముగా నున్నది. "సంకల్ప మొనర్చితి" అని మూడవ చరణములో మొదటి గణములో రెండక్షరములకు వాక్యము విఱిగి, గణములోని తృతీయాక్షరము నుండి "తొంబది తొమ్మిది చేసితి" అని చతుర్థ చరణమందు మొదటి గణములో మఱల రెండక్షరములకు వాక్యము విఱిగి, తర్వాత 'నీతో పూర్తి యగును శిష్ట మొకటియున్'—అని మఱల తృతీయాక్షరమునుండి కడపఱకు వాక్యము పూర్తియైనది. వాక్యము లిట్లు గణమధ్యమున విఱిచి శిష్టవాక్యములను గుర్వక్షరముతో ప్రారంభించుటవల్ల వాక్య విన్యాసము వందొక విచ్ఛిత్తి కల్గి వక్తయొక్క ఉచ్చారణ వైఖరిని వ్యంగ్యముచేసి రసమునకు దీప్తి తెచ్చును. దీనినే భావప్రకటనావైఖరి అని పూర్వము నే నన్నది. ఇది కావ్య భాషకు ప్రాణము వంటిది. ఒక పని నిర్వహించిన యుత్సాహములో సరిగా తెలుగువా డిట్లే అనును. ఆ వైఖరి అంతయు ఈ పద్యమందున్నది. మెత్తగా మధురముగా వ్రాయుచు ఈ గుణమును సంతరించుట చాల కష్టమైన పని.

ప్రధానముగ ఇట్టి కథలలో విషయైక్యమును బట్టి పునరుక్తి తప్పదు. ఇంచుమించుగ ఒకే ధర్మ మన్ని కథల యందును బోధింపబడ్డది. ఐనను మార్గాంతరము నవలంబించి నిబంధించుటవల్ల శ్రీ శాస్త్రిగారు పునరుక్తి లేకుండ చేయగల్గిరి. ఒకే విషయమును పదిచోట్ల పునరుక్తి లేకుండ చెప్పుటకు అపారమైన ప్రతిభావ్యుత్పత్తులు కావలయును. ప్రతి స్వల్ప విషయము నుండియు ఈ గ్రంథము చాల జాగ్రత్తగా కూర్పబడినదని చెప్పినచో అతిశయోక్తి కాదు.

ఇట్టి కథలు చెప్పుటకు గీతము కందము మొదలైన పద్యములే చాల యుచితముగా నుండును. శ్రీ శాస్త్రిగా రక్కడక్కడ వృత్తములు సీసములు వ్రాసినను మూడు పాళ్లు కందములు, గీతములతోడనే కథను నడిపించిరి. గ్రంథమునం దొక్కొక్క భాగమునం దొక్కొక్క గుణము ప్రధానముగా కన్పించుచున్నది. మొదటి భాగములో వర్ణన కొంచె మెక్కువగా నున్నది. ద్వితీయ భాగమునందు వర్ణన కథాకథనముతో కలిసి సమపాళముగ నున్నది. తృతీయ భాగమునందు కథాకథనము ప్రధానమై వర్ణనము అప్రధానముగ నున్నది. ఈ మూడు భాగములు భిన్న కాలములందు వ్రాయబడిన వగుటచే శ్రీ శాస్త్రిగారి కవితా పరిణామము ఈ మూడు భాగములు

సూచించుచున్న దనవచ్చును. పోను పోను రచన 'సాఫీదేరి' తృతీయ భాగమందు పరమ ప్రసన్నమై వెల్వారుచున్నది.

ముదిసి శరీరము క్రుస్సిన
మదనాగ్ని నిరంతరంబు మండుచు మదిలో
వెదికికొను నింధనంబుల
నది లేత ముదుళ్ల ఖేద మరయుదు గాదే.

పిలుపులఁ జూపుల, మ్మై నిలు
వుల, పొలుపుల, వలువ తొలువుల వలుగతులన్
మల్లి ప్రాయముపై ప్రాలిన
దొల్లి ప్రాయము తొంగిచూచు దొలఁగ వెరచుచున్.

ఈ రెండు పద్యములందు రెండు విధములైన రచనా పద్ధతు లున్నవి. మొదటి పద్యము తెలుగు భాషకు సహజమైన రచన. అనగా సహజమైన భావప్రకటనావైఖరితో గూడుకొన్నది. రెండవ పద్యము అలంకారికమైన రచన. వీరి రచన యంతయు ఈ రెండు పద్ధతులు సొగసుగా కలబోసిన ట్లుండును. అన్ని కథలు చక్కగానే చెప్పబడినవి. కాని నాకు మూడు కథలు బాగుగా నచ్చినవి. 1. శ్రేష్ఠి జాతకము. 2. హంస జాతకము. 3. మేష జాతకము.

ఇక శాస్త్రిగారి శబ్ద ప్రయోగమును గూర్చి; శాస్త్రి గారు ప్రసిద్ధులైన విద్వాంసులు. కాబట్టి వీరి భాష నిర్దుష్ట మని వేరే చెప్ప నక్కరలేదు. కొన్ని ప్రయోగములు మాత్రము ఆలోచింపదగ్గవిగా నున్నవి.

ధాత్రీనాథునిం గన్పడన్ (పు 32; కారకము). నానా మృగ పక్షిబృందము ఆ శ్రీ మృతకాయమునుంగని భజించిరి (పు 64. వచనము). మొదటి ప్రయోగమునకు పూర్వకవి ప్రయోగము లున్నవేమో వెదుకవలెను. రెండవది ప్రమాద పతితము కావచ్చును. యువతి శబ్దము కొన్నిచోట్ల హ్రస్వాంత ముగను, కొన్నిచోట్ల దీర్ఘాంతమును వాడిరి. యువతి శబ్దము ప్రత్యయాంతముగా కవి ప్రయోగ ప్రసిద్ధము. మార్గాంతరముచే ఙీప్ ప్రత్యయముచేసినచో యువతీ శబ్దమును సాధువే. కరేణు శబ్ద ముభయలింగములందును నుకారాంతమే. రెండుచోట్ల దీర్ఘాంతముగ వాడిరి. శాస్త్రిగారు వాడిరి కావున దీనిని అసాధు వనుటకు నాకు సాహసము చాలదు. వారు దీని సాధుత్వమును గురించి తెల్పినచో వినయపూర్వకముగా స్వీకరింతును. ప్రదరము—కత్తి యను నర్థమున వాడిరి. ఈ శబ్దమున కీ యర్థము ప్రసిద్ధము కాదనుకొందును. వృతించు—సిద్ధాంతించు. ఈ రూపములు శ్రవణ వ్యాకరణమునకు వ్యతిరేకముగా నున్నవి. మారించు—మారు ధాతువుమీద ణుగాగమము వచ్చును గాని ఇంచుక్కు రాదు. చెవ్వులు ద్విత్వము నివార్యము. రుదించు—ఇచ్చట గుణము చేయలేదు. చేతురు—'యు' వర్ణంబుతోడి దుగ్ధకారంబునకు తకారము— ఈ ప్రయోగము పూర్వకవి సమ్మతమే. ఈమధ్య ఒకరు దీనిని అసాధు వనుటవల్ల నిది శాస్త్రులవారికిని సమ్మతమే నని చూపుట కుదాహరించితిని. శ్రీహరి రమలు—రమా శ్రీహరు లనుట యుక్త మనుకొందును. "ఏకక్రియా ద్వ్యర్థకరి" యటండ్రు. అనుకృతిని విడుదకు కుఱుచ. దోషోద్ఘాటనోద్దేశముతో కాక జిజ్ఞాసతోనే నేను వీనిని పేర్కొను చుంటిని. వీనిలో కొన్ని నిజముగా ప్రమాద పతితములే యైనను ఆ మాత్రముచేత శాస్త్రులవారి పాండిత్యమునకు గాని, కవిత్వమునకు గాని ఏవిధమైన లొచ్చు సంభవించదనియే నా విశ్వాసము. ఈ గ్రంథము సర్వవిధముల నవదాతముగా నున్నది.

భూ. శ్రీ.

# ఆధునిక భాషాశాస్త్రం: వర్ణనాత్మక వ్యాకరణం

"చేరా"

పై శీర్షికతో శ్రీ పి. యస్. సుబ్రహ్మణ్యంగారు "1961 నవంబరు భారతి పంచికలో రాసిన వ్యాసంలో Morpheme ను పదం అనీ, Word ను శబ్దం అనీ తెలిగించారు. ప్రత్యయసహితమై ప్రయోగార్హమైన శబ్దమే పదమని ప్రాచీన వ్యాకరణాల మతమన్న సంగతి ఆయన ఎరగరనుకోను. Morpheme అంటే ప్రకృతి ప్రత్యయాల్లో ఏదైనా కావచ్చు. ప్రాచీన వ్యాకర్తలు శబ్దాన్ని చాలా విపులార్థంలో వాడారు. ప్రత్యయాన్ని కూడా వాళ్ళు శబ్దమనే వ్యవహరించారు. బాల వ్యాకరణంలో 'ఇయు' శబ్దమనీ, (అచ్చి. సూ. 23) ప్రౌఢ వ్యాకరణంలో 'ఇగ' శబ్దమనీ (శబ్ద సూ. 22) 'ను' శబ్దమనీ (కారక సూ. 7) ఆ వ్యాకర్తలు ప్రత్యయాల్ని కూడా శబ్దమనే వ్యవహరించారు. అందువల్ల Morpheme నే శబ్దమని, Word ను పదమని తెలుగుచేస్తే బాగుంటుందేమో! అయినప్పటికీ ఈ చిక్కు పూర్తిగా తొలగదు. ఎందుకంటే పదాన్ని కూడా శబ్దమనొచ్చు. ఈ మాటల్నే వాడుకోదల్చుకున్నప్పుడు ఈ చిక్కు పూర్తిగా తొలగించుకోటానికి వేరే మార్గం లేనందువల్ల ఈ సూచన్ను వారు గమనిస్తారనుకుంటాను.

కళ్ళె మండుతున్నది, ఒళ్ళు మండుతున్నది—అన్న రెండు వాక్యాల్లోనూ ఉన్న 'మండు'ను రెండు వేరే Morpheme లుగా సుబ్రహ్మణ్యంగారు పరిగణిస్తున్నారు. "మండుతున్నది యనివప్పుడు దీనికి గర్త యొడలో కళ్ళెయో చెప్పలేము గదా" అని కారణం కూడా చూపిస్తున్నారు. కర్త చెప్పలేకపోయినంతమాత్రాన వేరే Morpheme గా పరిగణించక్కర్లేదు. తెలుగులో అటువంటి వాక్యాలెన్నో ఉన్నై. ఉదాహరణకు, అరుస్తున్నది అన్నప్పుడు అరిచేది కుక్కపిల్లో, ఆడపిల్లో చెప్పలేం కాబట్టి, భిన్న సందర్భాల్లో వేరే Morpheme లుగా పరిగణించాల్సిందేనా? కళ్ళె మండుతున్నది, ఒళ్ళు మండుతున్నది, అనే రెండువాక్యాల్లోని "మండు" ఒకే Morpheme. రెండో వాక్యంలో కవితాత్మకంగా వాడబడటమే తేడా.

నేటి తెలుగులో వ్యతిరేక సమాపకంలో నకారాంత ధాతువుల తరవాత న, ర, డ, ద, లు పరమైనప్పుడు వ్యతిరేకార్థకం Zero Morpheme అని సుబ్రహ్మణ్యంగారి అభిప్రాయం. కాని కిందగా ఉచ్చరింపబడే అచ్చు (Lower vowel)తో ఉన్న రూపాల్ని Allomorphs గా నిరూపించొచ్చు గదా! Immediate constituent analysis కి ఇచ్చిన వాక్యంలో రూపాలను హలంతాలుగా ఇచ్చిఉంటే బాగుండేది. లేకపోతే 'తమ్ముడు' కర్త అయ్యే ప్రమాదముంది.

శ్రీ సుబ్రహ్మణ్యంగారు ఆధునిక భాషాశాస్త్రాన్ని గురించి ప్రాచీన భాషలో రాస్తున్నారు. ఆధునిక భాష ఇందు కసమర్థమని ఆయన అభిప్రాయమేమో అనుకుందామంటే, 1960 మార్చి నెల 'ప్రవంతి'లో 'వ్యాకరణం—ప్రాచీన నవీన స్వరూపాలు' అని వీరు రాసిన వ్యాసంలో వాడిన భాష ఆధునిక భాషకు దగ్గరిగా ఉన్నదే. ఎందుకు చెప్పాలిసొచ్చిందంటే ప్రాచీన భాషలో రాయటం వల్ల కొన్ని ఇబ్బందులున్నై. ధ్వనుల్ని గురించి వీరు రాసిన వ్యాసంలో కొన్ని శ్వాసధ్వనులు ద్రుతాల తరవాత రావటం వల్ల నాద ధ్వనులుగా మారిపోయినై. గ్రాంధిక వ్యావహారిక భాషా వాదాలకోసం ఈ మాట చెప్పటంలేదు. అసలే కొత్త శాస్త్రంకదా! ఆధునిక భాషలో రాస్తే కొంత క్లిష్టతైనా తగ్గుతుంది.

ఇంతకీ ఇవి అల్ప విషయాలు. తెలుగులో ఇంతవరకూలేని ఒక కొత్త శాస్త్రాన్ని తెలుగువారి కందించాలనే బుద్ధిమంతుల ప్రయత్నాన్ని తప్పకుండా హర్షించాల్సిందే.

# రాజగోపాల విలాసము

## కొడకండ్ల వేంకట రాఘవాచార్యులు

"రాజగోపాల విలాసము" అను ప్రబంధము తంజాపూరినాయక రాజగు విజయ రాఘవనాయకుని (క్రీ. శ. 1633—1673) కంకితముగ "లలితోక్తి భారవి" శ్రీ కాళయ కవిచే రచింపబడినది. కాళయ చతుర్విధ కవితా విశారదుడు. శ్రీ రాజగోపాల నామమున వెలసిన శ్రీ కృష్ణుని విలాసములుగల ఈ ప్రబంధమునకు "రాజగోపాల విలాసము"ను పేరు సార్థకముగు చున్నది.

శ్రీ కృష్ణుని యష్ట మహిషులను అష్టవిధ శృంగార నాయికలుగా నిరూపించి, కవి, యాలంకారిక శాస్త్రాను గుణ్యముగ శృంగారరసపోషణము గ్రంథమున నిట్లను సంధించినాడు.

రుక్మిణి—కలహాంతరిత, భద్ర—అభిసారిక, లక్షణ—వాసక సజ్జిక, జాంబవతి—విప్రలబ్ధ, మిత్రవింద—ఖండిత, సుదంత—విరహోత్కంఠిత, కాళింది—ప్రోషిత భర్తృక, సత్యభామ—స్వాధీన పతిక.

ఈ రాజగోపాల విలాసము మద్రాసు రాష్ట్ర ప్రభుత్వ సమాదరణమున ప్రకటింపబడినది. (Madras goverment Oriental Series No. LXVIII. 1951). దీనికి పరిష్కర్త, పీఠికాకర్త, మద్రాసు విశ్వవిద్యాలయఆంధ్రభాషా శాఖాధ్యక్షులగు శ్రీ నిడదవోలు వేంకటరావుగారు. కాళయకవి అష్టమహిషులను అష్టవిధ శృంగార నాయికలగా నిరూపించిన విధమును యిట్లు తెలిపిరి.

(1) ఇంగ్లీషు 'ఇన్‌ట్రడక్షన్'లో రుక్మిణి—స్వీయ, భద్ర—పరకీయ (జారిణి), లక్షణ—వాసక సజ్జిక. (2) తెలుగు పీఠికలో రుక్మిణి—స్వీయ, భద్ర—కలహాంతరిత, లక్షణ—వాసక సజ్జిక (3) విషయ సూచికలో, గ్రంథములో:—రుక్మిణి—స్వీయ, జారిణి—భద్ర, లక్షణ—జారిణి. శ్రీ వేంకటరావుగారు పై విధముగా తెలిపియున్నందున వాని విషయమై పరిశీలనావశ్యకమైనది.

1. గ్రంథమున రుక్మిణీ రాజగోపాలుల విలాస మిట్లు వర్ణింపబడినది (1 ఆ—95—125). "నేరము లెన్ని మున్న రమణీమణి రుక్మిణి యెంత వేడినన్ దీఱని కిన్కతోడ నొక తీరున నున్నదటంచు నెంచి" కృష్ణు డామె మందిరమునకేగి, చేరువ పొంచియుండెను. రుక్మిణి యొంటిపాటున మంచముపై కూర్చుండి

శా. ఏలా? కొండెము వింటి, ప్రాణ విభుతో
నేలా చలంబూనితిన్?
వేళల్ గా వలుగంగ నంచు జెలియుల్
వేమారు చాటింపగా
నేలా నే విననైతి? నిట్టి వెతచే
నేలాగు వేగింతు? నిం
కేలీలన్ విభు వేడుదానని యెంతే
వంత జింతింపుమున్ (97)

ప్రాణవిభుని జిత్ర పటమునఁగస్తూరి చేత వ్రాసి యిట్లు పలికెను.

"కలలోనైనను నీదు మాటలకు నే గాదంచు మాఱాడుటల్
గలవో? వాడల వాడలం దిరిగిరాగా నీకు మెండొడ్డుటల్
గలవో?"......(99)
"నీవు దయ దప్పినవేగతిఁ దాళ నేర్తురా?" (101)
"తలిరుం బోడుల పట్ల నిన్ని వలవంతల్ చెల్లునా?
వల్లభా!" (103)
"నీవు దయ దప్పిన నిప్పుడు తాళ నేర్తునే?" (104)
"రారమ్మంచును ప్రేమతోడ నను జేరంబిల్చి లాలించ నీ
వేరా? రాజశశాంక! యింక నడురే యేలాగు వేగింతురా?"
(105)
"తలచ నైతివిగదా?........తొల్లింటి మమత లెల్ల"(106)
"నీదు నాతెరతేవె యూనకే, మాటల దీరునా? యువతి
మన్మథ! మన్మథ తాపవేదనల్?" (110)

రుక్మిణియొక్క పశ్చాత్తాపమునుగాంచిన శ్రీ కృష్ణుడు దరిజేరి,

"అంగనామణి హృదయంబునందు నపుడు
పొడుకొను కోపమును 'లేదు బంతి' యనియె" (121)

లక్షణము:—"స్వామి న్యేవాను రక్తా స్వీయా"—భానుసూరి.

"లజ్జా శీలార్జవాది సుగుణంబులు గలది స్వీయ"
—ఆంధ్ర దశరూపకము.

ఇట శ్రీకృష్ణుని ధర్మపత్నియగు రుక్మిణి స్వీయయగును. సామాన్యముగ నాయిక స్వీయాది భేదమున త్రివిధయగును. స్వీయాదులు అష్టవిధ శృంగార నాయికలుగారు. నాయిక అవస్థా విశేషముల ననుసరించి స్వాధీనపతికాది భేదంబున యష్టవిధ యగును. "స్వాధీన పతిక, వాసక సజ్జ, విరహోత్కంఠిత, ఖండిత, కలహాంతరిత, విప్రలబ్ధ, ప్రోషిత భర్తృక, అభిసారిక యని స్వీయాది నాయికావస్థ లెనిమిది"—ఆంధ్ర దశ రూపకము. విద్యానాథుడు స్వీయాది భేదముల నిరూపింపక శృంగార అష్టవిధ నాయికలనే "ప్రతాప రుద్రీయము"న నిరూపించెను. ఇచట అవస్థా విశేషము ననుసరించి రుక్మిణి స్వీయ యనుట పొసగదు.

ఇచ్చట రుక్మిణి తొలుత కృష్ణునిపై నేరమెంచి, తిరస్కరించి పశ్చాత్తాపపడినది గాన "కలహాంతరిత" యగును. లక్షణము

"పతి మవత్య పశ్చాత్ పరితప్తా కలహాన్తరితా"—
రసమంజరి.

"కోపాత్ప్రియం పరాణాద్య పశ్చాత్తాప సమన్వితా.
కలహాంతరితా నామ సూరిభిః పరికీర్తితా"
—ప్రతాపరుద్రీయము.

"అల్కచే ముందు ప్రియు విడనాడి, వెనుకఁ దాపపడు జవ్వని కలహాంతరిత యగును"—ఆంధ్ర దశరూపకము.

"అల్క వదివుఁ దెగడి యనుశయముఁజెందు పతి కలహాంతరిత"—మూర్తికవి.

2. గ్రంథమున భద్రా రాజగోపాలుల విలాస మిట్లు వర్ణింపబడినది. (2 ఆ—3—41). జారభావము మదిగోరిన శౌరి పొదరిల్లు సంకేత స్థానముగఁ జెప్పి భద్ర చెంతకు దూతి నంపెను. ఆ దూతి భద్రతో నిట్లు పలికెను.

కం. సమయోచిత శృంగారము
సముచితముగఁ బూనవమ్మ! సారసముఖి! నీ
రమణుఁడు నాతోఁ జెప్పిన
సమయస్థలిఁ జేర నిపుడె చనవలయుఁ జుమీ!(13)

సీ. కొలము సాము లటంచుఁ గూడి రాకుండను
బాదాంగదమ్ములఁ బరిహరింపు
మొగిలి మొత్తమ్ములంచు మూకసేయక యుండఁ
గీలుగంటునఁ జేర్పు మేలి ముసుఁగు
వెలఁదివెన్నెల యంచు వెంట రాకుండను
తళుకుఁ గన్నులఁ జూపు బెళక నీకు
ముసుఁగు జాట్టమటంచు నంటి రాకుండను
చన్నులఁ బయ్యెద జార నీకు
గీ. మనుచు గైసేసి నవచంద్రికార్థముగను
హంసకేకీ చకోర రథాంగకులము
లనుసరింపక యుండ నుద్యానమునకు
వెలఁదిఁ దోడ్కొని వచ్చెను నేర్పుమీఱ (14)

అంత విరహ పీడితుఁడగు శ్రీ కృష్ణుఁడు భద్రతో నట విహరించెను.

ఇట భద్ర—జారిణి యనుట ప్రమాదికము.

"అప్రకట పరపురుషాను రాగా పరకీయా. సాచద్వివిధా, పరోఢా కన్యకా చ" — భానుసూరి. "అన్యయునగ నన్యోఢయు గన్యయు"-కావ్యాలంకార సంగ్రహము. భద్ర శ్రీ కృష్ణుని యర్ధాంగిగదా! పరకీయ యెట్లగును? అవస్థా విశేషము ననుసరించి, వేంకటరావు గారొకచోట తెలిపినట్లు (తెలుగు పీఠికలో) కలహాంతరితగాదు.

ఇచట భద్ర అభిసారికా వేషమున సమయోచిత వేష భూషణములను ధరించి కృష్ణుని కొఱకు సంకేతస్థానమగు పొదరింటికేగినది. కావున, భద్ర "అభిసారిక" యగును. లక్షణము—

"స్వయమభిసరతి ప్రియ మభిసారయతి వా యా సాభిసారికా"—రసమంజరి.

"కాంతాభిసరణోద్యుక్తా స్మరార్తా సాఽభిసారికా"
—ప్రతాపరుద్రీయము.

"కాంతాభిసరణశీల యభిసారి కాఖ్యయై చెలువు మెఱయు'
—కావ్యాలంకార సంగ్రహము.

జారిణి—లక్షణ యనుట పొరపాటు. శ్రీ వేంకటరావు గారే వేఱొకచోట తెలిపినట్లు లక్షణ—వాసకసజ్జికయగును. ఇతరులు వారు నిరూపించిన నాయికలే యగుదురు. "రుక్మిణీ—స్వీయ" అనుటవలన—అష్ట మహిషుల ప్రసక్తి యున్నందున ఇతరులు పరకీయ లగుదురా?

# తేనెతలవడఁ బండు

## శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

ఇటీవల పినవీరభద్రుని జైమిని భారతములోని 'తేనెతలవడఁ బండు' అను ప్రయోగమును గూర్చి 'భారతి'లోఁ జర్చ సాగుచున్నది. జైమిని భారతములోని పద్య మిట్లున్నది.

గీ. తేనె తలవడఁ బండె ధాత్రీతలంబు
పాదలి ధారణ పోకకుఁ బుట్టెఁ డయ్యె
సస్యవంకల దుర్భిక్ష మడఁగిపోయె
ప్రశస్తింపఁగఁదగు రామ రాజ్యమునకు

జైమి 6 ఆ—9 ప.

ప్రకరణమునుబట్టి యిందు 'తేనె తలవడఁ బండు' అనఁగా సమృద్ధిగాఁ బండు అని అర్థమగుచున్నది. పూజ్యులు శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు తమ సాహిత్య సమీక్షలో నీ ప్రయోగమును గూర్చి చర్చించుచు, 'తేనె తలవడన్' జాతీయమైనా కావాలి, లేదా మరియొక పాఠమైనా ఉండాలి, అని వ్రాసిరి. సూర్యరాయాంధ్ర నిఘంటువులోను, వావిళ్ల నిఘంటువులోను దీనికొసగబడిన యర్థములు తృప్తికరముగా లేవు. శ్రీ వి. రామకృష్ణారావుగారిటీవల 'భారతి'లో నీ ప్రయోగమును గూర్చి చర్చించుచు 'తేమ తలవడఁ బండె' అని సవరించి 'తేమ' పాఠమును సూచించిరి. ఈ 'తేమ' పాఠము ప్రకరణోచితము కాదనుచు శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు విమర్శింపగా శ్రీ రామకృష్ణరావుగారు తిరిగి యిట్లు వ్రాసిరి. (చూ. నవంబరు నెల భారతి). "తేమ తలపడఁ బండె ధాత్రీతలంబు' అన్న వాక్యానికి శ్రీ శాస్త్రిగారు చెప్పినట్లు 'భూమి తేమకే పండినది' అని ముక్కస్య ముక్కోర్థ అన్నట్లు అర్థము చెప్పితే పూర్వోత్తర విరుద్ధ రచన యగును. కాని ఈ యర్థము కవి వివక్షితము కాదు. 'ధాత్రీ తలంబు దున్నకయు పండె' అను వాక్యానికి భావమేమో! అదే భావము 'తేమ తలవడఁ బండె' అన్నచోట సంభావ్యము. అప్పుడు తేమ పాఠము ప్రకరణోచితము కాగలదు........'తేమ' పాఠముతో సరిపెట్టుకొనవచ్చునేమో మఱొకసారి శ్రీ శాస్త్రిగారు దయతోఁ బరిశీలింతురు గాక!"

ఇట్టిచో నీ పాఠముండునేమోయని యర్థానుకూలమగునట్లు సవరించుటకంటె వ్రాత ప్రతులలో నీ తావున నేదైనఁ బాఠాంతర మున్నదేమో పరిశీలించుట యుక్తమని నేను శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య విద్యా పరిశోధనాలయములోను, మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకాలయములోనుగల జైమిని భారతపుఁ దాళపత్ర ప్రతులను శోధించితిని. ప్రాచ్య లిఖిత పుస్త

కాలయములోని ప్రతు లిప్పుడు తిరుపతిలోనే కలవు. అందు వివిధ ప్రతులలోనున్న పాఠము లివి :

నం. 1256. 110 పత్రము—

'తేనె తలవడఁ బండె' అనియే కలదు. పుట్టెఁడయ్యె ననుటకు 'పుట్టెఁ డమ్మె' అని పాఠము కలదు.

నం. 562 వ 77 పత్రములో—

'తేనె తొలవడఁబండె ధాత్రి జనంబు' అని కలదు. రామ రాజ్యమునను అనుటకు రామరాజ్యమునను—అని యున్నది.

డి. నం. 17, 44 వ పత్రములో—'తేనె తలవడఁ బండె ధాత్రీతలంబు!......పాదలె అని కలదు.

డి. నం. 16 లో 60 పత్రమున—పై తీరుననే కలదు. పొదలి, రామరాజ్యము—అని యున్నది.

ఆర్ నం. 12, 76 వ పత్రములో నీ ప్రయోగమున్న భాగము శిథిలమై యున్నది. '.......వడఁబండె' పొదలి, రామురాజ్యము........

తక్కిన పాఠముల మాట యెట్లున్నను వ్రాత ప్రతులం దన్నిటిలోను 'తేనె తలవడఁ బండె' ననియే కలదు. 'తేమ' పాఠముకాని మఱొక పాఠముకాని యందు లేదు. దీనిఁబట్టి 'తేనె తలవడఁ బండె' ననునదే కవి ప్రయుక్త పాఠ మనియు, నది యేదో జాతీయమై యుండుననియు, దాని మార్పఁదలఁచుట భావ్యము కాదనియుఁ దేలుచున్నది.

ఇట్లు తేల్చుకొన్నపిదప 'తేనె తలవడఁ బండు' అను జాతీ యమునకు 'సమృద్ధిగాఁ బండు' అను నర్థమెట్లు వచ్చెనో కొంత విచారింపవలసి యున్నది. 'వెన్ను విఱుగఁబండిన'దని, 'వడఁ బండిన'దని యనుట నేఁటికిని వాడుకలో నున్నది. ఇదే యర్థమున నీ జాతీయము కూడఁ బ్రయోగింపఁబడి యుండును.

కన్నడమున 'తెనె' యని యొక పదము కలదు. ఇటీవల మదరాసు విశ్వ విద్యాలయమువారు ప్రచురించిన 'Dravidian comparative vocabulary' అను గ్రంథమున 'తినై' అను తమిళ పదమునకు కన్నడమున సామ్యపదముగా 'తెనె' యుదాహరింపబడియున్నది. దానికి Spike of corn అని యర్థ మొసఁగఁబడియున్నది. కన్నడములోని ఈ 'తెనె' యను పదమే తెలుఁగున 'తేనె' యయినది. తేనెతలయనగా వరియెన్ను యొక్క అగ్రము. ఆ యగ్రములు వ్రాలునట్లు—సమృద్ధిగాఁ బండినదని భావము. కాని 'తెనె' కు సామ్యమయిన ఈ 'తేనె' తెలుగున వ్యవహారమునుండి జారిపోయి 'తేనె తలవడఁ బండు' అను జాతీయములో మాత్రమే నేఁడు నిలిచియుండి యా ప్రాచీన రూపముయొక్క స్వరూపమును గుర్తింపజేయు చున్నది. "శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారు 'తేనెతల=సస్య విశేషము అన్న సూర్యరాయాంధ్ర నిఘంటువుపై 'తేనెతల సస్య విశేషమైతే వడఁబండెన్‌లోని వడన్ ఏమిటి? అని ప్రశ్నవేసినారు. 'ఇదే ప్రశ్న వారిక్ల నిఘంటువుపైనను వేయువలసి ఉన్నది" అని శ్రీ రామకృష్ణారావుగా రన్నారు. వడన్ అనఁగా వ్రాలునట్లు అని యిక్కడ నర్థము చెప్పుకొనవలెను. తేనెతలవడఁ బండె' అని పకార మునకు వాదేశముతో రూపము కూడ ఇచట సంభావ్యమే. 'వెఱ్ఱి తలలు వేయు' అనుట కూడ నిట్లే యేర్పడి జాతీయమయి యుండును. 'తేనెతల వడఁబండు'టకు "వెఱ్ఱితలలు వేయుట" వ్యతిరేకమని యూహింపదగును.

పయి చర్చనుబట్టి వ్రాతప్రతులం దన్నిట 'తేనె తల వడఁ బండు' అనియే కలదని, తేమ యనుపాఠముండవచ్చునని దాని సవరింపనెంచుట భావ్యము కాదని, సమృద్ధిగా బండుటను నర్థమున జాతీయము 'తెనె' పదమునుండి యేర్పడినదని తేలు చున్నది. ఇప్పటి కీ జాతీయమున కర్థము కుదిరినట్లే.

## పిడపర్తివారి ప్రతిభ

ఆంధ్ర ప్రదేశ్ విశాఖ జిల్లాలో చేరిన విజయనగరమును శ్రీపూసపాటి నారాయణరాజుగారు పరిపాలిస్తున్న కాలము. సంవత్సరాంత మగుచున్నది. లెక్కలు సరి చేయుటకు జమలు బందు చెయ్య వలసినదిగా ఆజ్ఞ ఇచ్చి కోటిపల్లి తాలాకు జమా బందీకి ప్రయాణం సాగించినారు రాజుగారు.

అదేమి చిత్రమో కాని ఎప్పుడు పల్లకీ ఎక్కినా రాజుగారు తల్లిడిల్లి పోయి చిన్న పిల్లలవలె అల్లరిచేస్తూ వుండేవారు. పల్లకీ ఎక్కడం మానుట రాజ లాంఛనానికి విరుద్ధం. అందుచేత తాత్కాలిక ఉపశమనం కోసం వైద్యులు, భూతవైద్యులు అనుపానాలిస్తూ మంత్రాక్షతలు జల్లుతూ అనుసరిస్తూ వుండేవారు. వీరిని పల్లకీపిజ అనేవారు.

జమాబందీ జరుగు తోంది. హైరాణా తీర్చుకోడానికి పైకివచ్చి తిరిగి వెళ్ళు చుండగా ఒక ఆహితాగ్ని ఎదురై "ప్రభూ! నేను జోతి శ్శాస్త్రమును క్షుణ్ణంగా చదువు కున్నాను.. ప్రశ్నభాగం అమోఘంగా చెప్తాను." అని విన్న వించగా వినోదంగా కొంత సేపు విశ్రాంతి తీసుకోవాలనే తలంపుతో "ఇక్కడున్న వారంతా ఆశ్చర్య పడేటట్టు యేదైనా చెప్పండి" అని ఆనతియ్యగా వెంటనే ఆ వచ్చిన బ్రాహ్మణుడు తన యిష్ట దైవమును ప్రార్థించి అంతర్ముఖుడై అంతా స్తంభించేటట్లు "పల్లకి బొంగులో పుల్లిపాము ఉన్నది" అని నోటివెంట మాట నూటిగా అనేసరికి అంతా విస్తుపోయారు.

ప్రభువుకు పట్టరాని కోపం వచ్చింది. కాని ముందుగా మాట యిచ్చినందున జవదాటుట మర్యాదకాదని వజ్ర వైడూర్య ఖచిత మైన సదరు పల్లకీ నుంచి బొంగు విడదీసి పగుల గొట్టించగా పాము పైకి వచ్చినది. ఎక్కడి వారక్కడ కొయ్యల వలె అయి పోయారు.

తమకు యిన్నాళ్ళ గ్రహమై వక్రించిన పామును నిగ్రహించి నందులకు అనుగ్రహించినవారై గ్రామమొకటి దాన పట్టా వ్రాసి ఇచ్చిరి. ఇదే నేటి బూరాడ పేట అగ్రహారం. ఆ కుటుంబీకులే నేడు ప్రసిద్ధిలోనున్న పిడుపర్తివారు. వీరి పంచాంగములు ప్రామాణికములు.

నిడదవోలు పెదసూర్యనారాయణ.

# గ్రంథ విమర్శనము

## వీర రసము

[కర్త : జి. వి. సుబ్రహ్మణ్యం. ఆంధ్రోపన్యాసకుడు. ఓరుగల్లు కళాశాల. వెల : పది రూపాయలు, ప్రాప్తిస్థానము : 17—6—199 దత్తభవనము బేరూన్ దబీర్‌పూరా. హైదరాబాదు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ బహుమతి 1959—60 సం. లకు పొందిన గ్రంథము.]

సాహిత్యశాస్త్రమను నామాంతరము గల అలంకార శాస్త్రము సంస్కృతభాషలో ఒక మహాశాఖ. అది తర్క ప్రధానమై ఎన్నో సొగసులు పోయినది. ఈ అలంకార శాస్త్ర ప్రవర్తకులలో మొట్టమొదట పేర్కొన దగినవాడు భరత మహర్షి. ఆయన "నాట్యశాస్త్రము" రచించెను. నాట్య శాస్త్రము రూపకము (Drama) ను గూర్చి లోతుగా చర్చించును. రూపకమునే దృశ్యకావ్య మందురు. భరత మహర్షి అభిప్రాయము ప్రకారము కావ్యమనగా దృశ్యకావ్య మనియే అర్థము. అట్టి కావ్యమునకు సౌందర్యమును సంపాదించి పెట్టునది "రసము" అని వారి తీర్పు. "విభావాను భావ వ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తిః" అని వారు సూత్రీకరించినారు. ఈ సూత్ర మందు గల సంయోగ నిష్పత్తి పదములకు అర్థభేదములు కల్పించి భట్టలోల్లటాదులు భిన్న సిద్ధాంతములు చేసినారు. ఆ సిద్ధాంతము లన్నింటిలో అభినవ గుప్తపాదుల "అభివ్యక్తి" వాదమునకే బహుజన సమాదరణము లభించినది.

భరత మహర్షి "రసము" ను దృశ్యకావ్య పరముగా చెప్పగా, ఆనందవర్ధనుడు దానిని శ్రవ్యకావ్యమున కన్వయించినాడు. ధ్వని సిద్ధాంతమును సుప్రతిష్ఠిత మొనర్చుట, భరతుని రస సిద్ధాంతమును శ్రవ్యకావ్య పరముగా అన్వయించుట అను రెండు గొప్ప పనులు చేసినవా డానందవర్ధనుడు. ఆయన వస్త్వలంకార రసధ్వనులను మూడిటిని పేర్కొనెను. కాని అభినవగుప్తపాదుడు "రసధ్వని" కే పట్టము కట్టెను. "వస్త్వలంకార ధ్వనీతు సర్వథా రసం ప్రతిపర్యవస్యేతే" (వస్త్వలంకార ధ్వనులు గూడ రసమునందే పర్యవసింప వలయును) అని వారి యాదేశము.

ఇట్టి "రసము" లనంతములని సంస్కృత సాహిత్య శాస్త్రవేత్తల విశ్వాసము. కొందరు శాంత మొక్కటే రస మనిరి. మరికొందరు శృంగార రసమే ఏకైకరస మనిరి. భవభూతి కరుణరసమే ముఖ్యరసమని చెప్పెను. రసము లెన్ని యైనప్పటికి తొమ్మిది రసములు మాత్రమే బహుళ జన సమ్మతిని పొందినవి. ఆ తొమ్మిది రసములలో శృంగార వీర శాంత కరుణ హాస్యములకు అతి ప్రశస్తి లభించినది. ప్రాచీన భారతీయాలంకారికులు రూపక భేదమయిన "నాటకము" లో శృంగార వీరరసములకే చోటు చూపించిరి.

సంస్కృతభాషలో ఈ అలంకార శాస్త్ర చర్చ పరాకాష్ఠ నందుకొన్నను తెలుగు భాసలో మాత్ర మిది మృగ్య మైనది. కావ్యప్రపంచములో సంస్కృత సాహిత్యమును బహుధా అనుసరించిన ప్రాచీన కవులీ అలంకార శాస్త్రము జోలికే పోలేదు. అట్లని తెలుగువారికి సాహిత్యశాస్త్ర బలము లేదని కాదు. సంస్కృత భాషలో సుప్రసిద్ధములయిన అలంకార శాస్త్ర గ్రంథములు రచించిన ఆంధ్రు లెందరో కలరు. ప్రాచీన కవుల పాలిటికి సంస్కృత నాటకము లెట్లో యీ సాహిత్యశాస్త్రము గూడ అట్లే యైనది. ఇక ఆంధ్ర లక్షణ గ్రంథకర్తలు రచించిన గ్రంథములు కలగూరగంపలు. కావ్యాలంకార చూడామణి, నరస భూపాలీయాది శాస్త్రగ్రంథము లున్నను అవి దోషములు కతీతములు గావు.

ఇటీవల మాత్రమే తెలుగువారికి సంస్కృత సాహిత్య శాస్త్రముపై వలపు కల్గినది. ఎందరో పండితులు భరత మహర్షినుండి జగన్నాథ పండితుని వఱకు రచింపబడిన అలంకారశాస్త్ర గ్రంథములను అనువదించిరి. ఈయుద్యే వేంకట వీరరాఘవాచార్యులు ఆంధ్ర ప్రతాపరుద్రయశోభూషణ టీకలో ఈ అనువాద గ్రంథముల పట్టిక నిచ్చినారు. కాని అన్ని అనువాదములు ప్రశస్తములుగా నున్నవని చెప్పజాలము. మూలగ్రంథములు అనువాదము కంటె తేలికగా నుండునట్లు చేసినవారు కొందఱు. సంస్కృతభాషా సంప్రదాయములు దట్టముగా నున్న వాక్యములతో అనువాదమును దిద్ది తీర్చినవారు కొందఱు. అనువాద కర్తల లక్ష్యమును మెచ్చుకొన్నంతగా వారి పరివర్తన పద్ధతిని హర్షింపజాలము. సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు భట్టుమూర్తి "కావ్యాలంకార సంగ్రహము" నకు చేసిన వ్యాఖ్య, శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు చేసిన నాట్య శాస్త్రానువాదము పరిశీలించినచో ఎంతగా తెలియని అలంకార శాస్త్ర విషయము నయినను ఎంత తేట తెల్లముగా చెప్పవచ్చునో సమచిత్తులకు తెలియని విషయము గాదు.

ప్రత్యేకముగా ఏకైక రస చర్చ చేసిన గ్రంథములు గూడ మన భాషలో లేవు. ఆ కొఱత తగ్గించుటకు కూడ ఇటీవలనే కృషి ప్రారంభ మయినది. ఇదివఱకు ముట్నూరి సంగమేశముగారు "హాస్యరసము" ను గూర్చి యొక గ్రంథము రచించిరి. ఇప్పుడు శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యము "వీరరస"

మను నుత్కృష్ట గ్రంథము రచించి ఆంధ్ర సాహితీప్రియుల కృతజ్ఞతకు పాత్రులయిరి. ఈ గ్రంథము 1959—60 సంవత్సరములలో ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీవారి బహుమతి పొందినది.

“విశ్వవిద్యాలయములలో పరిశోధన పట్టము పొందదలచినవారు సమర్పించు సిద్ధాంత వ్యాసము (Thesis) ల కోవకు చెందదగిన దీ రచన” యని ఆచార్య లక్ష్మీరంజనముగా రన్న మాటలు సత్యములు. 477 పుటలు గల ఈ గ్రంథము “రసాభ్యుదయము” “రసోల్లాసము” అను రెండు భాగములుగా విభజింపబడినది. ప్రథమ భాగములో రస చర్చ, వీరరస వివేచనము చక్కగా చిక్కగా సప్రమాణముగా చేయబడినది. ద్వితీయ భాగములో నన్నయ నుండి నారాయణరెడ్డి వఱకు రచింపబడిన సర్వ సాహిత్య ప్రక్రియలలో—జానపద సాహిత్యమందు, చాటువులందు, హరికథలందు చలనచిత్రములందు గూడ—సాక్షాత్కరించుచున్న వీరరస భేదములు సవిమర్శకముగా గుర్తింపబడినవి. గ్రంథ ప్రణాళికయే సుబ్రహ్మణ్యముగారి శక్తి సామర్థ్యములను చాటుచున్నది.

శ్రీ సుబ్రహ్మణ్యము స్వతంత్ర పరిశీలనా దృష్టి పుష్కలముగా గలవారు. అలంకారశాస్త్ర సిద్ధాంతములను వివరించుటయే గాక నూతన సిద్ధాంతములను యుక్తిసహముగా చేయగల దక్షులు. కావ్యరసము ఆనందదాయకమని కొందఱు, సుఖదుఃఖాత్మకమని కొందఱు చెప్పిరి. కాని యీ రెండిటిలో సత్య మున్నదని సమన్వయించినా రీ గ్రంథకర్త (పుట 35). ఉత్తమత్వసాధన నిమిత్తమగు ఉత్తమేతరుల యుత్సాహము వీరరసనామ యోగ్య మనుట (పుట.55) లో, వీరరసమునకే మానవ జీవితములో తదితర రసములకు లేని వ్యాప్తి కలదనుచు నిరూపించుట (పుట. 61) లో వీరి స్వతంత్ర శక్తి గోచరించుచున్నది. సుబ్రహ్మణ్యముగారు భయమును ఉత్సాహమునకు సంచారి భావముగా నిర్ణయించిరి (పుట. 59). అచ్యుతరాయలు చెప్పిన యిర్వది యొకటి వీరరస భేదములనే కాక మఱి మూడింటిని స్వాతంత్ర్య యశోమాన వీరములను జోడించిరి (పుట.101). మహాభారతము శాంతరస ప్రధానము గాదని, ధర్మవీర ప్రధానమని—ఆనంద వర్ధనాభినవగుప్తులను కాదని చెప్పిరి. (పుటలు 189 నుండి—193 వరకు). “వస్తు కావ్యములు—రసకావ్యములు” అని ఒక క్రొత్త వింగడింపు చేసిరి. (పుటలు 239—240). ఈ వింగడింపు అందరకు సమంజసముగా కన్పట్టునా యనునది వేఱుమాట. వారి పరిశీలనా పద్ధతి రమ్యముగా స్వతంత్రముగా నున్నది.

ప్రాచీనాలంకారికుల సిద్ధాంతములను ఆధారముగా గొని నూతన సిద్ధాంతములు ప్రతిపాదించుట మంచి బాట. ఎప్పటికప్పుడు శాస్త్రకర్త సమన్వయ దృక్పథము నలవఱచుకొనవలయును. అట్టి సమన్వయ శక్తి ప్రాచీనులలో నున్నంతగా నవీనులలో ఎంతోమంది యందు కానవచ్చుటలేదు. అట్టి శక్తి గలవారిలో సుబ్రహ్మణ్యమువారు మొగదల యందున్నారు. ఈ బాటబడి పోయినచో శాస్త్రచర్చ ధారాళముగా కొనసాగును.

గ్రంథకర్త సాహిత్య ప్రక్రియలలో వీరరస భేదములను గుర్తించు పోకడలు పాఠకులను ఆశ్చర్య చకితులను చేయును. కొన్నిచోట్ల పద్యాదుల శిల్పమును ఆవిష్కరింపజేయుటలో గ్రంథకర్తగారు వీరరస భేదమును గుర్తించుట కొంతసేపు మఱచిపోయినారేమో యనిపించును. కాని తత్త్వము తర్వాతగాని తెలియదు.

సుబ్రహ్మణ్యముగారు స్వతంత్రదృష్టి గలవారు గావున వారు చేసిన సిద్ధాంతములు పలువురకు నచ్చుట సాధ్యము కాకపోవచ్చును. రసము నాయకాశ్రయమని వారు పేర్కొనిరి (పుటలు 9—238). మీమాంసకుడయిన భట్టలోల్లటుడు ప్రతిపాదించిన “ఉత్పత్తి” లేక “ఆరోపవాద” మిది. కాని యీ సిద్ధాంతము నంగీకరించినచో సామాజికునకు లేక పాఠకునకు రసానుభూతి యెట్లు కల్గునను ప్రశ్న రాకమానదు. ‘అభివ్యక్తి’ వాదము మాత్రము యుత్తమమని, ప్రామాణికమని యనేకుల తలంపు. “రసాభ్యుదయము” లో సుబ్రహ్మణ్యముగారు ఉత్పత్తి—అనుమితి—భుక్తి—అభివ్యక్తి వాదములను వివరించి యుండవలసినది.

సాహిత్యమే సారస్వతము, వాఙ్మయము అని పిలువబడునని వీరి సిద్ధాంతము (పుట 38). “సాహిత్య మనగా కావ్యజాల మనియే లాక్షణికులు గ్రహింతురు” (పుట.39). రసవత్కావ్య సముదాయము సాహిత్యము (పుట. 41) అని వారే చెప్పియున్నారు. అట్టిచో సాహిత్య సారస్వత వాఙ్మయ పదములను పర్యాయపదములనుగా చెప్పుట తగదు. పలువు రీ పదముల యర్థభేదములను సోపపత్తికముగా వివరించియున్నారు.

ఉత్తమత్వ సాధన నిమిత్తమయిన ఉత్తమేతరుని యుత్సాహము వీరరస నామయోగ్య మగునని గ్రంథకర్త చెప్పిరి. (పుటలు. 55—113). కాని 111 వ పుటలో చెప్పిన మధ్యమ నాయకుని (స్వల్పదోషా బహుగుణో మధ్యమః) యుత్సాహము ఉత్తమ ప్రవృత్తి సాధన నిమిత్తము కావచ్చును గదా? “మధ్యమాధమ నాయకుల యందలి యుత్సాహ ముదాత్తలక్ష్యభూతముకాదు కావున దానివలన వీర ముత్పన్నము కాదు. ఇక నుత్తమ నాయకాశ్రయ మయిన కావ్యమే వీర రసోచిత మనబడును.” (పుట. 111). అన్న యీ వాక్యమును గ్రంథకర్తగారు మరొకసారి పరిశీలింపవలయును.

నాచనసోముని ఉత్తర హరివంశమును వస్తు కావ్యములలో చేర్చిరి. “ఇతివృత్తములో లేని యైక్యత రసమునందధికముగా గోచరింప జేయునట్టి దిది”. (పుట. 280). ఇందలి కథలు భిన్నములు కావచ్చును. నాయకుడు కృష్ణుడే కదా ! “కావ్యమున నంగినాయకుఁ డొక్కడే. ఫల సాధనములో నాతనికి సహాయులు పెక్కు రుండవచ్చును. ప్రతి నాయకులు నంతియ. ఇట్టిది రసవత్తరముగ నిర్వహింపబడినచో నది రసకావ్య మనబడును” (పుట. 239) అని వారే యన్నారు. “నవ్యకావ్య సృష్టి” యనుట కంటె ఉత్తర హరివంశమును “రస కావ్యము” లలో చేర్చిన బాగుండెడిది.

"రసోల్లాసము" లో చర్చ "రత్నత్రయము" నకు సంబంధించినంతవరకు విరివిగా సాగినది. తదితర కావ్యముల చర్చ కూడ ఉన్నంతలో బాగున్నది. సర్వకావ్యములను సహా మర్శించుట సాధ్యముకాని మాట నిజము. కాని గ్రంథకర్తగారి దృష్టి నన్నెచోడని "కుమారసంభవము" ను త్రోసిరాజన్నది. వీరము అంగరసముగా నున్న గ్రంథములలో "పారిజాతాపహరణము" నే తార్కాణించిరి. నన్నెచోడుని "కుమార సంభవము"లో వీరరసము అంగరసమని విద్వాంసులు కొందఱి అభిప్రాయము. ఈ పట్టున "కుమార సంభవము" ను తీసుకొనినచో బాగుండెడిది. సుబ్రహ్మణ్యముగారు ప్రసిద్ధాంధ్ర కావ్యములను ఎక్కడో యొకచోట సంభావించియున్నారు గదా! సమగ్రత యొక్కడికి !

గ్రంథాంతమునం దనేక విధములయిన సాహిత్య ప్రక్రియలను మచ్చున కొక్కటిగా ఎన్నుకొన్నారు. సుబ్రహ్మణ్యముగారు చలనచిత్రములను గూడ సమీక్షింప ప్రారంభించినచో చర్చకు బలిమి కలుగునేమో గాని గ్రంథమునకు కలుగు కలిమి యంతగా నుండదు. గ్రంథములో చిట్టచివర పట్టులలో వీరరససమన్వయము సలుపబడినది. వైవిధ్య మున్నమాట వాస్తవము. కాని చర్చల బరువు కఱవైనది. కొన్ని గ్రంథములకు న్యాయము చేకూరలేదు. అట్టి వానిలో "బాపూజీ ఆత్మకథ" యొకటి. అంతేగాక నవీన కావ్యములలో వాసిగాంచిన ఏటుకూరి వేంకట నరసయ్యగారి గ్రంథములగు "వీర భారతము" "మగువ మాంచాల", "నాయకురాలు", "బాలచంద్రుడు" మున్నగు వానిలో ఏ యొక్కటియు గ్రంథకర్తగారి దృష్టికి రాలేదు. శ్రీనాథుని "పల్నాటి వీరచరిత్ర" తార్కాణింపబడిన దనుకొన్నను భిన్న సంవిధానమును బట్టి రెండు హరివంశములు పేర్కొనబడినవి గదా! అచిరకాలములో రాబోవు ద్వితీయ ముద్రణమందయిన గ్రంథ మింకను సమగ్ర మగునను నమ్మిక కలుగుచున్నది.

సుబ్రహ్మణ్యముగారు "విద్యాపీఠము" ప్రదర్శించి ఆంధ్ర సారస్వత ప్రపంచమునకు మహోపకారము గావించినారు. వారి వచనరచన సుబోధకముగా నున్నది. అతి క్లిష్టము లయిన శాస్త్ర విషయములను సైతము వారు సరళముగా స్పష్టముగా వివరించిరి. ఇట్టి శైలితో నడిచిన సాహిత్య శాస్త్ర గ్రంథములు వ్రేళ్లపై లెక్కింపదగినవేమో! ఇట్టి గ్రంథము లింకను సుబ్రహ్మణ్యముగారు రచింపగలరు. తెలుగువారు మన్నింపగలరు.

—శ్రీ ఎస్. జి. ప్రసాదరావు.

## మహాశ్వేతా

(గ్రంథకర్త: ఉభయభాషా ప్రవీణ—వేదాంతపారీణ—కవిశేఖర—విద్యానాథ—కవితామహేశ్వర శ్రీ మిన్నికంటి గురునాథ శర్మ. మూల్యము 0—75.)

శ్రీ శర్మగారు సంస్కృతాంధ్రములలో చక్కని పండితులు. చాలకాలము అధ్యాపకవృత్తిలో నున్నవారు. బహు గ్రంథకర్తలు. సరస కవితా ధురీణులు. వీరు గురు భాగవతముపేరితో భాగవతములోని ఏకాదశ ద్వాదశస్కంధముల నాంధ్రీకరించిరి. ఈ మహాశ్వేత యన్న గ్రంథము భట్టబాణరచితమైన కాదంబరి కథకు సంగ్రహము. ఇది విద్యార్థులను దృష్టిలో పెట్టుకొని వ్రాసినది. భట్టబాణుని కాదంబరి ఒక మహారణ్యము వంటిది. బహువర్ణనాకులమైనది. దానిలోని కథను ఆ వర్ణనలలోనుండి పైకి తీసికొని రూపు కట్టించుకొనుట కష్టమైన పని. ఈ గ్రంథములో కాదంబరిలోని కథయంతయు చక్కగా చెప్పబడినది. నట్టి కథనే చెప్పుటకు కొంత నిగ్రహము కావలెను. ఏదో కొంత వర్ణనము కూడ కలుపుదమన్నచో అప్పుడు భట్టబాణుని గ్రంథమంతయు తిరుగ వ్రాయుటయే యగును. బాణుని ఏ వాక్యమును వదలిపెట్టగలము! అందుచే శర్మగారు వర్ణనమునంతయు మజ్జగించి కేవలకథాంశములు మాత్రమే గ్రహించి సరళమైన శైలిలో తమ రచన నడిపిరి.

"గద్యంకవీనాం నికషం వదంతి" అన్నమాట ప్రసిద్ధమే. ఎంతో భాషా పటుత్వమున్నగాని గద్యమునడుపుట కష్టము. సంస్కృతములో సమాసము లేకుండ వ్రాయుట కష్టము. తెలుగులో సమాసములతో వ్రాయుట కష్టము. ఆ యా భాషల యొక్క స్వభావములట్టివి. సంస్కృతములో అసలు సమాసమే లేకుండ వ్రాయుట 'నభూతోన భవిష్యతి' అని చెప్పవలెను. సమాసములున్నను లేకుండనున్నట్లు వ్రాయుట సంస్కృతమునందు గొప్ప. తెలుగులో సమాసములుపెట్టి తెలుగుదనము దీపింపజేయుట కష్టము. ఈ రెండు భాషలయందు నిట్టి రచనల కిద్దఱి నుదాహరణముగా తీసికొనవచ్చును. సంస్కృతమున దండి—తెలుగున తిక్కన్న గారు. పలువురు వీ రిద్దరు సమాసములు వాడరనుకొందురు. కాని అది యథార్థముకాదు. వారి రచనయందున్న గుణమది. సమాసములు వాడినట్లు మనకనిపించదంతే. ప్రకృత గ్రంథమునందొక వైచిత్ర్య మున్నది. వ్రాసినది కాదంబరి కథ. శైలి దండిది. సంస్కృతమునందు దండి, బాణుడు, వీరిద్దరు గద్య రచనయందు బహు విభిన్నమైన శైలీ లక్షణములు కలవారు. కాదంబరికథను వ్రాయుచు, భట్టబాణుని శైలీ ప్రభావమును తప్పించుకొనుట—దానికి కేవలము వ్యతిరేకమైన దండిశైలి ననుకరించుట ఈ గ్రంథములో నాకు కన్పించిన విశేషము. ఈ గ్రంథము చదువుచుండగా, ప్రతి వాక్యమునందును కాదంబరీ పరిచ్ఛేదములు వర్ణనా విలాసములతో మనముందు విప్పుకొనుచున్నట్లుండును. ఒక్క అంశమును వదలి పెట్టకుండ కథనంతయు మధురమైన పాకములో శ్రీ శర్మగారు చెప్పగల్గిరి. ఇది విద్యార్థులేకాదు పండితులు కూడ చదివి ఆనందింపగల గ్రంథము.

—శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి.

## సంస్కృత వాఙ్మయచరిత్ర

(ద్వితీయ సంపుటము : లౌకిక వాఙ్మయము. కర్త : మహోపాధ్యాయ, అభినవ వాగను శాసన—శ్రీ మల్లాది సూర్య నారాయణ శాస్త్రిగారు. ప్రకాశకులు : ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్‌రోడ్డు, హైదరాబాదు. 490 పుటలు. వెల : రు. 8.)

సంస్కృత వాఙ్మయ చరిత్ర విమర్శముల మీద ప్రకాశన ప్రచారముల మీద మహారాష్ట్రులు చూపిన చూపునున్న శ్రద్ధాసక్తులు గమనించినచో తెలుగువా రిట్టి మార్గమున నంతగా నాసక్తులు కృతపరిశ్రములు కారేమో అను కొరత కొంత కలుగక మానదు. అయినను ఆ కొరత తీర్ప గల పండితులు కొందరైనను తెలుగునాట లేకపోలే దన్నది సమీక్షకుని వంటి వారి కొక తృప్తి. వేళ్లమీద లెక్కపెట్ట దగిన ఆ కొలది మందిలో శ్రీ మల్లాది సూర్యనారాయణ మహోపాధ్యాయు లొకరు. సంస్కృత కవి జీవితము వ్రాసిన శ్రీ శాస్త్రిగారు పదపడి వైదిక వాఙ్మయము ప్రథమ సంపుటముగా, లౌకిక వాఙ్మయము ద్వితీయ సంపుటముగా, సంస్కృత వాఙ్మయ చరిత్రమును 1936 లోనే వెలయించినారు. హైదరాబా దాంధ్ర సాహిత్య పరిషత్తు వారు ఈ రెండు సంపుటములకు ద్వితీయ ముద్రణము కూర్చుట ముదావహము.

సంస్కృత సాహిత్యచరిత్రచరిత్రమును తడవిన పాశ్చాత్యులే అనేకు లున్నారు. మాక్స్‌ముల్లర్, వీబర్, మాగ్డనెల్, కీత్ మొదలగు వారి పేళ్లు సుపరిచితములే. శాస్త్రిగారి తెలుగు సంపుటములు రెండును అంత పెద్దవి అంత చిన్నవి కాక సామాన్య పాఠకున కుపకరించునవి యనుటలో సందేహము లేదు. దీనికంటెను ఈ గ్రంథ రచనలోని శాస్త్రిగారి స్వతంత్ర మార్గము గ్రంథమునకు కుత్కర్షహేతు వనక తీరదు. గ్రంథమున చారిత్రక విషయముతోపాటు విమర్శ భాగ ముండుట, రచనలోని కథన దక్షత, గ్రంథము నంతయు చదివించు మరికొన్ని గుణములు.

ఇపుడు సమీక్షింప బడుచున్న ద్వితీయ సంపుటము (లౌకిక వాఙ్మయము) ను శాస్త్రిగారు తొమ్మి దధ్యాయము లుగా వింగడించినారు. ప్రథమాధ్యాయమునఉపవేదములు, ద్వితీయాధ్యాయమున రామాయణభారతములు, తృతీయమున పురాణోపపురాణతంత్రములు, చతుర్థమున దర్శనములు, పంచమమున శాస్త్రములు, షష్ఠమున అలంకార శాస్త్రము, సప్తమమున కావ్యములు, అష్టమమున రూపక ములు, నవమమున కోశములు పరామర్శింపబడి పాఠక సౌలభ్యము సమకూర్పబడినది.

శాస్త్రిగారి స్వతంత్ర దృష్టి కుదాహరణములుగా కొన్ని అంశముల స్పృశింపవలసి యున్నది. రామాయణ భారతము లలో మొదటి దాదికావ్య మనియు రెండవది అర్వాచీన మనియు మన మందరము నమ్ముదుము. కాని వాష్‌బర్న్ హాప్కిన్ వంటి పాశ్చాత్యులు భారతమే ముందు దని వాదించి నారు. శాస్త్రిగారు రామాయణ భారతములలోని ఆంతరంగిక సాక్ష్యమును, పౌరాణిక సాక్ష్యమును చూపి రామాయణమే మొదటిదని సప్రమాణముగా నిర్ణయించినారు. దీనితోపాటు 'యవను' లనబడువారు అలెగ్జాండర్, డెరియస్‌ల కంటె పూర్వమువా రనియు, దాదాపు క్రీ. పూ. వెయ్యి సంవత్సరము లకు మునుపే ఉత్తర హిందూదేశమున నుండినవా రని— శాకటాయనుడు యవన శబ్దమును పేర్కొనుట ఆధారముగా నిశ్చయించినారు. రామాయణ భారతములు క్రీ. పూ. 12, 11 శతాబ్దములనాటివని శాస్త్రిగారి విశ్వాసము. ఇట్లే రామాయణ బాలకాండము నందలి మూడు నాలుగు సర్గలు ప్రక్షిప్తములన్న విశ్వాసము చాల సముచితము. ఉత్తరకాండ రచన పిదప నెవ్వరో దానిని పూర్వ గ్రంథముతో అగించుటకుగా నీ సర్గలు చేర్చియుందు రనుట సుసాధ్యమైన సంగతి. రాక్షసుల యుదంతములు హనుమదాదిశూరలవృత్తాంతములతో నలుబది సర్గలు జరిగి పండ్రెండు సర్గలలో సీతా విసర్జన ఘట్ట మేర్పడి, మృగనివ్యాధుల కథలతో మరికొన్ని సర్గలు వ్యయమై అరువది యైదు సర్గల తర్వాత కుశలవ జన్మ వృత్తాంత మంకురించిన ఉత్తమ కాండరచన—గుణమును

బట్టి గాని సంవిధానమును బట్టి కాని వాల్మీకి రచన కాజాల దనుటయే లెస్స.

అట్లే భర్తృహరియే భట్టికావ్య కర్త యని శాస్త్రి గారు చక్కగా నిరూపించినారు. భాస నాటకముల విషయమున శ్రీ పరంజపే గారితో నేకీభవించుచు దొరికిన పద మూడు నాటకములకు భాస కర్తృత్వము నంగీకరించినారు. కుందమాల కర్తృత్వ విషయమున బౌద్ధుడైన దిఙ్నాగుడు రామకథ వ్రాయునా యను సందియమును బట్టియు, 'ధీరనాగు' డను పేరు తంజావూరు నందలి లిఖితప్రతులలో నాటకాంత గద్యలలో కానవచ్చుట చేతను (కవే ర్ధీరనాగస్య కృతిః కుందమాలానామనాటకం సమాప్తమ్) శాస్త్రిగారు ఏతద్గ్రంథకర్త ధీరనాగుడనియు, శృంగార ప్రకాశకర్త భోజ దేవునకు ముం దెవ్వరును కుందమాలా శ్లోకముల నుదాహరింపక పోవుటను బట్టియు, భోజుడు పేర్కొన్నాడు గనుక వాతనికి, కొంచెము పూర్వుడైన ధనంజయునికీ, ధీరనాగుడు సమకాలీనుడు కావచ్చు ననియు శాస్త్రిగారి యూహ.

కాలగతిలో సహజముగా నేర్పడిన లౌకిక వాఙ్మయ వికాసమును శాస్త్రిగా రిట్లు ధీరస్వతంత్ర వృత్తితో పరిశీలించి వాఙ్మయ చరిత్ర జిజ్ఞాసువుల కుపకార మొనర్చినారు. మధురమగు రచన. సాహిత్య విద్యార్థు లందరు చదువవలసిన గ్రంథము.

—ఎస్. కె.

## మారే మనుషులు

(రచయిత : పురాణం సూర్యప్రకాశరావు. ప్రాప్తిస్థానం: జీవనగంగ ప్రచురణలు, విజయవాడ—3. మూల్యం : ఐదు రూపాయలు.

మారే మనుష్యులమధ్య మారకూడదన్న మూర్ఖపు పట్టుదలతో ఏకాకిగా నిలచింది సరస్వతమ్మ. ఇంటికి కొత్త కోడలుగా వచ్చినది మొదలు సమిష్టి కుటుంబపు బాధ్యతలన్నీ తనమీద వేసుకుని—కన్న నిష్ఠూరాలను పడడం తనవంతూ, సుఖాలనుభవించడం యితరుల పాళ్ళూ అన్నట్టుగా ప్రవర్తిస్తుంది.

సరస్వతమ్మ భర్త ధర్మారావు ఎక్కడి కక్కడ ఆమెను మారుద్దామని చూస్తూనేవుంటాడు. కాని ఫలితం కనిపించదు. దిక్కూ దివాణంలేనివారిని చేరదీసి ఆత్మీయతలో పెంచి స్వతంత్రులనుచేసింది. కాని వారలా స్వతంత్రంగా బ్రతకడంచూసి కన్ను కుట్టుకుంది తనను కాదంటున్నారే అని. వెంకట్రాయుడు,—కృష్ణ—ఇద్దరూ స్వతంత్రులయారు. ఆడపిల్లల పెళ్ళికని చేసిన అప్పు పీకలమీదికి వచ్చింది. అది తీర్చడానికని పౌరుషంతో ఒంటెడు నగలు అమ్మింది సరస్వతమ్మ. అందరూ సమిష్టి కుటుంబపు పంచవదలి గూళ్ళు కట్టుకుంటూవుంటే, సరస్వతమ్మ హృదయంలో ప్రశాంతత ఆవరించడానికిబదులు వికృతమైన అసూయా జ్వాలలు రేగాయి.

సంగీతం మేష్టారు రామనాథంగారి కూతురు అనూరాధని కృష్ణ ప్రేమించాడని తెలిసి, ఆ పెళ్ళి కాకుండ చేస్తుంది. కృష్ణ యిల్లు వదలి వెళ్ళిపోయాక మేష్టార్ని పిలచి మీ పిల్ల యిలా బరితెగిస్తే చూస్తూ వూరుకున్నారన్నట్టు కేకలు వేస్తుంది. అనూరాధ వివాహం యింకోరితో జరిగిపోతుంది. కృష్ణ హృదయంలో శూన్యం మాత్రం మిగులుతుంది. ఈ "తల్లి" నెలా సుముఖురాలిని చేసుకోవాలన్న ధ్యాస మినహా వేరు ధ్యాసలేదు అతనికి. వెంకట్రాయుడి సహాయంతో డబ్బు కూడా పెట్టి, తల్లి అమ్మిన అన్ని నగలూ చేయించి తీరాలని పంతంపట్టి నెగ్గుతాడు.

సంక్రాంతికని అందరూ కలుసుకున్నప్పుడు వెంకట్రాయుడూ, కృష్ణ తాము చేయించిన నగలను యిస్తారు సరస్వతమ్మకి పెట్టుకొమ్మని. కాని అహం అడ్డువచ్చి తటపటాయిస్తుంది సరస్వతమ్మ. కాలం ఈ మనిషిని మార్చేలోపున వచ్చిన దారినే వెళ్ళిపోతాడు కృష్ణ.

ఈ నవల ఓ విధంగ సరస్వతమ్మ జీవిత గాథ. ఆమె జీవన స్రవంతి మళ్ళిన మలుపులన్నిటినీ ఎంతో అందంగా చిత్రించారు రచయిత. నవనీతంలాంటి హృదయంవుండీ భార్యకు యింగితం బోధించలేని ధర్మారావు, సదుద్దేశంతో ఉద్యోగాలు చేయాలని తలపెట్టిన వెంకట్రాయుడు, కృష్ణ, అందరూ పుష్టి అయిన పాత్రలు. కృష్ణ ఆదర్శవాది. కాని ఆదర్శంకోసం యింకొకని నొప్పించడానికి ధైర్యం చెయ్యలేని పిరికివాడు. కృష్ణపాత్ర బాగుంది.

కాలం మారుతుంది. తదనుగుణంగా మనుష్యులు మారాలి. అలా మారకూడదనుకున్నవాళ్ళు బాధపడక తప్పదు. వారిది కోరికోరి ఏటికి ఎదురు యీదడంలాంటి తత్వంకదా. సరస్వతమ్మదిదే తత్వం. కాలాన్నిబట్టి నడుచుకొనివుంటే సరస్వతమ్మ ఎంతో అదృష్టవంతురాలు. కాని అది చేయలేదు కనుకనే మానసిక వ్యథతో కుమిలింది. దాని కామే బాధ్యురాలు. అందుకే చివరికి ఎవరినీ ధైర్యంగా ఎదుర్కోలేకపోయింది.

మారే మనుష్యులు చక్కని సాంఘిక నవల. సమిష్టి కుటుంబాలలోని విపరీతపు వాతావరణాన్ని ప్రత్యేకంగా చెప్పకుండానే చెప్పారు రచయిత. మారే మనుష్యులలోని విభిన్నతత్వాలను ఒకే తాటిమీద నడిపించాలన్న పట్టుదల ఎంత ప్రకృతి విరుద్ధమో, అనవసరమో సరస్వతమ్మ పాత్ర చాటుతూ వుంది.

పుస్తక ముద్రణా, ముఖచిత్రం బాగున్నాయి. కాని ధరే కాస్త ఎక్కువేమో!

—కె. రామలక్ష్మి

# గ్రంథ విమర్శనము

## భిన్నగతులు

(కథల సంపుటి)

(రచయిత : రాజేంద్ర. ప్రాప్తిస్థానం : వివేకవర్ధనీ పబ్లికేషన్సు, చిత్తూరు. మూల్యం : ఒక రూపాయి.)

ఉత్సాహానికి కళ్లెంవేసి వూహాల గుఱ్ఱాలని అదుపులో పెట్టడం యింకా పట్టుపడని కౌతు శ్రీ రాజేంద్ర. ఈ కథల సంపుటిలో మనకి అదే విశదం అవుతుంది.

"పిల్ల మెచ్చినవాడు" అన్న కథ రచయిత భాషలో "అడంగి యెదవ"ను గురించిన కథ. కథ కూడ అలాగేవుంది. "భిన్న గతులు" అన్న కథలో రఘు కమ్యూనిస్టు భావాలుకల కొడుకు. "స్నేహంకోసం, మర్యాదకోసం, మంచికోసం యింకా అనేక ప్రయోజనాలకోసం ఆడినమాట అదేపనిగా తప్పేవాళ్ళు, ఇంకా ఇతర తరహా వ్యక్తులు- అంతా ఎప్పుడో చచ్చిపోయి-యింకా బ్రతికే వున్నాం అని తృప్తిపడే మూర్ఖశిఖామణులు నాన్నా!" అంటూ ఒక్క గుక్కలో చెప్పేసి చదువు ముందుకు సాగకపోయినా చేసు కుంటా నన్న పెళ్ళి చేసుకుందుకు సిద్ధం అవుతాడు.

'ఆమె పిలిచింది' అన్న స్కెచ్‌లో గడపలో అందమైన అమాయకురాలు నిలబడి చూస్తూవుంటే—'ఇది సానివాడ కాదు కదా ఎందుకిలా నిలబడింది' అని నాయకుడు విఘ్నేశ్వరరావు అను కుంటూంటేనే ఆమె కాస్తా పిలిచింది—ఉత్తరం చదివించుకో డానికి! ఉప్పొంగిన హీరో ఉత్సాహం కాస్తా—ఆవిడ భర్త రాసిన ప్రేమలేఖ చదివి వినిపించటంతో చల్లారిపోతుంది. హతాశుడై కూలబడతాడు విఘ్నేశ్వరరావు.

'కొత్తరోజుల బ్రతుకు' అన్న కథ నాటువలపుల కథ. ఇల్లరికం భర్త కాస్తా చనిపోతే—వ్రడంగిపనికి యింటికి పిలిపించిన చిన్నస్వామిని మోహిస్తుంది శేషమ్మ. ఊళ్లోవాళ్ళు పలుగురూ నాలుగు మాటలూ అనుకుంటుంటే, వాళ్ల లెక్కేమిటి అని అతనితోపాటు పూరువదిలి—ఉప్పొంగిన నదిలాగ పట్నాలలో జల్సా జీవితం గడిపి గడిపి, చివరికి పల్లెటూళ్లలో శుష్కించి శుష్కించి, చిన్నస్వామి కాస్తా కుంటి గుడ్డి అయిపోగా — బిచ్చ మెత్తుకుంటూ పూరూరా తిరుగుతూ యీ బ్రతుకులో తెల్ల వారడమే తెల్లవారడం' అని నిశ్చింతగా వుండిపోతుంది శేషమ్మ.

కవిత్వానికిలాగే కథలకూ 'అన్నీ' ఇతివృత్తం కావచ్చు. కాని ఆ తీసుకున్న వస్తువు ఒప్పించడంలోనే తమ తమ వ్యక్తిత్వాన్ని చూపెడతారు రచయితలు. అటువంటివారిచేత ఆ యా వస్తువులు ఉత్తమ సాహితీ ఖండాలుగా కూడ రూపం దాలుస్తాయి. కాని వస్తువును ఒప్పించలేకపోతే ఫలితం యీ కథలలాగే హాస్యాస్పదంగా తయారవుతుంది" అంటే సత్యదూరం కాదేమో!

## విముకుడు

(నాటిక)

(రచయిత : హితశ్రీ, ప్రాప్తిస్థానం : శోభా ప్రచురణలు, విజయనగరం, మూల్యం : న. పై. 0—75.)

చాలాసార్లు ప్రదర్శింపబడి, బహుమతులు సహితం అందు కున్న యీ "విముక్తుడు" ఆంధ్ర పత్రికలకు పరిచితులైన హితశ్రీ సృష్టి.

ఇద్దరు ప్రొఫెసర్లు, ఒక జనరల్ మేనేజరు, ఇద్దరు సామాన్యులూ ఒక వెయిటరూ మధ్య జరిగిన సంభాషణల ద్వారా విష యం వెల్లడి అవుతుంది. ఉద్యోగం దొరక్క దొంగతనానికి పాల్పడ్డ జయరావ్, చావేవా భరిస్తానుగాని, దొంగనుకాను అనే మూర్తి, మతిమరుపు ప్రొఫెసరు అందరూ సహజంగా వున్నారు. బ్రత కడంకోసం దొంగగా మారుదాం అనుకున్న జయరావ్, ఆఖరు క్షణంలో కనువిప్పుకల్గి "పూటకు గతిలేకపోయినా దొంగగా మాత్రం బ్రతుకలేను" అని వాపోతాడు. ఈ పరివర్తన రావ డంలో, అసలు సెక్యూరిటీ డిపాజిట్టు కూడ కట్టనవసరం లేకుండా కాషియరు ఉద్యోగం యిస్తాడు జనరల్ మేనేజరు. దానితో నాటకం ముగుస్తుంది. స్టేజిమీద వేయడానికి ఖర్చు తక్కువలో జరిగే నాటకం యిది. అన్నిటికంటే ముఖ్యం— దీంట్లో ఆడపాత్రలు లేవు! అమెచూరు నాటక సంఘాలవారి ప్రాణాలు తోడడానికి. బహుశా అందుకే అందరి అభిమానం అందు కుంటూందేమో ఈ నాటకం. **శ్రీమతి రామలక్ష్మి**

## తిక్కన చరిత్రము

(కవి శ్రీ శిష్ట్లా బాల కోటేశ్వరరావు వెల రు. 1. ప్రకాశకులు శ్రీ శిష్ట్లా వెంకటప్పయ్యశాస్త్రి, బోపడకుర్రు.)

శ్రీ శిష్ట్లా బాలకోటేశ్వరశాస్త్రి చిరుత వయస్సున వ్రాసినా ధారాశుద్ధిగల కావ్యం ఇది. దీనికి రణ తిక్కన నాయకుడు. ఇతి వృత్తము కాటమరాజు మనుమసిద్ధి ప్రభువుల యుద్ధము. ఇదే ఈ కవి ప్రథమ ప్రయత్నమేమో, కావ్యమంత 'బింకము'గాలేదు. అయినను కవిత్వము, పద్యమును వ్రాయుపద్ధతి కొంత కొంతగా బాగున్నవి. పద్య రచనలో తిక్కనగారిని అనుసరించుటయు కలదు. కవి అభివృద్ధిలోనికి రావలసినవాడు. సహృదయులు ఆదరించవలసిన గ్రంథము.

హా. శి.

# వార్తలు

## కాశ్మీర్ సమస్య

డిశంబరు నెలలోనే పాకిస్తాన్ కాశ్మీర్‌సమస్య గూర్చి ఉధృతంగా మాట్లాడ్డం మొదలుపెట్టింది. ముఖ్యంగా గోవా సమస్యను భారతదేశం తేల్చివేసిన అనంతరం పాశ్చాత్య రాజ్యాలలో బయలుదేరిన అలజడినీ ఆధారంగా పెట్టుకొని, ఈ సమస్యను భద్రతా మండలిలో కదిపిన పక్షంలో, అసలు సమస్య ఏమైనా, ఆయా దేశాలు భారతదేశాన్ని తిరిగి దుయ్యబట్టగలవన్న భావంతో పాకిస్తాన్ ఈ ఎత్తు ఎత్తినట్లు, దాని ముఖం చూడగానే తెలుస్తున్నది. డిశంబరు 31 వ రక్షణ మంత్రి శ్రీ మీనన్ యీ సమస్యను గూర్చి బొంబాయిలో ప్రస్తావించి "ఇందులో తేలవలసినది ఏమీలేదు. పాకిస్తాన్ ఈసారి తన దురాక్రమణను ఒప్పుకొని, ఆ దురాక్రమణను రద్దు చేస్తానని భద్రతామండలికి చెప్పడం ఒక్కటే మిగిలి ఉంది" అన్నారు.

జనవరి 4 : పాట్నాలో 67 వ కాంగ్రెస్ మహాసభలో అధ్యక్షోపన్యాసంయిస్తూ శ్రీ సంజీవరెడ్డి కాశ్మీర్ వ్యవహారాన్ని గూర్చి మాట్లాడారు. పాకిస్తాన్ ఆక్రమణలో ఉన్న కాశ్మీర్ భూభాగానికి భారతదేశం విముక్తిని చేకూర్చవలసి ఉన్నదని, ఇంతకాలం ఈ సమస్య తనముందు నలుగుతున్నా, సమితి దీనిని గురించి ఒక మార్గాన్ని నిర్దేశించలేక పోవడాన్ని విమర్శించారు. ఆక్రమిత కాశ్మీర్‌కు ఎప్పుడు విముక్తిని కల్పించడము అనే విషయాన్ని భారత ప్రభుత్వానికి వదిలివెయ్యాలి" అన్నారు.

జనవరి 5 : ప్రస్తుతం ఉన్న యుద్ధ విరమణ సరిహద్దు ప్రాతిపదికగా కాశ్మీర్ సమస్యను పరిష్కారం చేసుకుంటే బాగుంటుంది అని ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ చేసిన సూచనను, పాకిస్తాన్ అధ్యక్షుడు జనరల్ అయూబ్ ఖాన్ తిరస్కరించారు. అంతేగాక భారతదేశానికి పాకిస్తాన్ మీద దండయాత్ర చెయ్యాలని ఉన్నదని, అందుచేతనే సరిహద్దుల్లో సైన్యాలను సమీకరించి ఉన్నదని కొన్ని ఆరోపణలు చేశారు. శ్రీ సంజీవరెడ్డి పాట్నా ప్రసంగానికి ప్రత్యుత్తరంగా ఆయన "ఆజాద్ కాశ్మీర్ గోవా అంత అరక్షితం కాదు" అన్నారు.

జనవరి 6 : పాట్నా కాంగ్రెస్‌లో మాట్లాడుతూ ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ పాకిస్తాన్ అధ్యక్షునికి సమాధానం ఇచ్చారు. భారతదేశం కాశ్మీర్‌ను పళ్లెంలో పెట్టి పాకిస్తాన్‌కు అప్పగించడం ఎన్నడూ జరగదని స్పష్టం చేశారు. భారతదేశంపై పాకిస్తాన్ సాగిస్తున్న విష ప్రచారాన్ని ఖండించారు.

జనవరి 8 : పాక్ ఆక్రమిత కాశ్మీర్ సరిహద్దులలో చైనా సైన్యాలు గస్తీ తిరుగుతున్నట్లు వార్తలు వచ్చాయి. పాకిస్తాన్ ఆక్రమణలో ఉన్న కాశ్మీర్‌లో 4 వేల చదరపు మైళ్ల ప్రాంతం తనకు రావాలని చైనా ప్రభుత్వం ఒక వాదాన్ని ప్రారంభం చేసింది.

జనవరి 11 : కాశ్మీర్ సమస్యను గూర్చి చర్చించడానికి భద్రతా మండలి సమావేశం కావాలని పాకిస్తాన్ ఆ సంఘం అధ్యక్షుడికి దరఖాస్తు పెట్టుకొంది. ఈ సమస్య విషయంలో అమెరికా తమకు అనుకూలంగా ఉండని పక్షంలో ఆగ్నేయ ఆసియా సైనికకూటం నుంచి పాకిస్తాన్ తొలగవచ్చునన్న ప్రచారం గూడా ప్రారంభమైంది.

జనవరి 13 : కాశ్మీర్ సమస్యను ఇప్పుడు చర్చకు పెట్టడం విషయంలో పశ్చిమ రాజ్యాలు ప్రాతికూల్యాన్ని ప్రకటించాయి.

జనవరి 16 : "కాశ్మీర్ : సమితి" అనే కరపత్రాన్ని భారత ప్రభుత్వం ప్రకటించింది. పాకిస్తాన్ అభ్యర్థనను ఆమోదించవద్దని సమితిలో భారత ప్రతినిధి శ్రీ ఝా భద్రతామండలి అధ్యక్షునికి లేఖ వ్రాశారు.

జనవరి 18 : భద్రతామండలిలో ఇప్పుడు కాశ్మీర్‌ను గురించిన చర్చకు అమెరికా ప్రతికూలంగా ఉన్నట్లు వార్తలు వచ్చాయి. భారత పాకిస్తాన్‌లు ఈ సమస్యను సమితి అవతల పరిష్కారం చేసుకోవడం మంచిదని అమెరికా భావిస్తున్నదట.

జనవరి 19 : సమితి ద్వారా కాశ్మీర్ సమస్యను శాంతియుతంగా పరిష్కరించుకోవాలన్నదే తమ ఆశయమైనట్లు పాక్‌విదేశాంగశాఖ అధికారి ప్రకటించారు. డా॥ గ్రాహం నివేదికను భద్రతామండలి చర్చించాలని తమ దేశం కోరుతున్నట్లు చెప్పారు. భారత్ తన సైన్యంలో 100 కి 85 వంతుల సైన్యాన్ని పాకిస్తాన్ సరిహద్దుల్లో మొహరించి ఉంచినట్లు కూడా ఈ అధికారి పేర్కొన్నారు.

జనవరి 20 : భారతదేశంతో తగాదాయే వస్తే, పాకిస్తాన్ తన వద్ద ఉన్న అన్ని రకాల ఆయుధాలను ప్రయోగిస్తుందని పాక్ అధ్యక్షుడు జనరల్ అయూబ్‌ఖాన్ ప్రకటించారు.

జనవరి 21 : అమెరికా ఆయుధాలను పాకిస్తాన్ ఎట్లా వినియోగించేది, భారత ప్రభుత్వం చెబుతున్నమాట ఇప్పుడు నిజమయ్యేట్లు కన్పిస్తున్నదని శ్రీ కృష్ణమీనన్ బొంబాయిలో మాట్లాడుతూ అన్నారు.

జనవరి 23 : కాశ్మీర్ సమస్యను మధ్యవర్తి ద్వారా పరిష్కరించుకోవాలని అమెరికా అధ్యక్షుడు శ్రీ కెనెడీ, ప్రధాని నెహ్రూకు ఒక ఉత్తరం వ్రాశారు. మధ్యవర్తిగా ప్రపంచ బ్యాంకు అధ్యక్షుడు శ్రీ బ్లాక్ పేరును సూచించారు. పాకిస్తాన్ ఈ ప్రతిపాదనను ఆమోదించింది.

జనవరి 25 : ముఖాముఖి సమాలోచనలు తప్ప, కాశ్మీర్ సమస్య పరిష్కారానికి వేరు మార్గం ఏమీ లేవన్లు భారత ప్రభుత్వం భావిస్తున్నది.

జనవరి 29 : మధ్యవర్తి పద్ధతిని తిరస్కరిస్తూ శ్రీ నెహ్రూ అమెరికా అధ్యక్షునికి ఒక లేఖ వ్రాశారు.

జనవరి 30 : భద్రతామండలిలో కాశ్మీర్‌ను వెంటనే చర్చకు తేవాలని పాకిస్తాన్‌తోపాటు బ్రిటన్‌గూడా ప్రయత్నం చేస్తున్నది. పాక్ ప్రతినిధి సర్‌జఫ్రుల్లా, శ్రీ నెహ్రూ దాసోహం అంటేగాని, ముఖాముఖి చర్చలు జరిగి లాభంలేదని ఒక ప్రకటన చేశారు.

జనవరి 31 : పాక్ అభ్యర్థనను పురస్కరించుకొని భద్రతామండలి కాశ్మీర్ సమస్యను చర్చించడానికి సమావేశం కాగలదని ప్రకటన వెలువడింది.

* * *

**ఎన్నికలు : అభ్యర్థులు**

జనవరి 20 వ ఎన్నికలకు అభ్యర్థి పత్రాలు దాఖలు చేయడం ప్రారంభమైంది. 25 నాటికల్లా, ఉపసంహరణలు మొదలైనవన్నీ పూర్తి అయినాయి. కాంగ్రెస్ దేశంలో పార్లమెంటు కేమి, శాసనసభల కేమి అన్ని స్థానాలకు పోటీచేస్తున్నది. ఆంధ్రప్రదేశ్ లో 293 స్థానాలకు 979 మంది అభ్యర్థులు నిలబడుతున్నారు. ఇందులో కాంగ్రెస్ 293, స్వతంత్రపార్టీ 140, కమ్యూనిస్టులు 135, జనసంఘం 70, స్వతంత్రులు 300. కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ సంజీవరెడ్డి ధోన్‌లోను, ముఖ్యమంత్రి శ్రీ సంజీవయ్య కోడుమూరులోను పోటీ చేస్తున్నారు. ఇంకా ఎన్నికలకు తగు సన్నాహాలు ప్రారంభం కాకముందే రాష్ట్రంలో వచ్చే శాసనసభా కాంగ్రెస్‌పార్టీ నాయకత్వాన్ని గూర్చి తగాదాలు బయలుదేరాయి.

జనవరి 5 : ఆంధ్రప్రదేశ్ ఎన్నికలకు పోలింగు తేదీలు నిర్ణయింపబడినాయి. ఫిబ్రవరి 19 వ పోలింగు ప్రారంభమవుతుంది. ఫిబ్రవరి 25 తో పూర్తి అవుతుంది.

జనవరి 10 : ఈసారి గూడా రాష్ట్ర శాసనసభ కాంగ్రెస్ పక్షం నాయకత్వానికి పోటీ చేస్తానని ముఖ్యమంత్రి శ్రీ సంజీవయ్య ప్రకటించారు.

జనవరి 13 : రాష్ట్రంలో ముఖ్యమంత్రి పదవికి శ్రీ సంజీవరెడ్డి కూడా పోటీ చేయగలరన్న వార్త ధృవపడింది.

జనవరి 15 : రాష్ట్ర కాంగ్రెస్ శాసనసభా పక్షం నాయకత్వానికి తాను పోటీ చేస్తానని శ్రీ సంజీవరెడ్డి ప్రకటించారు.

జనవరి 23 : మద్రాసు రాష్ట్రంలో తిరువందూరు నియోజకవర్గం నుంచి శ్రీ టి. టి. కృష్ణమాచారి పోటీ లేకుండా పార్లమెంటుకు ఎన్నిక అయినారు.

జనవరి 24 : ఆంధ్రప్రదేశ్‌లో కోయిలకుంట్ల నుంచి శాసనసభకు శ్రీ బి. వి. సుబ్బారెడ్డి పోటీ లేకుండా ఎన్నిక అయినారు.

జనవరి 25 : ఒరిస్సా నుంచి లోక్‌సభకు డా. హరి కృష్ణ మెహతాబ్ పోటీలేకుండా ఎన్నిక అయినారు.

ఉత్తర ప్రదేశ్‌లో కాంగ్రెస్ అభ్యర్థి మహారాజా మానవేంద్ర షా పోటీ లేకుండా లోక్‌సభకు ఎన్నిక అయినారు.

ఆంధ్రప్రదేశ్ శాసనసభకు శ్రీ బి. వి. సుబ్బారెడ్డి కాక (1) శ్రీ ఎ. రామస్వామి (వికారాబాద్), (2) శ్రీ కృష్ణరాం భూపాల్ (గద్వాల) (3) శ్రీ కె. పున్నయ్య (పొందూరు), (4) శ్రీ ఎం. లక్ష్మీకాంతరెడ్డి (ఆలూరు) (5) శ్రీ రంగారెడ్డి (ఆర్మూరు) లు గూడా పోటీలేకుండా ఎన్నిక అయినారు.

ఇంతవరకు పోటీలేకుండా ఎన్నిక అయిన వారంతా కాంగ్రెస్ అభ్యర్థులే.

* * *

**వివిధ వార్తలు**

జనవరి 1 : పెట్రోల్ పరిశ్రమ ప్రభుత్వం వశం అయినప్పుడే దేశ ఆర్థిక వ్యవస్థ బాగుపడుతుందని మంత్రి శ్రీ మాలవీయ ప్రకటించారు. అస్సాంలో నూన్‌మతివద్ద ప్రభుత్వ రంగంలో తొలి నూనె శుద్ధి కర్మాగారానికి ప్రధానమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

యావద్భారతానికి వర్తించే ఒక విద్యాశాఖ ఉండాలని కేంద్ర విద్యామంత్రి డా. శ్రీమాలి కేంద్ర విద్యాసలహాసంఘం సమావేశాన్ని ప్రారంభిస్తూ అన్నారు.

మానవ సంక్షేమం కోసం రష్యా, అమెరికాలు కృషి చెయ్యాలని కెనడీ, కృశ్చేవ్‌లు ఉగాది అభినందనలు పరస్పరం అందజేసుకున్నారు.

జనవరి 2 : వాణిజ్యపుపంటలకు జాతీయ సలహా మండలులను ఏర్పాటు చేయగలమని కేంద్ర వ్యవసాయ మంత్రి శ్రీ దేశముఖ్ మద్రాసులో ప్రకటించారు.

పోర్చుగల్‌లో సాలజార్ ప్రభుత్వంపై ప్రజల తిరుగుబాటును ప్రభుత్వం అణచివేసింది.

భద్రతామండలికి ఘనా ఎన్నిక అయింది.

జనవరి 5 : పాట్నాలో కాంగ్రెస్ మహాసభ ప్రారంభమైంది. సభలో ప్రభుత్వ విధానాలన్నీ ఆమోదింప బడినాయి. కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళికను గూడా ఈ సభ ఆమోదించింది. 6 వ తారీఖునాటితో సభలు అంతమైనాయి.

తిరుపతిలో సంస్కృత విద్యా వ్యాప్తికి, పరిశోధనకు కేంద్ర సంస్థ ఏర్పాటు చేయబడింది.

జనవరి 6 : పశ్చిమ ఇరియన్‌ను తాత్కాలికంగా సమితి ఆధిపత్యంలో ఉంచాలని హాలండ్ సూచించింది. ఇండొనీషియా తిరస్కరించింది. అధికారం కైవశం చేస్తే చర్చలు ప్రారంభం కాగలవని అధ్యక్షుడు డా. సొకర్నో సమితి కార్యదర్శికి తెలియజేశారు.

జనవరి 8 : డా. సొకర్నోపై హత్యా ప్రయత్నం జరిగింది. కాని విఫలమైంది.

జనవరి 9 : ఆఫ్రికన్ సాలిడారిటీ పార్టీ నాయకత్వం నుంచి శ్రీ గిజెంగా తొలగింపబడినారు.

రొడీషియాలో పర్యటనకు సమితి కార్యదర్శి తిరస్కరించారు.

జనవరి 10 : శ్రీశైలం సముద్ధరణకు ఆంధ్రపత్రిక వసూలుచేసిన నిధి లక్ష రూపాయలు ముఖ్యమంత్రికి సమర్పించబడినవి.

జనవరి 13 : మార్చి 31 కల్లా దేశంలో ఎన్నికలు పూర్తి కాగలవని ఎన్నికల కమీషన్ ప్రకటించింది.

జనవరి 15 : కేంద్ర ప్రభుత్వానికి స్టాన్లీవిల్లీ అధిపతి శ్రీ గిజెంగా లొంగిపోయాడు.

శ్రీ బండారనాయకేను హత్య చేసిన సోమరామ థేరోకు మరణశిక్ష ఖాయం చేయబడింది.

జనవరి 16 : పోర్చుగల్‌పై రాజకీయము, ఆర్థికము అయిన ఆంక్షలు ప్రయోగించాలని సమితిలో పోలండు, బల్గేరియాలు ఒక తీర్మానాన్ని ప్రతిపాదించాయి.

15 వ తేదీనాడు పశ్చిమ ఇరియన్ సమీపంలో డచ్చి నౌకలు ఇండొనీషియా బోట్లపై కాల్పులు సాగించాయి. ఆ విషయం సమితికి ఫిర్యాదు చేయగలమని ఇండొనీషియా ప్రకటించింది.

జనవరి 17 : రాష్ట్రపతి కంటిజబ్బువల్ల రిపబ్లిక్ ఉత్సవాలలో పాల్గొనరని ప్రకటన వెలువడింది.

జనవరి 18 : అంగోలా స్వాతంత్ర్యం విషయమై సమితిలో తీర్మాన ప్రతిపాదనకు ఆఫ్రేషియా రాజ్యాలు ఆలోచనలు చేస్తున్నాయి.

9250 కోట్ల డాలర్లతో అమెరికా బడ్జెట్టును శ్రీ కెనెడీ తయారు చేశారు. ఇందులో దేశరక్షణకు 5270 కోట్లు, సైనిక సహాయానికి 140 కోట్లు కేటాయించారు.

జనవరి 20 : లావోస్‌లో కొత్త మంత్రివర్గం ఏర్పాటుపై ప్రధానమైన ఒప్పందం ఒకటి ముగ్గురు రాకుమారులు కుదుర్చుకున్నారు.

జనవరి 20 : అమెరికా అధ్యక్షుని భార్య శ్రీమతి కెనెడీ మార్చి నెలలో భారతదేశం రాగలదని ప్రకటించబడింది.

డచ్చివారిపై ప్రతీకార చర్యలకు దిగేది లేదని ఇండొనీషియా సమితికి హామీ యిచ్చింది.

జనవరి 22 : టాంగనీకా ప్రధాని శ్రీ నైరేరి తమ పదవికి రాజీనామా యిచ్చారు.

పశ్చిమ ఇరియన్‌పై శాంతియుతమైన పరిష్కారానికి తాము సిద్ధమేనని డా. సుకర్నో ప్రకటించారు.

జనవరి 23 : అంగోలాలో అధికారాన్ని ప్రజాయత్తం చేయాలని పోర్చుగల్‌ను కోరుతూ సమితిలో ఆఫ్రేషియా రాజ్యాలు ఒక తీర్మానాన్ని ప్రతిపాదించాయి.

సేలం బెంగుళూరు రైల్వేకు శంకుస్థాపన జరిగింది.

పశ్చిమ ఇరియన్ సమస్యను పరిష్కరించేందుకు డచ్చి, ఇండొనీషియన్ ప్రతినిధులు ముఖాముఖి సమావేశం ఏర్పాటు చేయడానికి సమితి కార్యదర్శి ప్రయత్నం చేస్తున్నారు.

జనవరి 24 : శ్రీ గిజెంగాను లియొపోల్డ్‌విల్లీ ప్రాంతంలో నిర్బంధంలో ఉంచారు.

జనవరి 25 : భారతదేశంలో సైన్యానికి పర్వత ప్రాంతాలలో గస్తీలకు వీలుగా శక్తివంతమైన తేలికరకం జీప్‌ను ఆర్డినెన్సు ఫ్యాక్టరీ వారు నిర్మించారు. "జోంగా" అన్న పేరుతో ఇవి ప్రచారంలోకి వస్తున్నాయి. ప్రధాన మంత్రి ప్రారంభోత్సవం జరిపారు.

జనవరి 26 : రిపబ్లిక్ దినోత్సవాలు జరిగాయి. ఉపరాష్ట్రపతి డా. రాధాకృష్ణన్ సైనికాభివందనం స్వీకరించారు.

జనవరి 27 : చంద్రుణ్ణి ఫోటో తీసేందుకు వీలుగా అమెరికా ఒక ఉపగ్రహాన్ని అంతరిక్షంలోకి వదిలిపెట్టింది.

ఇంకో రెండు సంవత్సరాలలో భారతదేశం గూడా అంతరిక్షంలోకి రాకెట్లను వదలగలదని ఖగోళ పరిశోధన సంస్థల డైరెక్టరు డా. కృష్ణారావు ప్రకటించారు.

గోవాలోని పోర్చుగీసు జాతీయులను వదులుతున్నందుకు తమ వలసలలోని భారతీయులను గూడా వదలడానికి పోర్చుగల్ అంగీకరించింది. అయితే పోర్చుగల్ భారతీయులను తన వలసలలో ఎక్కడా ఉండనీయమని ప్రకటించింది.

జనవరి 27 : అష్టగ్రహకూటం వల్ల శుభమే గాని, అశుభం జరగదని కంచి కామకోటి పీఠాధిపతులు ఒక శ్రీముఖాన్ని ప్రకటించారు.

జనవరి 29 : కేంద్ర ప్రభుత్వోద్యోగుల పిల్లల చదువుకు ప్రత్యేక భత్యం ఇవ్వడానికి భారత ప్రభుత్వం నిశ్చయించింది.

జనవరి 30 : అణ్వస్త్ర పరీక్షలపై జనీవాలో సాగుతున్న చర్చలు భగ్నం అయినాయి.

కృష్ణా గోదావరిజలాలలో తమకుగూడా వాటాకావాలని మద్రాస్ ప్రభుత్వం గుల్హాతి సంఘానికి ఒక నివేదికను అందజేసింది.

పాక్ ప్రభుత్వం సుహ్రావర్ది ని అరెస్టు చేసింది.

సింహళంలో జరిగిన కుట్రవెనుక ఒక విదేశీరాజ్యం మద్దత్తు వున్నట్లు ఆ దేశం ఆరోగ్యమంత్రి ప్రకటించారు.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor: S. Sambhu Prasad.